# వాల్మీకి - విశ్వనాథ

## రామకథానుశీలనము





జ్వలతి జ్యోతి రహమస్మి

డాక్టర్ ముదివేడు ప్రభాకరరావు

# వాల్మీకి - విశ్వనాథ రామకథానుశీలన

## AN INTRODUCTION TO THE STUDY OF THE RĀMĀYANAS OF VĀLMĪKI AND VIŚWANĀTHA





డాక్టర్ ముదివేడు ప్రభాకరరావు
ఎం.ఏ., పిహెచ్.డి.,

# VALMIKI VISWANATHA RAMAKATHANUSILANA

*(An Introduction to the study on the Ramayanas of Valmiki and Viswanatha)*



Dr. M. PRABHAKARA RAO, M.A. (Tel. & Skt.), Ph.D. (Tel.)
Oriental Research Institute
Sri Venkateswara University, Tirupati-517 502



జ్ఞానప్రసూనమాలికా ప్రచురణలు - ప్రథమపుష్పం
ప్రథమముద్రణ – ప్రతులు 1000, మార్చి 1993
వెల రూ.

ముఖపత్రచిత్రణ 'లలితకళానిధి'
అక్షరాలంకరణ శ్రీ మైనంపాటి వేంకటసుబ్రహ్మణ్యంగారు

ప్రతులకు

1. శ్రీమతి ముదివేడు మీరాబాయి
నెం. 1-7-234, ఫస్ట్‌ఫ్లోర్
సూపరింటెండెంట్ స్టాఫ్ క్వార్టర్స్ (న్యూ)
(ఎస్.వి.యు. హెల్త్ సెంటర్ దగ్గర)
ఎస్. వి. యూనివర్శిటీ క్యాంపస్
తిరుపతి - 517 502.

2. విశాలాంధ్ర బుక్ హౌస్
హైదరాబాద్, తిరుపతి, విజయవాడ, హన్మకొండ
అనంతపురం, విశాఖపట్నం, గుంటూరు, కాకినాడ

ముద్రణ

ఎల్.వి. గ్రాఫిక్స్
నెం. 268, ప్రకాశంరోడ్
తిరుపతి - 517 502



శ్రీమతి ముదివేడు శాంతాబాయి    బ్రహ్మశ్రీ ముదివేడు గుండూరావు

"నా పసితనంలో ఒకనాడు–
శ్రీకాళహస్తి దేవాలయంబున
అమ్మ సన్నిధి త్రోవ దెలియక
దారి తప్పిన వేళలో
రోదించు చుండిన నన్ను కన్గొని
నా కనిష్ఠికను పూని కరముల
'మన అమ్మసన్నిధి యిదె కదోయీ!
భయపడకు రమ్మ'ని బుజ్జగించుచు
'శ్రీ జ్ఞానప్రసూనాంబిక'ను చూపిన
అమ్మానాన్నల అడుగుదమ్ములకు
అత్యంత భక్తితో
అంతం లేని
ఈ ఆదికావ్యానుశీలనం
అంకితం చేస్తున్నాము."

మీ
'ప్రభు'

*This book is published with the*
*financial assistance of*
*TIRUMALA TIRUPATI DEVASTHANAMS*
*under their scheme*
*'Aid to Publish Religious Books'*

*and also*

*The financial assistance sanctioned*
*by the*
*TELUGU UNIVERSITY*
*Department of Extension of Services*
*Hyderabad*
*Under their scheme*
*'Aid given to authors to publish*
*their books'*
*for the year 1992-93*

# విషయానుక్రమణిక

# పూర్వరంగం

"సామాన్యపాఠకుల్ని దృష్టిలో పెట్టుకొని, సరళవ్యావహారిక భాషలో వాల్మీకి రామాయణాన్ని గూర్చి ఒక వ్యాసపరంపరను మా పత్రికకు వ్రాయండి" అని 1983 జనవరిమాసంలో ఒకరోజు శ్రీశంకర కృపాపత్రికా సంపాదకులైన శ్రీతుమ్మలపల్లి రామలింగేశ్వరరావు (వీరు తర్వాత తురీయాశ్రమం స్వీకరించి శ్రీఅద్వయానందభారతీ స్వాములై శ్రీమద్రామాయణ కల్పవృక్ష సప్తాహాన్ని హైదరాబాదులోని శ్రీ శృంగేరీ శంకరమఠంలో 1990 ఆగస్టు నెలలో జరిపించారు. 1991లో సిద్ధిపొందారు.) వద్ద నుండి ఒక లేఖవచ్చింది. వారితో నాకు 1976 నుండి పరిచయం ఉండడం మూలాన వారి ఆదేశాన్ని కాదనలేక వెంటనే ఈ రచనకు శ్రీకారం చుట్టాను. ఈ వ్యాసాలలో కొన్ని దక్షిణామ్నాయ శ్రీశృంగేరీ శారదాపీఠమువారి యాజమాన్యమున వెలువడే ఆధ్యాత్మిక మాసపత్రిక 'శ్రీ శంకరకృప'లో 1983 మార్చి నుండి 1984 మే వరకు వెలువడ్డాయి. "శ్రీ మద్రామాయణ సారాంశము" అనే శీర్షికతో వెలువడిన ఆ వ్యాసాల్లో ఆధునిక యుగంలో వచ్చిన రామాయణాల్లో తలమానికమైన శ్రీమద్రామాయణ కల్పవృక్షంలోని తీర్మానాలను కొన్నింటిని పరామర్శించడం జరిగింది. ఆయా ఘట్టాలతో పాఠకులకు పరిచయం కావించడమే దాని ప్రధానోద్దేశ్యంకాని, ఈ గ్రంథం వాల్మీకి- విశ్వనాథ రామాయణాల తులనాత్మక పరిశీలన కాదని పాఠకులకు మనవి చేస్తున్నాను.

ఇదిలావుండగా, మదీయ చిరకాలమిత్రులు శతావధానసార్వభౌములు డా॥ మేడసానిమోహన్‌గారు తిరుమల తిరుపతి దేవస్థానం వారి హిందూ ధర్మ రక్షణ సంస్థ కార్యదర్శులుగా 1988 మే మాసంలో ఒక రోజు వేసవిపాఠశాల (Summer Institute) లో ఉపన్యసించ వలసినదిగా ఆహ్వానించారు. ఆరోజు ఈ వ్యాసపరంపరలోని విషయాలనే ఉపన్యాసరూపంగా చెప్పాను.

ఆ తర్వాత హిందూధర్మరక్షణసంస్థ ఆధ్వర్యంలోనే హిందూమత సంబంధితోపన్యాసాలివ్వవలసిందిగా, తిరుపతి శ్రీ అన్నమాచార్య కళా మందిరంలో ఒక వారంరోజులు ప్రసంగాలను ఏర్పాటుగావించారు. దానిని నేను రామాయణ సప్తాహంగా గ్రహించి 1989 మే నెల 21 నుండి 27 వరకు ప్రసంగించాను. అదీ యిదీ చెప్పడం దేనికని విశ్వనాథ రామాయణ కల్పవృక్షాన్నే ఎన్నుకుని మొదటిరోజు రామాయణ ప్రాశస్త్యాన్ని

చెప్పి తక్కిన ఆరురోజులు రోజు కొక్కకాండ చొప్పున ఆరుకాండల నుగూర్చి గురువుల్ల అనుగ్రహంతో ప్రసంగించాను. అప్పుడు సభ్యులు కొందరు సుందరకాండపై విశేషంగా చెప్పమని కోరటంతో శ్రీ హనుమద్విశ్వరూపాన్నిగూర్చి విపులంగా ముచ్చటించడం జరిగింది. అవన్నీ ఈ గ్రంథంలో పొందుపరిచాను.

ఇది ఈ గ్రంథరచనకు గల పూర్వరంగం. వాల్మీకి వ్రాసిన రామకథను రేఖామాత్రంగా పరిచయం చేయడమే దీని ప్రధానోద్దేశ్యం. అందుకే ఆయా ఉపశీర్షికలు అలాచెప్పటం జరిగింది.

ఈ గ్రంథం వాల్మీకి-విశ్వనాథ రామాయణాల తులనాత్మక పరిశీలన కాదని ముందే మనవిచేశాను. అన్ని విషయాలు సాంగోపాంగంగా చర్చించడం జరగలేదు. రామకథలోని ప్రధానపాత్రల మనఃప్రవృత్తుల్ని మాత్రమే స్థూలంగా విమర్శించడం జరింగింది. అప్రధానపాత్రల జోలికి పోలేదు. ఉపాఖ్యానాల ప్రసక్తితేలేదు. రామాయణాన్ని అనేక దృక్పథాలతో విమర్శించవచ్చు. ఇది ప్రధానంగా ఆధ్యాత్మికదృష్టితో విమర్శించిన గ్రంథం.

సామాన్య పాఠకుల్లో కూడ జిజ్ఞాసువులు, పండితుల్లోకూడ నిశిత పరిశీలనాచక్షువులు ఉంటారని తెలుసు. అలాంటి వారికికూడ తృప్తి కలిగించేలా ఆలోచనను రేకెత్తించే కొన్ని అంశాలు ఈ గ్రంథంలో చోటుచేసికొన్నాయి. ఉదాహరణకు 'శ్రీరాముని జన్మనక్షత్రౌచిత్యం, రాముని ధనుర్లస్తకమే ఆజ్ఞాచక్రం' అనే శీర్షికలు వాల్మీకి-విశ్వనాథుల దృష్టిని సమగ్రంగా పాఠకుల కందిస్తున్నవి. ఈ విషయాన్ని నేను 1990 ఆగస్టు 17వ తేదీ లో శ్రీ అద్వయానందభారతీస్వాములు అధ్యక్షస్థానంలో ఉండగా వారి ఆధ్వర్యంలోనే జరిగిన రామాయణ కల్పవృక్ష సప్తాహంలో 'బాలకాండ-ధనుః కల్యాణఖండాలపై చేసిన ప్రసంగసారాంశమే ఈ రెండు శీర్షికల్లో పొందుపరిచాను. దుఃఖమీమాంస, జీవునివేదన, శాంతరస నిరూపణ యిటువంటి మరికొన్ని శీర్షికలు క్రొత్తదృక్కోణంతో వ్రాయబడినవి. పరిశోధనాదక్షులైన పండితులు పరిశీలించాలి!

విశ్వనాథవారు ప్రతిపాదించిన 'జీవునివేదన' అనే కొత్తసిద్ధాంతాన్ని 1956-60 ప్రాంతాలలోనే డా॥ ధూళిపాళ శ్రీరామమూర్తిగారు భారతి జయంతి, మేఖల (1978) వంటి పత్రికల్లో అద్వైతవేదాంత దృష్ట్యా నిరూపిస్తూవచ్చారు. వారి రచనా సారాంశమేమనగా "కవి యనగా జీవునివేదన ననుభవించువాడు. కవితాస్వభావమనగా

జీవునివేదనానుభూతి. పరమేశ్వర విషయకమైన నిత్యవిరహమే జీవుని వేదన. లోకము యొక్క యిష్టజన విరహమును చూచి పరమేశ్వర విరహమునందు మునిగిపోవుట జీవునివేదన"అని తీర్మానించారు. ఈ సిద్ధాంతాన్ని వారు కవులందరికీ అన్వయించారు.

ప్రముఖంగా వారి సిద్ధాంతగ్రంథమైన "పోతనభాగవతానుశీలనము" (1973) మూడవ అధ్యాయం పుటలు 212-224 లో "ఊహక లంగి జీవనపు టోలమునన్ బడిపోరుచున్ (8-67) అనే పోతనగారి పద్యంలో కవి జీవునివేదన ఎంత సార్వకాలికమైనదో వివరించారు. అదే అధ్యాయంలో పుటలు 276-277లలో మరికొంతవ్రాశారు. వీరి వాదాన్ని సమర్థించినవారు విశ్వనాథవారి తమ్ముళ్లు వేంకటేశ్వరులుగారు. ఆయన 'నేను-మాఅన్నగారు' అవేవ్యాసంలో, "జీవునివేదన అనే ఒక అనాలంకారిక సమయాన్ని సత్యనారాయణ సృష్టించాడు. ధూళిపాళ శ్రీరామమూర్తిగారు తమ భాగవతానుశీలనంలో దానికొక ఆలంకారిక రూపాన్ని ప్రతిష్ఠించడానికి సఫలమైన యత్నంచేశారు. జీవుని అవిద్యా వరణ ఆనందమయకోశాన్ని ఆవరించి ఉంటుంది. సదసత్తులు సర్వత్ర ప్రత్యక్షములై ఉంటవి కదా! అవిద్యావరణతోపాటు, అహమస్మితోపాటు అహంబ్రహ్మోఽస్మి అనే బ్రహ్మస్పందం కూడ ఉంటుంది. అహమస్మి అనునది జీవస్పందం. అహంబ్రహ్మోఽస్మి అనునది బ్రహ్మస్పందం. ఇవి ఒకదానికొకటి ప్రతియోగిత్వాన్ని పొందివుంటవి. 'అహం బ్రహ్మోఽస్మి'అనే బ్రహ్మస్పందంయొక్క ఆక్రోశమే జీవునివేదన. ఈ జీవునివేదనయే పురు షుణ్ణి మహాకవిని చేస్తుంది. దానితోనే మాఅన్న కవిబ్రహ్మ అయినాడు. ఇది యిప్పటికి చాలిన నిర్వచనం" (విమర్శిని 1977 పుట-339) అని వ్రాశారు.

విశ్వనాథవారు పనిగట్టుకొని ఏ కొత్తసిద్ధాంతాలను సృష్టించలే దని 'జీవునివేదన' అనే తాత్త్వికాంశం ఆయన స్వకీయజీవితానుభవం మూలంగా అనుభూతి దశలో పైకిచేదుకొన్న విలక్షణాభివ్యక్తియని నేను విశ్వసిస్తున్నాను. ఆలంకారికులు సూచింపని 'కథాకథనశిల్పాన్ని' విశ్వనాథ ఏవిధంగానైతే విశిష్టంగా నిరూపించారో, వేదాంత విచార ణలో ఆచార్యపురుషులు విస్పష్టంగా చెప్పని 'జీవునివేదన'ను పైయుక్తిక స్థాయినుండి విశ్వజనీనస్థాయికి తెచ్చి రామకథ పునాదికాగా ఆ దృశ్య థాన్ని మహాసౌధంగా విశ్వనాథ నిర్మించారు శ్రీశంకరులు 'అధ్యాస'ను పునాదిగాచేసి అద్వైతమహాసౌధాన్ని కట్టినట్లు.

శ్రీధూళిపాళవారి అడుగుజాడల్లో నడచిన వారిశిష్యులు, మదీయ

గురువులు డా॥ తుమ్మపూడి కోటీశ్వరరావుగారు, ఆధునిక మన స్తత్వశాస్త్ర పరిశోధనల పునాది మీద 'విశ్వనాథ సాహితీసూత్రము' (స్రవంతి-డిసెంబరు 1971) 'జీవునివేదన'అని నిరూపిస్తూ "ఈయ నిలాధ్వమెల్ల నినదించెను మువ్వలమ్రోత దూరమైపోయిన గోతతిన్ పిలుచు పోలిక"అనే విశ్వనాథవారి పద్యంలో JUNG PSYCHOLOGY దృష్ట్యా UNCONCIOUS PRINCIPLEను వెలికితీసి అది 'జీవునివే దన'కు మూలం అన్నారు. ఆ తర్వాత వీరూ 'పోతన జీవునివేదన'ను నిరూపించారు.

నేను, ధూళిపాళవారి Philosophical stand pointను, తుమ్మ పూడి వారి Psychological stand pointను రెంటినీ మేళవించి అద్వైతానికి పూర్వమే వెలసిన బౌద్ధమతం Psycho-philosophical stand point నుండి దుఃఖమీమాంస చేసింది కాబట్టి అక్కడినుండి వివేచన ప్రారంభిస్తే అద్వైతంలో దానికి గట్టిపునాదులు ఏర్పడే అవ కాశముందని భావిస్తున్నాను. అప్పుడే విశ్వనాథచెప్పిన 'జీవునివేదన'కు ప్రామాణికమైన నిర్వచనం - నిరూపణం అందే అవకాశముంది.

విశ్వనాథ చెప్పిన 'జీవునివేదన'నే 'జీవకారుణ్యం'గా 'కారుణ్యరస మూలం'గా ఆయున సర్వరచనల్లో అంతర్వాహినిగా ప్రవహిస్తూవుందని నిరూపించినవారు డా॥ సుప్రసన్నగారు. "ఈ జీవుని భావుకతాస్థితి వ్యక్తజగత్తులో అవ్యక్త చైతన్య మూలాలను అన్వేషించటం. ఆ వేదన జీవు నివేదన" (విశ్వనాథమార్గము, 1992, పుట-47) "వాల్మీకి మూలమే అయినా దాన్ని చూచినచూపు, అది రూపొందినరీతి, దాన్ని ఆవిష్క రించినవైఖరీ అంతా విశ్వనాథ ప్రజ్ఞాప్రభావమే. అనితరసాధ్యమైన ఈ నిర్మాణ వైఖరివల్ల విశ్వనాథ తెలుగుసాహిత్య పరిధులను అతిక్రమిం చాడు. తిక్కన, పోతన ఆయునలో కలిసిపోయారు. ఆధునిక కాలంలోని మానవుని సంవేదన హృదయమూలంలో నిలిచివుంది. ఆంతర్యంలో జీవుని దివ్యచైతన్యాంశకు అందుకునే ప్రయత్నం ప్రధానవస్తువయింది." (విశ్వనాథమార్గము పుట-51)

వీరిదీ మనోవైజ్ఞానిక దృష్టికోణమే! కొంత శ్రీఅరవిందుల ప్రభావం, శ్రీవిద్యా గంధిలత్వం ఉన్నాయి. "భారతీయ సాహిత్య దార్శనిక పరి వేషములో సత్యనారాయణగారు కావ్యమౌలిక హేతువుగా ప్రతిపాదించిన 'జీవునివేదన' సాహిత్య విమర్శ మార్గమున వినూత్నము, విశిష్టము నైనది"అని ఆచార్యకోవెల సంపత్కుమారగారు దానిని ఆదికావ్యావత రణ పరంగా సమన్వయించడమేకాదు, 'కావ్యపరమార్థదృక్పథము'అనే

అధ్యాయంలో పరమార్థావిష్కరణకు 'ఏకవాక్యత, కధాకధనశిల్పములను మౌలికాంశాలుగా నిరూపించిన విశ్వనాధవారి సాహిత్యవిమర్శప్రస్థానాన్ని విశ్లేషించారు తమ సిద్ధాంతగ్రంధంలో (ఆధునిక తెలుగు సాహిత్యవిమర్శ-సంప్రదాయక రీతి, 1981).

నాకు సతీర్థ్యుడు, శ్రీతుమ్మపూడి, సుప్రసన్నల కిద్దరికీ శిష్యుడైన డా॥ కె.వి.యన్. రాఘవన్, "వేయిపడగలు - సమకాలీనత - సార్వకాలీనత"అనే సిద్ధాంతగ్రంధం (తెలుగు అకాడమి, హైదరాబాదు, 1989)లో, సమాజము, సామాజిక వ్యవస్థయే పునాదిగా పైకి చేదుకొనబడిన సార్వకాలీన 'జీవునివేదన' యేమిటో ఆధునిక కథాముఖంగా విశ్లేషించి చూపారు. అట్టడుగునగల జానపదీయాంశమే జాతియొక్క ధార్మిక చైతన్యంగా చెప్పడం జరిగింది. అంతేకాదు, 1990లో "విశ్వనాధ - ఆర్థికవ్యవస్థ" అనేగ్రంథం ప్రచురించారు. వీరిది Social & Economic stand pointగా చెప్పవచ్చు.

ఈ గ్రంధంలో నాదృక్పథమేమంటే వైయక్తిక దశలోని 'జీవునివేదన' సార్వకాలికం కావడానికి భారతీయవేదాంతానికి స్ఫూర్తినిచ్చింది బౌద్ధమత దర్శనమే. కాబట్టి విశ్వనాధవారి 'జీవునివేదన' అనేమాట వెనుక ఎంతకాదన్నా బౌద్ధదర్శన ప్రభావం పరోక్షంగా పనిచేసిందని, దుఃఖ మీమాంసకులు తొలుత బౌద్ధులేనని నా నమ్మకం! 'వేదన' అనేమాట వెనుక బౌద్ధదర్శన ప్రభావమున్నది. ఆదృష్టితో Psycho-philosophical stand point నుండి 'జీవునివేదన'ను విశ్లేషించవచ్చునని నాభావన. సమన్వయం దగ్గర వచ్చేటప్పటికి అద్వైతధోరణిగా చెప్పినా ప్రాధమికంగా 'దుఃఖ-వేదనా' వివేచనం చేయడంలో బౌద్ధమత ప్రసక్తిలేకుండా దీన్ని విశ్లేషించడానికి వీలులేదు. విశ్వనాధ అద్వైతముఖంగా కల్పవృక్షంలో శాంతరసం నిరూపించారు. శాంతరసస్థాయి 'తృష్ణాక్షయసుఖ'మని ఆనందవర్ధనుడు చెప్పడంలో ఈ దుఃఖనివారణోపాయాన్వేషణమే 'తృష్ణా' నాశనంకావడానికి దారితీసి 'తృష్ణాక్షయసుఖమనే శాంతంగా బౌద్ధులు నిర్ణయింపగా దాన్ని ఆనందవర్ధన, అభినవగుప్తులు స్వీకరించారని నా విశ్వాసం! ఈరెండు అంశాలు ఒకదానికొకటి లంకె! దీన్ని పండితులు మరింత క్షుణ్ణంగా పరిశీలించవలసివుంది. అనుస్యూతంగా, అంతస్సూత్రంగా నాలో ప్రచోదనశక్తిగా పనిచేస్తూ ఈ రచనను నడిపించినది మదీయగురుపాదుల అనుగ్రహవిశేషమే!

ఈనాడు విశ్వనాధగురించి పరిశోధన అంటే అయన మౌలికసిద్ధాంతాల ఆవిష్కరణకోసం భారతీయ జీవన మూలాలను, వేదాంతవిచా

రణా పునాదులను అన్వేషించి మూలసూత్రాలకు నిర్మించే ప్రయత్నం జరగాలి తప్ప పడికట్టు రాళ్లలాగా మన విశ్వవిద్యాలయాల సిద్ధాంతగ్రంథాలలో ప్రాచీన కవి యెవరికైనా ఉపయోగపడే చట్రాన్ని తెచ్చి విశ్వనాథ సాహిత్యానికి అమర్చడంకాదు కావలసింది. ఆ చట్రాలేవీ సత్యనారాయణ కవిత్వానికి నప్పదు. సరికదా "A square block in a round hole" అన్నట్లవుతాయి అలాంటి ప్రయత్నాలు. విశ్వనాథ సాహిత్యవిమర్శకు ప్రత్యేకమూలసూత్రాలు నిర్మించుకోవలసి వుందని నాదృఢాభిప్రాయం! ఆ విమర్శ స్థాయి ఎటువంటిదని ప్రశ్నిస్తే, ప్రాచీన భారతీయవిజ్ఞాన పరిశోధన (Indological Research status) స్థాయికి ఈ కృషిని తీసుకురాగలిగితే తప్ప దాన్ని నిర్ణయించలేము. అట్టి దిశలో నడవడానికి ఈగ్రంథంలో కొంతప్రయత్నంచేయడం జరిగిందని విన్నవిస్తున్నాను.

ఈగ్రంథమంతా వ్రాసిన తర్వాత ఒక్క బౌద్ధమతంలోనేగాక ఆస్తిక, నాస్తికదర్శనాలన్నింటిలో, రామాయణ, భారత, భగవద్గీతల్లో, పురాణాలలో, ఇతర భాషల్లోని ఆధునిక రచయితల్లో ఈ 'జీవునివేదన'ను గూర్చి మరోగ్రంథం వ్రాసి అప్పుడు విశ్వనాథ చెప్పిన 'జీవుని వేదన' ఏమిటో చెబితే దానికి మరింత గుర్తింపు లభిస్తుందనిపించింది. కాని, ఆ రోజే లైబ్రరీలో హఠాత్తుగా ఒక గ్రంథం కనబడింది. SUFFERING-INDIAN PERSPECTIVES, edited by K. N. Tiwari (Motilal, Delhi 1986). నా ఊహకు ప్రతి రూపమే ఆ గ్రంథంకావడం ఆశ్చర్యం కల్గించింది. అందులో 17 వ్యాసాలున్నాయి. థేరవాదబౌద్ధములో వేదన, మహాయానబౌద్ధములో వేదన, జైనమతంలో వేదన, విశ్వజనీనవేదన, టాగూరు, కబీరు రచనల్లో జీవునివేదన, గాంధీగారి సత్యాగ్రహం-వేదన, రామాయణ, భారత, భగవద్గీత, పురాణాలలో జీవుని వేదన. యిలా ప్రాచీన, సమకాలీన సమాజాల్లో జీవుడు పొందిన, పొందుతున్న వేదన నిరూపింపబడింది. ఈ దృష్టితో నా ఊహకు కొండంత బలం వచ్చినట్లయింది. విశ్వనాథ వారు చెప్పిన 'జీవునివేదన' అనే అంశం ఆకాశంనుండి ఊడిపడలేదని గట్టి పునాదిపైననే నిల్చివుందని ఆ గ్రంథంలో ఒకఅధ్యాయం వ్రాయదగినంత సామగ్రి దీనికుందని ఆత్మవిశ్వాసం గల్గింది. పాఠకులు ఆ ఆంగ్లగ్రంథాన్ని నేపథ్యంగా చదివిన తర్వాత నా గ్రంథాన్ని చదవమని అభ్యర్థిస్తున్నాను. ఇదిగాక ఓపిక, అభిరుచి కలవారు యిటీవలన వెలువడిన "DUHKHA - AN ANALYSIS OF BUDDHIST CLUE TO UNDERSTAND HUMAN NATURE - Mangala R. Chinchore (Indian Philosophical Quarterly, Poona, Vol. XX, No. 1 Jan, 1993, pp 37-83) అనే బృహద్వ్యాసాన్ని చదవమని కోరుచున్నాను.

ఆధునిక తెలుగుసాహిత్య విమర్శలో శాంత కరుణరసాలనుగూర్చి తొలిసారిగా చర్చలేవదీసినవారు కవిసమ్రాట్ విశ్వనాథవారే. వాల్మీకి రామాయణంలో కరుణరసం నిరూపింపబడగా కల్పవృక్షంలో శాంత రసం నిరూపించివుండడమే దీనికి హేతువుకావచ్చు. 1964లో (ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైదరాబాదు) విశ్వనాథ సాహిత్యోపన్యాసములు వెలువబడినవి. అందులో రెండవ ఉపన్యాసం "శాంతకరుణరసములు". వాల్మీకములో కరుణరసం, మహాభారతంలో శాంతరసమనేది ప్రసిద్ధవిషయంకాగా కాళిదాసు మహాభారతం నుండి శకుంతలకథగ్రహించి శృంగారరసాన్ని నిరూపిస్తాడా? అనే ప్రశ్న వేసుకొని విశ్వనాథ యిట్లన్నారు. "శాకుంతలమునందు ప్రధానమైనది శృంగారరసమని లోకరూఢమైన విషయముకాని, జాగ్రత్తగా చూచినచో శాంతరసమని చెప్పుటకు వీలున్నది. వీలున్నదికాదు. శాంతరసమనియే చెప్పవలయును. ఏమార్గములచేత నానందవర్ధనాచార్యులవారు తత్తత్పూర్వుల చేత చెప్పబడిన దానినే మహాభారతమునం దంగిరసము శాంతరసమని నిర్ణయించెనో ఆమార్గమును పట్టి విచారింపవలయునుగదా? (పుట. 29) అని ప్రశ్నించినారు. శాకుంతలంలో తాత్పర్యనిర్ణయార్థక షడ్లింగ నిర్ణయంచేసి శాంతరసం నిరూపించారు. భవభూతి ఉత్తరరామచరితనాటకము వ్రాసి వాల్మీకి అడుగుజాడల్లోనే నడచి కరుణరసానికే పట్టముకట్టినాడు. అది న్యాయమే! "భవభూతి దుఃఖము యొక్క స్వరూపములు తన నాటకము నందునిర్మించెను. ప్రపంచించెను. దాని కుదుళ్లుపట్టుకొని వివరించెను. సర్వప్రసిద్ధరసములు శోకము నుండియే సముద్భవించునని సిద్ధాంతీకరించెను. ....కాని, షష్ఠాంకమునందు శాంతరసమే నిరూపింపబడినది. లవ, చంద్రకేతులు యుద్ధాభిముఖులైరి. వారిద్దరన్నదమ్ములని తెలియక యుద్ధమాడిరి. లోకమునందలి విరోధములన్నియునిట్టివే. అవివేకహేతుకము. అవివేకము మాయాలక్షణము. మాయ దుఃఖము నాటకము మొత్తముమీద కరుణ రసముచేతనే సర్వ రసములు వ్యంజితములగునని భవభూతి మహార్థమును నిక్షేపించెను." (పుట-40-41)

కాబట్టి వాల్మీకి, వ్యాసుల కరుణ, శాంతములకు భవభూతి, కాళిదాసులు యథాతథంగా గ్రహించారని విశ్వనాథతీర్మానం. కాని తాను కల్పవృక్షంలో శాంతరసాన్ని నిరూపించాడుకదా! అదే చర్చనీయాంశం! "కరుణం ప్రథమరసం. శాంతం చివరిరసం. ఈ రెండు రసాలమధ్య నేతక్కిన రసములున్నవి. జన్మకు తొలుతటిది శోకము. విచారణా జన్యమై లోకము వ్యర్థమైనదని తెలిసికొన్ననాటి చివరిది శమము.

ఇది వీనిక్రమము. ఈ రెంటిలో దేనికి ప్రాధాన్యము? పుట్టుట తోడనే జీవిశోకముతో పుట్టెను. శోకములోనుండి పుట్టలేదుకదా! శోకముకాని స్థితి ఆనందము. అదియే రసము! రసమునుండి పొందిన ప్రథమవికృతి దుఃఖము. ఒక్కడుగు వెనుకకు వేసినచో యధాస్థితి ఘటిల్లును. అదియే శాంతము. శాంతమునకే 'రసోవైసః' అని చెప్పబడును. శాంత రసము లోకక్రియల నుండి ఉపరతి బోధించునది. యోగుల చిత్తవృత్తికి సన్నిధానమందున్నది. సర్వభావములయొక్క ఉపశాంతి యొక్క స్వరూప మది. కాని యిది నిరూపణకు క్లిష్టమైనది." (పుటలు-33-39)
ఆంగ్లభాషలో శాంతరస వివేచన చేసినగ్రంధాలు ఏ ఒకటోరెండో ఉన్నాయి. 'SANTARASA - ABHINAVAGUPTA'S PHILOSOPHY OF AESTHETICS" - J.L. Masson & M.V. Patwardhan (B.O.R.I. Poona, 1985) దీనిలో అభినవునిపై ప్రభావాలు తెల్పబడినవేగాని లోతుగా శాంతరసచర్చ జరుగలేదు. మరొకగ్రంధం 'SANTARASA' అనేది. కర్త పేరు జ్ఞాపకం లేదుగాని కలకత్తానుంచి Firma K.L. Mukhopadhyaya 1986 ప్రాంతాల్లో ప్రచురించినట్లు జ్ఞాపకం. దీన్ని నేను చూడలేదు. మాగురువుగారు 'శాంతరసం'పై ఒకగ్రంధం వ్రాస్తున్నారని విన్నాను. వేచి చూడాలి.

పది సంవత్సరాలు తాను అనుక్షణమూ మరణవేదన ననుభవిస్తూ మాకందరికీ నవ్వుమొగంతో ఆనందాన్ని పంచిపెట్టి జైనసన్యాసులు సల్లేఖనం (Fast unto death)తో ప్రాణపరిత్యాగం చేసేటట్లు, చివరి పదిరోజులు నిరాహారియై, అయధార్థమైన, వ్యర్థమైన ఈ లోకాన్ని వదలి వెళ్లిన నా పెద్దకుమారుడు గిరిధరుడు పొందిన 'జీవునివేదన' నిరంతరం నాలో దుఃఖపు చెలమను త్రవ్వుతూనే ఉంటుంది. అదే ఈ గ్రంధ రచనకు జీవనాడి. దుఃఖమీమాంసయే ఈ గ్రంధమంతా పరచుకొని పోయింది. విడుదలకై అన్వేషిస్తోంది!

"పత్రం పుష్పం ఫలం తోయం" అన్నట్లు ఈ చిన్నపుస్తకాన్ని చిన్ననాటినుండి నాజీవితాన్ని, ఆలోచనామార్గాన్నీ, తీర్చిదిద్దిన నాజననీ జనకుల పాదారవిందాలకు సమర్పించి వారి దీవనలందుకొన్నాను. సామాన్యులకుద్దేశించిన ఈ గ్రంథాన్ని పండితులు కూడా చదివి బాగుందంటే నాకృషిఫలించినట్లే భావిస్తాను.

శ్రీముఖ సంవత్సరాది — ముదివేడు ప్రభాకరరావు
తేది: 24-3-1993
తిరుపతి-517 502

# కృతజ్ఞతా సుమాంజలి

మొట్టమొదటిసారిగా ఈ గ్రంథముద్రణకు ఆర్థికసహాయాన్ని అందించిన అప్పటి, తిరుమల తిరుపతి దేవస్థానముల కార్యనిర్వహణాధికారులైన శ్రీ ఎం.వి.యస్. ప్రసాద్ గారికి, మరియు ఇప్పటి కార్యనిర్వహణాధికారులైన శ్రీ డి.వి.ఎల్.ఎన్. మూర్తిగారికి, సప్తగిరి పత్రికా సంపాదకులు శ్రీ కాట్రగడ్డ సుబ్బారావుగారికీ—

గ్రంథముద్రణకు వారిచ్చినసొమ్ము పర్యాప్తం కానందువల్ల తెలుగు విశ్వవిద్యాలయాన్ని అభ్యర్థించగా ఉదారంగా కొంతద్రవ్యసహాయం అందించిన అప్పటి విశ్వవిద్యాలయోపాధ్యక్షులు ఆచార్య డా॥ సి. నారాయణరెడ్డిగారికి, మరియు యిప్పటి వైస్ ఛాన్సలర్ ఆచార్య డా॥ పేర్వారం జగన్నాథం గారికీ, వారి కార్యనిర్వహణ సిబ్బందికీ—

ఈ గ్రంథమింత సర్వాంగ సుందరంగా వెలువరించగలిగానంటే దానికి ప్రధానప్రోత్సాహకులు బొంబాయి వాస్తవ్యులు లెఫ్టినెంట్ కల్నల్ కె. ఆర్. మూర్తిగారు, సుదూరప్రాంతంలో వున్నా, నా ముఖపరిచయం లేకపోయినా నా విన్నపాన్ని మన్నించి తమ ఉదారహస్తాన్ని అందించి నన్నుద్ధరించిన వారి సౌజన్యానికీ—

ఈ పుస్తకానికి ఔచితీవంతంగా ముఖపత్ర చిత్రణ అక్షరాలంకరణతో అందాన్ని యినుమడింపజేసిన 'లలితకళానిధి' శ్రీ మైనంపాటి వేంకటసుబ్రహ్మణ్యంగారికీ—

బహుకార్యవ్యగ్రులైనప్పటికీ అత్యంత స్వల్పకాలంలో ఈ గ్రంథాన్ని పరిశీలించి తమ అమూల్యాభిప్రాయాలను వ్రాసియిచ్చిన శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ మాజీ ఉపాధ్యక్షులు ఆచార్య కొత్తసచ్చిదానంద మూర్తిగారికీ ఆచార్య మొవ్వ వేంకటరామశర్మగారికీ, మద్గురువర్యులు ఆచార్య డా॥ తుమ్మపూడి కోటీశ్వరరావుగారికీ, పూజ్యపాదులు శివశ్రీ మల్లంపల్లి శరభేశ్వరశర్మగారికీ—

మదీయ శ్రేయోఽభిలాషులు, ప్రోత్సాహకులైన ఆచార్య డా॥ శలాక రఘునాథశర్మగారికీ ఆచార్య డా॥ రవ్వా శ్రీహరిగారికీ, శ్రీ కల్లూరి రాధాకృష్ణయ్యగారికీ, శ్రీ జువ్వాడి గౌతమరావుగారికీ డా॥ మేడసాని మోహన్ గారికీ—

గ్రంథముద్రణాది వ్యవహారాల్లో నాకెన్నో సలహాల నిచ్చి యిబ్బందు లను తొలగించిన స్నేహశీలి శ్రీ కోరాడ రామకృష్ణగారికీ,

ఈ గ్రంథముద్రణ కార్యక్రమాన్ని అతిత్వరగా పూర్తిచేయించిన లక్ష్మీ విలాస్ గ్రాఫిక్స్ (L.V. Graphics) అధినేతలు శ్రీ ఎమ్. రాజేంద్రన్ గారికీ వారి ముద్రణాలయ సిబ్బందికీ,

నాపై ఎంతో ఆదరాన్నీ వాత్సల్యాన్నీ కురిపించే అమృత హృద యులు కీ॥శే॥ కేతవరపు వేంకటరామకోటిశాస్త్రిగారికీ, కీ॥శే॥ తుమ్మల పల్లి రామలింగేశ్వరరావు గారికీ, కీ॥శే॥ చేబ్రోలు సుబ్రహ్మణ్యశర్మగారికీ విశ్వనాథవారి రచనల్ని అన్నపానాలుమానేసి చదివే సాహిత్యవ్యసనుడు కీ॥శే॥ తాటికొండ వేంకటకృష్ణయ్యగారికీ (వీరునల్వురినీ ఈ చల్లనివేళ స్మరించుకొంటున్నాను)

ఈగ్రంథం ఈవిధంగా ముద్రణకావడానికి ఆమోదించిన నాకుటుంబ సభ్యులందరికీ, ముఖ్యంగా నాకనేక విధాలుగా సహకరించిన నా శ్రీమతి మీరాకు —

కృతజ్ఞతాపూర్వక పారిజాతాలు సమర్పించుకొంటున్నాను.

24-3-1993, — ముదివేడు ప్రభాకరరావు
తిరుపతి.

# ప్రరోచన

ఊర్ధ్వోర్ధ్వ మారుహ్య యదర్థ తత్త్వం
ధీః పశ్యతి శ్రాంతి మవేదయంతీ।
ఫలం తదాద్యైః పరికల్పితానాం
వివేక సోపాన పరంపరాణామ్॥

— *అభినవ గుప్తపాదులు*

"When intellectual curiosity (dhih) claimbs
higher and higher and sees the truth (arthatattva)
without getting tired, this is because of the
ladders of thought built by earlier writers"

— *(Tr.) J.L. Masson & M.V. Patwardhan*

తత్త్వం ఆధ్యాత్మికం దృష్ట్వా తత్త్వం దృష్ట్వాని బాహ్యతః /
తత్త్వీభూత స్తదారామస్తత్త్వాదప్రచ్యుతో భవేత్ //

— *మాండూక్యోపనిషత్* II-38

"Having realized the truth inward, having also
realised the truth outward, one becomes the truth
(itself) delighting there in and being such one
should be unmoved from it."

— *(tr.) Swami Nikhilananda*

"He did to India with Veyipadagalu what Valmiki did with his Ramayana. He gave us the 20th century version of over culture. Sri Viswanatha has fulfilled in his generation, the mission which Sri Sankara, Vidyaranya and Vivekananda in their generations. He has kept the fires burning, the great fires of Vedic Agni."

— *Gunturu Seshendra Sarma*

Viswanatha-the Living Legend of Indian
Literature, Triveni, Vol. 61, No. 1, 1992, P-51

# వాల్మీకి, విశ్వనాథుల రామకథానుశీలన

## 1. అనుశీలన – పరిశీలన

శ్లో॥ కావ్యం రాయాయణం కృత్స్నం సీతాయాశ్చరితం మహత్ ।
పౌలస్త్యవధ మిత్యేవ చకార చరితవ్రతః॥ — సర్గ 4 - శ్లో. 7

ఉ॥ వ్రాసిన రామచంద్రుకథ వ్రాసితి వంచనిపించుకో వృథా
యాసముగాక కట్టుకత లైహికమా? పరమా? యటంచు దా
జేసిన తండ్రి యాజ్ఞయును జీవునివేదన రెండునేకమై
నా సకలోహవైభవ సనాథము నాథకథన్ రచించెదన్

— కల్పవృక్షావతారిక, ప-7

"ఏ కావ్యమునైనను కవిప్రతిజ్ఞనుబట్టి యనుశీలింపవలయును. లేదా యనూచానముగా వచ్చు మహాకవి సంప్రదాయమునుబట్టి పరిశీలింప వలయును. అనుశీలన - పరిశీలన పదములలో సంప్రదాయ నిర్మాతలైన పూర్వకావ్యమర్మజ్ఞు లనుశీలన పదమునే యభిమానించిరి. సహృదయ శబ్దమునకు వ్యాఖ్యానము చేయుచు నాలంకారికసరణి వ్యవస్థాపకులలో ప్రధానుడైన యభినవగుప్తుడిట్లనెను.

"యేషా మనవరత కావ్యానుశీలనాభ్యాసవశాత్
విశదీభూతే మనోముకురే వర్ణనీయతన్మయీభవనయోగ్యతా
తే హృదయసంవాదభాజః సహృదయాః" — లోచనవ్యాఖ్య

నిరంతరము కావ్యముల ననుశీలించుట వలన స్వచ్ఛమైన మనోదర్పణమునందు తన్మయత్వము చెందు యోగ్యత గలవారు సహృదయులు. ఇచ్చట ననుశీలన మననేమి? యనగా కవ్యభిప్రాయానుకూలముగా కావ్యార్థము భావించుట. 'శీల' శబ్దము సమాధిని చెప్పును. శీల సమాధౌ — కవి, కావ్యార్థముల ననుసరించి సమాధిని బొందుట యనుశీలనము"

"సహృదయనిర్వచనమునందు 'అనవరత' శబ్దమువలన బహూకావ్యానుశీలనము కన్పించుచున్నది. బహూకావ్యానుసంధానము వలన నొక ప్రమాణ మేర్పడునా? ఈ 'యనవరత' శబ్దమట్టి ప్రమాణ మందిచ్చుచున్నది.

కాబట్టి తత్ప్రమాణానుకూలమైన శీలనమునే యనుశీలనమని చెప్పవల యును."

"ఏ కవియైనను బాఠకుల నుద్దేశించియే వ్రాయును గాని ఊరక వ్రాయడు కదా! కావున నట్టి ప్రమాణాపేక్ష కవులకెల్లరకు నుండును.

'జీవునివేదన' యగ్నివంటిది. దానిని జాజ్జ్వల్యమానముగా జేసి కొనుటకు నింధనము వంటిదికథ. కవి ప్రతిభాపరిష్కృతమై కథ కావ్య మగును. 'నా సకలోహావైభవసనాథ' మనుటలోనర్థమిదియే. అసలు 'కావ్యము' అనుటలోనే అది వట్టికథ గాక 'కవి భావించిన కథ' యని తెలియుచున్నదికదా! రామకథ యచ్చముగా రామకథకాదు. 'జీవుని వేదన' యందు హుతమై దానితేజస్సుచే వ్యాప్తమైనదన్నమాట! ఇట్టి రామకథ చదువుటచే సహృదయుని హృదయమున 'జీవునివేదన' యుద్దీప్తమగును. అనుశీలన మనగానిట్టిది.

*యదభిముఖముగ జెప్పిరో యల్లదాని*
*తదభిముఖముగ జూచుట ధర్మవగును*

"కవి భావనను బట్టి కావ్యములు చదువవలయును. ఇట్లు చదు వుటయే యనుశీలనము. వినయముతో సేవించినగాని మహాకవుల వాణి ప్రసన్నముకాదు. అన్నారు డా॥ ధూళిపాళ శ్రీరామమూర్తిగారు (మేఖల, 1978)

*మత్సరస్వతి భావసామ్రాజ్యలక్ష్మి*
*భక్తి యున్నట్టిచో మెత్తబడెడు దేవి!*

అన్నారు విశ్వనాథ. వాల్మీకి మహర్షికి రామాయణ రచనకు బ్రహ్మాదేశమెట్లో, విశ్వనాథకు 'తండ్రియాజ్ఞ' వున్నది. కావున విశ్వనాథవారి తండ్రి శ్రీ శోభనాద్రి బ్రహ్మస్థానీయుడు"

"పరిశీలన పటిష్ఠము శాస్త్రము. అనుశీలన పటిష్ఠుడు సహృద యుడు. సహృదయునకు శాస్త్రబలముండును. అతనికి అంతకంటె సహృదయత్వ మెక్కుడుగా నుండును. కావున కవిప్రతిజ్ఞను బట్టి కావ్యము ననుశీలింపవలయును.

"శాస్త్రము సాహాయ్యకము. శాస్త్రము కవి ప్రతిభను కుదించ లేదు. శాస్త్రమును వదలిపెట్టి కవి ప్రతిభ భాసించదు" అన్నారు

విశ్వనాథ. (తెలుగుఛందో వికాసము - విశ్వనాథవారిప్రస్తావన) కాబట్టి "శుచి శీలనం హి సరస్వత్యాః సంవనన మామనంతి" అని రాజశేఖరు డన్నట్లు శుచి, శీలనములే సరస్వత్యావాహనమునకు మూలకందములు. వాల్మీకి — విశ్వనాథుల నాల్కలపై ఛందోమయవాణిగా సరస్వతి అవత రించి నాట్యమాడినదనగా వారెంతటి అంతర్దృష్టిలో, దార్శనికులో చెప్పనవసరము లేదు.

శ్లో॥ ఆశ్చర్యమిద మాఖ్యానం మునినా సంప్రకీర్తితమ్।
వరంకవీనామాధారమ్ సమాప్తంచ యథాక్రమమ్॥
— వాల్మీకి రామాయణావతారిక *(4-21)*

గీ॥ కవిప్రతిభలోన నుండును కావ్యగత శ
తాంశముల యందు తొంబదియైనపాళ్లు
ప్రాగ్విపశ్చిన్మతంబున రసము వేయిరెట్లు
గొప్పది నవకథాదృతిని మించి
— కల్పవృక్షావతారిక-5 ప.

# 2. సరస్వతీ తత్త్వం

అపూర్వం యద్వస్తు ప్రథయతి వినా కారణకలాం
జగద్గ్రావప్రఖ్యం నిజరసభరాత్సారయతి చ।
క్రమాత్ప్రఖ్యోపాఖ్యాప్రసర సుభగం భాసయతి తత్
సరస్వత్యాస్తత్త్వం కవి సహృదయాఖ్యం విజయతే॥

అపూర్వమైన కథావస్తువుతో కూడుకొన్న ఆదికావ్యావిర్భావం ఆశ్చ ర్యకరంగా వుంది. 'కవీ - సహృదయుల సమ్మేళనం చేతనే సరస్వతీ తత్త్వం సంపూర్ణమౌతోంది' అన్నాడు అభినవగుప్తపాదుడు.

ఇక్కడ డా॥ ధూళిపాళ వారి భావన ఇలాప్రసరించింది. "మహాకవి యనగా 'కవిహృదయుడు' అని అర్థము చేయవచ్చును. రాజశేఖ రుడు కూడ నిట్లే యన్నాడు — 'సాచ ప్రతిభా ద్వివిధా। కారయిత్రీ భావయిత్రీచ। కవేరుపకుర్వాణా కారయిత్రీ। భావకస్యోపకుర్వాణా భావ యిత్రీ। తత్పునరన యోర్భేదః? యత్ కవిర్భావయతి భావకశ్చ కవిః।'

ఆ ప్రతిభ రెండు విధములు. కారయిత్రి, భావయిత్రి యని. కవి కుపకరించునది కారయిత్రి. భావకున కుపకరించునది భావయిత్రి. ఈ రెండింటికి భేదమేమున్నది? కవియు భావించును. భావకుడై కవి యగును."

"రాజశేఖరుని యభిప్రాయము పైనుదహరించిన యభినవగుప్తుని మాటతో సంవదించుచున్నది. కవి, భావకుడు వేనికి వారు వేరు గారు. భావన యన్నది ఇరువురికి నుండవలయును. కవి భావకుడైనను రచనా వ్యాపారము వలన కవి శబ్దముచే వ్యపదేశింపబడుచున్నాడు. భావకున కట్టి వ్యాపారములేదు. కాన రచనావ్యాపారరాహిత్యమును బట్టి ఇద్దరికిని భేదము చెప్పవచ్చునుగదా యన్నచో రాజశేఖరుని యభి ప్రాయములో నీ భేదమంత ప్రధానమైనది కాదు. సహృదయుడు కవి కాకపోయినను నష్టములేదు. కవిమాత్రము సహృదయుడై యుండితీరవ లయును. అతడెంత భావకుడో యంత కవియగును. కావున మహాకవి 'కవి సహృదయుడు' అనుటలో విప్రతిపత్తిలేదు.

ఈ విషయమునే మహామహోపాధ్యాయ శ్రీ కుప్పుస్వామి శాస్త్రి గారు High ways and By ways of Literary Criticism in Sanskrit అన్నగ్రంథములో చక్కగా నిరూపించిరి. విశేషములు నెరుంగ గోరు వారా గ్రంథమును చూడదగును. మహాకవి యనగా "POET-CRITIC" అని ఆంగ్లభాషలో పేర్కొనిరి. ఆదికవియైన వాల్మీకి ఇట్టి మహాకవి. ఆయనకు పూర్వము కావ్యవాఙ్మయము లేదు. ఆయన తోడనే కావ్యవాఙ్మయము పుట్టినది. కావున సంప్రదాయ నిర్మాత ఆయన. మహాకవి సంప్రదాయము వాల్మీకి తోడనే ప్రారంభమైనది. నన్నయ భట్టారకుడు డాయనను 'గురుపద్యవిద్యకు నాద్యు' డన్నాడు. వాల్మీకి, మహర్షి కావున నాయనకు సరస్వతీతత్త్వము ప్రసన్నమైనది.

సంస్కృత వాఙ్మయంలో కాళిదాసు కవికులానికి గురువైనట్లు విశ్వ నాథ ఆధునికాంధ్రవాఙ్మయంలో "కవీనాం కవిః" "వ్యాఖ్యాతౄణాం శిరోమణిః" అని ప్రశంసింపబడినవాడు. ఆయన 'గొప్ప సహృదయుడు' అనటానికి పరశ్శతంగా ఆయన వ్రాసిన పీఠికలే సాక్ష్యం. అటువంటి కవిసమ్రాట్టు — "కవి సహృదయుడు" అనడంలో విప్రతిపత్తి ఏమీ లేదు. టి.యస్. ఇలియట్‌కు "critic for critics" అని బిరుదన్నమాట! ఆయనను "మహర్షి" అని ప్రశంసించిన విశ్వనాథ "కవిసహృదయ చక్రవర్తి".

విశ్వనాధకు ఇరువదిరెండవ సంవత్సరమే సరస్వతీ సాక్షాత్కారం జరిగినదనుటకు ఆయన వ్రాసిన 'ఆంధ్రపౌరుషము' లోని మొదటి పద్యమే ప్రత్యక్షసాక్ష్యం. ఆ పద్యమిది—

*శ్రీ పద్మాకర చామరానిల ప్రూతస్వేదాంబువౌమేన ది*
*వ్యాపాంగమ్ముల నీవు లోకముల బ్రోవన్ వీణవాయించుచో*
*నీపారామనిరంతర ధ్వనిత తంత్రీనాద సంతాన మ*
*మ్మా! పల్కించగదమ్మ! విశ్వజగదంబా! రాజరాజేశ్వరీ!*
(*1917* రచనాకాలం)

ఈ పద్యంలో నిక్షిప్తమైన సరస్వతీ మండలానికి చెందిన ఖగోళ శాస్త్రరహస్యాన్ని వివరిస్తూ నేను ఆంధ్రప్రదేశ్ మూడవ ప్రాచ్యపండిత పరిషత్తులో "సరస్వతీ స్రవంతి — విశ్వనాథ విజ్ఞాననిరతి" అనే వ్యాసం చదివాను. ఆ తర్వాత 'నవభారతి' లో ఆ వ్యాసం ప్రకటింపబడింది. (1981) కాబట్టి యిక్కడ వివరించడం లేదు. వాల్మీకిని, విశ్వనాధను పల్కించిన 'విశ్వజగదంబ' యైన సరస్వతీ దేవిని గూర్చి కొంత ముచ్చటిస్తాను.

సరస్వతి అంటే ఏమిటి? సరస్వతీ ఉపాసన వలన మానవజాతికి యెలాంటి శ్రేయస్సుచేకూరుతుంది? అనే ప్రశ్నల్ని గూర్చి విచారిస్తూపోతే సరస్వతీతత్త్వమేమిటో కరతలామలకమౌతుంది. ఇది జిజ్ఞాస.

సరస్వతి జ్ఞానాధిష్ఠాన దేవత. భారతీయధర్మంలోని అన్ని విచార మార్గాలూ సరస్వతినిగూర్చిచెబుతున్నాయి. వైదికధర్మంలో సరస్వతి, జైనధర్మంలో శ్రుతదేవత, బౌద్ధధర్మంలో ప్రజ్ఞాదేవి అనే పేర్లతో సరస్వతీదేవియే ఉపాసింపబడుతోంది. ప్రజ్ఞ జ్ఞానానికి అధిదేవత. బుద్ధభగవానునికి తపశ్చర్య, సమాధుల ఫలస్వరూపంగా లభించిన బుద్ధివిశేషమే ఈ ప్రజ్ఞ. ప్రజ్ఞఒక్కటే మానవుని విశిష్టగుణం. భౌతిక, కార్మిక శక్తులయొక్క వాటి వాటి గొప్పతనాలు వాటికున్నప్పటికీ ప్రజ్ఞలేదా మనోశక్తి అన్నిటికంటే మించింది. ఒక సూత్రాన్ననుసరించి 'మనస్సే మానవుడు! దీన్ని లోకోక్తిగా చెబితే 'మనసుంటే మార్గం లేకపోదు' అని మనం అంటూంటాం.

మనస్సుకు రెండు స్వరూపాలు. ప్రతివ్యక్తిలో ప్రత్యేకంగా నిర్మితమైన మనస్సున్నది. ఇది వ్యష్టిమనస్సు. నిజజీవితంలో వ్యక్తి సాధించిన

భౌతిక వికాసం వాని మనస్సు నుండి నిర్గమించిందేనని చెప్పాలి. సృష్టిలో ఎందరు జీవులున్నారో అన్నిరకాల మనస్సులున్నాయి. "జిహ్వాకొకరుచి పుర్రెకొకబుద్ధి" "తాను మెచ్చింది రంభ, తాను మునిగింది గంగ" అనే సామెతలిలా ఏర్పడ్డవే. వేర్వేరు జీవుల్లో వేర్వేరు ప్రజ్ఞలున్నాయి. ఈ ప్రజ్ఞల్లోగల అనంతభేదాలకు లెక్కాజమాలేదు. సృష్టిలోని సమస్తవస్తు జాలానికి ఎలా అంతం అనేది లేదో, అట్లే ప్రజ్ఞాసహితమైన మనస్సులేదా బుద్ధి అసంఖ్యాకభేదాలతో నిండివుంది. ఈ బుద్ధుల స్వరూపమేమిటని విచారిస్తే బుద్ధి లేదా మనస్సు అనేది ఏదో స్థూలవస్తువు కాదు. శరీరాన్ని మనం భౌతికంగా చూడగల్గుతున్నాము. కాని, శరీరాంతర్గత మైన ప్రజ్ఞ లేదా బుద్ధి ఒక సూక్ష్మశక్తి. అది ఎలాంటి సూక్ష్మశక్తి అంటే మనం దాని ప్రేరణచేత శబ్దాన్ని ఉచ్చరించినపుడే ఆశక్తి మన యందున్నదని తెలుస్తూవుంది. వాల్మీకి గొప్ప మహర్షియే. అందుకు సందేహంలేదు. కాని "మానిషాద...." శ్లోకం ఆయన నోటిగుండా వచ్చేంతవరకూ ఆయనలో ఒక మహాకవి వున్నాడని ఆయనకేతెలియ లేదు. ఇది వాక్ శక్తియొక్క విలాసం. ఇంకా చెప్పాలంటే మనస్సు యొక్కవిచారణాఫలితమైన కర్మల్ని మనం చేస్తూవుండడాన్నిబట్టి ప్రజ్ఞా శక్తి మనలోవుందనియితరులకు తెలుస్తూ వుంది. మీట నొక్కగానే తీగల్లో ప్రవహించే విద్యుచ్ఛక్తి బల్బురూపంగా వెలుగునూ, పంఖా రూపంగా గాలినీ ఎలా ప్రసరింపజేస్తోందో అదే ప్రకారంగా మనస్సులోని సూక్ష్మశక్తి మాటలుగా, చేతలుగా నిరంతరం మూర్తరూపాన్ని ధరిస్తూ వుంటుంది. వ్యక్తియొక్క ఈప్రజ్ఞ లేదా బుద్ధిని సాధారణపరిభాషలో వ్యష్టిమనస్సు అనవచ్చును.

ఎందరు వ్యక్తులో అన్ని వ్యష్టి మనస్సులు. ఇప్పుడాలోచింపగా ఈ అసంఖ్యాకమైన వ్యష్టి మనస్సులు లేదా బుద్ధులన్నీ ఆదిలో ఒకచోట సమావేశపరుపబడినవనీ, వాటి సంగమస్థానంఒకేచోటనీ, ఈ వివిధ రకాలైన బుద్ధిశక్తులకు జనిస్థానం లేదా ఉద్భవస్థానం ఒకటుందని తెలియ వస్తోంది. ఇలాంటి ప్రజ్ఞాశక్తి యొక్క విశిష్ట భాండారానికి సమిష్టి మనస్సని అంటారు. సృష్టి ప్రవర్తమానమవడానికి మూలభూతమైన దుంపలో తప్పనిసరిగా ఇటువంటి ఒక సమిష్టిమనస్సున్నది. అది మిక్కిలి శక్తివంతమైంది. మహత్తరమైంది. అందులో వివిధ వ్యక్తుల వేర్వేరు బుద్ధివిశేషాలు ఏకత్రా సమావేశపరుపబడ్డాయి.

ఈవిధమైన సమిష్టిమానసాన్ని మనం 'దేవత' అని పిలువవచ్చును. వ్యష్టిమనస్సుకొక హద్దున్నది. హద్దున్నదానికి అంతమెప్పుడూ వుంటుంది.

కాని నిస్సీమం, అపరిమితం అయిన శక్తి ఎల్లప్పుడూ అమృతం, అనంతమైంది. అదియే దేవత! ఆ దేవతను మనం ఏ పేరుతో నైనా పిలువవచ్చును. కాని, అది అమృతతత్త్వం. అన్నిధర్మాలూ, దర్శనాలూ, ఆచారాలూ, అధ్యాత్మవిషయాలూ, నీతి, సాహిత్యాది కళలూ ఇవన్నీ మానవవ్యక్తిగత బుద్ధిలో వ్యస్తంగా భిన్న భిన్నవి షయాలు కావచ్చును. కాని సమిష్టిరూపంలో ఇవన్నీ ఒకే విరాట్ మానసతత్త్వంలో లీనమైవున్నాయి. వ్యక్తిది వ్యస్తదృష్టి. శక్తిది సమస్త దృష్టి. ఈ మహత్తరమైన శక్తినే మనం జ్ఞానాధిష్ఠాన దేవి 'సరస్వతి' అని పిలుస్తున్నాము. ఇది దేవతా పరికల్పన.

సరస్వతీ శబ్దానికి అర్థమేమి? "సృగతౌ" అన్న సంస్కృత ధాతు నిష్పన్న మైనదే సరస్వతీ శబ్దం. "సరో వివిధం జ్ఞానం విద్యతే యస్యాం చిత్తౌ సా సరస్వతీ". సరోవరం నుండి జన్మించినదిసరస్వతి అనేది సామాన్యార్థం. సరస్వతి — సరస్ అనగా ప్రవహించుట — పరుగులి డుట — సెలయేరుగా సాగుట. సామాన్యముగా జలసంబంధమైనదే. తొలుత సరస్వతి నదీ దేవత. వేదకాలంలో 'సరస్వతి' యన్న నది యొకటి గంగా సింధూమైదానంలో చాల ప్రముఖపాత్ర వహించినది. ఆ నదీతటంలో వేదగాన ముద్భవిల్లినది. సంకలింపబడినది. ఆ నదివల్ల ఆనాటిఋషులుప్రభావితులలైనారు. దాని దివ్యత్వాన్ని తెలిసికొన్నారు. 'సృ' అన్న ధాతువును 'గతి' 'కదలిక' అని అర్థాలు. ఆహతమైతే కదలిక నిలిచిపోతుంది. కాబట్టి అది "అనాహతం" కావాలి. నిగ్రహం వున్నపుడే కదలిక అనాహత మవుతుంది. వివిధ జ్ఞానాలకు జనిస్థానం సరోభవ మైన సరస్వతి. ఇక్కడ సరోవరం ఏమిటి? అదెక్కడ వుంది? పైన సమిష్టిమనస్సని దేనినైతే చెప్పామో అదే ఈ సరో వరం. దాని నెవడూ ప్రత్యక్షరూపంలో చూడలేడు. అందుకే దానిని బుద్ధియొక్కఅవ్యక్తసరోవరం లేదా 'మానస సరోవరం' అని పిలుస్తు న్నాము. సరస్వతీనది అంతర్వాహిని అనే ఐతిహ్యం యిందుకే ఏర్ప డింది. అది అవ్యక్తం కాబట్టి అంతర్వాహిని (unconscious stream) దీన్నే ఋషులు 'బ్రాహ్మసరము' అన్నారు. వేదం దీన్నే 'హిరణ్మయ ఉత్సము' (బంగారపు బావి) గా ప్రశంసించింది. 'ఉత్సోదేవ హిర ణ్మయః' అని ఋగ్వేదం. ఇక్కడ హిరణ్యమంటే సువర్ణం. బంగారు. ఉత్సమంటే బావి. ఈసువర్ణం ప్రకాశించే స్థూలమైనధాతువు కాదు. అది అధ్యాత్మతత్త్వం. అదే మనస్సు. ఆ ప్రకాశమానమైన సువర్ణకిరణా లలో జీవితసర్వస్వం యొక్కవిలువలు సంగ్రహించబడివుంది. జీవితంలో

ఎన్ని అమూల్యమైన రత్నాలున్నాయో వాటన్నిటికీ జనిస్థానం ఈ బంగారపు బావియే.

సరస్వతి సర్వశుక్ల. శుక్లవర్ణం ప్రకాశం. లేదా జ్యోతియొక్క రూపం. దీన్నే జ్ఞానం అంటారు. జ్ఞానం ఒక జ్యోతి. ఇది ప్రతివ్యక్తి యొక్క మానసంలో అభివ్యక్తమౌతూవుంటుంది. దీన్నే ఉపనిషత్తు "ఆర్ద్రం జ్వలతి జ్యోతి రహమస్మి" "నేను ఆర్ద్రంగా వెలిగేదీపాన్ని" అని జీవుని స్వరూపాన్ని వర్ణించింది. ఋషి, మానవుల్ని "అమృత పుత్రులారా!" అని సంబోధిస్తున్నాడు ఉపనిషత్తుల్లో. ఆర్ద్రమంటే రెండు మూడర్థాలు చెప్పవచ్చు. దీపం వెలగడానికి స్నేహం అనగానూనె అవసరం. ఇది ఆర్ద్రమైందే కదా! ఇందులో ఆవునేతిదీపం ఇచ్చే వెలుగు మరింత ఆర్ద్రంగా, చల్లగా వుంటుంది. ఆముదపు దీపం వెలుగు మందకొడిగా, చిక్కంగా వుంటుంది. కిరసనాయిలు దీపం వెలుగు నల్లని పొగలు కక్కుతూ వట్టి వెలుగును పంచుతుంది. ఈ ఆర్ద్రత — సహృదయుని దృష్ట్యా సౌహార్ద్రతను చెబుతోంది. సహృదయుడు అచ్చమైన ఆవునేతితో వెలిగించిన ఆర్ద్రమైన దీపకాంతిని ప్రసరింపజేస్తాడు. ఇతడు 'అమృత పుత్రు'డంటే! ఇక అధ్యాత్మపరంగా చూస్తే ప్రతి జీవునిలోని, ప్రతి ప్రాణిలోని ప్రాణశక్తి జ్యోతి వంటిది. అది ఆర్ద్రంగానే వెలుగుతూ వుంటుంది. ప్రతిజీవుడూ తాను 'ఆర్ద్రమైన జ్యోతిస్సు'నని భావించాలి అంటోంది ఉపనిషత్తు.

సృష్ట్యారంభం నుండీ ఈనాటి వరకూ మానవుని మనస్సులో జ్ఞాన రూపమైన జ్యోతిస్సు యెన్నిరకాలుగా ఉదయమైందో దీన్నిబట్టి మనం ఊహించుకోవచ్చు. అనేక ఋషులూ, మునులూ, బుద్ధుడు, బోధిసత్త్వుడు, అర్హతులు, సిద్ధులు, ఆచార్యులు ఈ జ్ఞానజ్యోతిని ఉపాసించారు. నామభేదం చేత వస్తుతత్త్వంలో భేదమేమీ వుండదు. అందరూ సరస్వతీ మందిరంలో జ్ఞానజ్యోతిని ఉపాసించినవారే. అనాహత జ్యోతిని వర్ణిస్తూ భగవద్గీత-జ్ఞానయోగం (19) లో

శ్లో॥ యథా దీపో నివాతస్థో నేంగతే సో మా స్మృతా।
యోగినో యతచిత్తస్య యుంజతో యోగ మాత్మనః॥

నిశ్చల వాయుప్రసారం గలచోట దీపము చలింపక స్థిరముగా నెట్లు వెలుగునో, అట్లే యీ యోగసాధనచే మనస్సును జయించు యోగికి చిత్తము స్థిరమై యుండును.

జ్ఞానం యొక్క స్వరూపం జ్యోతి లేదా ప్రకాశమని చెప్పబడింది. దానినే మరొకవిధంగా జలమనికూడా చెప్పవచ్చు. అప్పుడుకూడా 'ఆర్ద్రత' అనే గుణం అన్వయిస్తుంది. ప్రతి వ్యక్తి మనస్సు ఆ విరాట్ జ్ఞానసరోవరం యొక్క ఒక పరిమితమైన, సీమితమైన అంశం. లేక దీన్నిలా చెబితే మరింత బాగుంటుంది. వ్యక్తి మనస్సు ఒక కమండలం. ఈ కమండలం ఆ విరాట్ జ్ఞానసరోవరంలోని జలంతో నిండివుంది. జన్మ మొదలు మృత్యుపర్యంతం ఈ కమండలంలోని జలబిందువులతో మనం జీవిత వికాసాన్ని పొందుతూ వున్నాము. ఏది సమిష్టి జలమో అది నిత్యమూ స్వచ్ఛమైంది. దానిలో భావకాలుష్యముండదు. ఎందుకంటే అది అగాధంలోని జలంఅందుకే అది నిర్మలం, మధురం, అమృత స్వాదువు. కాని అదే జలం వ్యక్తి మానసపాత్రలో వచ్చినపుడు అది సీమితమౌతున్నది. వ్యక్తియొక్క రాగద్వేషాలచేత కలుషిత మౌతున్నది. అందుకని ప్రతి వ్యక్తి ఈ విషయంలో మిక్కిలి జాగరూకుడై వుండాలి. ఎల్లప్పుడూ తన మనస్సును సరస్వతి యొక్క విరాట్ జ్ఞాన చింతనచే స్వచ్ఛత్వాన్నీ, పరిశుద్ధినీ పొందేటట్లుగా చూచుకొంటూవుండాలి. దీనికి వాల్మీకిరామాయణావతారికలో చక్కని తార్కాణం లభిస్తూ వుంది. వాల్మీకి తమసానదీతీరానికి శిష్యుడైన భరద్వాజుని వెంట తీసుకొనివెళ్లినప్పుడు క్రౌంచద్వంద్వ వియోగ ఘటన ఇంకా అప్పటికి జరుగలేదు. వాల్మీకిలోని సహృదయుడు అప్పుడు మేల్కొనివున్నాడు.

*అకర్దమమిదం తీర్థం భరద్వాజ నిశామయ।*
*రమణీయం ప్రసన్నాంబు సన్మనుష్య మనోయథా॥* (2-5)

అకలుషమైన చిత్తవృత్తిని 'అకర్దమతీర్థ' మనేమాట, 'తీర్థ' మనే పదం పవిత్రతనూ, దివ్యత్వాన్నీ సూచిస్తోంది. అటువంటి స్వచ్ఛమైన జలము "రమణీయ ప్రసన్నాంబువు" అని వర్ణిస్తున్నాడు కవి. రమణీయ, ప్రసన్న శబ్దములు రెండూ కావ్యాంతర్గత వైశిష్ట్యాన్ని సూచించే ఉపలక్షకమైన మాటలు. నన్నయ్యగారు ఆశ్వాసాంతాలలో 'రమణీయ' శబ్దాన్ని తరుచుగావాడటమేకాదు 'అవతారిక'లో 'ప్రసన్నకథా కలితార్థ యుక్తి' అని వాల్మీకి వాడిన పై రెండు మాటలను తన కావ్య శిల్పలక్షణాలలో ప్రధానమైనవిగా స్వీకరించినాడు. నన్నయ 'పద్యవిద్యాప్రభువు' కాగా, వాల్మీకి "గురుపద్యవిద్యకు నాద్యుడు" కదా!

ఇక్కడ ప్రధానమైన విషయం సన్మనుష్యుని మనస్సు అకలుషితమైన తీర్థమని అది రమణీయప్రసన్నాంబుపూర్ణమని చెబుతున్నాడు.

దీనికి వాల్మీకి మహర్షియే మంచి ఉదాహరణ. వాల్మీకి క్రౌంచ ద్వంద్వ వియోగఘట్టంతో కవి కాబోతున్నాడు. తత్పూర్వం పరిసర నదీ, అరణ్య శోభాసౌందర్యదిదృక్షాఘట్టంలో సహృదయ శేఖరుడు. ఈ సమ్మనుష్యుడు రామకథా నిర్మాత వాల్మీకి మహర్షియే. మహాకావ్యంలో పురుషోత్తము డైన శ్రీరామచంద్రుడే సమ్మనుష్యుడు. కాబట్టి వాల్మీకి సహృదయుడైన కవి, మహాకవి అని నిర్ణయింపబడుతోంది.

అహం = హంస. సరస్వతీదేవి వాహనం హంస. మానవుని వ్యక్తి గత బుద్ధిని లేదా మనస్సును 'అహం' అంటారు. అదేహంస. విరాట్ జ్ఞానాన్ని మూర్తరూపంలో అంటే ఒక కేంద్రస్థానంలో దర్శించాలంటే మనోరూపమైన హంసకంటే వేరొకమార్గంలేదు. వాయువేగమనోవేగాలని లోకంలో మనం అంటూంటాం. మనస్సుకంటే వేగవంతమైనది సృష్టిలో మరొకటిలేదు. సరస్వతి ఆవాహనం హంసద్వారావే సంభవం. హంసపై అధివసించిన సరస్వతి, దివినుండి భువికి అవతరించిన వాక్శక్తికి సమష్టినుండి వ్యష్టికి సంక్రమించిన జ్ఞానమార్గానికి, సంకేతం. హంస ప్రాణానికీ, వ్యష్టిమనస్సుకూ ప్రతీక. ప్రాణానికీ, వాక్కుకూ ఎడతెగని సంబంధం. వాక్శక్తియే సృష్టిగా పరిణమించిందని వేదం. వ్యక్తియొక్క మనస్సు ఆ షక్షితో సమానమైంది. దాని శక్తివంతాలైనరెక్కలతో విరాట్ఆకాశాన్ని కొలవడంలో గొప్పవిశేషముంది. ఎవ్వరికీ పోవడానికి శక్యంకాని అతిగహనమైన ప్రదేశాలలో కూడా ఆషక్షి తన పయనకౌశలం చేత విశేషవిషయాలనుగ్రహించి తిరిగి స్వస్థానం చేరుకోగలదు. అందుకే మహాకవి కాళిదాసు మనస్సును రథంతో పోలుస్తూ "మనోరథానామగతి ర్నవిద్యతే". మనస్సనే రథానికి పరిచయంకాని మార్గమేలేదుఅన్నాడు. మహాకవుల్లో ఈ విలక్షణ వాక్శక్తికి ఆధారం వారివారి మనస్సులయొక్క ఏకాగ్రత లేదా సమాధి అనవచ్చును. శ్రీహర్ష, శ్రీనాథ, జగన్నాథ, విశ్వనాథాదుల ధిషణాహంకారాన్ని ఈస్థాయినుండి చూడాలి. అప్పుడే వారివారిప్రత్యేకతలు తేటతెల్లమవుతాయి. ఈప్రత్యేకతాప్రాప్తికి సాధనం తపశ్చర్య. కేవలజ్ఞానం లేక ఇచ్ఛ ఇక్కడ పనికిరాదు.

అనేకపాత్రల్లో ఉంచబడినజలం నుండి ఒక్కొక్క బిందువు గ్రహించి వాటిని ఒకపాత్రలో ఎలా కలుపవచ్చో అలాగే వ్యక్తియొక్క మనస్సులో నిత్యమూ సంకల్ప వికల్పక్రియ జరుగుతూవుంటుంది. మన ఆలోచనలు మనం ఇతరులకు అందిస్తూవుంటాము. ఇతరుల సంస్కారం మనలో కలుపుకొంటూ వుంటాము. ఈప్రకారంగా ఎందరు వ్యక్తులతో మనం సాన్నిహిత్యం గల్గివుంటామో ఆయావ్యక్తుల మానసజలం మనమనస్సులో

అనాయాసంగా కలిసిపోతూవుంటుంది. ఆదాన ప్రదానాలతో కూడిన ఈకార్యక్రమమే మానవజీవనవ్యవహారం. ఇది ఎప్పటికీ అంతమయ్యేది కాదు. ఈగొలుసులోని ప్రతి సంకెలకూ ఒక ప్రాధాన్యం, ఒక ప్రత్యేకత తప్పనిసరిగావుంది. ఆయావ్యక్తుల ఉదారభావనలు రాత్రింబవళ్లు నాల్గుదిక్కులా ప్రసరిస్తూనేవుంటుంది. "ఆనో భద్రాః క్రతవోయంతు విశ్వతః — నేల నాల్గుచెఱగుల నుండి గొప్పగొప్పభావాలు వచ్చి మమ్ము చేరుగాక!" అని చేతులుచాచి ఆహ్వానిస్తున్నాడు వేదఋషి. ఇలాకోరే ప్రతిమానవుడూ తన మానసజలాన్ని స్వచ్ఛంగా, నిర్మలంగా, నిష్కల్మషంగా వుంచుకోవాలి. అలా వుంచుకోవడానికి ప్రయత్నించాలి. ఇదే వైయక్తిక వైలక్షణ్య పరిరక్షణం (safe-guarding Individual Personality). ఇతరుల మేధతోడి సంపర్క, సాన్నిహిత్యాలవల్ల తన మనస్సులో ఎటువంటి ఉద్వేగానికీ, అలజడికీ, ప్రతికూలప్రతిక్రియలకూ తావీయకుండా జాగ్రత్తపడాలి. ఇదే ఉత్తమసంయమనంగల వానిమనో లక్షణం. ఇలాంటి మనస్సే మానవ పురోగతికి మిక్కిలి ఆవశ్యకమైంది. ఇలాంటి స్వచ్ఛమైన మనస్సే అనిమిషమనస్సుకు మిక్కిలి దగ్గరగా వుంటుంది. అలాంటివారే దేవతలకూ, అమృతతత్త్వానికీ సన్నిహితంగా ప్రవర్తిస్తూవుంటారు. వారినే 'అమృతహృదయుల'ని మనం పిలుస్తూ వుంటాము. కావ్యపరిభాషలో కవీ—సహృదయులంటే వీరే. అందుకే అనుభవజ్ఞులైన పెద్దలు యిలా సెలవిచ్చారు.

సంసార విషవృక్షస్య ద్వే ఫలేహ్యమృతోపమే।
కావ్యామృతరసాస్వాదః సాంగత్యం సాధుభిస్సహ॥

జనన మరణ యాత్రారూపమైన జీవుని సంసారపరిభ్రమణం ఒక విషవృక్షంతో పోల్చబడింది. అంటేఅందులోసారంలేదు. నిస్సారమైంది. వైగాప్రాణాంతక మైంది. కాని, ఆవిషవృక్షంలో రెండు అమృతఫలాలున్నాయి. అందులో ఒకఫలం కావ్యామృతరసాస్వాదన. రెండవఫలం సాధుజనసాంగత్యం. ఇక్కడ మళ్లీ కవి-కావ్యము-సహృదయుడు అనే త్రిపుటి ప్రత్యక్షమౌతోంది. 'కవిసహృదయుడు' కావ్యం వ్రాయగా అందరి విశ్వజనీనమైన అమృతరసాస్వాదనచే సహృదయులౌతున్నారు పాఠకులు. కవితో సమానమైనహృదయం గలవారు సహృదయులు. "నాయకస్య కవేః శ్రోతుః సమానోऽనుభవస్తతః" అన్నాడు అభినవగుప్తుని ఉపాధ్యాయుడు భట్టతౌతుడు. కావ్యనాయకుడూ-కవీ-శ్రోతయైన సహృదయుడూ ముగ్గురికీ సమానమైన కావ్యరసాస్వాదనానుభవం కల్గు

కొంది అంటే వీరు ముగ్గురూ సమానస్థాయిలోని వారు అని ఆయన ఎప్పుడో నిష్కర్షించినాడు.

ఇలా మన మనస్సులో ఎటువంటి సరస్వతీమందిరాన్ని నిర్మించు కొంటున్నామో అది మనశాశ్వతనివాసస్థానం కావాలి. అదే మన హృదయం. అదే మనస్వర్గం. అదే మనరసరాజధాని-రసధుని. అది జ్ఞానాధిష్ఠానదేవతకొక ప్రతీకకావాలి. ఆ ప్రతీకద్వారా మనం దేవతా స్వరూపప్రాప్తినిపొందాలి. మనభక్తిప్రపత్తులు స్వస్వరూపానుసంధానానికి దోహదంకావాలి. ప్రతిసరస్వతీమందిరంలో సేకరింపబడిన గ్రంథరాశి ఒకస్థూల ప్రతీకమాత్రమే. ఆశబ్దరాశి నిస్సందేహంగా ఆ సమిష్టి మనస్సంజనితమైందే. ఆజనిస్థానాన్నే మనంపైన బ్రాహ్మసరం లేక సమిష్టిమనస్సు అన్నాం. ఈ స్థూలగ్రంథాల ప్రయోజనమంతా జీవిత చారితార్థ్యానికి ఉపయోగపడేంతవరకే. లిఖితాక్షరాల వెనక ఏవాస్తవిక మైన అక్షర తత్త్వముందో దానికెన్నడూ నాశంలేదు. ఈ అక్షరతత్త్వం చేరుకోటానికి సోపానక్రమం ఈ గ్రంథపఠన మననాదుల వలన ప్రతి మానవునికీ లభించాలనేదే మనఆశయం. ఆదర్శం. ఎవడు జాగరూకుడై తనమనస్సును స్వచ్ఛంగా మేఘగతజలబిందువులాగా, పవిత్రంగా ఉంచు కోవటానికి నేర్చుకొన్నాడో, చక్కగా మనస్సుచే విచారించి కార్యాలను యుక్తిసహంగా చేసుకోవడం అభ్యసించాడో, ఎవడు మనోశక్తిచేజీవన నిర్మాణకళలో నిష్ణాతుడో అతనికి సరస్వతీమందిర నిర్మాణధ్యేయం సార్థకమైనట్లే. ఈ విధమైన ప్రణాళిక సర్వధర్మాలకూ శ్రేష్ఠమైంది. సర్వరూపాలకూ ఉన్నతమైంది. ఈవిరాట్ మానవీయసంస్కృతియొక్క ఆరాధన సర్వజనులకూ ఉపాదేయమైంది. ఇది ఉదాత్తమైన ఆశంస.

*అంధీభూయ గుణాగుణేషు తరవో వాతావధూతా ఇవ*
*శ్లాఘంతే యది సాహితీ రసవతీమజ్ఞాః తతః కిం ఫలమ్?*
*జానన్ వ్యంగ్యచమత్కృతీ రసగతీః అర్థాచితీరాదరాత్*
*అంతశ్శర్మ యదశ్నుతే సహృదయః సా జీవనాడీ కవేః*

— ఒక అజ్ఞాతకవి

(ఒకకావ్యంలోని గుణాగుణాలను వివేచించకుండా అన్నికావ్యాలనూ ఆహా! ఓహో! అని పొగుడుతూ చెట్లుగాలికి అటూయిటూ వూగేట ట్లుగా తలలూపే అజ్ఞులవల్ల రసవంతమైన సాహితీజగత్తులో వట్టిచీకటి అలముకొంటుంది తప్ప యేమాత్రం ప్రయోజనంలేదు. ఎవనికి అంత స్సుఖాపాదకమైన, కావ్యగౌరవప్రతిపాదకమైన వ్యంగ్యమర్యాద, చమ

త్కృతి, రసగతి, అర్థౌచితి తెలియనో అటువంటి సహృదయుడే కవికి జీవనాడి వంటివాడు).

## 3. మహాకవి మనస్తత్వం

కావ్యావిర్భావానికి కవిమనస్తత్త్వమే పృష్ఠభూమి. శ్రీమద్రామాయణ మహాకావ్యావిర్భావానికి పూర్వం మహర్షివాల్మీకి మనస్తత్వ మెటువంటిది?

శ్లో॥ ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేనం
ఆశ్చర్యవద్వదతి తథైవచాన్యః।
ఆశ్చర్యవచ్చైవ మన్యః శృణోతి
శ్రుత్వాప్యేనం వేద న చైవ కశ్చిత్॥ — *గీత 2-29*

మరణాన్నిగూర్చి, దేహిదేహాల పరస్పర సంబంధాన్నిగూర్చి లోకులు కొందరు వింతగాచూస్తారు. వింతగా మాట్లాడుతారు. ఆశ్చర్యంగా వింటారు. దీన్నిగూర్చి ఎంతవిన్నా, చూచినా, చెప్పినా కూడా యాథార్థ్యం తెలుసుకొన్న వాడొక్కడూలేడు, అని భగవంతుడు 'గీత'లో చెప్పాడు. ఈ మాటలు కఠోపనిషత్తులోని ఈక్రింది శ్లోకాన్ని జ్ఞప్తికి తెస్తున్నది.

శ్లో॥ శ్రవణాయాపి బహుభిర్యో న లభ్యః
శృణ్వంతోఽపి బహవోయం న విద్యుః।
ఆశ్చర్యో వక్తా కుశలోఽస్యలబ్ధాఽఽ
శ్చర్యో జ్ఞాతా కుశలానుశిష్టః॥ *(2-7)*

'ఏయాత్మను గురించి వినడానికీ, విన్నా తెలుసుకోవడానికీ మిక్కిలి కష్టమో అట్టి యాత్మనుగురించి చెప్పేవాడుగాని, తెలిసికొనేవాడు గాని ఎంతో అరుదుగా వున్నారు.' పైవాక్యాలు మరొక గీతాశ్లోకాన్ని స్పృశిస్తూ వున్నది.

మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే।
యతతా మపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః॥ *(7-3)*

వేయిమంది మనుష్యుల్లో ఎవడో ఒకడు ఆత్మజ్ఞానసిద్ధికోసం ప్రయత్నిస్తున్నాడు. అలా ప్రయత్నించి ఆత్మసిద్ధిని పొందినవారిలో కూడా ఎవడో ఒకడే నన్నునిజంగా తెలిసికొంటున్నాడు' అని భగవంతుని నిష్కర్ష.

భగవంతుడు చెప్పిన ఆ ఒక్కడుఎవరు? ఆ ఏకైకవ్యక్తి ఎవరు? ఆయనే ఆదికవి వాల్మీకిమహర్షి. జీవన్మరణసమస్యారహస్యాలను చక్కగా తెలిసినవాడు. సంయోగ వియోగాల్లోని పరమార్థాన్ని తత్త్వతః గుర్తెటిగినవాడు. బృహదారణ్యకోపనిషత్తు మృత్యుమీమాంసతో ప్రారంభింపబడినట్లే రామాయణం క్రౌంచమరణవేదనతో ప్రారంభమైంది. అంటే రామాయణం మరణవేదననుండిపుట్టిందనితాత్పర్యం. అది ఆశ్చర్యంగా తిలకించి మహాకవిత్వంచెప్పిన వాల్మీకిమహర్షి జీవుల జననమరణ రహస్యజ్ఞాత. ఎవరో పాశ్చాత్య దార్శనికుడన్నట్లు "It is not death that is painful but the departure of life" — "మరణముకన్న ప్రాణోత్క్రమణమే జీవులకు మిక్కిలి బాధాకరము" అన్నసత్యము వాల్మీకి మహర్షి ఇక్కడ దర్శించినాడు. ఆ దర్శనమే కావ్యావిర్భావహేతువైనది. ఇదియే విశ్వనాథవారి "జీవునివేదన"కు ముఖ్యప్రేరకం. రాక్షసుల 'మరణవేదన'చూచి రాముడు 'జీవునివేదన'కు లోనవుతాడు కల్పవృక్షంలో.

మరొకవిధంగా చూస్తే ఉపనిషద్ ప్రోక్తమైన — "ద్వాసుపర్ణా సయుజా సఖాయా....." అన్న శ్లోకతాత్పర్యాన్ని జీర్ణించుకొన్నవాడు — మహర్షి. ఇటువంటి విలక్షణమనస్తత్త్వంగల మహర్షికి అపూర్వకథావస్తువు లభించింది.

*గీతలో శ్రీకృష్ణభగవానుడు వక్త — అర్జునుడు శ్రోత*

*కఠోపనిషత్తులో వక్త యముడు — శ్రోత నచికేతుడు*

*రామకథకు ప్రథమవక్త నారదుడు — ప్రథమశ్రోత వాల్మీకి*

*భాగవతానికి శుకమహర్షి వక్త — శ్రోత పరీక్షిత్తు*

పైజంటలు నిజంగా అత్యుత్తములయిన వక్త-శ్రోతలు. ఉదాత్త గురుశిష్యులు. ఒకమంచిమాట చెప్పేవాడున్నా విని ఆచరించేవాడు వుండాలి. అప్పుడే చెప్పిన దానికి సార్థకత. విని పెడచెవిని పెట్టేవాడి వల్ల ప్రయోజనంలేదు. ఈ సందర్భంలో వాల్మీకి మహర్షియే మారీచుని చేత రావణునికి చేయించిన హితోపదేశంలోని ఒకశ్లోకం గుర్తుకొస్తోంది.

సులభాః పురుషారాజన్ సతతః ప్రియవాదినః।
అప్రియస్యచ పథ్యస్య వక్తాశ్రోతా చ దుర్లభః॥

ఓరాజా! ప్రియమైన మాటలు చెప్పేవాళ్లు కోకొల్లలు. అప్రియమైనా హితమైనదాన్ని చెప్పేవాడూ వినేవాడూ ఎప్పుడూ దొరకరు.

అప్రియస్యాపి పథ్యస్య పరిణామః సుఖావహః।
వక్తాశ్రోతా చ యత్రస్తి రమంతే తత్ర సంపదః॥

'ఒక మంచిమాట వినేవాడికి మొదట అయిష్టంగా వున్నా చిట్ట చివరికి అదే వాడికి మంచినికల్గజేస్తుంది. ఇలాంటి వక్తాశ్రోతలున్న చోట సర్వసంపదలు సమకూరుతాయి' అని హితోపదేశంలోని ఒక సుభాషితం.

## 4. అనుకోకుండా ఆశ్చర్యంగాపుట్టింది ఆదికావ్యం

లోకంలో ఒకనిజమైన వింతపుడితే దాన్ని సామాన్యమానవుడు కళ్లుండి చూడలేకపోతున్నాడు. కొందరుఅచ్చంగా వింతపనులనే విచిత్ర విషయాలుగా గుర్తిస్తారు. ఏసుక్రీస్తు, కుంటివాణ్ణి లేచినడవ మనడం ఒకడికి వింత. సాయిబాబా గాలిలో చేయెత్తి రత్నఖచితహారం యిచ్చాడని విని ఒకడు నోరుతెరుస్తాడు. అదే ఒకసువాసనగల సుందరపుష్పం ఒకపెంటకుప్పనుండి మొలిచివికసించడం, ఒకబురదగుంటలో వేయిరేకులతో పద్మం విప్పారుకొనడం వాడికి లోకసహజం! అలాగే వేసవి సాయంకాలాల్లో మేఘాలుగుమిగూడి ఆకాశంలోనృత్యంచేయడం వాడికి ప్రకృతిధర్మం! రామాయణావిర్భావంకూడా యిలాగే అత్యాశ్చర్యకరంగా జరిగిందంటే, నమ్మని వాళ్లున్నారంటే ఆశ్చర్యపడనక్కరలేదు.

ఒకనాడు వాల్మీకిమహర్షి గంగానదికిసమీపంలోగల తమసానదిలో స్నానంచేయడానికి భరద్వాజుడనే శిష్యునితోపాటు వెళుతున్నాడు. దారిలో ఒకచెట్టుకొమ్మపై క్రౌంచపక్షులజంట మనసిజరాగంతో కలిసి మెలిసి వుండడం గమనించాడు. అంతే! హఠాత్తుగా ఎక్కణ్ణుంచోఒకబాణం వచ్చి మగపక్షికి తగిలింది. అది గిలగిల తన్నుకుంటూ క్రిందపడి ప్రాణాలుకోల్పోయింది. ఈవిషాదదృశ్యం మహర్షిహృదయాన్ని కదలించి

వేసింది. ఓరీ కిరాతుడా! నీవు క్రౌంచపక్షులజంటనుండి కామపరవశమైన మగపక్షినిచంపావు. నీవు శాశ్వతప్రతిష్ఠ నందకుందువుగాక!" అని శపించినవెంటనే 'కిమిదం వ్యాహృతం మయా' — ఏమిటి? నానోటివెంటఇలాంటిమాటలొచ్చాయి! అని ఆశ్చర్యపోయాడు. ఆసన్ని వేశాన్నే, ఆమాటలనే తదేకధ్యానంతో మననంచేస్తున్న మహర్షిముందు బ్రహ్మసాక్షాత్కరింపగా —

"ప్రాంజలిం ప్రయతో భూత్వా తస్థౌ పరమవిస్మితః" దోసిలియొగ్గి పరమాశ్చర్యపడుతూ లేచినిలుచున్నాడు.

*"ఋషే! ప్రబుద్ధోఽసి వాగాత్మని*
*తత్ బ్రూహి రామచరితమ్*
*అవ్యాహత జ్యోతిరార్షమ్*
*తే చక్షుః ప్రతిభాతి; ఆద్యః కవిరసి"*

'నీవు ఆదికవివి' అని బ్రహ్మఆశీర్వదించి, రామాయణాన్ని రచించమని ఆజ్ఞాపించి, ఆర్షచక్షువునిచ్చి అంతర్ధానమయ్యాడు. తిరిగి ఆశ్చర్యపోవడం వాల్మీకివంతు అయింది. "తతః సశిష్యో భగవాన్ మునిర్విస్మయ మాయయౌ" — భగవంతుడైన వాల్మీకి శిష్యసమేతంగా ఆశ్చర్యపోయాడు. "మానిషాద...." శ్లోకాన్ని మళ్ళీ మళ్ళీ మననంచేస్తూ బ్రహ్మమాటలుతలపోస్తూ వాల్మీకి శిష్యులంతా "ముహుర్ముహుః ప్రీయమాణాః ప్రాహుశ్చ భృశవిస్మితాః" తమలోతాముఎంతో ఆశ్చర్యపడ్డారు. 'విచిత్రార్థపదాల'తో విలసిల్లే రామాయణ కావ్యగానాన్ని కుశలవులద్వారా విన్న ఋషులందరూ ఆనందబాష్పాలు రాలుస్తూ —

*అహో! గీతస్య మాధుర్యం శ్లోకానాంతు విశేషతః*
*ఆశ్చర్య మిద మాఖ్యానం మునినా సంప్రకీర్తితమ్*
*సాధు సాధ్వితి తా వూచుః పరం విస్మయ మాగతాః॥*

పెద్దబైపులోవున్న గీచిన వాక్యాలు అద్భుతమూ, ఆశ్చర్యమూ అయిన శ్రీమద్రామాయణకావ్యావిర్భావాన్ని బహుధా ప్రశంసిస్తున్నాయి. ఇలాంటి ప్రశంసే మనకు భవభూతి, ఉత్తరరామచరితనాటకంలో వ్రాశాడు.

"ఆకస్మిక ప్రత్యవభాసాందేవీం వాచ మవ్యతికీర్ణరూపా
మానుష్ఛందసాపరిచ్ఛిన్నా మభ్యుదైరయత్ (2వ అంకం)

ఇక్కడ 'దేవి' అంటే 'సరస్వతీదేవి'. ఆమె అకస్మిక ప్రత్యవ భాస యైనదట! అంటే హఠాత్తుగా సాక్షాత్కరించిందని అర్థం. కాబట్టే, భామహుడనే ఆలంకారికుడు "కావ్యంతు జాయతే జాతు కస్యచిత్ ప్రతిభావతః" — ఎవడో ఒక ప్రతిభావంతుని నుండే కావ్యమావిర్భ విస్తుంది — అన్నాడు. ఇక్కడ 'కస్యచిత్' అనే మాట సాభిప్రాయం. ఈ 'కశ్చిత్' శబ్దాన్ని గీతాకారుడు కూడా వాడాడు. "కశ్చిన్మాంవేత్తి తత్త్వతః" — ఎవడో ఒక్కడే నన్ను యథార్థంగా తెలుసుకుంటున్నాడు. అంతేకాదు, "కశ్చిద్ధీరః ప్రత్యగాత్మాన మైక్షత్"— అని ఉపనిషత్తు. ఒకానొక ధీరుడెవ్వడో ముముక్షువై యింద్రియాలను బాహ్యవిషయాల నుండి తిప్పి అంతర్ముఖ దృష్టిగలవాడై ఆత్మస్వరూపాన్ని దర్శిస్తున్నాడు. కావ్యమీమాంసాకారుడయిన రాజశేఖరుడు దశవిధ కవులను పేర్కొంటూ వీరందరిలో 'కవిరాజు' అత్యున్నతుడని నిర్ణయించి — "తేయది జగత్యపి కతిపయే" ఇలాంటి కవిరాజులు లోకంలో కొంతమందే అన్నాడు. అంతటితో ఆగక "మహాప్రబంధేతు కవి రేకో ద్వౌ దుర్లభాస్త్రయః" — మహా ప్రబంధకర్తలైన కవులు ఒకరో, ఇద్దరో మూడవవాడు దొర కడం కష్టం' అన్నాడు. ఇది ధ్వనికారుడు చెప్పిన — "అతి మహతి విచిత్రకవిపరంపరావాహిని సంసారే ద్విత్రాః పంచషావా మహాకవయః వాల్మీకి కాళిదాస ప్రభృతయః ఇతి గణ్యంతే" అన్నవాక్యంతో బుజాలు రాచుకొంటోంది. ఆ ఒకరిద్దరు వాల్మీకి, వ్యాసులైతే, ఐదుగురిలో కాళి దాస, భవభూతి, మురారుల్ని గ్రహింపవచ్చునేమో! ఎవరేమన్నప్పటికీ మహాకవుల్లో అగ్రతాంబూలం ఆదికవి వాల్మీకిమహర్షికే దక్కుతుంది.

# 5. రామకథాస్వరూపసాక్షాత్కారపద్ధతి

పాశ్చాత్య సంస్కృత పండితులు రామాయణంలో బాలకాండ అంతా ప్రక్షిప్తమనగా, భారతీయవ్యాఖ్యాకర్తలు కొందరు మొదటి నాల్గుసర్గలు మాత్రం ప్రక్షిప్తం కావచ్చునని వూహిస్తున్నారు. ఈ నాల్గు సర్గలను గూర్చిచెబుతూ అది ప్రధానకథకు "ఉపోద్ఘాత"మని తిలకటీకాకారుడను, అమృతకతక వ్యాఖ్యాకారుడును చెప్పగా, అది 'సంక్షిప్తరామాయణ'మని శిరోమణి వ్యాఖ్యాత అభిప్రాయపడగా 'ప్రస్తావనా గ్రంథ'మని భూషణ వ్యాఖ్యాతచెప్పాడు. పైగా ఈ భూషణ వ్యాఖ్యాత అయిన గోవిందరాజు పై నాల్గుసర్గలరచనావిషయమై మూడువిధాలుగావూహిస్తూ "వైలక్షణ్యా

త్రయ ప్రతిపాదన” మనేపేరుతో కొంతవ్రాశాడు. ఆ మూడంశాలు యివి.

1. రామాయణమంతా వ్రాసిన తర్వాత ఏతద్రచనకు పూర్వం తన మనోభావమెలా వుండినదో భావించుకొని మహర్షియే దాన్నివ్రాసి మొట్టమొదటిభాగంగా చేర్చివుండవచ్చు.

2. పైసర్గలునాల్గు కొంత ఆత్మప్రశంసారూపంగా వున్నప్పటికీ యితరులకు ఆవృత్తాంతాలు తెలియదుకాబట్టి ఎలా జరిగిందో తెలియజేయడానికోసం వ్రాసిచేర్చివుండవచ్చు.

3. లేదా ఈ సర్గచతుష్టయాన్ని వాల్మీకి శిష్యులెవరో రామాయణ రచనానంతరం రచించి తద్వైభవ ప్రకటనార్థం కలిపి వుండ వచ్చు. దీనికి విజ్ఞానేశ్వరుడు వ్యాఖ్యానించిన యాజ్ఞవల్క్య స్మృతియే ఉదాహరణం.

పై వూహలు ఎంతవరకు నిజమైనవో మనమిప్పుడు ఖచ్చితంగా చెప్పలేము. నా ఉద్దేశ్యంలో బాలకాండలోగల మొదటినాల్గుసర్గలు ఒకప్రత్యేక ప్రయోజన మపేక్షించి మహర్షియే రచించివుంటారనితోస్తోంది. ఎందుకంటే ఆ నాల్గుసర్గలు ఆదికవికి రామకథాస్వరూపసాక్షాత్కారమెలా కలిగిందో, ఏతత్క్రమికవికాసాన్ని సూచించే విధంగా — భక్తుడికి భగవత్సాక్షాత్కార పద్ధతిలోగల నాల్గుదశలతో సంవదించేటట్లుగా — సంతరింపబడిందని నా విశ్వాసం.

ఆత్మస్వరూప సాక్షాత్కారసోపానములు నాలుగని బృహదారణ్యకో పనిషత్తు చెబుతున్నది.

*ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో*
*మంతవ్యో నిదిధ్యాసితవ్యో మైత్రేయి।*
*ఆత్మనో వా అరే దర్శనేన శ్రవణేన*
*మత్యా విజ్ఞానే నేదజ్ సర్వమ్ విదితమ్॥* *(2-4-5)*

*శ్రోతవ్యః శ్రుతి వాక్యేభ్యో మంతవ్య శ్చోపపత్తిభిః।*
*మత్వా చ సతతం ధ్యేయ ఏతే దర్శన హేతవః॥*

వేదవాక్యముల మూలమున ఆత్మస్వరూపమువిని, యుక్త్యుపపత్తులచే

మననంచేసి, ఆత్మను నిరంతరంధ్యానించుచున్నచో నాత్మసాక్షాత్కారం కలుగుతుంది. ఆత్మసాక్షాత్కార సాధనామార్గాలను నిరూపించడంలో యోగశాస్త్రమెంతో ఉపకరిస్తుంది. సంప్రజ్ఞాత సమాధి, అసంప్రజ్ఞాత సమాధి యని ఆత్మసాక్షాత్కార పద్ధతి ద్వివిధాలు. దీనిలో మొదటిది శ్రేష్ఠమైనదికాదు. రెండవది — స్వరూపమాత్ర స్థితిరూపమైన అసంప్రజ్ఞాత సమాధియే కైవల్యమని నిరూపించిన పాతంజలదర్శనమెంతో ఉత్తమోత్తమమైనది.

'వేదోపబృంహణార్థ'మై రచింపబడినది రామాయణం. అటువంటి మహాకావ్యకర్తయైన వాల్మీకి వేదవాక్యముల యందు పరినిష్ఠితమయిన బుద్ధిగలవాడు. కావుననే —

వేదవేద్యే పరేపుంసి జాతే దశరథాత్మజే।
వేదః ప్రాచేతసాదాసీత్ సాక్షాద్రామాయణాత్మనా॥

వేదములచే తెలియబడు పరమపురుషుడు దాశరథియై అవతరింపగా వేదము వాల్మీకిమహర్షినుండి రామాయణరూపమున అవతరించినది. ఇప్పుడు ఆత్మసాక్షాత్కార సోపానములను, రామకథాస్వరూప సాక్షాత్కార పద్ధతికి అన్వయించుదము.

1. శ్రవణం — రామకథా శ్రవణానికి ముందే మహర్షి అంతః కరణం అద్దంవలె నిర్మలంగా వుంది. అచ్ఛోదకాసారం వలె మానససరోవరం నిష్కల్మషంగా వుంది. అంటే ఉర్వారుక మోక్షమువలె కవిబుద్ధి పరిపక్వమైవుంది. ఆ జిజ్ఞాసతో ప్రశ్న పరంపర వెలువడింది. తత్ఫలితంగానారదమహర్షి వలన రామకథాశ్రవణం.

2. మననం — మహర్షి రామకథాబీజమునందు నిమగ్నచిత్తవృత్తి తో నున్నప్పుడు క్రౌంచద్వంద్వ వియోగసంఘటన సంభవించడం — శ్లోకంగా అవిర్భవించడం జరిగింది.

3. నిదిధ్యాసనం — బ్రహ్మాదేశంచే కావ్యరచనోద్బోధం కల్గడం, వెంటనే కథాగతవిషయ పునఃచర్వణం.

4. సమాధిదర్శనం — సమాధ్యవస్థలో రామకథాతత్త్వదర్శనం — ప్రతిభోన్మేషంతో కావ్యరచనకుపక్రమించడం.

ఇలా నాల్గుసర్గలు పైనాల్గు మహావిషయాలతో సంవదిస్తున్నది. మహర్షి యిలా రామకధను సాక్షాత్కారం చేసుకొన్నారని తెలుస్తూ వుంది. అది చివరికి సమాధ్యవస్థకు దారితీయగా ఐదవసర్గనుండి కధాప్రారంభంతో కావ్యమారంభింపబడింది. సమాధి రెండువిధాలు.

1. సవికల్పక లేక సంప్రజ్ఞాత సమాధి
2. నిర్వికల్పక లేదా అసంప్రజ్ఞాత సమాధి

రెండవదానికిధ్యేయం మోక్షమే. "సమాధి స్సమతావస్థా జీవాత్మ పరమాత్మనోః" సమాధియనగా జీవాత్మ పరమాత్మల యొక్క ఐక్యత. ఈ సమాధి, యోగముచేతనే సాధ్యం. ఓంకారము లేదా ప్రణవమే దీనికి బీజం. పాతంజలయోగము దానినిట్లు చెప్పినది.

1. యోగశ్చిత్తవృత్తి నిరోధః। (1-2)
2. తస్యవాచకః ప్రణవః। (1-27)
3. తదా ద్రష్టు స్స్వరూపేz వస్థానమ్। (1-3)
4. సమాధిసిద్ధిరీశ్వరప్రణిధానాత్। (2-45)

ఇది యోగపరంగా చెప్పబడింది. ఇక కావ్యపరంగా చూస్తే —

1. కావ్యకర్మణి కవేః సమాధిః పరం వ్యాప్రియతే।
2. మనసి ఏకాగ్రతా సమాధిః।
3. సమాహితం చిత్తమర్థాన్ పశ్యతి॥
   అవిచ్ఛేదేన శీలన మభ్యాసః॥
4. సమాధిరాంతర ప్రయత్నో, బాహ్యస్త్వభ్యాసః।
   తా వుభావపి శక్తిముద్భాసయతః।

మొదటిదైన సవికల్పక సమాధిలో ప్రతిభాసాక్షాత్కారం-కావ్య సరస్వతీ అవతరణం. ఈ ప్రతిభ భావయిత్రీ, కారయిత్రీ శక్తిసమన్విత మని రాజశేఖరుడు. మొదటి నాల్గుసర్గలలో రామకధను కూలంకషంగా భావించిన మహర్షి కారయిత్రీ శక్తిచే మహాకావ్యరచన చేసినాడు. కాబట్టి, భావయిత్రి-శ్రవణ, మననాలకు అంటే "కృత్యాద్యవస్థ"కు చెందింది కాగా, కారయిత్రి — నిదిధ్యాసన, సమాధులకు దారితీసి కావ్యావిర్భావ హేతువయిందివెరసి, రామాయణం మహాకవి ప్రతిభావినిస్సృతం.

"ప్రతిభావివ గరీయసీ" అనుట యిందులకే.

ఈ సందర్భంలో శ్రీశంకరభగత్పాదుల 'వివేక చూడామణి'లోని ఈ క్రిందిశ్లోకాలు మననం చేయదగ్గవి.

అతీవ సూక్ష్మం పరమాత్మతత్త్వం నస్థూల దృష్ట్యా ప్రతిపత్తుమర్హతి।
సమాధినాత్యంత సుసూక్ష్మవృత్త్యా జ్ఞాతవ్యమార్యైరతి శుద్ధబుద్ధిభిః॥
నిరంతరాభ్యాస వశాత్తదిత్థం పక్వం మనోబ్రహ్మణి లీయతే యదా।
తదా సమాధిః సవికల్ప వర్జితః స్వతోఽ ద్వయానంద రసానుభావకః॥
శ్రుతేః శతగుణం విద్యాన్మననం మననాదపి।
నిదిధ్యాసం లక్షగుణ మనంతం నిర్వికల్పకమ్॥
నిర్వికల్పక సమాధినా స్ఫుటం బ్రహ్మతత్త్వ మవగమ్యతే ధ్రువమ్।

మహర్షి వాల్మీకి నిర్వికల్పక సమాధిలోనికి వెళ్లి భగవద్దర్శనముచేసి ధన్యుడై ఆ తత్త్వదర్శనాన్ని పదిమందికీ పంచిపెట్టాలనే కవితాత్మ గలవాడై కవితాసమాధిలో కావ్యరచనచేశాడు. ఇది కవితారూప తపస్సు. కేవల నిర్వికల్పసమాధిలో యోగసిద్ధిపొందుతాడేతప్ప లౌకికమైన రచనా వ్యాసంగం వుండదు. మహర్షులు లోకానుగ్రహంకోసం చేసే మహత్కార్యాలలో యిటువంటి మహాకావ్యరచన ఒకటి. పైగా 'అతీవ సూక్ష్మమైన పరమాత్మతత్త్వ' మెటువంటిది?

ద్రష్టుః శ్రోతుర్వక్తుః కర్తుర్భోక్తుర్విభిన్న ఏవాహమ్।
నిత్య నిరంతర నిష్క్రియ నిస్సీమాసంగ పూర్ణబోధాత్మా॥

ఇటువంటి భగవత్తత్త్వాన్ని మానవులకు తెలియజేయడానికే వాల్మీకి మహర్షి నిర్వికల్పక సమాధ్యవస్థనుండి బయటికి వచ్చి, లోకాన్నిచూచి, మరణంనుండి కరుణం పుడుతోందనిదర్శించి, రామకథను కరుణా రస ప్లావితకవితారసధునిలో ముంచెత్తినాడు. 'జగద్ధితం' కోసం, 'లోకోద్ధరణ' కోసం వైదికుడైన వాల్మీకి మహర్షి లౌకికుడై కావ్యరచన చేసినాడని మనం గ్రహించాలి.

ఈపైకారణాలచేత బాలకాండలోని మొదటినాల్గుసర్గలు నిస్సందేహంగా మహర్షివాల్మీకికృతమే. ఒకమహానాటకంలోని నాందీప్రస్తావనల వలె ఇది శ్రీమద్రామాయణ మహాకావ్యప్రస్తావన. "The Personality





of the Poet" అన్నవ్యాసంలో ప్రఖ్యాతాంగ్లవిమర్శకుడైన Herbert Read ఇలా అంటున్నారు. I believe that criticism must concern itself, not only with the work of art in itself, but also with the process of writing and with the writer's state of mind when inspired – that is to say, criticism must concern itself, not only with the finished work of art, but also with the workman, his mental activity and his tools."

పైమాటలు వాల్మీకిమహర్షి రచించిన మొదటినాల్గుసర్గలకు సర్వాత్మనా అన్వయిస్తోంది. మనకీ 'ప్రస్తావన'తో పనియేమి? కథ ఎక్కడమొదలవుతుందో అక్కడినుంచే చదువుదాం అనుకొనేపాఠకుడు 'పీఠిక'వంటి కవిమానసికస్థితి – ఎటువంటిపరిస్థితుల్లో ఆయన ఉత్తేజనం పొంది కావ్యరచనకుపక్రమించాడు – ఆ రచనకు మూలహేతువేమి? – ఇటువంటిముఖ్యమైన అంశాలను విస్మరిస్తున్నాడు. ఇదిలేనిదే కావ్యం లేదు. కవిలేడు. శిల్పమున్నదిఅంటే అదిచెక్కినశిల్పి వుండియేతీరుతాడు. శిల్పిమానసికస్థితి అవగతమయితేగాని శిల్పమర్థముకాదు. కాబట్టి 'పీఠిక' వంటి పైనాల్గుసర్గలు రామాయణకావ్యానికి అనివార్యాలు.

# 6. సర్వవేదసారం, అచ్చమైనఅద్వైతం ఆదికావ్యం

రామాయణం అప్రయత్నంగా మహర్షిముఖతః వెలువడింది. వేదాలచే తెలియబడే పరమపురుషుడు దాశరథియై అవతరింపగా వేదం వాల్మీకి మహర్షినుండి రామాయణరూపంగా ఆవిర్భవించింది. అసలు వేదోపబృంహణార్థమే – వేదాల్లోస్థాపింపబడిన పరమాత్మస్వరూపాన్ని ఆవిష్కరించడానికే కథారూపంగా రామాయణంఅవతరించింది. మహర్షి అంటే మహోన్నతుడైన మానవుడు. ఆయన అంతఃకరణం ఈజగత్తు యొక్క పార్యంతిక సత్యంలో నిత్యం రమిస్తూవుంటుంది. అది జీవాత్మ-పరమాత్మల ఏకత్వరూపమైనసమాధి. ఈజీవాత్మ-పరమాత్మల ఏకరూపత్వమేమహర్షికి క్రౌంచద్వంద్వరమణ సన్నివేశంగా భాసించింది. ఈ క్రౌంచద్వంద్వరమణానికి రెండర్థాలు. 1. భౌతికార్థం. 2. అభౌతికార్థం. భౌతికార్థం ప్రత్యక్షవిషయం. చర్మచక్షువుకు తెలుస్తూనేవుంది. ఇక అభౌతికార్థం జ్ఞానచక్షువుకు సంబంధించింది. అది జీవుడుఆత్మయందురమించడం. కాబట్టి–

1. భౌతికార్థం — అధిరమణం
(రమణం = మరణం = కరుణం) — జీవలక్షణం

2. అభౌతికార్థం — ఆత్మరమణం
(రమణం = ఆనందం = శాంతం) — ఆత్మలక్షణం

అధిరమణంకంటే ఆత్మరమణం శ్రేష్ఠమని కఠోపనిషత్తుచెబుతున్నది. ఆత్మరమణమే అచ్ఛమైన అద్వైతము. అదే జీవాత్మ-పరమాత్మల ఏకత్వం. కాబట్టి ఆత్మరమణం అమృతతత్త్వాధిగమం. అధిరమణవాంఛ మృత్యుదుఃఖాకులం. మొదటిదిధీరమార్గం. రెండవది అధీరమార్గం. ధీరుడంటేఇక్కడ ద్రష్ట, మహర్షి. అధిరమణవాంఛచే జీవులు మృత్యువునకులోనవుచున్నారు. ఆజీవులేఇక్కడ పక్షులైనక్రౌంచద్వంద్వం. అధిరమణవేళ హఠాత్తుగాకల్గిన మృత్యువే పర్యవసానానికిసూచకం.

క్రౌంచద్వంద్వంలో ఒకటిజీవాత్మ. రెండవది పరమాత్మఅన్నాముకదా! స్త్రీ జీవుడు. పురుషుడు ఆత్మ. అంటే, క్రౌంచి-జీవుడు. క్రౌంచము-ఆత్మ. మగపక్షినిచంపాడు కిరాతుడు. ఆత్మస్థానీయమైన భర్తయెడబాటుతో జీవుడనేక్రౌంచిశోకించింది. ఇదితిరిగీ యోగవిషయానికి అన్వయింపవచ్చు. ఆత్మరమణవేళ హఠాత్తుగపతనమైనజీవుడు యోగభ్రష్టుడవుతున్నాడు. క్రౌంచమరణం జీవునియోగపతనంవంటిది. ఈయోగభ్రష్టుడైన జీవునిదుఃఖమే "జీవునివేదన" అన్నారు విశ్వనాథ. ఈజీవునివేదనయే వాల్మీకిలోపెల్లుబికి అద్వైతసారభూతమైన, కరుణరసప్రధానమైన మహాకావ్యంగారూపుదాల్చింది. సృష్ట్యాదిలోజీవాత్మపరమాత్మల ఏకత్వం — తరువాతవాటి ఎడబాటు — కథాంతంలో అద్వైతముఖంగా సమన్వయం — ఇదే రామకథావస్తువు. ఉపనిషత్తే జీవాత్మ-పరమాత్మల ఏకత్వాన్ని స్థాపించుచుండగా, కావ్యం వాటి ఎడబాటుకుగల కారణాన్నివర్ణించి యేకత్వంకోసం ఆక్రోశిస్తోంది.

ద్వా సువర్ణా సయుజా సఖాయా
సమానవృక్షం పరిషస్వజాతే।
తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి
అనశ్నన్నన్యోऽ భి చాకశీతి॥

— సువర్ణసూక్తము-ఋగ్వేదం *1-164-20*

"చక్కనిరెక్కలుగల రెండుపక్షులు రెండుసగములవలె నొకటినొకలసియుండి, అన్నికాలతలతోనేర్పడిన యొకవృక్షమునుపరిష్వంగముచేసికొని

యున్నవి. అందొకపక్షి తీయని రావిపండ్లుతినును. రెండవపక్షి తిన కయేదానివంకచూచుచుండును." క్రౌంచద్వంద్వఘట్టమువెనుక ఈవేద సూక్తసంస్కారమున్నది. ఈశరీరమనేదొకవృక్షం. దీనిపై రెండుపక్షులు న్నాయి. అవిజీవుడు, ఈశ్వరుడు. జీవుడువేరు, శరీరంవేరు అన్నట్లు కనబడుతుందిగాని అది సత్యంకాదు. కదలుచున్న నీటిలో కదిలేటట్లు కనబడినా కదలనినీటిలో నిశ్చలంగాకనబడినా ఆకాశంలో చంద్రుడొక్క డేయైనట్లుఉపాధి దోషంచే పరమాత్మ జీవేశ్వరభేదంగా తోచినప్పటికీ నిజానికొక్కడే!

ఈతత్త్వరహస్యాన్ని నిరంతరం మననంచేస్తున్న మహర్షికి క్రౌంచ ద్వంద్వరమణసన్నివేశవిషాదం గాఢంగాహృదయాన్ని కదలించి నిషాదు నికిశాపం "మానిషాద...." శ్లోకంగా బహిర్గమించి, క్రౌంచీవిలాపం కరుణారసగీతంకాగా మహాకావ్యరచనకు దారితీసిందని చెప్పవచ్చు.

మహర్షి 'మానిషాద....' శ్లోకాన్ని, 'పాదబద్ధోక్షరసమః తంత్రీ లయసమన్వితః' అనడంలో పాదబద్ధమైనమంత్రాలు ఋక్కులు, గాన యుక్తాలుసామలు. అందుకే 'పాఠ్యేగేయే చ మధురమ్మ'ని చెప్ప బడిన రామాయణం ఋక్సామవేదతుల్యమైంది. "తంత్రీలయ వద త్యర్థం విశ్రుతార్థ మగాయతామ్, అగాయతాం మార్గవిధానసంపదా" అని గానానికే అధికప్రాధాన్యమిచ్చాడుమహర్షి. దీనిచే నిషాదసం జనితమైన విషాదం ఎంతపరాకాష్ఠకుచేరి గీతంగా పరిణమించినదో మనంభావించ వచ్చును. "తంత్రీలయస్వరరాగవినోదులు, త్యాగరాజ హృద్భావితులార్యులు" అని త్యాగరాజస్వామి. ఆర్షవాద్యమైనవీణపై సామగానంవలె కుశలవులచే రామాయణాన్ని గానంచేయించిన వాల్మీకి ఆద్యఋషి — ఆర్యఋషి.

# 7. రామాయణం మానవభౌతికజీవితానికి ఆదర్శం

రామాయణంలో అచ్చమయినఅద్వైతవేదాంతమూ, ఔపనిషద సారమూ వెదజల్లబడివున్నా ఆమహాకావ్యంలోని గొప్పదనమేమంటే అందులో మానవజీవితాదర్శపరిస్థితులు సంపూర్ణంగా నిరూపింప బడ్డాయి. క్రౌంచద్వంద్వమే సీతారాములజంట. చనిపోయింది మగపక్షి కదా అనవచ్చు. కాని, కవిభావన కది ఆలంబనమాత్రమే కాని అదేవాస్తవం

గాచిత్రించాలనిలేదు. కవికిప్రేరణప్రధానం. కల్పనలో కవికి కావలసినంత స్వాతంత్ర్యముంది. అదికుదరదు అనేవారికి సమాధానం ఇలావుంటుంది. చనిపోయినమృగపక్షి ఆత్మస్థానీయమన్నాం. కాని ఆత్మకు చావులేదుకదా!

ఆత్మ నిత్యమ్ము కాలాద్యవచ్ఛిన్నమ్ము
సచ్చిదానంద సంపచ్చయమ్ము
అద్వితీయమ్మేక మపరిణామప్రాప్త
మపరిమేయ మ్మది యచ్చతెలివి. — బాల, ఇష్టి-1

అని కవిసమ్రాట్ విశ్వనాధ కల్పవృక్షకథారంభంచేస్తూ ఆత్మను నిర్వచించారు. ఆత్మకు షడ్భావవికారాలు లేవని గీతలో భగవంతుడు చెప్పాడు.

అచ్ఛేద్యోఽ యమదాహ్యోఽ యమక్లేద్యోఽ శోష్యఏవ చ।
నిత్యం సర్వగతం స్థాణు రచలోఽ యం సనాతనః॥ 2-24

అందుకే సీతారాములు అరణ్యవాసంలోవున్నా, సీతలంకలో సంవత్సరమున్నా, తిరిగివచ్చినతర్వాత సీతను అడవులకుపంపినా వారిఆత్మలురెండూ ఎల్లప్పుడూ అద్వైతస్థితిలోనే స్థిరంగానిలిచివున్నాయి. భౌతికమైన ఏర్పాటువారి లౌకికజీవితపరిణామానికి దోహదంకల్గించిందేతప్ప వారి ఆత్మలఅద్వైతానందస్థాయిని ఆటంకపరచలేదు. పరచజాలదుకూడా. ఇది సారవత్తుగా గ్రహింపవలసినఅంశం.

ఇక ఆదర్శమంటేఏమిటి? అద్దం అనిఅర్థం. అద్దంలోమనప్రతిబింబం ఎంత విస్పష్టంగా కనబడుతుందో రామాయణకావ్యం చదివితే మన కుటుంబమే అందులో ప్రత్యక్షమవుతుంది. ఒకఆదర్శసహోదరుడూ, తనయుడూ, భార్యా, తండ్రీ, తల్లీ, శత్రువూ, స్నేహితుడూ, హితుడూ ఇలావీరంతా కథాముఖంగా, ఎలావుండాలో లోకానికి ఆదర్శప్రాయంగా చిత్రీకరింపబడ్డారు. కాని ఇవన్నీ పట్టికథాగమనంకోసం. ఒకమహారాజుకు వివిధపరివారజనం ఎలాంటిదోఅలాంటిది. కథకుప్రాణభూతమైన మూల దుంపపూర్తిగా దివ్యత్వసంబంధి. ఇదొక్కటే ఈనాటికీ రామకథా ప్రాశస్త్యాన్ని వెల్లడిచేస్తూవుంది.

# 8. దాశరథీరాముడు అయోధ్యలోనే పుడతాడు

"సర్వేషు రమంతే ఇతిరామః" అని రామశబ్దానికి వ్యుత్పత్తి. మనలో ఏసత్యం నిత్యమూ జాగృతమవుతూ వుంటుందో, ఏస్వచ్ఛస్ఫాటికమైన అంతఃకరణం ఆత్మానుభూతిగా జీవునిఅనుభవంలో వికసిస్తున్నదో అదే రామతత్త్వం— ఆత్మారాముడంటే అతడే. మనలోని ఈఆధ్యాత్మికసారం బాహ్యంగా ఆకృతిధరిస్తే ఎలావుంటుందంటే దశరధుని కుమారుడైన దాశరధివలెవుంటుంది. ఈదాశరధి దశేంద్రియాలను జయించినవాడు— అవి ఐదుజ్ఞానేంద్రియాలు. ఐదుకర్మేంద్రియాలు. ఘ్రాణ, రసన, చక్షు, త్వక్, శ్రోత్రములు జ్ఞానేంద్రియపంచకం. వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థకర్మేంద్రియపంచకం. దయాశరధియైన దాశరథిమనలో అవతరించవలెనన్నా లేక లోకంలో చక్షుర్గోచరం కావాలన్నా ఆప్రదేశం 'అయోధ్య' కావాలి. యుద్ధమంటే సంఘర్షణ. అయోధ్యఅంటే సంఘర్షణారహితమైంది. ఎక్కడసర్వేంద్రియ సంఘర్షణలు బాహ్యాభ్యంతరంగా శమించిప్రశాంతవాతావరణం నెలకొని వుంటుందో అదే "అయోధ్య" అనబడుతుంది. అటువంటిఅయోధ్యను పరిపాలించడానికి ఆత్మనిగ్రహంగలవాడే అన్నివిధాలా అర్హుడు. రాముడు ఎటువంటివాడంటే స్వాహంకారం, భౌతికభోగాలు జీవితంలో శాంతినీ, సమాధానాన్నీ సమకూర్చవని చక్కగా తెలిసినవాడు.

మస్తిష్కానికే మరోపేరు స్వర్గం. అథర్వవేదంలో ఒకమంత్రం ఇలా వుంది.

*అష్టచక్రా నవద్వారాదేవానాం పూరయోధ్యా।*
*అస్యాం హిరణ్యయోకోశః స్వర్గోజ్యోతిషావృతః॥* *(10-2-31)*

ఎనిమిదిచక్రాలు (యోగసంబంధమైనవి) నవద్వారాలు (ఇంద్రియాలు)న్న ఈశరీరమే దేవతల పురమైన అయోధ్య. ఇందులో ఒకబంగారుకోశమున్నది. అదిజ్యోతిచేత కప్పబడినస్వర్గం. ఈ మానవ మస్తిష్కమేస్వర్గం. అదేజ్యోతిర్లోకం. దేవతలనివాసస్థానం.

# 9. బుద్ధికిప్రతీక సీత

శ్రీరాముడు అచ్చమైనజీవుడు. ఇతడు జీవితరంగంలో చైతన్యవంతమైనపాత్ర నిర్వహించడానికి బుద్ధితోలంకెవేయబడితేనేగాని బండిసాఫీగా నడవదు. ఆ బుద్ధికి ప్రతీకసీత. ఆమె యుగయుగాలుగా రాముడికోసం వేచివుంది.* ఆమెజనకునికి వివాహఫలితంగా జన్మించిందికాదు. భూమిదున్నుతుండగా ఆయనకుసీత లభించింది. అలాభూమిదున్నుతున్నప్పడంతా ఓపాపాయి దొరుకుతున్నట్లయితే వ్యవసాయం ఏనాడోనిలిచిపోయి వుండేది. ఈసీతాదేవికథయేయైన రామాయణకావ్యం యెంత ఆశ్చర్యంగా పుట్టిందో సీతకూడా జనకుడికి ఒక్కసారే నేలదున్నుతుండగా హఠాత్తుగాలభించడం యెంతో ఆశ్చర్యకరమైంది.

# 10. జీవుడు ఎక్కడైతేపుట్టాడో తిరిగి అక్కడికేచేరుకుంటాడు

బుద్ధిస్థానీయురాలైన సీత ఒక అస్థానపతితమైనచోట లభించిందంటే ఎవరికయినా మరి ఆశ్చర్యంకల్గించే అంశమే. భూమి దున్నుతుండగా ఏదిదొరకకూడదని? ఒకశవం తాలూకు ఎముకలు దొరకవచ్చు. నగలు లభించవచ్చు. ఎవరోపాతిపెట్టిన నిధినిక్షేపాల్లాంటివి వుంటే బయట పడవచ్చు. అంతే తప్ప సజీవంగావున్నపాపాయి లభించడమేమిటి? విడ్డూరంగాలేదా? అనవచ్చు. అవును. విడ్డూరమే. పదితలల రావణాసురుడు రెండుయుగాలవరకు జీవించి, మూడులోకాలను జయించి దేవతల్ని ముప్పతిప్పలుపెట్టి మూడుచెరువులనీళ్లు త్రాగించినపుడు — కృతయుగంలో వేదవతిగా జన్మించిన సీత రావణునిచే అవమానింపబడి

---

* కృతయుగంలో వేదవతి - రావణబలాత్కారంచే యోగాగ్నిదగ్ధయై త్రేతాయుగంలో సీతగా అవతరించిందని, లంకలోనిసీత నిజమైనసీతగాదనీ, ఛాయాసీతఅనీ, ఆమెద్వాపరయుగంలో ద్రౌపదిగా జన్మించిందని మన పురాణాలు చెబుతున్నాయి. కాబట్టి రాముడికంటే సీతవయసులోపెద్దది. మనజానపదవాఙ్మయంలోకూడా — "మాసీత సిన్నాదిమేమియ్యలేదు, సీతకన్నసిన్నోడె అయోధ్యరాముడు" అనిచెప్పబడింది.

ప్రతిజ్ఞచేసి, యోగాగ్నిదగ్ధయై, త్రేతాయుగంలో వాణ్ణిమట్టుపెట్టడంకోసం భూమిలో లభించిందంటే ఆశ్చర్యంలేదు. అతిశయోక్తి అంతకంటేలేదు. "ప్రతిజీవుడూ కారణజన్ముడు" అనేది మనంయిక్కడ సిద్ధాంతవాక్యంగా గ్రహించాలి. ఇదే రామకథలోని వైశిష్ట్యం.

కథాంతంలో ఈసీతయే, శ్రీరాముడు చూస్తూవుండగా భూమి లోచొరబడి తల్లివొడిచేరుకొంటుంది. మాతృభూమినుండిపుట్టి ఆమె తిరిగిమాతృగర్భంలోనే లీనమైంది. అందుకే "క్షితి హలకృష్టిబుట్టియడ గెన్ క్షితియందునె సీత" అంటాడు ఆముక్తమాల్యదాకారుడు. "ఎచ్చట బుట్టెజీవుడు తానచ్చటికేగుట నైజము ప్రాణికోటికిన్" ఇది సహజపాండి త్యాభిరాములైన పోతనామాత్యులవారిమాట. దీనికర్థమేమి? జీవుడు అవ్యక్తంనుండి పుట్టితిరిగి అవ్యక్తంలోనే లీనమౌతున్నాడు. పుట్టుకకు ముందువెనుకలు మనకు తెలియవు.

*అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత!*
*అవ్యక్తనిధనాన్యేవ తత్ర కా పరిదేవనా॥* — *గీత 2-28*

అనిభగవంతుడే చెప్పాడు. ఇక్కడలోతైన వేదాంతార్థాన్ని అవతలకు పెట్టి సూటిగాచెబితే బుద్ధియెక్కణ్ణుంచి పుడుతున్నదో, సమాధ్యవస్థ లోయెక్కడ అంతర్థానమవుతున్నదో యెవ్వరూచెప్పలేరు. ఇదేమాయ. సీతాదేవి మహామాయాశక్తికి సంకేతం!

# 11. అంతఃకరణ చతుష్టయం

అంతఃకరణం నాల్గువిధాలుగా ప్రసరిస్తూవుంది. 1. మనస్సు, 2. బుద్ధి, 3. అహంకారం, 4. చిత్తం. వీటిలో గరిష్ఠమైంది చిత్తం. కనిష్ఠమైంది మనస్సు. ఈప్రసరణానికే వృత్తిఅనిపేరు.

బుద్ధ్యహంకారచిత్తాలు అంతఃకరణానికి మిక్కిలిదగ్గరివి. మనస్సు నిత్యేంద్రియసన్నికర్షకలది. మనస్సులో తొంబదిపాళ్లు లౌకికం. మనస్సు లోకానికి సంబంధించింది.

"సంకల్ప వికల్పాత్మికాంతఃకరణవృత్తిమత్ మనః"
(సంకల్ప వికల్పాలతో కూడుకొన్న అంతఃకరణవృత్తికే మనస్సుఅని పేరు)

"నిశ్చయాత్మికాంతఃకరణవృత్తిః బుద్ధిః"
(నిశ్చయంతో కూడుకొన్న అంతఃకరణవృత్తియే బుద్ధి)

"బుద్ధిస్తు ద్వివిధామతా అనుభూతిః స్మృతిశ్చస్యాత్"
(అనుభూతి, స్మృతులతో కూడుకొన్నది బుద్ధి)

మనస్సు — "మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః"
— గీత

బుద్ధి — "పరేంగిత జ్ఞాన ఫలాహి బుద్ధయః" — ఒకసుభాషితం

ఇదంత —
అహంత — "శాంతాకార! ఇదంతాహంతా చింతావిదూర" — ధూర్జటి

అహం — హంసస్సోహం! హంసస్సోహం! (అహం = హంస)
దేహం? నాz హం!
కోzహం? సోzహం!! — శ్రీరమణమహర్షి

చిత్తము — కామాదిరోగ కలుషీకృతదుష్టచిత్తమ్।
సిక్త్వాతు మామవకళాదధికాంతికాంత్యా॥
— శ్రీసుబ్రహ్మణ్యాష్టకమ్



# 12. ఏకాగ్రత దెబ్బతింటే.....?

బుద్ధికిస్థానమైన సీతతో వివాహమైనపిమ్మట శ్రీరాముడు అయోధ్యచేరి నిశ్చింతగా జీవితం గడపలేకపోయాడు. ఎందుకంటే బుద్ధి ఒకసారి మానవునిలో ప్రతిష్ఠింపబడితే అతడు ఆబుద్ధిద్వారానే సర్వ కార్యాలుచేస్తాడు. బుద్ధిఅతనిని తనవెంట ఎక్కడకుతీసుకెళ్లితే అక్కడి కల్లా యాంత్రికంగా వెళ్లవలసిందే. సీత-రాముని జీవితారణ్యంనుండి దూరంగాతీసుకొనివెళ్లింది. అది జీవుడికి ఆత్మతో ఏకాంతవాసం — లోకందృష్ట్యా వనవాసం. ఏదోఒకబలవత్తరమైనకారణం పుడితేనేగాని ఒక యువరాజు అరణ్యవాసానికి పోవడానికి వీలుపడదు. అలాంటి తిరుగు లేనిఒకకారణసృష్టికి సీతపరోక్షంగా ప్రభావితంచేసింది. రామధ్యానంతప్ప సీతకు మరొక్కటితెలియదు. ఎంతోకాలం రామున్ణేస్మరిస్తూ ఆయన గుండె లోతుల్లో జీవించింది. రాముడే తనసర్వస్వమని భావించింది. అయోధ్యకూ అరణ్యానికీమధ్య ఎలాంటితేడావున్నట్లు ఆమెకుఅనిపించ లేదు. కానిఎంతకాలం మనలోని బుద్ధిఉన్నతమైన దైవీశక్తులకేంద్రంలో స్థిరంగావుండగల్గుతుంది? ఏకాగ్రత, తదేకధ్యానం బుద్ధిలక్షణం. ఆయేకాగ్రత భగ్నమైతేపతనంతప్పదు. నిశ్చయాత్మకమైన అంతఃకరణవృత్తి బుద్ధి. మరి యేకాగ్రత చిత్తానికిసంబంధించింది. సీత ఒకనిశ్చయబుద్ధితో అవతరించిన వేదవతి. ఆ నిశ్చయకార్యసాధనకు ఆమె మానుషత్వంలోని ఎంతఉన్నతశిఖరాలకెదిగిందో అంతలోతులను కూడా దర్శించి రామునిచే రావణుని వధింపజేసింది.

"మనసి చ ఏకాగ్రతా సమాధిః — కావ్యమీమాంస-4 అధ్యా

"యోగశ్చిత్తవృత్తి నిరోధః" — పాతంజలయోగదర్శనమ్ సూ. 2

"చిత్తైకాగ్ర్యమవధానమ్ । చిత్తైకాగ్ర్యం బాహ్యార్థనివృత్తిః
తదవధానమ్ । అవహితం చిత్తమర్థాన్ పశ్యతి"
— కావ్యాలంకారసూత్రమ్ 1-3-17

ఇంద్రియాకర్షణచేత బుద్ధిబహిర్ముఖం కావడమే పతనం. సరిగ్గా యిలాగేజరిగింది. "అనవధానత ఆవగింజంతసూవె పర్వతంబంత యవ రాదభరముగొలిపి" అన్నట్లు ఎప్పుడైతే సీత రామునినుండి దృష్టిమరల్చుకున్నదో అప్పుడే బంగారుజింక ఆమెకంటబడింది. లేదా ఏ

బలహీనక్షణాన సీతదృష్టి బంగారుజింకపై పడిందో ఆక్షణకాలం సీత రాముని విస్మరించడమనే దోషాన్నిచూపి, జింక, సీతయొక్క ఇంద్రియాలనూ, బుద్ధినీ స్వాధీనపరచుకొంది. అంటే మహామాయకూడా ఆసురీమాయకు ఎప్పుడోఒకప్పుడు లొంగక తప్పదన్నమాట! ఆలొంగడం ఎంతసేపు! ఒక్కవిఘడియకూడా వ్యర్థంకానివ్వకుండా ఆసురీశక్తి చకచకాతనకార్యం నెరవేర్చుకొంది. న్యాయంకోసం, ధర్మకోసం పెనగులాడిన జటాయువు జీవంకోల్పోయాడు. ఆసురీమాయ విజృంభించినకాలంలో జటాయువేకాదు రామలక్ష్మణులు ఏకమైఎదుర్కొన్నా ఫలితంవుండదు. అందుకే సీతవారినిద్దరినీ ఏదోవంకబెట్టిదూరంచేసింది.

దైవీశక్తిని ఆకర్షించిన ఆసురీశక్తిచేత సీతతప్పనిసరిగా రావణునివెంట లంకకువెళ్లవలసివచ్చింది. కృతయుగంలో వేదవతికి రావణునిచేకల్గిన తపోభంగం ఎలాంటిదో, త్రేతాయుగంలోసీతకు, రావణప్రయోక్తమైన మాయలేడిచేకల్గిన ధ్యానభంగం అలాంటిది. అక్కడ రావణుడువేదవతిని కేశాలుపట్టుకొనిఈడ్చాడు. ఇక్కడా సీతకేశావకర్షణచేశాడు. అక్కడ వేదవతికోరింది విష్ణుమూర్తిని. అది ఫలించలేదు. మరోజన్మయెత్తి విష్ణ్వవతారుడైన శ్రీరామచంద్రమూర్తిని పతిగాపొందింది. రావణుడు స్పృశించినందుకు వేదవతియోగాగ్నిదగ్ధమైంది. రావణసంహారానంతరం సీత అగ్నిప్రవేశంచేసి తనవిశుద్ధతను చాటుకొంది.

## 13. భౌతికప్రపంచం – ఇంద్రియాలఆకర్షణ

నశ్వరమూ, భౌతికమూ అయిన ప్రాపంచికవస్తువులు మానవుల యింద్రియాలను సమ్మోహపరచి ఆకర్షిస్తాయి. బుద్ధివాటినే పదేపదే కోరుతుంది. కఠోపనిషత్తులోఇలా చెప్పబడింది. బ్రహ్మసర్వేంద్రియాలను ఆత్మభిన్నములైన శబ్దాదివిషయాలవైపుగా పరుగులు తీసేవిధంగా అంటే బహిర్ముఖంగాసృజించాడు. అదివాటి స్వభావంగానిర్ణయించాడు. అవి బాహ్యవిషయాలను చూస్తుంటవే తప్ప ఆత్మస్వరూపాన్ని దర్శించలేవు. ధీరుడు అంతర్దృష్టితో ఆత్మసాక్షాత్కారాన్నిపొందుతున్నాడు. కాబట్టి—

| | | | |
|---|---|---|---|
| 1. ఆత్మ— | రధి | 4. మనస్సు — | పగ్గం |
| 2. శరీరరా— | రధం | 5. ఇంద్రియాలు— | గుఱ్ఱాలు |
| 3. బుద్ధి — | సారథి | 6. విషయాలు — | మార్గం |

ఇందులో బుద్ధికి మూడవస్థానం యివ్వబడింది. కఠోపనిషత్తులో ప్రథమాధ్యాయం తృతీయవల్లిలో 10, 11 శ్లోకాలలోని భావం, ద్వితీయాధ్యాయం తృతీయవల్లిలో 6, 8 శ్లోకాల భావాలు రెండూ ఒక్కటే. అవి పైనచెప్పబడిన వాటిలో క్రిందినుండి పైకి అంటే యింద్రియాలనుండి ఆత్మవరకు దేనికంటే ఏది శ్రేష్ఠమో చెబుతుంది.

ఇంద్రియాత్మ కంటె విషయాత్మ
విషయాత్మ కంటె మనోరూపాత్మ
మనోరూపాత్మ కంటె బుద్ధ్యాత్మ
బుద్ధ్యాత్మ కంటె మహదాత్మ
వీటన్నిటి కంటె కేవలాత్మ శ్రేష్ఠమైంది

అదే అందరికీ గమ్యస్థానం. ఇందులోకూడా బుద్ధికిమూడవస్థానం వచ్చింది. దానికంటే ఉన్నతమైనవి మరిరెండువున్నాయి అనేవిషయం మరచిపోకూడదు. మహత్తుకంటే అవ్యక్తం, అవ్యక్తంకంటే పురుషుడు ఒకదానికంటేఒకటి ఆంతరమైనవి. సూక్ష్మమైనవి. సర్వానికి పరిపూర్ణమైంది ఆత్మ. ఇదే పర్యవసానం, పరాగతిఅని కఠోపనిషత్తు స్థాపిస్తోంది.

భగవద్గీతలోకూడా ఇదేవిషయం పునరుద్ఘాటింపబడింది "కామమనే ఈశత్రువు ఇంద్రియాలు, మనస్సు, బుద్ధియను మూడావరణలనడుమ దాగి, జ్ఞానాన్ని ఆవరించి పైఆవరణలద్వారా జీవుని భ్రమింపజేస్తున్నది. కాబట్టి ఇంద్రియాలకంటె మనస్సు, మనస్సుకంటెబుద్ధి, బుద్ధికంటె ఆత్మశ్రేష్ఠం.

ఏకాగ్రతలేనిమనస్సుచేత బుద్ధి అవివేకమై అంటే విచక్షణజ్ఞానం కోల్పోయి సారధికిలోబడని గుఱ్ఱాలవలె అపమార్గంలో పడిపోతాడు మానవుడు.

రాముని సంతోషమే తనజీవితధ్యేయంగాకల్గినసీత రామునికంటే వేరైన ఒకవస్తువునందు బుద్ధినిలగ్నంచేసి అదికావాలనిమనసారాకోరుకొంది. ఈసందర్భంలో శ్రీమద్రామాయణ కల్పవృక్షకర్త వ్రాసిన పద్యాలుపైతాత్త్వికవిచారాన్ని ఎంతగా విశ్లేషిస్తున్నాయోచూడవచ్చు.

*ఒకయింద్రియానుభవ మిం*
*కొక యింద్రియమునకు దెలియదూరక చెప్పన్*
*మొకరియగు జిహ్వవ్రూనిక*
*యకటా! యాలేడి జూడవలె నదియంతే!*

— అరణ్య, మారీచ-256.

సర్వేంద్రియాలను సమాకర్షిస్తున్న అమాయలేడిసౌందర్యం యింద్రియాలనుపట్టి పాలార్చుతోంది. ఎప్పుడూ ఏదీ అడగని సీత కోర్కెను విన్నరాముడు 'అదంతా మాయ, అసత్యమని సముదాయించవచ్చు' 'ఆ జింక రాక్షసుడేనని లక్ష్మణుడు వాదించవచ్చు. 'జగత్తుమిథ్య' యని శాస్త్రాలు పలుమార్లు ఘోషింపవచ్చు. కాని ఎవరేమన్నప్పటికే, సీత — శ్రీరామచంద్రుని సాక్షాత్ ధర్మపత్నియైన సీత — దాని కంగీకరించ లేదు. తన ఇంద్రియాలను పట్టి ఆకర్షించే ఆ వస్తువును పట్టి తెమ్మని రాముణ్ణే తరిమింది. తన వాదాన్ని ఇంకా ఇలా సమర్థించుకొంది.

*శాంతలీలా చరన్మౌని సరణికాదు*
*విధురమాయా చరద్దైత్య విధము కాదు*
*వరగ నొక ఇంద్రియాభితర్పణము జరుగు*
*చోటు, వెఱ యూహలకు నిది చోటుకాదు.*

— *అరణ్య-మారీచ-327*

*నీవే దృష్టిం జూచిన*
*భావంబు దానినే ధ్రువం వఱచు మతి*
*వ్యావర్తమగు పోతు*
*శ్రీ వెలయును ఫలముదాని చెందగవలయున్*

— *అరణ్య-మారీచ-328*

ఒక్కసారి కోర్కె ప్రజ్వరిల్లిందంటే మనిషి పతనమైపోతాడు. పైగా ఎప్పుడూ ఏనాడూ ఇంద్రియాలకు లొంగనివాడు ఒకసారి లొంగాడా వాడిక తిరిగి స్వస్థితికి చేరుకోవడానికి ఎంతోకాలం పడుతుంది. ఇంద్రియలోలుపులైన వారిసంగతి సరేసరి. ఇంద్రియాలు సహజంగా అణిగి మణిగివున్న శరీరంలోని బుద్ధి దిగజారిపోరాదు.

*నిరతం బింద్రియ వశులై*
*తిరిగెడు వారికి విపత్తు తెచ్చునదే దు*
*ర్ధర మింద్రియ వశవర్తత*
*తిరుగని వారికొకసారి తెచ్చియ తీరున్*

— *అరణ్య-మారీచ.ప.309*

అలా ఎప్పుడూ ఇంద్రియాలవెంబడి పడిపోని సీత బంగారు జింకను చూడగానే ఆ మాయలోపడి కొట్టుకుపోయి విచక్షణజ్ఞానాన్ని

కోల్పోయింది. కాని ఆమె బౌద్ధికమైనతార్కికశక్తి, నిశితసుకుమార ప్రసంగనైపుణి ఏమాత్రం కుంటుపడలేదు. తానే రాముణ్ణి వెళ్లమని ప్రార్థించి తనవాదనకు చివర రాముని నివారిస్తూ ఇలాఅన్నది.

*అరయ జ్ఞానంబె కర్మసంహరణ శీలి*
*కర్మవైదికమును, లౌకికంబు ద్వంద్వ*
*ఫలవిధాయి, ఈ దైతేయ వధము మనకు*
*గడకు నివ్వాడు కాకున్న గట్టికుదువు*

— అరణ్య-మారీచ-342

అని భవిష్యత్తును గూఢంగా సూచించి, ఎందుకు, పోనీ, జింకను తేవద్దులే' అని నిరుత్సాహపరుస్తూ తానే మరలా వెనక్కిలాగుతుంది. అప్పుడు శ్రీరాముడన్నమాటలు 'సీత — బుద్ధివైభవానికి ప్రతీక' అన్న సిద్ధాంతానికి ప్రోద్బలకంగావున్నాయి.

*అలముప్రీతుడు రామచంద్రుడును భార్యం గౌగిటంబూని, మై*
*థిలి! నీ యీ మతివైభవంబునకె బుద్ధిన్ నిన్నుమన్నించెదన్*

-వ-343

అంటాడు. జింకను తేవడానికే వెళుతూ లక్ష్మణుణ్ణి క్షణకాలం చూస్తాడు. ఆచూపులో వారిద్దరూ సీత ఆత్మస్థైర్యం దిగజారిపోతున్నదని, ఆమెకు కష్టకాలం ఆసన్నమైందని అర్థంచేసుకొంటారు. తమ్ముని అండదండ లలో సీతనుంచి రాముడు జింకవెంటపడతాడు.

అక్షద్యూతే సమాహ్వానం నియోగాత్ స్థవిరస్యచ
జానన్నపి క్షయకరం నాతి క్రమితు ముత్సహే
మృగం సువర్ణం నాస్తీతి రామస్యా విదితం కిము
ఇతి బ్రువన్నివ వృతే భ్రాతృభిస్సహ పాండవః
జానంశ్చ శకునేర్మాయాం పార్థో ద్యూత మియాత్పునః

— మహాభారతమ్, సభా - అధ్యా. 6, శ్లో॥ 48-49

ఈ శ్లోకాలు భారతానికి ముందే రామాయణం జరిగిందని స్థాపిస్తోంది. అంతేకాదు, రామాయణంలో మారీచుని మాయ — సువర్ణ మృగసృష్టి. భారతంలో శకునిమాయ — అక్షద్యూతసృష్టి. అక్కడ విధికి లొంగినవాడు ధర్మరాజు. ఇక్కడ శ్రీరామచంద్రుడు.

"పెద్దవాడైన తండ్రియాజ్ఞ ఇట్లున్నదా? జూదము నాశహేతువని తెలిసికూడా తండ్రియాజ్ఞను నేను అతిక్రమించలేకున్నాను. బంగారు లేడి వుండదని రామునకు తెలియదాఏమి? విధి అనుల్లంఘనీయం. అని పలుకుతూ సోదరులతో గూడి హస్తినాపురానికి తిరిగివచ్చాడు. శకుని యొక్క మాయను తెలిసికూడా జూదానికిమరలా ధర్మరాజువచ్చాడు."

అసంభవం హేమమృగస్యజన్మ తథాపి రామోలులుభే మృగాయ।
ప్రాయః సమాపన్న విపత్తికాలే ధియోఽపి పుంసాం మలినీ భవన్తి॥

"బంగారులేడి పుట్టడం అసంభవం. అయినా రాముడు బంగారులేడి కోసం ఆశపడ్డాడు. సాధారణంగా ఆపదలు రావలసిఉన్నప్పుడు పురుషుల బుద్ధులు చెడిపోతాయి" అని ఒకసుభాషితం.

శ్లో॥ కర్మాయత్తం ఫలం పుంసాం బుద్ధిః కర్మానుసారిణీ।
తథాపి సుధియాభావ్యం సువిచార్యైవ కుర్వతా॥

సకలము కర్మాధీనము
సకలము నియమితఫలంబు చానా! ఇదియే
రికి తెలియబోవ దవ్వా
రికి మాత్రము నీకృతి విపరీతార్థమగున్
— అయోధ్య, పాదూ-ప.*204*

అని కవిసమ్రాట్టు నిష్కర్ష. పైపద్యం భరద్వాజమహర్షి కైకను ఓదార్చుతూ చెప్పినమాటలు. అటు కైకచేసిన కార్యానికీ ఇటుకల్పవృక్షకృతికీ తగిలేలా పైపద్యం వ్రాశారు విశ్వనాథ. కల్పవృక్షం కర్మసిద్ధాంతంపై ఆధారపెట్టి రచింపబడిందని కవి ధ్వనింపజేస్తున్నాడు.

శ్రీరామచంద్రునకు తానేమి చేయుచున్నాడో తెలియును. అది సువర్ణమృగంకాదని కూడాతెలియును. కాని ఏమి చేయగలడు? కల్పవృక్షం లో అగస్త్యమహర్షి అనుశాసనం ఒకటికొత్తగా రాముణ్ణి నిర్బంధిస్తోంది. అది — సీత రామునికి అనుకూలవతిగానేవుంది. ఈచిన్నకోర్కె ఇంతప్రతికూల పరిస్థితుల్ని తెచ్చిపెడుతుందని రాముడు కలలోకూడా వూహించివుండడు. ఇదెలావుందంటే వామనుడు — "ఏమీలేదు, మూడడుగులు మాత్రమే"నని ముల్లోకాలు ఆక్రమించినట్లుంది. పాపం! బలిచక్రవర్తి ఎంత లోతులో కూరుకుపోయాడు! సీత జింకనుకోరడంతో రామకథ మలుపుతిరిగింది.

న ప్రమాదోఽ ప్రకర్తవ్యో విదుషా మోక్ష మిచ్ఛతా॥
ప్రమాదే జృంభతే మాయా సూర్యోపాయే తమో యథా॥

మోక్షమం దిచ్ఛగలిగిన విద్వాంసుడు ఎక్కడా, ఎప్పుడూ. విధంగానూ ఆత్మస్థైర్యాన్ని కోల్పోకూడదు. అలాకాక పరిస్థితులకు లొంగిపోయి ప్రవర్తిస్తే మాయవిజృంభిస్తుంది. సూర్యుడస్తమించగానే చీకట్లెలా లోకాన్ని ఆవరిస్తాయో బుద్ధిశక్తికోల్పోయిన సాధకుణ్ణి మాయ వశపరచుకొంటుంది.

ఇది 'మాయ' అని తెలిసిచేసినా, తెలియక చేసినా తత్ఫలితాన్ని అనుభవించి తీరవలసిందే. సీత ఆత్మతృప్తి కోసం రాముడు ఆ ఫలితం ఎటువంటిదైనా అనుభవించడానికి సంసిద్ధంగావున్నాడు.

మాయాంతు ప్రకృతిం విద్యాన్మాయినం తు మహేశ్వరమ్।
తస్యావయవ భూతైస్తు వ్యాప్తం సర్వమిదం జగత్॥
— శ్వేతాశ్వతరం 4-6.

ప్రకృతి మాయ. మహేశ్వరుడు మాయి. ఆయన అవయవాలే సర్వభూత ప్రకృతిలో వ్యాపించియున్నది.

## 14. ఆధునిక మానవుని ఆత్మాన్వేషణ

శ్రీరామచంద్రుడు పురుషుడు. సీత మాయ. మాయా, పురుషుల సంతానమే మనస్సు. సంకల్ప వికల్పాత్మకమైన మనస్సు ప్రవృత్తి నివృత్తులతో కూడుకొన్నది. పురుషుడు మాయకు లోనుకావడం వల్లనే జీవునిలో ఆత్మాన్వేషణ ప్రారంభమై అనేకమార్గాలలో పయ నించి చివరికది ఆత్మజ్ఞానప్రాప్తితో "తత్త్వమసి" అనే మహావాక్యంలో పర్యవసిస్తోంది. రాముడు తాను మానవుడనని, దశరథుని కుమారుడ నని భావించగా, బ్రహ్మవచ్చి 'నీవు సాక్షాత్ మహావిష్ణుమూర్తివే' యని చెప్పడం ఈసందర్భంలో గమనింపదగింది. ఇదే "తత్ త్వం అసి" అనే మహావాక్యార్థనిరూపణం.

నివృత్తి మార్గంలోని జీవుణ్ణి అమార్గమే ఉద్ధరిస్తూవుంది. కాని ప్రవృత్తిమార్గంలోని జీవునిమాటయేమి? వాడు అధఃపతనం కావలసిం దేనా? ఉద్ధరింపబడే మార్గమేలేదా? అంటే వుంది. అదే నిత్యయోగా నుష్ఠానం. సీతాదేవి ప్రవృత్తికిలోనై వ్యామోహబుద్ధితో శ్రీరామునికి

దూరమైంది. ఇదిసత్యదృష్టికాదు. మిధ్యాదృష్టి. అందుచే రావణునికి పట్టుబడినసీత సంవత్సరకాలం కుండలినీయోగ మనుష్ఠించడం దీనికి ప్రబలోదాహరణం. ఆమె పూర్వజన్మలో యోగిని. ఆయోగం రావణ స్పర్శచే భ్రష్టమైంది. తిరిగి సీతగా జన్మించి అదేరావణుని వలన యోగం పునఃప్రారంభించి సిద్ధిపొందింది. వాల్మీకి సీత చెప్పలేదుకాని కల్పవృక్షంలో సీత రావణుని 'పరోక్షగురువుగా' అంగీకరించింది. యోగానికి పార్యంతిక ఫలస్వరూపుడైన శ్రీరామచంద్రుని మళ్ళీకలుసుకొన్నది. తనయోగసిద్ధిని తానేపరీక్షింపనెంచి అగ్నిలోచొరబడి అక్షతంగా వెలువడింది. తనకికలోకంతో సంబంధంలేదు. నిర్లిప్తురాలైంది. కేవలం రామునిభార్యగా సంతానవతియైంది. అదీ యెక్కడ? రామునికిదూరంగా అరణ్యాలలో — వాల్మీక్యాశ్రమంలో. రాముడు మరలా సీతను పరిగ్రహించడానికి వస్తాడు. తనకథనింకా పొడిగించుకోవడం సీతకిష్టం లేదు. మహర్షివారినిద్దరినీ కలపాలని ఎంతోప్రయత్నంచేస్తాడు. సీతకు తెలుసు తనవిషాదకథకు అంతంలేదని. అందుకే రాముని సంతానం రామునికే వదిలి తానెక్కడైతే పుట్టిందో తిరిగిఅక్కడికే చేరుకొన్నది. శ్రీరాముడు వట్టిరాముడుగా మిగిలిపోయినాడు.



# 15. లక్ష్మణస్వామి తపస్సుకు ప్రతీక

లక్ష్మణస్వామి తపస్సుకు సంకేతం. ఆయన అడవులకు పోవడానికి కారణమేమీలేదు. కాని స్వకీయమైన నిశ్చయంతోనే అన్నావదినలవెంట అడవులకు వెళ్లాడు. లక్ష్మణుడు నిద్రనుకూడా వదలి పవిత్రమైనబ్రహ్మచర్యంతో పదునాలుగేళ్లకాలం వెళ్లబుచ్చాడు. ఇదీనిజమైన తపస్సంటే. నిద్రను వదలినంతమాత్రాన అందరూ తపోనిష్ఠలో ఎల్లకాలం ఉండలేరు. తపస్సుకు వ్యతిరేకమైన రాక్షసమాయ నిన్ను మరోలోకానికి లాక్కొనిపోతుంది. కాని దీనికి అపవాదుగా నిల్చినవాడు ఒక్కలక్ష్మణస్వామియే. ఆయనెంతటి సూక్ష్మబుద్ధి, అంటే — రాక్షసమాయ సృష్టించిన రావణాసురుడే లక్ష్మణుని మెచ్చుకొంటాడు — 'కల్పవృక్షం'లో. రాజుకు రాజ్యం లేకపోయినప్పటికీ, సైన్యం లేకపోయినప్పటికీ ఇటువంటి కుశాగ్రబుద్ధిగల మంత్రిఒక్కడుంటేచాలు, ఆరాజుకు అన్నీవున్నట్లే"నని. అంతేకాదు, లక్ష్మణుని 'పరిశీలనామతి'నీ, 'సూక్ష్మతమాభిదర్శన వ్యాపృతబుద్ధి'నీ, 'విషయాభిముఖీనమైన హేతుకల్పన'నూ బహుధాప్రశంసిస్తాడు రావణుడు. ఇవి కల్పవృక్షంలోని అవాల్మీకమైన అంశాలు.

ఇలా ప్రతినాయకునిచేత ప్రశంసల నందుకొన్న లక్ష్మణస్వామి 'అచ్చమైన వెనుభక్తిస్థాణువు'. 'వెనుభక్తి' ఎవరిమీద? ప్రభువైన శ్రీరామచంద్రునిమీద. తాను నిత్యమూ పాదాభివందనంచేసే మాతృదేవీ సమానురాలైన వదినగారు సీతమీద.* కాని ఈఘట్టంలో సీతాదేవి

---

* రామాయణంలో లక్ష్మణస్వామి, విశ్వనాథ వేయిపడగల్లో లక్ష్మణస్వామి అనే ఏనుగు మహత్, అమహత్ పాత్రలు. రామునితమ్ముడు లక్ష్మణుడు యోగమార్గ ప్రవర్తకుడైన ఆదిశేషుని అపరావతారం. సేవాభావానికి ప్రతీక. రామాయణం వెనుక కల్పనలేదు. సంప్రదాయముంది. వేయిపడగల్లోని ఏనుగు లక్ష్మణస్వామికూడా సేవాభావానికి ప్రతీక. యోగమార్గంలో ప్రాణత్యాగంచేస్తుంది. ఈకల్పన వెనుక తాత్పర్యం ఏమిటని విచారించారు ఆచార్య సుప్రసన్న. (విమర్శని, 1978) ఆధారచక్రంలో బీజాక్షరం 'లం'. దాని వాహనం ఐరావతం-గజోత్తమం. ఈ ఉత్తమగజం కథగతంగా 'ల'కారాది యైనపేరుతో లక్ష్మణస్వామిగా రూపొందింది." మన తెలుగుకవుల్లో ఏనుగు లక్ష్మణకవి పేరెంత చిత్రంగాఉంది! ఆశ్చర్యంగా లేదూ! విశ్వనాథ 'తిక్కనగారి శేషత్వము' (ఆంధ్రజనత 21-7-68) అనేవ్యాసంలో 'కుండలీంద్రుడు తన్మహనీయస్థితి మూలమైనిలువ' అన్న రామరాజభూషణుని ప్రశంసను వ్యాఖ్యానిస్తూ కుండలీంద్రుడనగా, ఆదిశేషుడు, సోమయాజి అనిచెప్పి ఆదిశేషువు ధరామండలమును తనవేయిపడగలపై నిలబెట్టుట ప్రాణలక్షణము, యోగలక్షణము. అది శ్రీవిద్యారహస్యము. ప్రాణము ఉచ్ఛ్వాసనిశ్వా

మనఃస్థితి ఎట్లున్నది? ఆసురియైనమాయ ఆమెను ఆవరించియున్నది. ఏక్షణంలో సీతమారీచుని మాయాకంఠస్వరంగా వెల్వడిన "లక్ష్మణా గ్రజా!" అన్న చావుకేకలో 'లక్ష్మణా' అన్న అక్షరాలే సుదూరాన అడవిలో పయనించి విన్పించినదో, అది శ్రీరామునికంఠస్వరమేనని భ్రమించి ఆమె తనభర్త మహావీరుడనే సంగతి పూర్తిగావిస్మరించి ఆయనను ప్రాణాపాయంనుండి తప్పించడానికి ప్రయత్నిస్తుంది. ఈప్రయత్నం వాల్మీకంలోనువుందిగాని "హా! లక్ష్మణా!" అనియే "హా సీతా!" అనియే పిలిచినట్లున్నది. విశ్వనాధవారి కల్పనలో "లక్ష్మణాగ్రజా!" అని రాముణ్ణేపిలుస్తూ "ఏకక్రియాద్వ్యర్థికరీ" అన్నసూక్తినిసార్థకంచేస్తూ మారీచుడు మరణించాడు. మాయావేషధారికాబట్టి డొంకతిరుగుడుగా రాముణ్ణిసంబోధిస్తూ, కార్యసాధనకోసం 'లక్ష్మణా', అనేశబ్దం గట్టిగాఅరుస్తూ 'గ్రజా' గొంతులోనే గుర గురలాడించాడు. 'సవర్ణదీర్ఘం' కూడా మారీచునికి ఈపిలుపులో ఎంతోవెసులుబాటిచ్చినది. విశ్వనాధవారికీ కల్పనలో భారతంలోని "అశ్వత్థామ హతః — కుంజరః" అన్న ధర్మరాజుమాటలు ప్రోద్బలకమై యుండవచ్చు. 'అగ్రజా' అనే చివరిమాటలు అడవికాబట్టి గాలిలో తేలిపోయినవి. భారతయుద్ధంలో "కుంజరః" వినబడకుండా యుద్ధభేరీలుమోగించి మోసంచేశారు.

సీత మరిదితో అన్నకు సహాయార్థం వెళ్లమనిప్రార్థిస్తుంది. లక్ష్మణుడామెకుధైర్యంచెబుతూ ఇది ఆసురవేళయనీ, పైగాశ్రీరాముడంతటి మహావీరుడికి కీడుఎప్పుడూ కల్గదనీ, బాణప్రయోగకౌశలంలో అన్నను మించినవాడు సృష్టిలోవుండడానికి వీల్లేదంటాడు. సీతకు అరికాలిమంట నెత్తికెక్కుతుంది. లక్ష్మణుణ్ణి అనుమానిస్తుంది. స్త్రీకదా మరి! అనుమానం తర్వాతనే స్త్రీ అవతరిస్తోంది! ఆమె అంటుందికదా — "లక్ష్మణా! ఎన్నాళ్లుగా ఎన్నేళ్లుగా నాపైనికోర్కెలోపల దాచుకొన్నావు? నామీద మోహంపెట్టుకోవద్దు! బయట భక్తి! కడుపులోకామం! ఇదా నీస్వరూపం? ఇది 'ఆసురవేళ' అన్నావునీవు. నీకిలాంటి దుర్బుద్ధి పుట్టడమే 'ఆసురవేళ' అంటున్నాన్నేను" అని లక్ష్మణుని మాటను దుర్వ్యాఖ్యానంచేస్తుంది సీత.

---

నములనవలంబించి యుండును. కవియొక్క పద్యము అందలి శబ్దవిన్యాసముచేత పాఠకుని ఉచ్ఛ్వాసనిశ్వాసముల నియమించును. ఈ ప్రాణనియమనము చేయు ఛందోమయ కావ్యమునకు కర్తయైన కవిబ్రహ్మయందు ఈలక్షణము పరాకాష్ఠపొంది కుండలీంద్రుడైనాడని భావము" అన్నారు. ఈమాట గురుపద్యవిద్యకునాద్యుడైన వాల్మీకికి, — కవిసమ్రాట్ విశ్వనాథకు కూడా అన్వయించునుగదా!

లక్ష్మణుడు తలవంచుకుని వెళ్లిపోతూ ఒక్కమాటంటాడు. "నేనెందుకు మీవెంట అడవులకు వచ్చానంటే ఈఅవకాశం కోసమే వచ్చానన్నట్లుగా నోటికివచ్చినట్లు మాట్లాడావు. దానితో నాఅన్నపట్ల అపచారంచేసిన దానివైపోయావు" (అరణ్య-మారీచ-వ-413)

"— స్త్రీలెందున నాత్మ నిగ్రహమహీయసు లింతయుగారనంగ
నీయందున కంటె వేతెచటనయ్యె బ్రమాణము సర్వసృష్టిలో"

"అసురమాయ, దుష్టవిధియిలా తోసుకువచ్చింది. నిన్నని ఏంలాభం? నీనొసట ఎలారాసివుంటే అలాజరుగుతుంది" అంటూ వెళ్లిపోతాడు.

ఇప్పుడు వాల్మీకి రామాయణంలో ఈఘట్టం ఎలావుందో పర్యాలోచిస్తాము. రాముడు మృగరూపంలోవున్న మారీచుణ్ణిచంపాడు.

న ప్రాప్తకాల మాజ్ఞాయ చకార చ తతస్స్వరం
సదృశం రాఘవస్యైవ హాసీతే! లక్ష్మణే!! తిచ

రావణానుజ్ఞాసారం సమయం వచ్చేసరికి ఆ మారీచుడు రాముని గొంతుకతో హా సీతా! లక్ష్మణా! అని గట్టిగా అరుస్తూనేలకూలాడు. వాడికి మృగరూపంపోయి రాక్షసరూపం వచ్చింది.

మారీచస్యైవ మాయైషా పూర్వోక్తం లక్ష్మణేనతు।
తత్తథాహ్యాభవచ్చాzద్య మారీచోz యం మయాహతః॥
హాసీతే! లక్ష్మణే!! త్యేవ మాక్రుశ్యచ మహాస్వనం।
మమార రాక్షస స్సోzయం శ్రుత్వాసీతా కథంభవేత్॥
లక్ష్మణశ్చ మహాబాహుః కా మవస్థాం గమిష్యతి।

మాయలేడి మరణించేంతవరకూ అది మారీచుడనే సంగతిరామునికి తెలియదు. మారీచుని నిజరూపాన్ని చూచినతర్వాత లక్ష్మణుడు చెప్పిన మాటలు యథార్థాలని రాముడనుకొంటాడు. ఈమాయావి అరచిన అరుపులు విని సీతాలక్ష్మణులెంతగా తననుగురించి ఆందోళన చెందారోనని భయపడుతాడురాముడు.

రాముడు భయపడింది సీతవిషయంలో యథార్థమైంది. మారీచుని ఆర్తస్వరం రాముని చావుకేకగా సీతభావించి లక్ష్మణునితో—

ఆక్రందమానంతు వనే భ్రాతరం త్రాతు మర్హసి!
తంక్షిప్రమభిధావత్వం భ్రాతరం శరణైషిణం!
రక్షసాం వశమాపన్నం సింహానామివ గోవృషం!!

అంటుంది. రాక్షసులకు వశుడై ఆపన్నదశలో ఆక్రందనంచేస్తున్న అన్నను రక్షించడానికి నీవు తక్షణమే త్వరగావెళ్లు లక్ష్మణా! అని విహ్వల హృదయంతో అభ్యర్థిస్తున్నసీత ఆదేశాన్ని పెడచెవినిబెట్టి "అన్న మాట జవదాటను" అని నిలుచున్న లక్ష్మణుణ్ణిచూచి కోపంతో సీతయిలా నిందిస్తుంది.

సౌమిత్రే మిత్రరూపేణ భ్రాతు స్త్వమసి శత్రువత్!
యస్త్వ మస్యా మవస్థాయాం భ్రాతరం నాభిపత్స్యసే!!

ఇచ్ఛసి త్వం వినశ్యంతం రామం లక్ష్మణ మత్కృతే!
లోభాన్మమకృతే నూనం నానుగచ్ఛసి రాఘవం!!

వ్యసనం తే ప్రియం మన్యే స్నేహో భ్రాతరి నాస్తి తే!
తేన తిష్ఠసి విస్రబ్ధ స్తమపశ్యన్ మహాద్యుతిం!!

కింహి సంశయ మాపన్నే తస్మిన్నిహమయా భవేత్!
కర్తవ్య మిహ తిష్ఠంత్యా యత్ప్రధాన స్త్వమాగతః!!

లక్ష్మణా! నీ అన్నదుస్థితిలో వున్నాడు. నీవుకదలకుండా వున్నావు. నీవు మిత్రుడిలానటిస్తున్న శత్రువువన్నమాట! నాకుతెలుసు. నువ్వునా కోసమే రాముడు చావాలని కోరుతున్నావు. నామీదమనసుపెట్టుకున్నావు. అందుకే అన్నచావనీ అనివెళ్లకుండా వున్నావు. రాముడికి కష్టం రావడం నీకుసంతోషంగావుంది. రాముడిమీద స్నేహమేలేదు నీకు. అతనికి ఆపదవచ్చినా నీవుచలించడంలేదు. ఎవళ్లనిచూసి అడవికి వచ్చావు? రాముణ్ణిచూచివచ్చావుగాని నన్నుచూసిరాలేదు కదా! రాముడే లేనప్పుడు నేనుమాత్రం నీతోఎందుకుండాలి?" అని కోపంతో వణికిపోయిందిసీత.

లక్ష్మణుడు సీతతో "నువ్వు విన్నది రాముడిగొంతుకకానేకాదు. మాయలమారి మారీచుడే ఇలాఅరిచాడు. ఇది రాక్షసమాయ. నువ్వు విచారించకు. నేను కదలడానికివీలులేదు. ఇది అన్నగారిఆజ్ఞ!" అంటాడు. దాంతోసీత రెచ్చిపోయి —

అనార్యాz కరుణారంభ నృశంస కులపాంసన!
అహం తవప్రియం మన్యే రామస్య వ్యసనం మహత్॥

అనార్యుడా! చెడ్డచెయ్యడానికే వూనుకున్నావు. కులం చెరప బుట్టావు. పాపిష్ఠుడా! కఠినాత్ముడా! అన్నఆపదలో వున్నాడని తెలిసేనా ఇలామాట్లాడుతున్నావు. నిజమైన శత్రువునువ్వు. నీలాంటి క్రూరుడికి ద్రోహబుద్ధిపుట్టటం చిత్రంకాదు. పరమదుర్మార్గుడా! నీస్వార్థంకోసమో లేదా భరతుడు పంపడంచేతనో వొక్కడివీ కపటంగా అడవిలోరాముణ్ణి వెంటాడుతున్నావు. అని నిష్ఠురోక్తులు పల్కి, "రామం వినా క్షణ మపి నహి జీవామి భూతలే" అంటుంది. లక్ష్మణుడు చలించిపోతాడు. వణుకుతున్నకంఠంతో యిలాఅంటాడు.

ఉత్తరం నోత్సహే వక్తుందైవతం భవతీ మమ।
వాక్య మప్రతిరూపం తు న చిత్రం స్త్రీషు మైథిలి॥
స్వభావ స్త్వేషనారీణా మేవం లోకేషు దృశ్యతే।
విముక్తధర్మా శ్చపలా స్తీక్ష్ణాభేదకరా స్త్రియః॥
న సహే హీదృశం వాక్యం వైదేహీ జనకాత్మజే!
శ్రోత్రయో రుభయోర్మేz ద్య తప్తనారాచసన్నిభః॥

దేవీ! నువ్వునాకుదేవతవి. నీమాటకు ఎదురుచెప్పను. స్త్రీలు ఇలాతగనిమాటలనడంలో చిత్రమేమీలేదు. ఆడవాళ్లస్వభావమే ఇది. లోకమంతటాయిలాగేవుంది. ఆడవాళ్లలో ధర్మంలేదు. వాళ్లస్వభావమే చంచలమైంది. వాళ్లహృదయం క్రూరమైంది. స్నేహందగ్గర విరోధంపెడతారు స్త్రీలు. అమ్మా! నారెండుచెవుల్లోనూ కాల్చిన శూలాలు పొడిచినట్టుంది. ఇలాటిమాటలు సహించలేను. న్యాయవాదినినేను. అన్యాయంగా నన్నునిందించావు. వనదేవత లందరూ దీనికిసాక్షులు. అన్నగారి ఆజ్ఞశిరసావహించాను నేను. నన్ను సందేహించావు. నిందమోపావు. నిన్ను ధిక్కరిస్తున్నాను. ఏమైనా కానువ్వు. స్త్రీల స్వభావమే చెడ్డది. సరే, రామునివద్దకే వెళుతున్నాను. నీకుశుభం కలగాలి! వనదేవతలు నిన్నురక్షించాలి" అంటూ వెళుతాడు లక్ష్మణుడు.

శ్రీరాముడు మార్గమధ్యంలో లక్ష్మణుణ్ణి కలిసియిలాఅంటాడు.

దూరం నీత్వాతు మారీచో రాక్షసోఽ భూచ్ఛరాహతః।
హా లక్ష్మణ! హతోఽస్మీ!! తి యద్వాక్యం వ్యాజహార చ॥

"హా లక్ష్మణా! హతోఽ స్మి" అని అరిచాడట మారీచుడు. ఇదీ వాల్మీకి రామాయణంలోనిమాట "హాలక్ష్మణా! హాసీతా! హతోఽస్మి" అనివుంటాడని మనం వాడిచావుకేకని నిర్ణయించుకోవాలి. ఇక్కడ వాల్మీకి-విశ్వనాథుల తీర్పులోని ఔచిత్యాన్ని పరామర్శించాము. సీతా-లక్ష్మణులపాత్ర చిత్రణల్లోని సూక్ష్మతమభేదాలను స్పృశించాము. మహర్షి అడుగుజాడల్లోనే విశ్వనాథ నడిచారని మనకు విస్పష్టమౌతోంది.

# 16. శ్రీరాముని జన్మనక్షత్రౌచిత్యం

లక్ష్మణుడు సీతతో శ్రీరామచంద్రుని బాణప్రయోగ కౌశలాన్ని బహుధా ప్రశంసిస్తూ, "ఓ వదినా! నీకు తెలియనిదేమున్నదమ్మా!

.... అన్నముందు దు
ర్భరము త్రిలోకి గుప్పిలికిరాదు శరాసన లస్తకంబునన్

"అఖిల లోకచయము లాడగా నూడగా
నతని యమ్ము చివర నంటియుండు"

— అరణ్య-మారీచ-390-91

అంటాడు కల్పవృక్షంలో. ఈసందర్భంలో వాల్మీకికూడా —

అశక్యస్తవ వైదేహీ భర్తాజేతుం న సంశయః।
దానవేషు చ ఘోరేషు న స విద్యేత శోభనే॥
యో రామం ప్రతియుధ్యేత సమరే వాసవోపమం।
అవధ్య స్సమరే రామో నైవం త్వం వక్తుమర్హసి।
అనివార్యం బలం తస్య బలైర్బలవతామపి।
త్రిభిర్లోకై స్సముద్యుక్తై స్సేశ్వరైరపి సామరైః॥

ముల్లోకాలు ఎత్తివచ్చినా రాముణ్ణి యుద్ధంలో జయించేవారులేరు అంటాడు లక్ష్మణుడు. ఈసందర్భంలో ముండకోపనిషత్తులోని ఈక్రింది శ్లోకం స్ఫురిస్తోంది.

ధనుర్ గృహీత్వౌపనిషదం మహాస్త్రం
శరం హ్యుపాసా నిశితం సందధీత।
ఆయమ్య తద్భావగతేన చేతసా
లక్ష్యం తదేవాక్షరం సోమ్యవిద్ధి॥

"ఉపనిషత్తును బలమైన కోదండంగా గ్రహించి దానిపైన మహాస్త్ర శరంగా దీర్ఘధ్యానముంచి బ్రహ్మచింతన చేస్తున్న మనస్సుతో దానిని లాగితేనీవు లక్ష్యాన్ని కొట్టగలవు" ఇలాంటి ఆత్మజ్ఞుడు, లక్ష్యశుద్ధివేత్త శ్రీరామచంద్రుడొక్కడే! దీనికి శ్రీరాముడు జన్మించిన నక్షత్రం కూడా ఉపబలకం.

శ్రీరాముడు చైత్రమాసంలో 'పునర్వసు' నక్షత్రంలో జన్మించినాడు. పునర్వసు నక్షత్రం ఆకాశంలో ధనురాకారంగా మనకు దృగ్గోచరమవు తూవుందని శాస్త్రజ్ఞులు కనిపెట్టినసత్యం.



FIG. 1.

"ధనుర్గృహీత్వౌపనిషదం..." అనే ఉపనిషత్ శ్లోకానికి యోగశాస్త్ర సమన్వయం

1. మూలాధారచక్రం
2. స్వాధిష్ఠానచక్రం
3. మణిపూరచక్రం
4. అనాహతచక్రం
5. విశుద్ధచక్రం
6. ఆజ్ఞాచక్రం (భ్రుకుటి-ధనుర్మస్తకం)
7. ద్విదళాలుగా, ద్విజిహ్వాలతో ఊర్ధ్వప్రసారణంచేసే కుండలిని
8. సహస్రారం

పునర్వసు నక్షత్రాకారం సంధించిన బాణమున్న ధనుస్సువలెవుం టుంది. పునర్వసు నక్షత్రాకారం గొడుగులాగా వుందికదా అనికొందరు సందేహించవచ్చు. కాని "అనూరాధా జ్యేష్ఠాంగుళి ఛత్రాకారం షష్ఠన క్షత్రాణి" అని జ్యోతిశ్శాస్త్రం. అనూరాద, జ్యేష్ఠ నక్షత్రాలకు ఆరవ నక్షత్రం గొడుగుకమ్మి పట్టుకొనేచోట వుంటుంద కాబట్టే, పునర్వసు ధనురాకారం అనేది విస్పష్టమైనఅంశం.



FIG. 2

ఖగోళంలో పునర్వసునక్షత్రం ఎక్కుపెట్టిన ధనురాకారంలో పంచనక్షత్రాలతో వున్నది. ధనుస్సులో ఎక్కుపెట్టబడిన బాణానికియే లక్ష్యశుద్ధి, సిద్ధివున్నవో దానితో యోగశాస్త్రం తర్గత కుండలినీ ఊర్ధ్వప్రసరణం గమ్యమానమౌతోందని సమన్వయం. మహాధానుష్కుడైన శ్రీరాముని విలువిద్యా రహస్యమిది. ఇదే శ్రీరామచంద్రుని జన్మనక్షత్రౌచిత్యం!



FIG. 3

ఖగోళంలో అనూరాధ, జ్యేష్ఠ నక్షత్రాకారాలు ఛత్రాకారంలో దర్శనమిస్తున్నాయి.

ఈ పై రేఖాచిత్రాలను బట్టి అనూరాద, జ్యేష్ఠనక్షత్రాలు ఛత్రాకారంగా వున్నాయని, పునర్వసు ధనురాకారం గలిగిన ఐదునక్షత్రాలనీ తేట తెల్లమవుతోంది.

ముండకోపనిషత్తులోనే మరొకశ్లోకం రాముని బ్రహ్మత్వాన్ని స్థాపిస్తోంది.

ప్రణవో ధనుః శరోహ్యాత్మా బ్రహ్మ తల్లక్ష్యముచ్యతే।
అప్రమత్తేన వేద్దవ్యం శరవత్తన్మయో భవేత్॥

ఓంకారమే ధనుస్సు. బాణము ఆత్మ. బ్రహ్మ లక్ష్యము — అనగా ధ్యేయం. ఇలా జాగరూకుడై లక్ష్యభేదం చేసినవాడు ఆత్మైక్యము నొందుచున్నాడు — అని ముండకము చెప్పుచున్నది.

ఇప్పుడీసత్యమూ, అమృతమూ అయిన అక్షరబ్రహ్మనుగూర్చి ముండకోపనిషత్తులో చెప్పబడిన పై రెండుశ్లోకాలు మాయామానుష విగ్రహుడైన శ్రీరామచంద్రుని జన్మనక్షత్రంతోనూ, అయన మహాధానుష్కతతోనూ ఎంతచక్కగా సంవదిస్తోందో భావుకులు వూహింపగలరు.

# 17. శ్రీరామచంద్రుని ధనుర్హస్తకమే ఆజ్ఞాచక్రం

మస్తకం (మాడుభాగం) సహస్రారస్థానంకాగా, ధనుస్సుకు యిరువైపులా ఉబ్బెత్తుగాగల భాగాలు కనుబొమలు. దానిక్రింద చక్షువులుండగా, లస్తకస్థానం భ్రుకుటి — ఆజ్ఞాచక్రమగుచున్నది. గురువు శిష్యునికి హస్తమస్తకసంయోగంచే ఆజ్ఞాచక్రం వరకు సాధించినయోగానికి సిద్ధి గల్గజేస్తాడు. సీతారాములవివాహం సహస్రారంలో లక్ష్మీనారాయణద్వంద్వసమాగమంతో సమానమైందేకాదు సాక్షాత్తు వారు లక్ష్మీనారాయణులే! వశిష్ఠ, విశ్వామిత్రుల శిష్యుడుగా ఆంతరంగా ఆజ్ఞాచక్రం వరకు రాముడు సాధించినయోగం, సీతాదర్శనంతో వినూత్నశక్తినిపొంది మహాయోగియైన శివునియొక్క ధనుర్భంగంతో ఆజ్ఞాచక్రభేదనం సిద్ధించి లక్ష్మీనారాయణ ద్వంద్వసమాగమానికి అనగా సీతారామకళ్యాణానికి దారితీసినదని చెప్పవచ్చును. రాముడు శ్రీరాముడై 'మహాయోగి' యైనాడని అంతరార్థం! ఈ సందర్భంలో విశ్వనాథ కవిసమ్రాట్టు 'అనార్కలి' నాటకంలో వ్రాసిన నాందీశ్లోకం గుర్తుకొస్తోంది!

నాసాంతేకృత దృష్టి రవ్యవహిత భ్రూః వ్యాఘ్రచర్మాసనే
నిష్పామర్దిత బాహ్యవస్తువిషయాః యాబ్రహ్మరంధ్రోద్గతైః।
తేజోఽభిః భృశమైందవైః ప్రచలితైః మూర్ధ్న్యాz మృతేవాంశుభిః
సర్గస్థిత్యపహార హేతురవతాత్ శైవార్ధ సీమంతినీ॥

ఈ శ్లోకం ఆజ్ఞాచక్రంనుండి సహస్రారానికి కుండలిని చేరడాన్ని వర్ణించింది. మస్తకం సహస్రారంకాగా, భ్రుకుటి ఆజ్ఞాచక్రస్థానం. ఇక్క

డనే సుషుమ్నతో ఇడా, పింగళలు సంయోగంపొంది త్రివేణీసంగమమనే పేరుకు సార్థకతకల్గిస్తోంది.

| నాడి | శక్తి | చిహ్నం |
|---|---|---|
| 1. ఇడ | చంద్ర | గంగ |
| 2. పింగళ | సూర్య | యమున |
| 3. సుషుమ్న | అగ్ని | సరస్వతి |

బిసతంతు సదృశమైన సుషుమ్నయే అంతర్వాహినియైన సరస్వతి. "మాటలాడే వెన్నెముక, పాటపాడే సుషుమ్న" అని శ్రీశ్రీ, విశ్వనాథను ప్రశంసించాడంటే దానికర్థం ఈస్థాయినుండిచెప్పాలి. అతిలోక భావనావ్యాపారముగల కవిసమ్రాట్టు 'పుంభావసరస్వతి' అని అర్థం!

## షట్చక్రాలు లేక షట్కమలాలు

| చక్రం/కమలం | స్థానం | తత్త్వం |
|---|---|---|
| 1. మూలాధారం | గుదస్థానం | పృథివీతత్త్వం |
| 2. స్వాధిష్ఠానం | లింగస్థానం | జలతత్త్వం |
| 3. మణిపూరకం | నాభిస్థానం | తేజస్తత్త్వం |
| 4. అనాహతం | హృదయస్థానం | వాయుతత్త్వం |
| 5. విశుద్ధం | కంఠస్థానం | ఆకాశతత్త్వం |
| 6. ఆజ్ఞాచక్రం | భ్రూమధ్యస్థానం | మనస్తత్త్వం |
| 7. సహస్రారం | శిరస్సు | ఆత్మస్థానం |

పై పట్టికలో ఆజ్ఞాచక్రంతో షట్చక్రనిరూపణం పూర్తవుతున్నది. ఏడవది బ్రహ్మరంధ్రంగల సహస్రారంలో ఐక్యంపొందడం. భ్రుకుటి లేదా భ్రూమధ్యభాగం (ధనుస్సుపరంగాచూస్తే లస్తకం) స్థానంగాగల ఆజ్ఞాచక్రంయొక్క స్వరూపమిది.




FIG. 4 ఆజ్ఞాచక్రం
భ్రూమధ్యస్థానం — మనస్తత్వం

ఆజ్ఞాచక్ర స్వరూప వివరణం

| క్రమసంఖ్య | విషయం | ఆజ్ఞాచక్ర స్వరూపం | సహస్రారం |
|---|---|---|---|
| 1. | స్థానం | భ్రూమధ్యం | మస్తకం |
| 2. | తత్వం | మనస్సు | ఆత్మ |
| 3. | తత్వకాంతులు | 64 | అనంతం |
| 4. | దళాలు | 2 | వేయి |
| 5. | వర్ణాలు | హం, క్షం | వేయి |
| 6. | జ్ఞానేంద్రియాలు | చిత్తం, మనస్సు | — |
| 7. | రంగు | — | — |
| 8. | మండలాకారం | బిందువు | — |
| 9. | బీజం | ఓం | — |
| 10. | దేవత | శంభువు | — |
| 11. | ధాతుశక్తి | హాకిని | — |
| 12. | లింగయోని | ఇతర త్రికోణం | — |

| | | | |
|---|---|---|---|
| 13. | ఇతర తత్త్వసంయోగం | మహత్తు<br>సూక్ష్మప్రకృతి<br>హిరణ్యగర్భుడు | —<br>—<br>— |
| 14. | గ్రంధులు | రుద్రగ్రంథి<br>(విశుద్ధంతో కలిసి) | — |
| 15. | లోకము | తపోలోకం | సత్యలోకం |
| 16. | గుణము | సత్త్వం | సత్త్వం |
| 17. | అధిష్ఠానశక్తి | చంద్రుడు | [illegible] |
| | | | |

పై పట్టికలో ప్రస్తుతాంశమైన ఆజ్ఞాచక్రస్వరూపం, జీవేశ్వర ఐక్య స్థానమైన సహస్రారస్వరూపం మాత్రమే చెప్పబడినాయి. ఆజ్ఞాచక్రం ద్విదళబీజం లేదా ద్విదళపద్మం వంటిది.

మనోఽపి భ్రూమధ్యే సకలమపి భిత్త్వాకులపథం।
సహస్రారే పద్మే సహరహసి పత్యా విహరసే॥

అని శ్రీశంకర భగవత్పాదులు సౌందర్యలహరి (శ్లో. 9). "ఓ భగవతీ! కనుబొమల నడుమనుండు ఆజ్ఞాచక్రమందున్న మనస్తత్త్వమును గూడవీడి సుషుమ్నామార్గమును భేదించుకొని సహస్రారకమలమునందు నీభర్తయగు సదాశివునితోగూడి రహస్యముగా క్రీడించుచున్నావు".

దీనికి లొల్ల లక్ష్మీధరుల వ్యాఖ్య యిట్లున్నది — "మనః -మనస్తత్త్వమ్। భ్రూమధ్యే — భ్రువోరంతరాళే । ఆజ్ఞాచక్రే — ఆజ్ఞ ఆజ్ ఈషదర్థః, జ్ఞా — జ్ఞానమ్ । ఈషత్ జ్ఞానం యత్ర జాయతే సాధకానాం భగవతీవిషయం బ్రహ్మగ్రంధి భేదనాతివ్యగ్రతియా భగవత్యా ఆజ్ఞాచక్రే క్షణమాత్రావస్థానాత్ సాధకానాం తటిల్లేఖా రూపేణ అవభాసనాత్ । కులపథం — సుషుమ్నామార్గం ।"

సాధకులకు భగవతీవిషయమై యించుకంతజ్ఞానం ఎక్కడైతే కల్గుతుందో అది ఆజ్ఞాచక్రస్థానం. బ్రహ్మగ్రంధిని భేదించే తొందరలో భగవతి ఆజ్ఞాచక్రంలో తటిల్లతవలె భాసిస్తుంది. ఆజ్ఞాచక్రాన్ని శ్రీశంకర భగవత్పాదులిలా వర్ణించారు.

తవాజ్ఞా చక్రస్థం తపన శశికోటి ద్యుతిధరం
పరం శంభుం వందే పరిమిళిత పార్శ్వం పరచితా।
యమారాధ్య న్భక్త్యా రవి శశి శుచీనా మవిషయే
నిరాలోకేz లోకే నివసతి హి భాలోక భువనే॥ శ్లో. 36.

"ఓ భగవతీ! నీకు సంబంధించినదై భ్రూమధ్యమునందు వెల యుచున్నదైన ఆజ్ఞాచక్రమునందు కోట్లకొలది సూర్యచంద్రుల కాంతిని ధరించినవాడును, 'పర' యను చిచ్ఛక్తి తన ఉభయపార్శ్వములందు చేరి యుండగా విలసిల్లువాడునగు పరశివునిగూర్చి నమస్కరించుచున్నాను. పరమశివుని ప్రసన్నతపొందిన సాధకుడు జ్యోత్స్నామయలోకమున అనగా నిండు పున్నమి వెన్నెలగల లోకమందు నివసించుచున్నాడు. నీసాయు జ్యమును పొందుచున్నాడు."

అంతేకాదు, శ్రీశంకరులు "లలాటం లావణ్యద్యుతి, అనేశ్లోకంలో దేవి ఫాలతలంపై సంపూర్ణచంద్రాకృతి విలసిల్లునని భావించినారు. అది సార్వకాలిక సత్యము! తల్లి సంపూర్ణమైన దయవలననే ఆజ్ఞాచ క్రమందు, సహస్రారమందు నిండుపున్నమి వెన్నెల పరచుకొనియున్నది. ఆమె తటిల్లత! దేవినే 'స్ఫురణ! స్ఫురత్తా' అని కాశ్మీరశైవముచెప్పినది. దీనిని తైత్తిరీయారణ్యకము నిరూపించియున్నది.

నీలతోయదమధ్యస్థా విద్యుల్లేఖేవ భాస్వరా।
నీవార శూకవత్తన్వీ పీతా భాస్వత్యణూపమా॥

'స్ఫురణా'రూపిణియైనదేవి అనుగ్రహాన్ని అనుభవించి దానిని 'వైఖరి'గా ఆవిర్భవింపజేసే మహోకార్యమే 'కవిత్వం'. వాల్మీకి — విశ్వనాథులీ అనుగ్రహానికి సంపూర్ణంగాపాత్రులై మహాకవులై మహాకావ్యాలను తమ జాతిజనుల కందించి ధన్యులైనారు.

ఆజ్ఞాచక్ర రహస్యాన్ని గూర్చి యింతగా ఎందుకు వ్రాయ వలసివ చ్చిందంటే శ్రీరాముడు జన్మించిన నక్షత్రం 'పునర్వసు' ఎక్కుపెట్టిన ధనురాకారంగా వుండడం — తదనుగుణంగా శ్రీరాముడు మహాధాను ష్కుడుకావడం — ధనుర్లస్తకమే ఆజ్ఞాచక్రస్థానం కావడం — లక్ష్య శుద్ధిసిద్ధి గల్గిన శ్రీరామచంద్రుడు మహాయోగి యని నిరూపించడానికే! శ్రీమన్నారాయణుడే శ్రీరామచంద్రుడు! లక్ష్మియే — సీతాదేవి! వీరి వివాహఘట్టమే దీనికి తార్కాణం! అది సహస్రారంలో లక్ష్మీ

నారాయణద్వంద్వసమాగమం! శ్రీరాముడు శివధనుర్భంగం చేయడం ఆజ్ఞాచక్రభేదనంచేసి, లక్ష్మీదేవియైన సీతా నామక యోగాన్నిసాధించడం.

కల్పవృక్షంలో శివధనుర్భంగానికి పూర్వమే శ్రీరామచంద్రుడు సీతను 'ప్రాగ్దిశాసౌధంబు పైయంతస్తున" దర్శించినట్లు చెప్పబడినది ఈమూడు మాటలు సాభిప్రాయాలు. విపులార్థవంతాలు. దేవి సౌదామని. అవి సహస్రారాన్ని సూచిస్తున్నాయి. లక్ష్మీనారాయణ ద్వంద్వసమాగమాన్ని ధ్వనింపజేస్తున్నాయి. "కలాభ్యాం చూడాలంకృత శశికలాభ్యాం" అనిచెప్పిన శ్రీశంకరుల శివానందలహరీ శ్లోకం గుర్తుకొస్తోంది యిక్కడ.

"శృంగారభావ మొడిసి పట్టిన ముఖచంద్రుడొకడు తోచె".
—(బాల-ధనుస్సు-237)

ఇవి కేవలం ఆలంకారికమైన మాటలుకావు. శ్రీశంకరులు ఆజ్ఞాచక్ర — సహస్రార విషయంగా వర్ణించిన 'పున్నమి నాటి చందమామయే సీతాదేవి ముఖచంద్రుడు! ఆవెన్నెల ఏమిటో శ్రీరామచంద్రునకు తెలియును. అది ఆధ్యాత్మిక లోకంలో వెన్నెల.

ఆజ్ఞాచక్రానికి అనుబద్ధమైనదే తపోలోకం! ఆతపస్సు ఉత్తమోత్తమ సంస్కారవంతులయందు సిద్ధించినపుడెలా వుంటుందో విశ్వనాథ చెప్పారు సీసపద్యంలో —

ఇదమిత్థమని నిర్ణయింపగా రాని దే కోర్కియో రూపు గైకొన్నయట్లు
జన్మజన్మాంతర సంగతమ్మైన యా శాబలం బవధికి సాగినట్లు
ప్రాణముల్ బయటికి వచ్చి ముగ్ధాకార మొనయించి దర్శనమిచ్చినట్లు
**తన సృష్టిలోని యుత్తమభావ మానంద ముగ బొంగి బింబమై**
**పొడిచినట్టు**

ఇందలి 'బింబ' శబ్దము 'ముఖచంద్రుని'కి స్ఫోరకము! ఇది సీతారాముల జన్మజన్మాంతర తపస్సు- నిరీక్షణ — పండబోవుచున్నట్లుగా చెప్పబడింది! 'తపోలోక' మందలి ఆజ్ఞాచక్రస్థవిషయమది! ఈ 'బింబ' శబ్దాన్ని వాల్మీకి కుశలవుల విషయంలో వాడియున్నాడు. "బింబాదివోద్ధృతౌ బింబౌ రామదేహాత్తథాపరౌ" (బాల - సర్గ4, శ్లో. 11) సీతారాముల పరస్పర వీక్షణలో అది చంద్రబింబము. ఆజ్ఞాచక్రంయొక్క



అధిష్ఠానశక్తి చంద్రుడు. సహస్రారంలోని ఐందవం చంద్రుడే. ఇది యోగ సమన్వయంకాగా కావ్యపరంగా శృంగారరసం ప్రవర్తించిందికదా! "చంద్రమా మనసోజాతః" అది ఋగ్వేదం. అజ్ఞాచక్రానికి మనస్సు తత్త్వం. శ్రీరామచంద్రుడనే పేరులోనే ఆ రహస్యమున్నది. అయన బాణము అగ్ని. అతని ముఖము చంద్రుడు. ఇది పింగళ, సుషుమ్న, ఇడలకు సూచకం, కాగా 'శ్రీ' ఎవరు? సీతాదేవి! ఆమె తటిల్లత! సౌదామని! పున్నమినాటి చందమామ! అందుకే 'ముఖచంద్రు' డన్నాడు కవి. ఇది శృంగారరస సమన్వయం. నీలమేఘశ్యాముడైన రాముని వక్షమున దాగిన చంద్రుడే నీలతోయద మధ్యస్థమైన తటిల్లత సీతాదేవి ముఖచంద్రుడు! 'శ్రీ వక్షస్థ్సలమందు డిగ్గిన గతం జెల్వొంది గాఢోరసుండు" (బాల-ధనస్సు-15) అనుదానికర్థమిదియే! ఆతర్వాతి పద్యంలో దానిని రూఢిపరచినాడు కవి—

పునర్భువద్దంత ముగ్ధమోహన రుచి ప్రకటరేఖా హాస భావపరిధి
బాల్యయౌవనదశా పరిణాహ సంధ్రిత పాముగ్ధ నేత్ర శోభావయోధి
పుష్కలాభివ్యక్త ముగ్ధచిక్కణ కపో ల క్షీరకాంతి వేలాసుధాబ్ధి
**శతసహస్రమనోజ చాప లస్తక మహా భావపుంజీభూత ఫాలవీధి**

యై దృగింద్రియగత పరమార్థమగుచు హృదయదఘ్న రక్తఝరీ నిలీన
వేగ మాధుర్య పరసీమయై గవేషి తార్థ సంప్రాప్తియై దర్శనాధ్వ మొదిగె

సీసపద్యంలో నాల్గవపాదం, ఎత్తుగీతిలో సీతారాములమధ్య దర్శ నాధ్వ మొదిగిన తీరు విలక్షణంగా, విశిష్టంగా, ఉదాత్తంగా వర్ణింపబడింది. అది మహాభావ పుంజీభూతమని కవియే చెప్పినాడు. శతసహస్రమన్మథులు చాపలస్తకములతో సీతారాముల ఫాలవీధియందు — మహాభావపుంజీ భూత ఫాలవీధియందు — దృగింద్రియగత పరమార్థమైన మాన్మథభావ సృజనచేయుచు — అనాహత చక్రస్థానమైన హృదయపు లోతులలో మాధుర్య పరసీమల సంపాదించిపెట్టుచు — ఒకరినొకరు చూచుకొ న్నారు.

శ్రీరఘురామ చంద్రునకు జిత్తము జానకిపై గరంబు వి
స్ఫార శరాస లస్తకముపై యుగపత్ప్రియ జిత్రమయ్యె సం
ధారతి గోటికె[illegible]న గుణంబు బిగించుట లాగుటెంతయున్
నేర డెఱుంగ నొక్కసడి నిండిన శబ్దము కల్గునంతకున్

యోగరహస్యం సీతారాముల సంయోగశృంగారరహస్యంగా మలచిన ఈ కల్పవృక్షంలోని ఘట్టం విశ్వనాథవారి కవితామార్గానికి చక్కని తార్కాణంగా చెప్పవచ్చు.

అతని దృష్టికి జానకి యాగ లేదు
అతని కృష్టికి శివధనుస్సాగ లేదు
సీత పూజడ వెన్నుగా శిరసువంచె
జెఱకుగడవోలె నడిమికి విఱిగె ధనువు.

ఇట్లీ ఘట్టంలో అంతర్వాహినిగా యోగసంబంధమైన ధనుర్గ్రస్తకం ఆజ్ఞాచక్రమనే రహస్యాన్ని — సుషుమ్నానాడివలె, సరస్వతీనదివలె, ప్రవహింపజేస్తూ పైకి శృంగారరసాన్ని తేల్చిచెప్పడంలో కవిసాధించిన ఘనవిజయానికి పతాకంగా నిల్చిన పద్యపాదాలుగా చెప్పవచ్చు!

కోదండంబన నాయుధంబగు మహోక్షోణీపతిశ్రేణికిన్
కోదండంబన నాటవస్తువు రఘుక్ష్మాకోటి సుధారశ్మికిన్
కోదండంబన వంచునో, విఱచునో కోటింగువాళించునో
లేదా త్రచ్చునొ కంధి వ్రచ్చునొ శరాళిన్ దుస్తపోలోకముల్
— కోదండరాముడు ప-1

త్రేతాయుగంలో శ్రీరామచంద్రుడు, ద్వాపరయుగంలో అర్జునుడు మహాధానుష్కులు. ధనుర్విద్య అనేటప్పటికి మొదట శ్రీరాముని పేరుచెప్పి తరువాతతక్కినవారి పేరుచెప్పాలి. అలాంటి అగ్రగణ్యుడూ, కనిష్ఠికాధిష్ఠితుడూ అయిన శ్రీరాముని జీవితధ్యేయం — ఒకమాట — ఒక బాణము — ఏక పత్నీవ్రతం. ఈ నిర్ణయాన్ని పై ఎక్కుపెట్టబడిన ధనుస్సుదృష్ట్యా పర్యాలోచించినచో శ్రీరాముని బాహ్యాభ్యంతర జీవితవ్యాఖ్యానం. అంతేకాదు, పై సంధించిన ధనుస్సు శివధనుర్భంగంచేసి సీతాదేవిని వివాహమాడిన వృత్తాంతాన్నీ, ఆతర్వాత పరశురాముడు రౌద్రంతోవచ్చి సవాలుగాయిచ్చిన వైష్ణవధనుస్సును ఎక్కుపెట్టి పరశురామునిపుణ్య తపోలోకాలను దగ్ధంచేసిన విషయాన్నీ ముఖ్యంగా స్పృశిస్తున్నాయి. ఇలా శ్రీరామచంద్రుని జన్మనక్షత్రం "పునర్వసు" పరమౌచిత్యసంధాయకమై, ఔపనిషదకమైన రహస్యానికి ప్రమాణంగా నిలుస్తూ —" రామోవిగ్రహవాన్ ధర్మః "రామోద్విర్నాభిభాషతే" అన్నమహర్షివాల్మీకి మాటల్ని, 'రామబాణం' అన్నలోకోక్తినీ బహుధా

వ్యాఖ్యానిస్తోంది. శ్రీరామచంద్రుడే కైకేయితో ప్రసంగిస్తూ తనకు భౌతిక సుఖాలమీద ఆసక్తిలేదనీ, తానువిరాగినని చెబుతూ — "ఋషి స్విద్ధిమాం ఋషిభిస్తుల్యమ్" అంటాడు. సూర్యవంశానికిచెందిన క్షత్రియ కులంలో జన్మించినప్పటికీ, ఎల్లప్పుడూ ధనుస్సునుధరించి "క్షతాత్త్రా యిత ఇతిక్షత్రియః" "క్షత్రియైర్ధార్యతే చాపోనార్తశబ్దోభవేదితి" అన్న మహర్షిసూక్తికి అన్వర్థం కల్గిస్తున్నప్పటికీ, శ్రీరామచంద్రుని ఆత్మద్రవ్యం ఎంతవైరాగ్యపూర్ణమయిందో, గృహస్థుడై సంసారయాత్ర గడుపుతున్న ఆయనమాటలనుబట్టి విచారిస్తే శ్రీరాముడు ఆత్మజ్ఞానపరాయణుడు, మనస్సన్న్యాసి అనీ — ఒక్కమాటలో చెప్పాలంటే 'ఋషితుల్యుడనీ' నిర్ణయింపవచ్చు. మరొకపద్యంలో రాముడు లస్తకంతో నిమిత్తంలేకనే లక్ష్యాన్ని భేదించగలడని చెప్పబడింది.

మ॥ ఇది చేయంగల డిద్ది లేడనుచు లేనేలేద యేదైననున్
ప్రదరాంతంబున జేయగా గలడు తద్బాణానికై లస్తకం
బది కోదండము నందునన్ కలదు చాపాంతంబు చాపాది దీ
ప్రదశాలస్తకమే రఘుత్తమునకున్ బాణప్రయోగార్థికిన్     ప. 2.

'శ్రీరామునకు లస్తకంతో పనిలేదు. చాపాంతము, చాపాది అనగా ధనుస్సు యొక్క చివర మొదలు. ధనుస్సులో నేభాగమైనను సరే ఆయనకు లస్తకమే. ఆయన బాణప్రయోగార్థి! బాణప్రయోగంలో సముద్రంలాంటివాడు'. ఇది రాముని ప్రజ్ఞకాగా, రావణునిప్రజ్ఞను వాల్మీకి రామాయణంలో యుద్ధకాండ (సర్గ 24 శ్లో. 43) లో యుద్ధాన్ని వీణవాయించడంతో రూపకకల్పన చేసినాడు.

"మమ చాపమయీం వీణాం శరకోణైః ప్రవాదితాం"

ఇది రావణవాక్యం. ఈరూపకంలో వేళ్లస్థానంలో 'కోణములు' చెప్పబడినాయి. ఆ యుద్ధవీణ శరకోణములచే వాయింపబడునట! వీణాదితంత్రీవాద్యాలను వ్రేళ్లతోనే కాక పుల్లలతో వాయించడంకూడా అనాదిప్రసిద్ధంగా నుండబట్టియే అమరుడును "కోణోవీణాది వాదనం" అని యుపదేశించి యున్నాడు. అట్లే — రామాయణ కల్పవృక్షంలో

మంజూషలోనె యమర్చి కోణంబందు
నొక్కితాటం గొప్పనెక్కు పెట్టి

*గాబోలు, మంజూషికా వినిర్గమనంబు*
*వేళకే జ్యావల్లి బిగిసియుండె* — బాల, ధనుస్సు.ప.300

వాల్మీకంలో 'శరకోణః' అనిచెప్పబడినది, 'రావణవీణ'గా మనం గుర్తింపవచ్చు. భండనపండితుడైన రావణాసురుడు తన యుద్ధవిద్యావై శారద్యాన్ని ఒకహేలగా, ఖేలగా సంభావించి దానిని వీణావాదనంలో తనకుగల ప్రాగల్భ్యానికి సమానంగా సూచించిన వాక్యమది. రెండువం దలయేండ్లక్రితం పాశ్చాత్యుల సంగీతవాద్యమైన ఫిడేలును మనపూర్వీ కులు 'ధనుర్వీణ' అనిపిలిచేవారని రాళ్లపల్లివారు 'మనసంగీతవాద్యాలు' అనేవ్యాసంలో పేర్కొన్నారు.

శ్రీరాముడు శివధనుస్సును రెండుఖండాలుగా చేయడమంటే ద్విద ళాలుగల ఆజ్ఞాచక్రభేదనం చేయడమే! ఇది సాంకేతికార్థం! ఇది కుమార స్వామి క్రౌంచపర్వత భేదనంతో తుల్యమైనది.

కల్పవృక్షంలో ధనుష్ఖండ ప్రారంభమిలావుంది —

*శ్రీయోగిరాజ హృత్కమ*
***నీయ సుధాస్యందికోన్మనీ చరమకళా!***
***తోయజ మృదురేఖా శో***
*భాయుత రుద్రాక్ష కాంతిభాగ హిమగళా!*

కల్యాణఖండ ప్రారంభం యిలావుంది కల్పవృక్షంలో —

*శాసిత హృషీక ధీ ధా*
*రాసిత* ***సంవిత్కళాంకుర*** *సముత్పన్నా!*

'ఉన్మనీ' అనగా ఆజ్ఞాచక్రానికి పైనున్నదశ. దీనికే తురీయం, సహ జామనస్కమని అంటారు. 'సంవిత్' — సహస్రారకమల ధారణకు ఫలం. సంవిత్ అనగా ఉత్తమజ్ఞానం. 'మూర్తసంవిత్కళాయువతీభోగ' అని విశ్వనాథవారే కల్పవృక్షఖండాంత పద్యంలో వ్రాశారు.

కాబట్టి ధనుష్ఖండం — ఆజ్ఞాచక్రం, ఉన్మనీస్థితులకు చెందినదికాగా, కల్యాణఖండం — సహస్రారకమల ధారణకు ఫలమైన సంవిత్కళాస్థి తికి చెందినదని కవియే సూచించినట్లయినది. ఈకల్యాణఖండంలో

సీతారామద్వంద్వ మేర్పడినది. 'మూర్తసంవిత్కళాయువతీభోగ' అన్న సంబోధనకు సార్థకత సిద్ధించినది. శ్రీసీతారాములకల్యాణం శ్రీవై కుంఠమందలి లక్ష్మీనారాయణ ద్వంద్వసమాగమమే. సహస్రారమందలి నిత్యద్వంద్వమిదియే. తద్రహస్యమే కథాముఖంగా సీతారామకల్యాణ ఘట్టంగా ప్రవర్తించింది. ఇదికుండలినీయోగరహస్యం.

ఇక ధనుష్ఖండాంత పద్యాలలో—

1. ఇది ధనుష్ఖండ మాత్మేశ! మదన మదనమన ధృశాగ్నిక!

2. ఉపనిషదుదితోక్తి వ్యూహ నానాభిధానా!

మొదటి సంబోధనలో ఆజ్ఞాచక్రస్థానీయమైన శివుని 'కృపీటయోని' చెప్ప బడగా తల్లిపార్వతి వివాహానంతరం "హరనేత్రాగ్ని సందగ్ధకామ సంజీవనౌ షధిః" అని కీర్తింపబడి మన్మథుడు పునరుజ్జీవితుడైనాడు. ఇక్కడ ఇది సీతారామకల్యాణ ఘట్టం కాబట్టి శృంగార రసస్ఫోరకంగా దీనిని గ్రహిం చాలి. రెండవ సంబుద్ధిచే ఉపనిషత్తుల్లో వ్యూహమనగా ఉపాధి. వైకుం ఠంలోని శ్రీమహావిష్ణువుకు శ్రీరామచంద్రత్వమొక ఉపాధి. లక్ష్మీదేవికి సీతాదేవీత్వమొకఉపాధి. ఉపాధిగతంగా వారుచేసే పనులన్నీ తత్త్వస్ఫో రకంగా ఉంటాయి. రామకథ యోగరహస్యార్థాలతో కూడుకొన్నదని తాత్పర్యం.

గౌతమ ధర్మపత్ని అహల్య, ఋషిపత్ని కావున ఈ తత్త్వార్థాన్ని — రామావతార రహస్యార్థాన్ని — సూచించే విధంగా కల్పవృక్ష కావ్యంలో శివధనుర్భంగానికి పూర్వమే రామునికి "ప్రేయపు బొట్టు" పెట్టినది. 'తిలకము' ఆజ్ఞాచక్రస్థానీయం. ఇదిమొదటగా కల్యాణ తిల కము. రెండవదిగా రావణసంహార విజయతిలకము కావాలని ఆమె ఆకాంక్ష! దీనిని వెంటనే తెలిసికొన్న రాముడిలా అంటాడు.

*"నా నొసట నిద్దతే యుంచినారు విజయ*
*తిలకము లయోధ్యలో బయల్దేరు వేళ*
*నమ్మ కౌసల్యయును, గౌతమాశ్రమమున*
*నమ్మకన్న బ్రేముడి నహల్యయును నాకు"* — (ధనుః -49 ప.)

ఈతిలకం కథాపరంగా సీతారామకల్యాణాన్నీ, యోగపరంగా ఆజ్ఞా

చక్రవిదళనాన్నీ స్ఫురింపజేస్తున్నాయి. ఇది కల్యాణతిలకం, అనసూయ యిచ్చిన అంగరాగాలు దాల్చిన సీతాపరంగాచూస్తే' "స్త్రీణాం ప్రధాన మఖిలేష్వపి కుంకుమం హి" అని చెళ్లపిళ్ల వారన్నట్లుగా —

అగ్ని శిఖా జన్మత్వా దగ్నిశిఖాz లంకృతౌ తవ ప్రీతిః
అథవా స్వజన్మ భవనే నహి కాసాం ప్రీతిరంబ మహిళానామ్

అని తిరుపతి వేంకటకవుల కాళీసహస్రము. విశ్వనాథకల్పవృక్షంలో మహాయోగియైన హనుమచేత సీత యెట్టిదియో రామునికిలా చెప్పించి నాడు.

"ఆమె యొక నూతనాగ్నిశిఖ!" ఈ అగ్నిశిఖాత్వము సీతయొక్క నిత్యజాజ్జ్వల్యమానమైన జీవితాన్నీ, అగ్నిగర్భయైన ఆమె దివ్యత్వాన్నీ ఏతత్ స్ఫోరకంగా నుదుటదాల్చిన 'కుంకుమాగ్ని'ని స్ఫురింపజేస్తున్నాయి.

తస్యా లలాట లీన స్వాహాపతిరేవ శాంత సంతాపః।
రేజే కుంకుమతిలక వ్యాజాన్మ్నానం బుధాహి కాలవిదః॥

కుంకుమతిలక వ్యాజంతో ఆజ్ఞాచక్రాంతర్గతమైన అగ్నితత్త్వాన్ని "శమీ మివాభ్యంతర లీనపావకామ్" అని వర్ణించిన కాళిదాసువలె జ్ఞానసుందరీ కవయిత్రి సీతాదేవితత్త్వాన్నే వ్యాఖ్యానిస్తున్నాదా అనిపిస్తున్నది. సీతా దేవి 'ఒక నూతనాగ్ని శిఖ'! ఆధునిక సమాజంలో స్త్రీయింతటి మహిమోపేతురాలు కావాలని మహాకవి ఆంతరమైన తపన!

## 18. వాల్మీకి – స్త్రీ మనస్తత్త్వ చిత్రణ

ఒక్కమాట రామతత్త్వాన్నిగూర్చెచెప్పి తర్వాత కథలోనికిపోదాము. ఋషితుల్యుడైనవాడే జీవాత్మపరమాత్మలమధ్య సేతువు వినిర్మింప గలడు. తద్వారా తమోసాగర తరణం చేయగలడు — అని ముండ కోపనిషత్తులో చెప్పబడిన శ్లోకాలు ఋషితుల్యుడైన శ్రీరామచంద్రుని సేతునిర్మాణం, సాగరతరణం బాహ్యాభ్యంతరాలుగా ధ్వనింపజేయుచున్నది.

యస్మిన్ ద్యౌః పృథివీ చాంతరిక్ష
మోతం మనః సహప్రాణైశ్చ సర్వైః।

తమేవైకం జానాథ ఆత్మానం మన్యా
వాచో విముంచ థామృతస్యైష సేతుః॥

స్వర్గం, భూమి, అంతరిక్షం, మనస్సు, సర్వప్రాణాలు ఎవని మీద ఆధారపడివున్నవో అతడే ఏకైకమైన ఆత్మను తెలిసికొని తక్కినవన్నీ పరిహరించి అమృతత్వానికి సేతువుకాగలడు. రాముడు నిర్మించిన సేతువు యోగసేతువు.

అరా ఇవ రథ నాభౌ సంహతాయత్రనాడ్యః
స ఏషోఽంత శ్చరతే బహుధా జాయమానః
ఓ మిత్యేవ ధ్యాయథ ఆత్మానం
స్వస్తిపః పారాయ తమసః పరస్తాత్॥

ఒకరథచక్రాన్ని ఉపమానంగా తీసుకొందాము. ఇది మానవశరీరం లోని గుండెకాయవంటిది. రథచక్రంలోని అడ్డకమ్ములన్నీ ఇరుసునందు వచ్చి లగింపబడినట్లుగా మానవశరీరంలోని సర్వరక్తనాళములు గుండెను వచ్చిచేరేట్లుగా ఆత్మతత్త్వ దర్శనానికి సాధనాలైన అవయవాలన్నీ — అనగా జ్ఞానేంద్రియ — కర్మేంద్రియాలన్నీ — ఓంకారమునందు లీనమౌ తున్నాయి. ప్రణవోపాసనచేతనే జీవుడు తమోసాగరతరణం (crossing over the sea of darkness) చేయగలుగుచున్నాడు.

ఇటువంటి పరమాత్మ మానుషరూపం ధరించి అవతరించగా శ్రీ రాముని పరాక్రమాన్ని సీత విస్మరించి ప్రాణాపాయాన్ని అనుమానించిందంటే ఆమె ఎంతగా రాక్షసమాయకు లోనైవుండాలో పాఠకులే వూహించుకోగలరు. విరాధవధ, కబంధవధ ఆమె కళ్లారాచూచింది. అన్నిటికంటే శైవవైష్ణవ ధనుస్సుల్ని ఎక్కుపెట్టినభర్త ఏప్రమాదానికి గురి అయ్యాడోనని ధర్మపత్నిగా భయపడింది. అందుకే అభయ మభయ మంటున్న లక్ష్మణుణ్ణి సైతం లెక్కచేయకుండా తీక్ష్ణమైన మాటలతో నిందిస్తుంది. అతనిని అనవసరంగా అనుమానిస్తుంది. ఈ సందర్భంలో వాల్మీకి సీత తనమరిదితో పల్కిన నిందోక్తులు కొంచెం ఎక్కువమోతా దులో వున్నాయేమో ననిపిస్తుంది. ఒక సాధారణ మనస్తత్వం గలిగి సంఘంలో తక్కువస్థాయికి చెందిన స్త్రీకూడా అంత కఠినంగా దూషింపదేమో! ఈసందర్భంలో విశ్వనాథవారి మాటలు చూడండి — "In Ramayana, there are two places where at one time Sita and at another time Rama are made to utter certain things which only

the story requires. Neither their character nor their dignity nor the decorum in which the story is made to move does guarantee. Sita here spoke to Lakshmana something in such a way that were she Sita, our ideal Sita, would not say. The daughter of Janaka would not utter those words. She knows the character of Lakshmana much better than perhaps Rama. She said such things to Lakshmana. Why did she say? She is not ignorant of the great fact of Rama's being the paramount archer in the whole world. She once spoke of Rama to Anasuya the wife of the great sage Atri that Rama is the only purusha and now speaks to Lakshmana as if Lakshmana entertains the idea of people of low civilisation. The story itself has necessitated Sita to see that Lakshmana will not be there when Ravana appears. A master artist of the story can see Sita's hand behind. Rama has nothing to do with this."

What is Ramayana to me? 1976, Pages — 30-31.

కాని, వాల్మీకి చాలా నిజాయితీగలకవి. ఆయన ఇక్కడ స్త్రీ మనస్తత్వాన్ని చక్కగా ఆవిష్కరించాడు. ఈఘట్టంలో సీత మానవత్వపు సరిహద్దుల్లో ప్రవర్తిస్తూ వుందని మనం జ్ఞాపకం వుంచుకోవాలి. జింకను చూచి వ్యామోహపడిన క్షణంనుండి ఆమెలోని దివ్యత్వపు పొలిమేరలు అంతరించి మానవస్వభావం విస్తరించింది. ఈ మానవస్వభావంలోని భ్రాంతి, సందేహాలే ఇక్కడ ఒకవిచిత్రపు కోర్కెగా, సత్పురుషదూషణగా బయటపడ్డాయి. ఒకానొకకథలోని ఒక సచ్ఛీలమైనపాత్రలో దోషాన్ని నిరూపించడం చాలాకష్టం. అందులో రామకథవంటి కథలో అది మరింతకష్టం. సీతవంటి ఉదాత్తప్రవర్తనగలస్త్రీ అలాంటి విచిత్రపు కోరిక కోరడం, లక్ష్మణనింద చేయకపోతే కథముందుకు జరగడానికి వీలేలేదు. కథలో రావణపాత్ర ప్రవేశానికి అసలే తావులేదు. కాబట్టి సీత కథాగమనంకోసం, రామాయణం జరగడంకోసమని పైనుండి రెండు మెట్లు క్రిందికి దిగి వచ్చింది. ఒక సామాన్యస్త్రీగా ప్రవర్తించి కథముందుకు సాగగానే వెంటనే తనస్వస్థానానికి వెళ్లిచేరుకొంది. ఒకనాటకంలో ఒకపాత్రధరించి నటించవలసిన వ్యక్తిప్రేక్షకులముందు నాటకరంగంపై ఆపాత్ర ఎటువంటిదైనాసరే సమర్థవంతంగా నటించి రంగనిష్క్రమణంచేస్తాడో అలాగే మహామాయమైన సీతాదేవి 'పంచవటి' అనే రంగస్థలంపై ఒకవిచిత్రమైన మనస్తత్వంగల పాత్రపోషణ అత్యంత సమర్థవంతంగా నిర్వహించి రంగనిష్క్రమణంచేసింది. దానితో

కథాభాగం రావణసంహారం వరకు నెట్టుకువచ్చింది.

మళ్లీ కథ నడవడానికి కవికి క్రొత్తహేతువు కల్పించవలసిన పరిస్థితి ఏర్పడింది. అది "జనవాక్యంతు కర్తవ్యమ్" అన్నధ్యేయంగల రాము నిమీద మోపబడింది. ఇంతవరకు సీత మంచిదైకూర్చుంది. మరి ఇప్పుడు ప్రజావాక్యం మన్నించేరాజుగా రాముడు చెడ్డవాడయ్యాడు. సీతను అడవులకుపంపాడు. ఉత్తరరామాయణమంతా నడిచింది. పూర్వరామా యణంలో కైక రాముణ్ణి అడవులకు పొమ్మనగా ఉత్తరరామాయణంలో రాముడే సీతను అడవులకు పంపాడు.

సీత పాఠకుల కరుణకు పాత్రురాలైంది. కాబట్టి ఏతావతా తేలిందే మంటే కథ ముందుకునడవడానికి కారణంకావాలి. అది కథలోనేపుట్టిం చాలి. ఆ హేతుకల్పనలో పొసగింపువుండాలి. ప్రధానపాత్రలద్వారానే దాన్ని ఆవిష్కరించాలి. అందులోనూ రామాయణంవంటి కథలోకవికి ఇదొక క్లిష్టసమస్య.

రాముడు పుట్టకముందు అయోధ్య అంతఃపురంలో అందరూ మంచి వాళ్ళే. రాముడు పుట్టిపెరిగాక అంతవరకు మంచిదనుకొన్న కైక హఠాత్తుగా చెడ్డదనిపించుకొంది. వనవాసంలో పదమూడేళ్లు మంచి గావున్నసీత జింకకావాలనికోరడం, దానికై రాముణ్ణిపంపి లక్ష్మణుణ్ణి నిందించడంతో రావణునికి చక్కనిఅవకాశం కల్గింది. సీతాపహరణంతో రావణుడు తనచావుతానే కొనితెచ్చుకున్నాడు. ఆ రావణుడు చచ్చాక సీత రాముని నిశితకోపానికి గురైనాలోకం ఆమెనుఆడిపోసుకొంది. రహ స్యంగా చెవులుకొరుక్కొంది. లోకాన్ని త్రోసివేయలేక సీతను రాముడు దూరంచేసుకొన్నాడు. అప్పుడు సీతపై జాలిపుట్టింది లోకానికి. రాముడు ఎవడో ఆకాసిపోకాసిగాడి మాటలు విని నిందుచూడాలిని అడవికి పంపా డని లోకంతిట్టిపోసింది. కుశలవులు కుశలంగా పెరిగిపెద్దవారయ్యాక అయోధ్యకు తిరిగిరమ్మని రాముడు సీతను వేడుకొంటాడు. రాముణ్ణి తిరస్కరించినసీత భూమిలో చొరబడింది. "ఆహా! మహాపతివ్రత!" అన్నారందరూ! చివరికి చెడ్డవాడయింది రాముడు.

'రాజ్యాంతే నరకం ధ్రువమ్' అన్న లోకోక్తి రాముణ్ణిమాత్రం ఎందుకు వదిలిపెడుతుంది? సీత అడవులపాలుకాగా రాముడు సజీవ నరకాన్నే అనుభవించాడు. భవభూతి ఉత్తరరామచరిత చదివితే పాఠకు లకు రాముని అంతఃకరణం ఏమిటోతెలుస్తుంది. అయినా యిప్పటికీ

రాముడు చెడ్డవాడే. ఆయన్ను ప్రజలింకా అర్థంచేసుకోలేకపోతున్నారు. అందుకే ఆయన్ను దూషిస్తూ, భూషిస్తూ రకరకాలగ్రంథాలు పుట్టు కొస్తున్నాయి. అయినా ఇంకా అర్థంకాకనే మిగిలిపోతున్నాడు రాముడు. అవును! ఆత్మపదార్థం అంతత్వరగా కరతలామలకమౌతుందా? శాంత మహాసముద్రాన్ని ఆపోశనపట్టడం అంతసులభమా? జీవలోకం ఉన్నం తవరకూ, ఈశరీరంలో జీవుడున్నంతవరకూ రాముణ్ణి, ఆత్మారాముణ్ణి అర్థంచేసుకోవడానికి ప్రయత్నం జరుగుతూనే వుంటుంది. ఈభూమి పై నదులూ, కొండలూ వున్నంతకాలం రామకథ చిరస్థాయిగా నిలిచివుం టుందని బ్రహ్మఅనడానికి మూలకారణం యిదే. రాముడు చెడ్డవాడంటే ధర్మం చెడ్డదన్నమాట! ఆ నిష్ఠురత్వం, ఆ కఠోరత్వం ధర్మంలో వుంది. కాని రాముడిలో లేదు. రాముడేధర్మం — ధర్మమే రాముడు. రాముడు నవనీతహృదయుడు.

ఇక సీతసంగతికొస్తే ఒకఉన్నతసంస్కారంగల వ్యక్తిసంస్కారహీనమైన స్థాయికి దిగజారినప్పటి ప్రవర్తన ఎలావుంటుందో ఈ పట్టంలో కవి నిరూపించాడు. తిరిగి ఆమె పశ్చాత్తప్తురాలై మరలా రెండుసోపానాలు ఎక్కిరావణుణ్ణే తృణీకరించడమే కాదు. రాముని రాకకోసం ఎదురు తెన్నులుచూస్తూ రామనామాన్నే జపిస్తూ యోగినిగాకాలం గడుపుతుంది. ఇది మరల దివ్యత్వపదవి. ఇలా సీతజీవితంలోని ఎగుడు దిగుళ్లనూ, ఉత్థా నపతనాలనూ పరమపదసోపానక్రమంలో చిత్రించాడు వాల్మీకి. ప్రతిమా నవజీవితంలోనూ కూడా ఇలాంటి ఎగుడుదిగుళ్లు తప్పవు. దిగుడుబావిలో పడిపోయిన దేవయానిని ఉద్ధరించినయయాతి లా బుద్ధిరూపమైన భగ వంతుడు చివరిక్షణాలలో భక్తుని ఉద్ధరిస్తాడు. అలా ఉద్ధరింపబడడానికి ప్రతిజీవుడు గజేంద్రుడిలా అన్నీవిడిచి "నీవే తప్ప నితఃపరం బెరుగ" అంటేనే తప్పభౌతికమూ, భౌమమూ అయిన నేలబారుతనం నుండి జీవుడు ఒకఉదాత్త, దివ్యత్వస్థాయికి ఎదిగిరాలేడు.

*యేతు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః।*
*అనన్యేనైవ యోగేన మాం ధ్యాయంత ఉపాసతే॥*
*తేషా మహం సముద్ధర్తా మృత్యు సంసారసాగరాత్।*
*భవామి న చిరాత్పార్థ! మయ్యావేశిత చేతసామ్॥*

*— గీత, 12-6, 7 శ్లో*

"ఎవరు సర్వకర్మలను నాయందు సన్యసించి, అర్పించి నాయం

దత్యంత ఆసక్తికలిగి ఏకాగ్రమైన మనస్సుతో ధ్యానించుచుందురో, నాయందే మనస్సు లగ్నమొనర్చినట్టి భక్తులను నేనతి శీఘ్రము గనే మృత్యువుతో కూడిన సంసారసాగరము నుండి ఉద్ధరింతును." అని భగవంతుడే చెబుతున్నాడు.

వాల్మీకి ఉద్దేశంలో స్త్రీజాతికి ఆదర్శమైన ఉత్తమశీల సంపన్నురాలిని చిత్రించడమేకాదు. అంతకుమించి దివ్యత్వ, మానవత్వ స్థాయుల్లోవ్యక్తి ఎలాప్రవర్తిస్తాడో చిత్రించడమే, ధ్యేయంగా పెట్టుకున్నాడు. కాబట్టి దివ్యాదివ్య స్థాయుల్లో సీతాదేవి ప్రవర్తన మనకళ్లకు కొట్టవచ్చినట్లు కనబడుతుంది.

## 19. దశరథుడు X దశముఖుడు

ఒకసారి కోర్కెనీమనస్సులో వేళ్లుతన్నుకొంటే మానవశరీరమెత్తిన వాడెవడైనాసరే తపోలోకంలో కాలునిలదొక్కుకోలేడు. "ఎప్పుడు మేను దాల్చితివో ఈ తనుసంగత లక్షణంబులుం దప్పవు" "ఎప్పుడు కామ మేచినది అప్పుడుదుఃఖముపుట్టె" అంటోంది కల్పవృక్షం. ఇదే వేరొక పరిస్థితిలో అయితే ఒకహద్దును సూచిస్తూ గిరిగీయవచ్చుకాని ప్రస్తుతం సీతవున్న పరిస్థితిలో ఆ గీతకు అర్థంలేదు. ఒకసారి తపస్సు త్యజించిన తరువాత అటువంటిగీతలు ఎన్నిగీచినా ప్రయోజనంశూన్యం. గీత గీతగానే వుంటుంది. నీవుదాన్ని దాటివెళ్లిపోతావు. ఇలా నీవెప్పుడు సీమోల్లంఘనం చేశావో దశరథుని తనయుడైన దాశరథికి బదులు ఆయనకు బాహ్యాభ్యంతర ప్రతిద్వంద్వియైన దశముఖుని నీవు ఎదుర్కోవలసివస్తుంది. దాశరథియెంత అంతర్ముఖుడో, ఇంద్రియనిగ్రహం కలవాడో దశముఖుడంతగా బహిర్ముఖుడు, ఇంద్రియలోలుడు. ఒక్కమాటలో చెప్పాలంటే దశదిశలకూ బహిర్ముఖమైన యింద్రియచాపల్యానికి లంకేశ్వరుడు సంకేతం.

నేటి ఆధునికస్త్రీ కట్టుబాట్లను ఉల్లంఘిస్తూవుంది. వివాహం ఒక కట్టుబాటు. ఆకట్టుబాటులో స్త్రీకి ఒక్కడేభర్త. జీవితాంతమూ ఒక్కడేభర్త. దాన్నితెంచుకొని సంఘంలోకి వచ్చినస్త్రీని పదిమంది పురుషులు వాంఛించడంలో తప్పులేదు. ఆపదిమందే యిక్కడ దశముఖుడైన ఒక్కరావణాసురుడుగా చిత్రించబడ్డాడు. నేటిసంఘంలో చూస్తే,

బయటఒకతల, లోపల పదేమిటి, వందతలలున్నా ఇంకా మాట్లాడితే వేయిముఖాలున్న రావణాసురులకు లెక్కలేదు. వాల్మీకి దశముఖుణ్ణే చిత్రించాడు పాపం! ఆతర్వాత శతముఖ, సహస్రముఖులు పుట్టుకొస్తా రని ఆయనకు తెలియదుకదా!

ఇంద్రియాలు కోరే కోర్కెల్ని వెంబడించిన ఆనందం సీతను గీత దాటేలా చేసింది. నీవు ఎంతకాలంనైతిక పరిహద్దుల్ని గౌరవించి మర్యాదగా ప్రవర్తిస్తావో అంతవరకు నీ ప్రత్యేకవ్యక్తిత్వానికేమీ భంగం వాటిల్లదు. నీలో అధర్మం వేలోల్లంఘనం చేస్తే నీవా చెలియలికట్టను దాటివెళ్లడానికి ఎంతోకాలంపట్టదు. అప్పుడు ప్రతివస్తువూ నిన్ను మరిం తగా ప్రలోభ పెడతాయి. రావణుడు తన ఐశ్వర్యాన్నంతా చూపించి సీతనెలా ప్రలోభ పెట్టాడో యిక్కడ ఒకసారి పాఠకులు గుర్తుచేసుకో వాలి. సీత దానికి ససేమిరా లొంగలేదనుకోండి. కాని! యింతజరిగాక చివరికి దశముఖుడు సీతను తన యిరవైచేతులా ఆహ్వానించాడు కదా!

దశముఖుడంటే కుడివైపు ఐదుతలలు, ఎడమవైపు ఐదుతలలుండి ఒకేమెడకాయ వున్న విచిత్రపురుషుడుకాడు. ఇక్కడ ముఖ్యంగా చెప్పవ లసిందేమంటే రావణుని ఇంద్రియలోలుపత దశదిశావరివ్యాప్తములైనవని అర్థం. పూర్తిగా బహిర్ముఖుడైన జీవుడు మాంసవృక్షంలాంటివాడు. అటువంటి వాళ్లు యింద్రియలోలురై లోకరమణంలో ఆరితేరినవాళ్లై వుంటారు. భౌతికంగా యిలాంటివారు రావణాసురుడు లంకనేలినట్లే సకలైశ్వర్యాలూ, భోగభాగ్యాలూ అనుభవించవచ్చు. కాని ఫలితం మాత్రంశూన్యం.

## 20. నేటినగరాలను తలదన్నే లంకానాగరికత

లంకతో పోలిస్తే అయోధ్య ఒకవెనుకబడిన చిన్నపల్లెటూరు. రాముడు అడవి రాముడు — అని రావణుని ఎగతాళి. లంక లోని ప్రజలు మహాఐశ్వర్యవంతులు. అయోధ్యలోని జనులు బడుగుజాతి వారు. అయోధ్యలో ఎడ్లబండ్లు నడుస్తుంటే లంకలో పుష్పకవిమానం అగమేఘాలమీద పోతుంటుంది. నిజానికి లంకఎంత అత్యున్నతమైన అభివృద్ధిని సాధించిందంటే అక్కడ ఉదయం ఎనిమిదిగంటలకు కూడా స్త్రీలు మదిరాపానపు మత్తులోపడి నిద్రపోతూవుంటారు. ఇదెలాంటి జీవనవిధానమో ఆలోచించుకోవలసిందే. ఢిల్లీలో, న్యూయార్క్‌లో కూడా మనమిలాంటి సన్నివేశాలు చూడలేము. ఎక్కడైనా సాయంకాలాలు

తాగుతారు కాని పగటిపూట తాగిపడుకోరు. అసలు లంకలో శ్రమజీవులులేరు. సరికదా ప్రజల సకలసౌకర్యాలు సామ్యవాద ప్రభుత్వమే చూచుకొంటుంది. మూడు లోకాల్లోని రాజులందరూ రావణబ్రహ్మను దర్శించుకొని ఆయనసార్వభౌమత్వాన్ని మన్నించి, గౌరవించి కాన్కలు సమర్పించి వెళుతుంటారు. ఇక అష్టదిక్పాలకుల సంగతి సరేసరి. వాళ్లు రావణేశ్వరుడియింట్లో వెట్టిచాకిరీ చేస్తుంటారు.

భౌతికనాగరికత ఇంతకంటే మానవుని జీవితావసరాలను ఎలా తీర్చగలదు? ఇది మానవజీవితసమస్యలకు సరైన పరిష్కారంకాదు. ఆధ్యాత్మిక, సాంస్కృతికవిలువలే ప్రపంచాన్ని పరిరక్షించగలవు. ఈ మహావిషయాలే రామాయణంలో బహుధా నిరూపింపబడింది. ఈ సందర్భంలో ప్రఖ్యాతమనస్తత్వశాస్త్రజ్ఞుడైన సిగ్మండ్ ఫ్రాయిడ్ (sigmund Freud) "Civilisation and its Discontents" అనే గ్రంథంలో వెలిబుచ్చిన అభిప్రాయాలు పరిశీలనార్హములైనవి. "The impression forces itself upon one that men measure by false standards, that everyone seeks power, success, riches for himself and admires others who attain them, while undervaluing the truly precious things in life. And yet, in making any general judgement of this kind one is in danger of forgetting the menifold variety of humanity and its mental life. There are certain men from whom their contemporaries do not withhold veneration, although their greatness rests on attributes and achievements which are completely foreign to the aims and ideals of the multitude. One might well be inclined to suppose that after-all it is only a minority who appreciate these greatmen, while the majority cases nothing for them. But the discrepancy between men's opinions and their behaviour is so wide and their desires so manysided that things are probably not so simple."

"Culture demands other sacrifices besides that of sexual gratifications. Conflict between civilisation and sexuality is caused by the circumstance that sexual love is a relationship between two people, in which a third can only be superfluous or disturbing, where as civilisation is founded on relations between larger groups of persons. A civilised community could consist of pairs of individuals such as this, libidinally satisfied in each other and linked to all the others by work and common interests".

ఇది ఆధునిక మనస్తత్వశాస్త్రజ్ఞులదృష్టికాగా ప్రాచీన భారతీయమైన దృష్టి ఎటువంటిదో పరిశీలించుతాము. పాశ్చాత్యుల దృష్టిఎంత ఉదార భావనతో కూడినదైనా గృహస్థాశ్రమము దెబ్బతిన్నచో సంఘముయొక్క మనుగడే సమస్యాత్మకమౌతున్నది. కదా! The Idea of Personality అన్న గ్రంథములో శ్రీ P.N. శ్రీనివాసాచారి గారు యిలా చెబుతున్నారు.

"Marriage sublimates lust into love; it familiarizes sex and promotes monogamous affection and loyalty. It is the social basis for the spiritual affinities of two persons and their conjugal at-one-ment is essential to social stability. It is therefore praised as a sacrament, and it elevates animal behaviour into spiritual bond. The Pati-Patni ideal of Rama and Sita is an eternal virtue of dual-non-dual personality functioning on the religious level as Lord and Sri or the divine pair in the interests of soul-making."

"Modern life has given many artificial substitutes for the family feeling and to that extent has undermined the basis for the development of true social personality. The child is a "trailing cloud of glory" from the divine Home. It is a spark of God and as "the father of man". It can develop its infinite spiritual potentiality and virtually become the son of God. Brotherhood is both physical and spiritual kinship as all men are sons of God. Married love not only sublimates sex but is the expression of the two-sidedness of Divine creative love. Psycho-analysis only brings out the nastiness of naked lust in action and misses the spiritual side of love. Earthly parentage is a partial reflection of the tender love of the divine parents, symbolizing the unity of law and love". (pp. 34 ff)

పై అభిప్రాయంలో శ్రీనివాసాచారిగారు ఫ్రాయిడ్ సైకోఅనాలిసిస్ సిద్ధాంతాన్ని ఖండించారు. ఫ్రాయిడ్‌సిద్ధాంతంలో దంపతులకు సంతానం లేకున్నా పరవాలేదు. దాంపత్యసుఖముంటేచాలు. అనిచెప్పాడు. ఈతని సిద్ధాంతాన్ని ఈయన శిష్యుడే అయిన C. G. Jung కాదన్నాడు. రావణుని కామసిద్ధాంతం పాశ్చాత్యుడైన ఫ్రాయిడ్ సిద్ధాంతానికి దగ్గరగా వుంటోంది. శారీరక సుఖమే తప్ప దానికి పారల్యంతిక ఫలాన్నికోరడం అనుచితం అంటాడు రావణుడు. ఒక్కదాంపత్యమేకాదు. స్నేహల్లక్షణంలో కూడా రావణుని సిద్ధాంతంవేరు. బంధుత్వపద్ధతివేరు. మారీచునిపట్ల రావణుని

ప్రవర్తనమే దీనికి మంచి ఉదాహరణ. శ్రీరాముని పక్షంగా ఆలోచిస్తే గుహుడు, సుగ్రీవుడు, విభీషణుడు — రామకథాధారా గురుఘట్టభూతులైన వీరు నలుగురు తనకు సహోదరులని రాముడంటాడు. ఏకపత్నీ వ్రతం ఆయన జీవితసిద్ధాంతం. పదునాలుగేళ్ల అరణ్యవాసకాలంలో బ్రహ్మచర్యాన్ని వల్కలధారణతో అనుష్ఠించి అయోధ్య చేరినతర్వాతనే సీత గర్భవతియైనది. ఇది సీతారాముల దాంపత్యం. లవకుశుల్ని కని రాముని కప్పగించింది సీత. ఎంతటి మాతృమూర్తి! ఆధునిక నాగరకతా వ్యామోహంలోపడి యువతీయువకులు కుటుంబ వ్యవస్థను విచ్ఛిన్నంచేస్తున్న ఈకాలంలో రామాయణం ఎంతటి మహత్తర సందేశాన్ని అందిస్తోంది!

## 21. అదే ఈకాలపుసీత అయితే ఏమనివుండేది?

సీతరావణునిచేత అపహరించబడింది. ఈస్థితిలో వాల్మీకి చేసిన నిర్ణయమేమంటే ఒకసారి ఆసురీమాయకు లోనైనసీత ఏమాత్రమూ ఆర్యావర్తభూమికి చెందిన స్త్రీకాదు. ఆమె శ్రీరాముని ధర్మపత్నియే కావచ్చుకాని ఆమె ఆక్షణంనుంచి ఎంతమాత్రమూ ఈ సాంస్కృతికమైన గడ్డకు చెందిందికాదు. ఆమెకు లంకలో స్థానమివ్వవలసివుంటుంది. ఆలంక మనభారతదేశానికి దూరంగావున్నదో దగ్గరగా వున్నదో అన్నవిషయాన్ని చారిత్రక పరిశోధకులే నిర్ణయించాలి. దీనిలో ఎన్నో భేదాభిప్రాయాలున్నాయి. యథార్థంగా లంకయెక్కడిదైనా కావచ్చు లేదా వట్టికవికల్పన అనవచ్చు కాని అక్కడ కూడా సీత దూరంగా బహిష్కరింపబడి వుంచబడింది. ఇప్పుడు మనమందరంకూడా భారతదేశపు భూభాగంపైనే నివసిస్తున్నప్పటికీ బహిష్కరింపబడ్డ వాళ్లకిందేలెక్క. ఆనాడు వేదబాహ్యుల్ని మ్లేచ్ఛులన్నారు. బహిష్కరించారు! ఈనాడు మనం మనవేషభాషలవల్ల, ఆచారవ్యవహారాలవల్ల, భావనాప్రపంచం వల్ల మనల్ని మనమే బహిష్కరించుకొంటున్నాం! స్వదేశంలో పుట్టిపెరిగి విదేశీయమైనవేకదా మనం అనుష్ఠిస్తున్నాం. మనమంతా యింద్రియాలకు పట్టాభిషేకం చేసేశాంకదామరి.! "అయోధ్య" మనకికఅందుబాటులోలేదు. దాన్ని తిరిగిపొందాలంటే మనమేం చేయాలి? సీతాదేవి అవలంబించిన యోగమార్గమే మనకు శరణ్యం!

అదే ఈకాలపు అమ్మాయి గనుక సీతవున్న పరిస్థితిలో వుండి

వుంటే ఏమనేదో తెలుసా? "రాముడు చాలామంచివాడే. అందుకు సందేహంలేదు. అతణ్ణి నేనెప్పుడూ మరచిపోలేను. కాని.... ఏనేం చేసేది? ఈ రావణుడు పాపం అహోరాత్రులు నేనంటేపడిచస్తున్నాడు. అతనితో చేతులు కలిపితేమాత్రం తప్పేముంది? తప్పేనేముంది?? బ్రతుకుతెరువుఎలావున్నా బ్రతకడంముఖ్యం కదా!" అంటుంది.

రావణుని ఆదర్శప్రాయుడైన ప్రియునిగా, ప్రణయోపాసకునిగా, ప్రేమపిపాసిగా చిత్రీకరించిన ముద్దుకృష్ణగారి 'అశోకం' అనే నాటికలో రావణుడు శూర్పణఖతో యిలా అంటాడు.

"ఇది హాస్యాస్పదంగానే ఉంది. సీత హృదయం పూర్తిగా గ్రహించాను. ఆమె రాముని అణువుఅణువునా ప్రేమిస్తూవుంది. నాకే ఆనందంగలిగింది వాళ్ల అద్భుతజీవితాన్నిచూస్తే" (పుట-45) (1934).

ఈ సందర్భంలో The Reconstruction of Humanity అనే గ్రంథంలో P.A. Sorokin చెప్పినవాక్యాలు గుర్తుకొస్తున్నాయి. "Of all social institutions the good family has possibly been the most effective agency of alterism and familistic relationships. Viewed from this standpoint, the contemporary western family leaves much to be desired. It has increasingly failed in its main task; has increasingly generated the forces of egoism and demoralization". (Bharatiya Vidya Bhavan, Bombay, 1960, P. 133).

Ernest Barker అనే సాంఘిక తత్త్వవేత్త The Values of Life అనేగ్రంథంలో — The purpose and meening of life began and remain so to the end with family. It is a small but a total society. It is a unit of religion and education and mutual moral training as an economic and social unit. I wonder whether the British have understood the essential significance of the family. They have no clear notices of the family group and family obligation. Their ethics are the poorer for their lack of clear understanding of the ethics of the family, their general social philosophy is the poorer because is does not adequately reckon with the institution of the family".

మరలా, సొరోకిన్ వాక్యాలనే ఉల్లేఖించక తప్పదు. "Marriage and the family must be restored to their place of dignity among

the greatest values in human life, not to be trifled with. Thus the ennobled family will become a true consortium, the cornerstone of a new creative social order". (P-137)

## 22. శోకం – అశోకం

*"వివిధ బాధనాయోగాత్*
*దుఃఖమేవ జన్మోత్పత్తిః"* — *గౌతమన్యాయసూత్రమ్ 4-1-55*

కాని, రామునిభార్య సీత అలాంటిదికాదు. ఆమె తాను పతన మయ్యానని వెంటనే తెలుసుకొని పశ్చాత్తాపపడింది. ఇంకా అధఃప తనం కాకుండా కాలు నిలదొక్కుకొంది. గుండె చిక్కబట్టుకొని రావ ణుని కోర్కెను తిరస్కరించింది. ఉద్యానవనంలో అశోకవృక్షం క్రింద కూర్చుంది. తాను కూర్చోలేదు. రావణుడే అక్కడ వుంచాడు ఆమెను. ఎందుకు? సంస్కృతంలో "అశోకవనికాన్యాయం" అనే ఒక లౌకిక న్యాయముంది. అది దీన్నిబట్టి వచ్చిందే. రావణుడు సీతను అశోకవృక్షం కిందవుంచాడు. అతడు అశోకంకిందనే సీతనెందుకుంచాడో అంత సులభంగాతేలే విషయంకాదు. మరొకచెట్టుకిందవుంచరాదా? అశో కాన్నే ఎందుకు ఎన్నుకోవాలి?" అశోకవనికాన్యాయాన్ని రెండువిధాలుగా వివరిస్తారు పండితులు.

1. ఛాయాసౌరభ్యాలుగల అశోకవనంలో నున్నవారికి ఇతరస్థలానికి పోవా లని బుద్ధి పుట్టనట్లు, ఎవరికిని ఇష్టస్థలాన్ని విడిచిపోవటానికి బుద్ధిపుట్టదు.

2. అనేకములైన చూతాది వనాలుండగా రావణుడు అశోకవనంలోనే సీత నుంచడానికి కారణాన్ని చెప్పలేనట్లు, ఒకకార్యాన్ని నిర్వహించడా నికి సమానబలంకల పెక్కుసాధనాలుండగా వానిలో ఒకసాధనాన్ని అవలంబించడానికి కారణాన్ని చెప్పడంకష్టం.

ఇక్కడ అశోకవనమంటే ఏమిటోకాస్త ఆలోచిద్దాము. మహారాజు లకు సామాన్యంగా దేవేంద్రుని నందనోద్యానంవలె నానావిధాలైన ఫలవృక్షభరితమైన ఉద్యానవనాలు ఉంటాయి. లంకలో రావణునికి, అయోధ్యలో రామునికి ఇలాంటి ఉద్యానవనాలున్నట్లు రామాయణంలో చెప్పబడింది. యయాతికి కూడా యిలాంటి వనం గంధర్వుడైన

చిత్రరథుని కుండే ఉద్యానవనంవలే వుండేదని మహాభారతం చెబు... వ్యుత్పత్తిదృష్ట్యా విచారిస్తే 'అశోకవనం' అంటే "శోకంలేనివన... అర్థం. ఈ పై అర్థంలో రామాయణంలోనే ఒకశ్లోకం చె...

అమూల పుష్పనిచితై రశోకైః శోకనాశనైః॥
నీలాంజన నిభాః కేచిద్ తత్రాశోకాః సహస్రశః।
నందనం వివిధోద్యానం చిత్రం చైత్రరథం యథా॥

ఉద్యానవనాని కంతటికీ పేరు అశోకవనమని. కాని తర... ఉద్యానవనంలోని ఒక అశోకవృక్షానికే పరిమితమైపోయింది. ఈ...కం భారతీయ సాహిత్య ప్రపంచంలో జానపద క్రియాకలాపాల్లో అత్యంత ప్రాముఖ్యం వహిస్తూవుంది. ఈవనం సర్వాకాల సర్వావస్థల్లో... పుష్పాలతోనిండి నిత్యంవసంతఋతువులో వున్నట్లేవుంటుంది. ఆకులు రాల్చి మోడుగానిలబడివుండవు. దుఃఖాన్ని తెచ్చిపెట్టవు — ...ట్టే అశోకవనంఅని పేరుపెట్టివుంటాడు రావణుడు.

రామాయణ వ్యాఖ్యాత లెవ్వరూ ఈఅశోకవనికాంతర్గతమైన ... విశ్లేషించి చెప్పలేకపోయారు. "అంతఃపురగతం లీలోద్యానమ్" అని భూషణ వ్యాఖ్యాకారుడు చెప్పగా "ప్రమదావనమ్" అని ...కయే చెప్పినాడుకాబట్టి "మహాప్రభూణా మంతఃపురైః సహ విహారయోగ్య ఉపవనమ్" అని తిలకటీకాకారుడు చెప్పాడు. ఒక్క శిరోమణికారుడు ... "సేయ మశోకవనికా శోకనిర్వర్తికాత్వేన తదాభిదా" అన్నాడు. కాని అశోకవనంలోనే సీతనెందుకు వుంచవలసివచ్చిందో దానిప్రాముఖ్యాన్ని, అంతరార్థాన్ని ఎవ్వరూ ఆవిష్కరించలేకపోయారు.

సీతకు తన ఐశ్వర్యాన్నంతా స్వయంగా వెంటతీసుకువెళ్ళి ...పించిన రావణుడు ఆమెను ఒకమహాభవనంలో ఉంచక అశో...వనంలో ఎందుకుంచాడో కవిసమ్రాట్ విశ్వనాథసత్యనారాయణగారిలా చెబుతున్నారు. "She is not a common woman. Who is she? She must be either of two types of women. Either she must be a woman of very great ideals, being almost a Sanyasini at heart or she must be the goddess Lakshmi, herself. Lakshmi means Durga. Durga's loving abode is Asokavana. The Asoka plant, as ... be seen from the medicines prepared for menstrual diseases of women, has much to do with the sex of women. Perhaps he might have thought by her long stay in the Asokavana, breathing

the air that waves over the branches of Asoka trees, she would become sexy. Sita is placed there. Ravana kept her there."

(What is Ramayana to me? P - 37)

సీత, లంకలోని ఐశ్వర్యాన్నంతటినీ చూచికూడా నిశ్చలంగా నింపాదిగా వుండటంచూచి రావణుడు నివ్వెరపోయాడు. "ఆమె సౌందర్యం జగదేకమోహనమైంది. ఆమె సామాన్య స్త్రీకాదు. మరి, ఎవరైవుండాలి? మహా సౌశీల్యవతియై, మహాపాతివ్రత్య మహిమ గలిగి సన్యాసినీ మనస్తత్వం గల్గిన స్త్రీ అయినా అయివుండాలి. లేదా శ్రీమహాలక్ష్మి దేవి అయినా అయివుండాలి. లక్ష్మిఅంటే దుర్గ. దుర్గకు ప్రియమైన నివాసస్థానం అశోకవనం. స్త్రీ బహిష్టుసంబంధమైనవ్యాధులకు అశోక వృక్షంనుండి తయారుచేసిన మందులతో వ్యాధినివారణ కలిగిస్తారు. ఇలా ఈవృక్షం కామసంబంధిగావున్నది. రావణుడేమనుకొని వుంటాడంటే — సీతను దీర్ఘకాలం అశోకవనంలో వుంచితే ఆచెట్లమీదుగా వచ్చే గాలిని పీల్చి ఆమె కాముకురాలుగా అవుతుందని భావించివుంటాడు. వైరాగ్య సన్యాస భావాలతోవున్న సీతకాముకురాలు కావడమే రావణుడికి కావలసింది." ఇది రావణుడు సీతను అశోకవనంలోనే వుంచడానికి గల ముఖ్యకారణం.

నాదృష్టిలో శోక, అశోకాలను గురించి యిలా వ్యాఖ్యానించవచ్చునని పిస్తోంది. శోకమంటే దుఃఖం. అశోకమంటే దుఃఖరాహిత్యం. ఆనందం నుండి పుట్టిన ప్రతిజీవితంలో అట్టడుగున దుఃఖం తప్పనిసరిగావుంటుంది. అందుకే న్యాయసూత్రాల్లో గౌతమమహర్షి "వివిధ బాధనాయోగాత్ దుఃఖమేవజన్మోత్పత్తిః" అని నిర్వచించాడు. మూలభూతమైన జీవగత దుఃఖాన్ని సరిగా గుర్తించకుండా మనం దాన్ని పైపై సుఖాలచేత మభ్య పెట్టుకొంటున్నాం. శోకం జీవలక్షణం. అదే "జీవునివేదన" అన్నారు విశ్వనాథ. వాల్మీకి కరుణరసానికి మూలదుంప క్రౌంచద్వంద్వవియోగ దుఃఖం నుండి జనించిన "జీవుని వేదన"యే! అది వట్టి జీవకారుణ్యం కాదు — సృష్టిలో అంతర్వాహినిగా ప్రవహించే జీవకారుణ్యవేదన! సర్వ జీవ సమావృతమైన, నిగూఢమైన విశ్వజనీన జీవునివేదన!!

| | | | |
|---|---|---|---|
| | జీవునిది | — | శోకస్థితి |
| | ఆత్మది | — | అశోకస్థితి |
| సాంకేతికంగా చెబితే — | శోకం | — | జీవునివేదన |
| | అశోకం | — | ఆత్మానంద సంపాదన. |

"దుఃఖమభ్యాసముచేయగా దగినయట్టి యొకానొకవిద్య" అన్నారు కవిసమ్రాట్ విశ్వనాధ. భారతీయ వేదాంతంలో సుఖదుఃఖాలనే ద్వంద్వ మున్నప్పటికీ సుఖమంటే ఆనందం, దుఃఖమంటే శోకమనీ వాడబ డుతున్నాయి. మన ప్రస్థానత్రయంలో ఆనంద మీమాంస ఎక్కువ. ఆనందం అనుభవైకవేద్యం. దుఃఖం అభ్యాసం చేయదగింది. దీన్నే చెప్పారు విశ్వనాధ. ఉపాసనామతమైన మనది ఆనందవివేచన చేయగా, బౌద్ధులు దుఃఖమీమాంస చేశారు. శోకం వేరు; దుఃఖం వేరు, శోకం వైయక్తికమైనది. దుఃఖం సార్వకాలికమైనది. దుఃఖమీమాంస బౌద్ధులు పెట్టినభిక్ష! వాల్మీకిరామాయణంలో కరుణరసానికి శోకం స్థాయీభావంకాగా, కల్పవృక్షంలో శాంతరసానికి, 'తృష్ణాక్షయసుఖం' స్థాయీభావం. ఈ 'తృష్ణయే దుఃఖానికి మూలమని మొట్టమొదట చెప్పినవారు బౌద్ధులు. తృష్ణనే 'తణ్హా' (tanha) అన్నారు. దీనినే "తృష్ణాక్షయ సుఖము"గా శాంతరసస్థాయీభావంగా ఆనందవర్ధనుడు; అభినవగుప్తపాదులు అలంకార శాస్త్రానికి ఎరవుగా తెచ్చుకొన్నారు.

*"దానాని సర్వాణి చ ధర్మదానం*
*సర్వాన్ రసాన్ ధర్మరసోఽ తిశేతే।*
*సర్వా రతీ ధర్మరతి స్తథైవం*
*తృష్ణాక్షయ శ్చాఖిల దుఃఖహారీ॥*

— *ధమ్మపదం, తణ్హావగ్గం-22*

ఈ శ్లోకం ఆనందవర్ధనుని శాంతరస్థాయీభావ నిర్ణయానికి ప్రేరకం. తృష్ణాక్షయం వలన సకల దుఃఖాలు హరింపబడుననగా సుఖములభిస్తుంది కాబట్టి "తృష్ణాక్షయ సుఖము" శాంతరసస్థాయి భావంగా ఆతడు నిర్ణ యించాడు. ధమ్మపదంలోనే 'వీత తణ్హో' 'త్యక్తంచ సర్వం గలితాచ తృష్ణా' అని చెప్పబడింది. రామాయణంలో దీనికి ప్రకృష్టమైన ఉదాహ రణం రాముని వ్యక్తిత్వం. కాబట్టి వాల్మీకంలోని కరుణరసాన్ని జీవు నివేదనగాచెప్పి సర్వరసాలకు మూలమైన శాంతరసాన్ని నిరూపించాడు విశ్వనాధ. మహాభారతంలో భౌతికభోగాల వ్యర్థత్వం నిరూపింపబడగా శాంతరసంలో పర్యవసించింది.

రామాయణంలో వాలి చనిపోయాడని తారదుఃఖిస్తూ వుండగా ఆత్మజ్ఞానియైన హనుమంతుడు యిలాఅంటాడు.

*శోచ్యా శోచసి కం శోచ్యం దీనం దీనానుకంపసే।*
*కశ్చకస్యాను శోచ్యోఽస్తి దేహేఽ స్మి న్బుద్బుదోపమే॥*
*జ్ఞానస్య నియతామేవం జానానా మగతిం గతిమ్॥*
*తస్మాచ్ఛుభం హి కర్తవ్యం పండితేనేహ లౌకికమ్।*
*గతో ధర్మజితాం భూమిం నైనం శోచితు మర్హసి।*
*(కిష్కింధ 21 - 3,5,8, శ్లో.)*

"నీవు దుఃఖింపదగిన పరిస్థితిలోనే వున్నావు. కాని ఎవరికొరకు ఎవరు దుఃఖించాలి? అయితే నీవుమాత్రం దుఃఖిస్తున్నావు. జీవులకు మరణమనేది తప్పనిసరి. అది ఎలాగూ తప్పదని తెలిసిన పండితులు జరగవలసినదాన్ని గూర్చి ఆలోచిస్తారు. ఇహలౌకికమైన పరిస్థితులలో శుభాన్నిగూర్చి ఆలోచించు. ధర్మంచేత జయించబడిన ఈయుద్ధభూమిలో నీవుశోకించరాదు". మహాభారతంలో అర్జునుడు యుద్ధంచేయనని విహ్వలుడై దుఃఖిస్తూవుండగా శ్రీకృష్ణభగవానుడు, ఆత్మజ్ఞానియైన హనుమంతుడుచెప్పిన భావాలనే సరిగ్గా అనువదిస్తాడు.

*అశోచ్యానన్వ శోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే।*
*గతాసూన గతాసూంశ్చ నానుశోచంతి పండితాః॥*
*దేహినోఽస్మిన్యథా దేహే కౌమారం యౌవనం జరా।*
*తథా దేహాంతరప్రాప్తి ర్ధీరస్తత్ర న ముహ్యతి॥ (గీత 2–11, 13)*

"అర్జునా! నీవు దుఃఖింపదగిన వారికోసం దుఃఖించడంలేదు కాని, నీవు మహాప్రజ్ఞావంతునివలె మాట్లాడుతున్నావు. పండితులైనవారు బతికిన వారికోసంగాని చింతించరు. ఈదేహం బాల్యం మొదలుకొని వృద్ధాప్యం వరకు అనేకమార్పులకులోనై చివరికి మరొకశరీరాన్ని పొందుతుంది. ధీరుడైనవాడు ఈశరీరంపై మమకారం పెట్టుకోడు."

దుఃఖం క్షుద్రలక్షణం. 'క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప!' ఇక్కడ జీవగతశోకాన్ని వదలి 'అశోకస్థితి'ని అనగా ప్రజ్ఞత్వాన్ని పొందమని భగవంతుని ఆదేశం. హనుమంతుని భావంకూడా యిదే. సీతకూడా దానికోసమే యోగసాధన అవలంబించింది. సీత శ్రీరాముని నుండి పొందినయెడబాటు దుఃఖరూపంగా ఆమెలో పెల్లుబుకుతోంది. తానుచేసిన తప్పుకు పశ్చాత్తాపంతో దుఃఖం అనుభవిస్తోంది. అటువంటి శోకాన్ని ఆమెవిస్మరించి సంతోషంతో తనవైపు ఆకర్షింప బడాలని రావ

ఉడామెను అశోకవృక్షం క్రిందవుంచాడు. రావణునిదృష్టిలో శోకానికి, అశోకానికి వుండే అర్థంవేరు.

శోకం — భౌతిక శోకం

అశోకం — భౌతికానందం

మనకత్యంత ప్రీతికరమైన వస్తువు పోగొట్టుకొన్నామనుకోండి. దాని వల్ల కలిగేశోకం భౌతికశోకం. మళ్ళీ అలాంటి వస్తువే తిరిగిసంపాదించిన పుడు కలిగే ఆనందం భౌతికానందం — అని రావణుడు భావించు కొన్నాడు. రాముడు లేకపోతే నేమి? తానున్నాడు కదా! తనతోకలిసి దుఃఖాన్ని పోగొట్టుకొని ఆనందం పొందవచ్చుకదా! దాన్నే 'అశోకస్థితి' సాధించడం అనుకొన్నాడు రావణుడు. ముద్దుకృష్ణగారి "అశోకం"లో రావణుడు సీతతో ఇలా అంటాడు— "సీతా! నీవు రాముని భార్యవై నావు. కాని రాముడు నీభర్తకాడు. అతని ఆశయం ప్రజలకు ఆదర్శనీ యమైన ప్రభువు కావలెనని. అతని ఆదర్శం అతనికీ, నీకూ సుఖాన్ని కూర్చదు. జీవిత సమస్తం నీపాదాలదగ్గరపెట్టినవాడు ఈ రావణుడు. సీతా! నాకు ఈ సౌఖ్యాలతో తృప్తిలేదు. ఇంతకన్నా యెక్కువ ఏదో వున్నదనిపిస్తున్నది. ఎప్పుడూసౌఖ్యాలు అనుభవిస్తూ జీవితం అవిచ్ఛిన్న మైన ఆనందంగా, జీరలేని సంగీతంగా, అమృతప్రాయంగా గడపవలెనంటే రావణుడే తగినవాడు. నీకు జీవితంలో ప్రేమప్రధానమైతే, భౌతికజీ వితం అనుభవించడంలో అద్వితీయుడూ, తన సమస్తం అర్పించినిన్నే సర్వస్వంగా ఎంచుకొనే రావణుడే నీకు తగినవాడు." ఇదికేవలం భౌతి కదృష్టి (materialistic view). అసలు లోకంలో శోకం అనేదేలేదని ఒకవేళవున్నా దానిని భౌతికభోగాలచేత అశోకంగా మార్చివేయవచ్చునవి రావణుడు పొరబడ్డాడు. అందుకే దుఃఖిస్తున్న సీతతో యిలాఅంటాడు—

*అంచిత భోగలాలసవునప్పుడు కోరెదవేని, దృక్కులా*
*వంచిత పుష్పబాణశరవైభవ! సౌఖ్యమునందు నిన్ను వం*
*చించిన యీ రఘూత్తముని నీ మును కోతులాట యా*
*డించెద నీ సుఖంబు వికటించిన మందగు గామరోగిచే*

(*ఆరణ్య — జటాయుః - 75*)

ఇది రావణుని మనస్తత్వం. వానికి సీత భోగలాలస గల స్త్రీగా కనబడింది. ఆ లాలసను తనవైపు త్రిప్పుకొనేందుకు అశోకవనంలో వుంచాడు సీతను. కాని ఏంలాభం? తానొకటి తలిస్తే దైవమొకటి

తలచింది. శోకాన్ని విస్మరించేలా చేస్తుందని అశోకంక్రింద కూర్చొబెడితే సీతతన నైజగుణాన్నీ, శీలాన్నీ పోగొట్టుకోకుండా ఋజువుగా ప్రవర్తించసాగింది. ఎన్నో క్లిష్టపరిస్థితుల్ని సీత ఎదుర్కోవలసివచ్చింది. నిరంతరం విఘ్నాలతో ఆకర్షణలతోకూడిన భౌతికప్రపంచం ముందు సీతస్వాత్మనిష్ఠను విస్మరించక అహర్నిశలు శ్రీరామునేధ్యానిస్తూ యోగ సమాధిలో వుండిపోయింది. దీనితో రావణుడు తలక్రిందులయ్యాడు. రావణుని ఆశాసౌధం కూలిపోయింది.

ముద్దుకృష్ణగా 'అశోకం'లో చివర రావణుని వాక్యాలావున్నాయి. "సీతా! నిన్ను పొందడానికి నా బ్రతుకునూ, నాకీర్తి, నారాజ్యం, నాసమస్తం జూదమాడివేయవలెననిపిస్తోంది. సీతా! నాకేమీ తెలియడం లేదు. నీవు నాకు అర్థంకావడంలేదు. అంతా అయోమయంగా వుంది. నీ కన్నులలో సృష్టిరహస్యాల విప్పులున్నవి. సీతా! నీ యిష్టం వచ్చినట్టు నడిపించు. నీ బానిసను" అంటాడు. అప్పుడు సీత — 'ఈ శరీరం అంచులు దాటిన ప్రణయంలో రాముడా? రావణుడా? అనేప్రశ్నవుంటుందా?" అంటుంది. అదే ఈ నాటికాకర్త హృదయం. "ఇక నైనా సీతను సుఖపెట్టు రామా!" అన్నది రావణుని హృదయం.

ఇక్కడ శోక — అశోకాలనుగూర్చి మరికొంత తాత్త్వికవిచారణ చేయవలసివుంది.

"న యో హ వై తత్పరం బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి।
నా స్యా బహ్మ విత్కులే భవతి॥
**తరతి శోకం తరతి పాప్మానం** *గుహా గ్రంథిభ్యో*।
*విముక్తోఽ మృతో భవతి*"। — ముండకోపనిషత్తు *3-2-9*

ఎవడు పరబ్రహ్మను తెలుసుకొంటున్నాడో వాడు బ్రహ్మఅవుతున్నాడు. వాని వంశంజ్ఞానవంతమౌతోంది. వాడు దుఃఖాన్ని జయించి, పాపాన్ని జయించి, గ్రంధుల్ని భేదించుకొని అమృతత్వస్థితిని పొందుచున్నాడు. ఇది మహాయోగులు, సిద్ధపురుషులు పట్ల వర్తిస్తుంది. "స్వయం తీర్ణః పరాంస్తారయతి" అన్నసూక్తి వారిపట్ల అన్వర్థమౌతోంది. కాబట్టే, "తరతిశోక మాత్మవిత్" — ఆత్మజ్ఞానిశోకాన్ని తరిస్తూవున్నాడు, అని ఉపనిషత్తు చెబుతోంది. "ఆర్ద్రం జ్వలతిజ్యోతి రహమస్మి" అనుకొన్న జీవుడే, హిరణ్మయకోశంలోని నిష్కలమైన "జ్యోతిషాంజ్యోతి" యైన పరమాత్మను దర్శించి "అశోకస్థితి" నందుకొనుచున్నాడు. దానినే ఉప

నిషత్తు "అమృతము" అనిచెప్పినది.

"విశోకా వా జ్యోతిష్మతీ" అని పాతంజల యోగదర్శనం (1-46) విషయవత్ప్రవృత్తి యుత్పన్నమై — చిత్తాన్ని స్థిరపరిచే విధంగా శోకర హితమైన జ్యోతిష్మతి సంజ్ఞకమైన ప్రవృత్తి యుత్పన్నమైతే — చిత్త స్థైర్యం కల్గుతుంది. సుషుమ్నానాడి చిత్తస్థానం. ఇది జ్యోతి స్స్వరూప మైన చిత్తాన్ని సాక్షాత్కరింపజేసుకోవటం. కాబట్టి జ్యోతిష్మత్ప్రవృత్తి అనబడుతుంది. దీనిలో సూర్యాద్యనేక విషయాలున్నాయి. ఇదికూడా విషయవత్ప్రవృత్తియే. దీనిలో సత్వగుణం ప్రధానంగా వుండి రజస్తమ స్సంబంధం లేదు. దీనికే "విశోకం" అని నామాంతరం.

అట్లే అస్మిత (అహంకారం)లో కూడా సంయమస్థిరమైన చిత్తం నిస్తరంగకమైన మహాసముద్రంవలె శాంతమై, అనంతమై సత్వప్రధానమైన అస్మితామాత్ర మవుతుంది. దీన్నే అస్మితామాత్ర జ్యోతిష్మత్ప్రవృత్తి అంటారు.

కాగా, విషయవత్ప్రవృత్తియు, అస్మితామాత్ర ప్రవృత్తియునైన రెండు చిత్తసంవిత్తులును సాత్వికప్రకాశప్రచారములు కాబట్టి జ్యోతిష్మత్తులనబ డుతుంది. అందుకే ఇవిరెండూ విశోకము: లనబడుతాయి.

కాబట్టి విశోక విషయవజ్జ్యోతిష్మత్ప్రవృత్తి చేతనూ, విశోకాస్మితా మాత్రజ్యోతిష్మత్ప్రవృత్తి చేతనూ చిత్తము స్థిరత నొందుతూవుంది. సీతాదేవి అనుష్ఠించిన యోగమే దీనికి ప్రబలదృష్టాంతం.

## 23. సురేశ్వరాచార్యుల దుఃఖమీమాంస

జీవునిదుఃఖానికి మూలకారణమేమి? అని బౌద్ధుల తర్వాత బహుధా వివేచించినవారిలో సురేశ్వరులు ప్రముఖంగా మనకు కనబడుతారు. 'నైష్కర్మ్యసిద్ధి'లోను "తైత్తిరీయోపనిషద్భాష్యవార్తికం" లోను రెండు చోట్ల మొత్తం మూడువిధాలుగా ఆయనచేసిన దుఃఖమీమాంస బౌద్ధుల ప్రతీత్యసముత్పాద వాదానికి దగ్గరగావుంది. ఎక్కువ లోతులకుపోకుండా సూత్రప్రాయంగా ఈసాదృశ్యాన్ని నిరూపిస్తాను. శ్రీ శంకరులు 'అధ్యాస' అనేపునాదిపై అద్వైతవేదాంత సౌధనిర్మాణంచేశారు. ఈ పునాదికి తొలుత పాటుపడినవారు బౌద్ధులే. బ్రహ్మమునందు జీవాత్మ

అధ్యస్తమౌతోంది. ఈ ఆరోపంపేరే అధ్యాస. అధ్యాసవల్లనే జీవునికి దుఃఖం. అధ్యాసకే 'అవిద్య' అని మరోపేరు. అవిద్యవల్ల వీడిపోతే ముక్తి, మోక్షం! అవిద్యా నివారణోపాయానికే వేదాంతశాస్త్రం కంకణం కట్టుకొనింది. ఇది శంకరదర్శనం కాగా దీనిని ప్రచ్ఛన్నబౌద్ధమనడం సరికాదు. గౌడపాదులవలె శ్రీ శంకరులు బౌద్ధంనుండి కావలసినదాన్ని గ్రహించి శూన్యవాదాన్ని ధ్వంసంచేశారు. కాని సురేశ్వరులు ఒక్క అడుగుముందుకువేసి అవిద్యకంటె 'కామం' దుఃఖానికి మూలకారణ మనడం, దానికి పర్యాయపదంగా 'తృష్ణ' శబ్దాన్ని వాడడం — ఆలోచనీయమైన అంశమే!

| నైష్కర్మ్యసిద్ధి | తైత్తిరీయోపనిషత్ భాష్యవార్తికం 12, 125 | తైత్తిరీయోపనిషత్ భాష్యవార్తికం 1-7 | బౌద్ధుల ప్రతీత్య సముత్పాదవాదం |
|---|---|---|---|
| అవిద్య | అవిద్య | అవిద్య | అవిద్య |
| | | | సంస్కారం |
| అవిచారిత సిద్ధద్వైతవస్తు | X | X | విజ్ఞానం |
| | | | నామరూపాలు |
| అధ్యాస | X | విపర్యయం | షడాయతనం |
| | | | స్పర్శ |
| | | | వేదన |
| రాగద్వేషాలు | కామం | కామం | తృష్ణ |
| విహితప్రతిసిద్ధ కర్మ | ప్రవృత్తి | క్రియ | |
| పూర్వోపచిత ధర్మాధర్మం | ధర్మాధర్మం | X | |




ప్రతీత్య సముత్పాదవాదం బౌద్ధసంప్రదాయానికి సంబంధించింది. ఇక్కడ ప్రధానంగా గమనించవలసిన అంశమేమంటే సురేశ్వరుల వంటి ప్రముఖవేదాంతి దుఃఖం యొక్క మూలకారణం అవిద్యనుండికాక మరొక జనిస్థానాన్ని భావిస్తున్నారు. అది కొంతవరకు బౌద్ధులవాదానికి దగ్గరగా వుంది. వైదికవేదాంత పారిభాషిక పదాల్లో సామాన్యంగా 'తృష్ణ' అనే పదం రాకపోయినప్పటికీ సురేశ్వరులు ఈపదాన్ని చాలసార్లు ప్రయోగించారు. తైత్తిరీయోపనిషద్భాష్యవార్తికం II-19లో 'తృష్ణ'కు మూలకారణం అజ్ఞానమని ఇతరత్రా మరికొన్ని సందర్భాలలో 'తృష్ణ'కు సమానార్థకంగా 'కామం' అనేపదం వాడబడింది. తైత్తిరీయోపనిషద్భాష్యవార్తికం II-125లో కామం, అజ్ఞానం నుండి పుడుతోందని, కర్మం కోరికనుండి పుడుతోందని తెలుపబడింది. సురేశ్వరులు వాడిన 'కామ' శబ్దం, పై ప్రణాళికకు చక్కగాసరిపోతోంది. అది ఒక ఆలోచనాక్రమాన్ని కూడా సూచిస్తోంది. కామం అజ్ఞాన సంజనితమైన వస్తువేకాక కర్మకు హేతుభూతమవుతూవుంది.

'ఉపాదాన' మనేపదం సురేశ్వరులూ, బౌద్ధులూ యిద్దరూ వాడారు. బౌద్ధమతంలో ఈపదం 'తృష్ణ'కు మిక్కిలి దగ్గరగా వుంటుంది. 'భౌతికస్థితికి లగింపబడింది' అని దానికర్థం అంటే 'శరీరసంబంధమైంది' ఈసంబంధా (జీవునికి శరీరసంబంధం) నికి కారణం పూర్వోపచిత ధర్మాధర్మం (పూర్వజన్మలో సంపాదింపబడిన గుణదోషాలు). కాబట్టి సురేశ్వరుల దుఃఖమీమాంస రెండువిధాలుగావుంది.

1. అవిద్య — ధర్మాధర్మం
2. దేహోపాదానం — దుఃఖం

సురేశ్వరుల దుఃఖమీమాంస శ్రీశంకరభగవత్పాదుల బ్రహ్మసూత్ర భాష్యంచేత కూడా ప్రభావితమై వుండవచ్చు.

(1-1-4) అవిద్య — ధర్మాధర్మం — శరీరోపాదానం — సుఖదుఃఖం
(1-2-7) అవిద్య — కామం — కర్మ (నైష్కర్మ్యసిద్ధి I-1)

బౌద్ధదర్శనంలో "నాస్తి రాగసమోవహ్నిః నాస్తిద్వేషసమోకలిః।
నాస్తి స్కంధసమందుఃఖం నాస్తిశాంతేః పరంసుఖమ్॥

అని ధమ్మపదంలో సుఖవగ్గం — 6వ శ్లోకం. రూప, వేదనా, సంజ్ఞా, సంస్కార విజ్ఞానములనెడి పంచస్కంధాల సమాహార స్వరూపమే జీవుడు. ఈజీవునికి తృష్ణచేత దుఃఖం కల్గుతోంది. ఈ తృష్ణా స్వరూపాన్ని 'తణ్హావగ్గం'లో చెప్పినాడు. దుఃఖాన్ని అతిక్రమించడానికి 'తృష్ణ'ను త్యజించమన్నాడు. దానికి మార్గమేమిటో 'బుద్ధవగ్గం'లో చెప్పాడు. (శ్లో-13)

దుఃఖం దుఃఖసముత్పాదం దుఃఖస్య సమతిక్రమమ్।
ఆర్యం చాష్టాంగకం మార్గం దుఃఖోపశమగామినమ్॥

సమ్యక్‌దృష్టి, సమ్యక్‌సంకల్పం, సమ్యగ్వాక్కు, సమ్యక్కర్మ, సమ్యగాజీవము, సమ్యక్‌వ్యవసాయం, సమ్యక్‌స్మృతి, సమ్యక్‌సమాధి — ఇవి అష్టాంగమార్గములు. దీనిచే మార్గం 'విశుద్ధ' మవుతోంది. దీనినే 'విసుద్ధిమగ్గం' అన్నారు బౌద్ధులు. ధమ్మపదంలోనే 'విశుద్ధిమార్గానికి' మూలభావాలు చెప్పబడినవి. 'సబ్బేసంఖారా అనిచ్చా' (Impermanence) 'సబ్బే సంఖారా దుఃఖా' (unsatisfactoriness) 'సబ్బేధమ్మా అనత్తా' (Everything is subjected to change) అని నిరూపించబడింది. "నిర్విణ్ణోz ఖాధ భవేద్దుఃదేషమార్గో విశుద్ధయే" — బహుళమైన సంసారమునందు సంస్కారములన్నియు అనిత్యములు. వైరాగ్యమొక్కటే శరణ్యము. ఇది ఎట్లేర్పడుతుంది? అంటే.

యో హి బుద్ధం చ ధర్మంచ సంఘం చ శరణంగతః।
స సమ్యక్ ప్రజ్ఞా పశ్యత్యార్యసత్య చతుష్టయమ్॥

— బుద్ధవగ్గం-12 శ్లో

బుద్ధునకు మొట్టమొదట గోచరించిన ఆర్యసత్య చతుష్టయములివి. 1. దుఃఖము, 2. దుఃఖోత్పత్తి, 3. దుఃఖనివారణము, 4. దుఃఖని

వారణోపాయము. దుఃఖాన్ని అతిక్రమించడానికి సముదాయ, నిరోధ, ప్రతిపద, వినిగమనములు తెలుసుకోవాలి.

యోऽత్ర పుణ్యస్య పాపస్య చోభయోః సంగమాత్యగాత్।
అశోకరజసం శుద్ధం బ్రాహ్మణం తం బ్రవీమ్యహమ్॥

అని బ్రాహ్మణవగ్గం (శ్లో. 30) 'నిబ్బాణో పరమం సుఖమ్' నిర్వాణమే పరమసుఖమని చెబుతూ—

సాధు దర్శనమార్యాణాం సన్నివాసః సదాసుఖః।

అని సాధుజన సాంగత్యమే సదాసుఖమని — అదే శాంతమని చెప్పబడినది. ఉపనిషత్ ప్రోక్తమైన శోకంవేఱు. బౌద్ధుల దుఃఖ మీమాంసవేఱు. బౌద్ధ దర్శనంలో శోకాన్ని (Psycho-philosophic standpoint) మనోవైజ్ఞానిక వేదాంత దృష్టికోణం నుండి పరిశీలించారు.

రామాయణంలో అచ్చమైన వేదాంతం తెలిసిప్రవర్తించింది సీత కాగా దానికి వక్రభాష్యాలు పలికినవాడు రావణాసురుడు. జానకి మైథిలుల యింటి ఆడపడుచు. వేదాంతార్థం రక్తంలో జీర్ణించిన వంశంలో జన్మించింది. అందుకే రాముడు 'జానకీ! 'మైథిలీ' అనియే కల్పవృక్షంలో సంబోధిస్తాడు సీతను, శోకమనేదాన్ని రావణుడు అర్థంచేసికొన్న తీరుపైన పరిశీలించాముకదా. ఇక 'కామ'మనే శబ్దానికి రావణుని వ్యాఖ్యానమే వేరుగావుంది. శూర్పణఖ వాడిచెల్లెలేకదా!

చ॥ ధృత రతివాంఛ స్త్రీపురుష దేహనిబద్ధము దేహధారులన్
దితిజులదైనసృష్టి గడిదేరని మోహనిమగ్నసృష్టి యు
ద్ధతమగు కామతృప్తి యొకదారి తపశ్చరణానుకూల్య వ
ద్ధతికి నను్గ్రహించి పరితర్పణ చేయుఘు కామదేవతన్
— ఆరణ్య-దశవర్ష-130 ప.

ఉ॥ లోపల దాచిపెట్టెదరు లోకము నందున గోర్కులెల్ల స్త్రీ
లీపరమంపు గోపన మొకింతయు నింద్రియనిగ్రహంబు నా
దీ పగిదిన్ లతాంగులు మహేశ్వర! యిచ్చటనుం బరత్రహ
స్తాపతితంబు సౌఖ్యమునయందు స్వవంచితలై మెలంగుచున్
— అరణ్య-జటాయుః 27 ప.

చ॥ పురుషుడు భోగి, స్త్రీ ఎమిల భోగధరిత్రి, వానని
ర్మ్కరిసిన నైననున్ సరసికూలము తూమునుండి వచ్చు నీ
ర్వెరిసిన్నైన బచ్చపడు బ్భూయునెండలు కాసినంత బం
కరహితయౌ, ధరిత్రియును గాంతయు నొక్కటియే లతాతనూ!
— సుందర — వరరాత్ర 276 వ.

కాబట్టి జీవుడు — ఆత్మ — శరీరం — దుఃఖం వీటికి వేదాం తార్థాలు వేరు. లౌకిక భోగులైన రావణాసురుని వంటివాని భాష్యాలు వేరు.

మరి ఈదుఃఖంనుండి జీవుడు తరించేమార్గమేలేదా? దుఃఖం ఏదో ఒకవిధంగా ప్రతిజీవుడికీ అనుభవంలోకి వస్తూవుంది. ఇంతగా వివేచిం చిన వేదాంతులు దానికి పరిష్కారమార్గం చెప్పకుండావుంటారా? ఆ పరిష్కారం యిది.

రే రే చిత్త! త్వం వృథాశోక సింధౌ
మజ్జంతత్ ఉపాయం విముక్త్యై।
దేవ్యాః పాదౌ పూజయైకాక్షరేణ
తత్తేవదం సంగ్రహేణబ్రవీమ్యాం॥

అని శ్రీమత్త్రిపుర సుందరీ వేదపాద స్తోత్రం. ఇందులో వుండే వేదపాదం కఠోపనిషత్తులోనిది. "ఓయీ! చిత్తమా! నీవు శోక సముద్రంలో ఎందుకు మునిగిపోతావు? నీవు శోకాన్ని జయించటానికి నేను ఉపాయం చెబుతాను. నీకు సంగ్రహంగా ఒక అక్షరం చెబు తాను. "ఓం" అనే ఏకాక్షరంతో 'శ్రీదేవి' పాదాలను పూజించు" అని భగవత్పాదులు చెబుతున్నారు. శ్రీమద్రామాయణంలో 'సీతాదేవి' యే 'శ్రీదేవి'. ఆమెను పైవిధంగా సేవించినవాడు ఒక్క లక్ష్మణస్వా మియే. రావణుడు వక్రమార్గంలో ఆమెను కామించి మృత్యువువాత బడ్డాడు.

ప్రజ్ఞా ప్రాసాద మారుహ్య అశోచ్యః శోచతో జనాన్।
భూమిష్ఠానివ శైలస్థః సర్వాన్ ప్రాజ్ఞోఽనుపశ్యతి॥

ఆత్మజ్ఞాని ప్రజ్ఞఅనే మహాభవనము పైకెక్కి దుఃఖరహితుడై కొండ నెక్కినవాడు భూమిమీదనుండు జనుల్ని చూచేవిధంగా తాను ఆనంద మంటే ఏమిటో తెలిసికొని జీవులు దుఃఖితులని గుర్తిస్తున్నాడు.

వ్యాసభారతంలో పైశ్లోకం అరణ్యపర్వం (198-93) లోను శాంతి పర్వంలో రెండుచోట్ల (17-19) (147-11) కొద్దిపాటి భేదంతోవుంది. దీనిని తిక్కన శాంతిపర్వం (5-185) లో యిలా అనువదించాడు. కం॥ సుత నీవు సుప్రసన్నాత్మత బొంది నగాగ్రగతుడు మహీవారల జూచు-**తెఱంగున** నీ భూతప్రతతిం గనుంగొనుచు నుండు పరితృప్తుడవై. ఇంద్రియనిగ్రహముత్తమ ధర్మంబనుచు వ్యాసుడు శుకునకుపదేశించిన అంతర్యాగ ప్రకారములోనిదీపద్యం.

వ్యాసుని శ్లోకానికిమూలం బౌద్ధవాఙ్మయానికి చెందిన ధమ్మపదం లోవుంది.

పఞ్ఞాపాసాద మారుహ్యా అసోకో సోకినం పజం।
**పబ్బతట్ఠోవ భుమ్మ ట్ఠే ధీరో బాలే అవేక్ఖ॥** అప్పమాదవగ్గో ॥-8

ప్రజ్ఞాప్రాసాద మారుహ్యాऽశోకః శోకవతోజనాన్।
పర్వతస్థో యథా భూస్థాన్ ధీరో బాలానవేక్షతే॥ అప్రమాదవర్గం ॥-8

సత్యప్రవృత్తివలన వివేకియైనవాడు మిథ్యాభిమానమును బోద్రోలు చున్నాడు. అతడెపుడు నిత్యానందము ననుభవించును. పర్వతశిఖరము నెక్కిన ధీరుడు నేలమీదనున్న బాలకుని జూచినట్లు జ్ఞానప్రాసాదమధి ష్ఠించిన యావివేకి దుఃఖభూయిష్ఠమైన యీలోకమును జూచుచుండును.

# 24. సీతారాములు కేవలం భార్యాభర్తలా? లేక జీవాత్మ పరమాత్మలా?

అశోకవనంలో సీత శ్రీరాముణ్ణే ప్రతిక్షణమూ తీవ్రంగా ధ్యానిస్తూ వుంది. "దదర్శ సీతాం ధ్యాయంతీ మశోకవనికాం గతామ్" అశోక వనంలో నిరంతరం రామధ్యానంచేస్తూవుండిన అమ్మవారిని హనుమ సందర్శించినాడు. శ్రీరాముడామె నిరంతరధ్యానానికి ప్రతిస్పందించాడా అనిప్రశ్నించవచ్చు. వాల్మీకి రామాయణాన్ని జాగ్రత్తగా చదివితే ఒక విషయం తెలుస్తుంది. లంకలో జరిగిన ఒకవిషయం ప్రస్తావించిన వెంటనే అడవుల్లో రాముడెలాంటి పరిస్థితుల్లో వున్నాడో చెప్పబడుతుంది. ఇదేం తెలియజేస్తుదంటే సీతారాములమధ్య ఒక రహస్యవర్తమానం నడుస్తోందా

...స్తుంది. సీతఎంతగాఢంగా రామునికోసం ఆక్రోశిస్తుందో శ్రీరాము డంతగా పరితపిస్తూ సీతకోసం చెట్టూపుట్టా తీవ్రంగా గాలిస్తాడు. ఆయన సీతకోసం విలపించడం ఒక సామాన్య మానవుడు తనస్త్రీకోసం ఆరాటపడినట్లుగా భావింపరాదు. తనభక్తురాలైన స్త్రీని భగవంతుడెలా ఉద్ధరించడానికి సంకటపడుతాడో అదృష్టితో చూడాలి.

ఇక్కడ సీతారాములు భార్యాభర్తలుకారు. సీత భక్తురాలైన జీవుడు. శ్రీరాముడు భగవంతుడైన ఆత్మ. జంటవీడని క్రౌంచపక్షులవలె జీవాత్మ పరమాత్మలైన సీతారాములు పదమూడేళ్లు ఒకటిగా అరణ్యావాసం చేశారు. కాని రాక్షసమాయ జీవుణ్ణి ఆత్మనుండి వేరుచేసింది. ఈ ...డు క్షణకాలం ఆత్మోన్నత్యాన్ని విస్మరించి రాక్షసమాయకు లొంగి ...డం మూలాన జీవునికీ — ఆత్మకూ మధ్య పెద్ద అగాధం ...డింది. అనాదిగావస్తున్న లంకె తెగిపోయింది. ఆధునిక మానవుని ...స్థితికూడా సరిగ్గా యిలాగేవుంది. అందుకే "ఆక్రోశించెద చేతులెత్తి ...వా ఆలింపవే!" అంటున్నాడొక ఆధునికకవి. పతనమైన జీవుడు ...ంతుని కోసం పరితపించగా చిట్టచివరికి భగవంతుడు భక్తురాలిని ...ద్ధ...చటం — మకరాన్ని సంహరించి గజేంద్రుని రక్షించినట్లు — ...రణ్యకశిపుని చంపి ప్రహ్లాదుని ఆదరించినట్లు — రావణసంహారంచేసి శ్రీరామచంద్రుడు సీతను ఉద్ధరించాడు.

## ...వాల్మీకి – మిల్టన్ – విశ్వనాథ మహాకవులు – వస్తు, భావసామ్యాలు

ఆంగ్లభాషలో మిల్టన్ మహాకవి 'ప్యారడైజ్‌లాస్ట్' అనే మహాకావ్యం వ్రాశాడు. అందలి ఇతివృత్తం కొంత మనరామాయణ కథతో పోలి ...ఉంది. సీతారాముల్ని ఈవ్, ఆడమ్‌లతోను, పంచవటిని గార్డెన్ ఆఫ్ ఈడెన్ తోను పోల్చవచ్చు. ఈవ్ వ్యామోహపడి ఆడమ్‌చేత తిని ...ంచిన ఆపిల్‌పండు — సీత వ్యామోహపడి రాముని తెమ్మనికోరిన ...గారుజింకతో పోలుతుంది. మహాసర్పంగా ఈడెన్ ఉద్యానవనంలో ప్రవేశించి ఈవ్‌ను వ్యామోహపెట్టిన సాటెన్ అనేరాక్షసుడు, కపట ...న్యాసిగా పంచవటిలో ప్రవేశించి సీతనెత్తుకుపోయిన రావణాసురునితో ...్చవచ్చు.

కల్పవృక్ష మహాకావ్యంలో రావణాసురుడు పంచవటికి బయలుదేరిన ఘట్టంలోని వర్ణన — రాక్షసుడైన సాటెన్ గార్డెన్ ఆఫ్ ఈడెన్‌కు మహాసర్పాకారుడై బయలుదేరిన ఘట్టంలోని వర్ణనతో పోలుతున్నది.

"అంత రావణుండు ప్రచ్ఛన్నవేషుండు, మందురైక దేశనిద్రాణు రథ చోదకుని సభయవేగసజ్జితము, పిశాచవక్త్రఖర యుగ్యంబు రథం బెక్కి"

కం॥ పదితలల కుండలంబులు
*గదలాడిన రవలకాంతి కడలందున ని*
*ర్వది జాబిల్లి వెలుంగులు*
*పొదలినవగు వెలుగుకంబములుగా నొప్పెన్*

కం॥ పదితలలపాము క్రతుసం
*పద తూలించెడు నఘంబు బయలు వెడలెనాన్*
*మొదలిటి యసత్వదార్ధము*
*పదివివృతాస్యములతోడ బయలు వెడలెనాన్*

— *అరణ్య-మారీచ-86, 87వ*

ఇందులో 'పది తలలపాము' అన్నమాట రావణుని పదితలలను స్ఫురింపజేస్తున్నా 'పాము' 'విషజంతువు' అన్నదానికే ప్రాధాన్యం సంఘటిస్తోంది. ఎన్ని తలలున్నా పాము పామే! ఒక్కతల గల పాము భయావహమైనప్పుడు పదితలలుగల పామెంత భయానక బీభత్స వాతావరణాన్ని సృష్టించగలదో కవి మన ఊహకే వదలిపెట్టినాడు. ఇక రెండవ ఉపమానమైన 'మొదలిటి అసత్వదార్ధ'మను మాట సృష్టి ప్రారంభదశలోనే ధర్మానికి వ్యతిరేకంగా, సృష్టికి వ్యతిరేకంగా, స్థితిని వ్యతిరేకిస్తూ తలెత్తిన అధర్మాన్ని చెబుతోంది. సృష్ట్యాద్యవస్థలో మధుకైటభులిట్టివారు. వారిని విష్ణువు సంహరించినాడు. ఆ యసత్వదార్ధము సంపూర్ణంగా నశించేదికాదు. మరల మరల మొలకెత్తి స్థితికి వ్యతిరేకంగా పనిచేస్తూనేవుంటుంది. విష్ణుస్థానీయుడైన రాజు, ధర్మస్థాపకుడుకాబట్టి దానిని సంహరిస్తున్నాడు. ఈ అసత్వదార్ధ నిర్మూలనను తన కర్తవ్యంగా భావించి దానిని నిర్వహించిన శ్రీరామచంద్రుడందుకే ధర్మస్థాపకుడని పేరుపొందినాడు. ఆయనను అవతారపురుషుడనుట యిందులకే. రామకథలోని అంతరార్ధ మిక్కడనే నిక్షిప్తపరచబడినది.

ఇప్పుడు మిల్టన్ మహాకవి 'ప్యారడైజ్‌లాస్ట్' కావ్య సన్నివేశాన్ని

తులనాత్మకంగా విశ్లేషించుకొందాము. ప్యారడైజ్‌లాస్ట్ మహాకావ్యం లోని ప్రతిసర్గకు ప్రారంభంలో పీఠికాప్రాయంగా మహాకవి 'THE ARGUMENT' అనే పేరుతో కీలకమైన సన్నివేశాన్ని వచనరూపంలో విశ్లేషించి పాఠకులకు ఆ కావ్యపరనోన్ముఖులను గావిస్తాడు.

9వ సర్గ ప్రారంభంలోని 'పీఠిక'లోనే కవి చెప్పిన వాక్యాలు — సాటెన్ సర్పాకృతిని ధరించి, గార్డెన్ ఆఫ్ ఈడెన్‌లో ఉన్న ఆడమ్, ఈవ్‌లను మోసగించి, వారిచే భగవంతునిచే నిషేధించబడిన 'విజ్ఞాన వృక్ష' (Tree of Knowledge) ఫలాన్ని భక్షింపచేసిన సన్నివేశవివరణను ప్రతిపాదించినాడు. ఆ ప్రతిపాదనలో మరిరెండు సూక్ష్మమైన విషయా లున్నాయి. వానిని పాఠకుడెక్కడ విస్మరిస్తాడోనని దానిని విస్పష్టీకరించి నాడు. 8వ సర్గలో సాటెన్ ప్రచ్ఛన్నరూపంలో గార్డెన్ ఆఫ్ ఈడెన్‌ను ప్రవేశించి దేవదూతలచే కనిపెట్టబడి యిక తన కుటిలప్రయత్నం సాగదని తెలిసి నరకలోకానికి వెళ్లిపోతాడు. అప్పుడొక దేవదూత ఆడమ్, ఈవ్‌లను హెచ్చరికగా ఉండమని హితవుచెప్పి వెళుతాడు. వెంటనే విఫలప్రయత్నుడైన సాటెన్ 9వసర్గలో సర్పాకృతిలో ఆదిదంపతులను పతనము చేయుట సులభమని యోచించి, ఒక నిద్రిస్తున్న సర్పము ఖంలో తన 'అసత్‌బుద్ధితో' ప్రవేశించుతాడు. విశ్వనాథ వారిక్కడచెప్పిన మాటలు మననం చేయదగ్గవి — 'మొదలిటే యసత్ప్రదార్థము పది వివృతాస్యములతోడ బయలువెడలెనాన్' నిద్రిస్తున్న పామేదియో నోరు తెరిచియుండటం చూచి అందులో ప్రవేశించాడు సాటెన్. పాముకు నోట్లో విషం. మనిషి మాట్లేడేది నోటితో. 'అసత్ బుద్ధి'తో మాట్లేడే మాటలు పామువిషం కన్న తీయనైనవి, భయంకరమైనవి. పది వివృ తాస్యంబులన్నప్పుడు దానియొక్క దశగుణితశక్తిని పాఠకుడూహించుకోవ లసినదే. సాటెన్‌యొక్క ప్రియవాదిత్వం పరిణామ సుఖావహంకాదు. మరి, పరిణామ దుఃఖసంకులం.

*విషయేంద్రియ సంయోగాత్ యత్తదగ్రేz మృతోపమమ్॥*
*పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్॥*
*యత్తదగ్రే విషమివ పరిణామేz మృతోపమమ్।*
*తత్సుఖం సాత్త్వికం ప్రోక్తం ఆత్మబుద్ధి ప్రసాదజమ్॥*

*(గీత-18-37, 38)*

పాములు పక్షులున్ మొదటివారలు సృష్టికి మిమ్ము బట్టిప్ర
జ్ఞామిత భావనం బడిప్రజాపతి సంయతకామమున్ వ్రతో

ద్దామము సృష్టి చేసె ననుదారత దీక్షితవాదమున్ సమ
జ్ఞామలినుండవిజ్ఞుడు ప్రసక్తము కామము నేకలగ్నతన్

— అరణ్య-జటాయుః - *198* ప.

మన మందరమును గాశ్యప
ముని సంతానంబు లోకమూర్ధన్యం బీ
మన ప్రథమసృష్టి తొలియుగ
మున ధర్మము మనమె తొలగిపోవుటమేలా! — (*124* ప.)

ఇది జటాయువు రావణునికి చేసిన హితోపదేశం. ఇవి అప్రియ మైనను పథ్యము- పరిణామసుఖావహమైన మాటలు. రావణుడు ఆ మాటను పెడచెవిని బెట్టినాడు.

ఒక్క తలకేమొ పదితల, లొక్క రెండు
చేతులకు నేమొ యిరువది చేతులును,
దింత లఱువది యింతలు, నీ వివేక,
మీ బలము, జీవలక్షణ మిట్టులగునె! (ప. *128*)

అని లోలోపల జటాయువంతటివాడే ఆశ్చర్యపోతాడు.

మనకిక్కడ ప్రధానమైంది దీక్షితవాదం. "పాములు పక్షులున్ మొద టివారలుసృష్టికి" అనేవాక్యం. బైబిల్‌లో కూడ సృష్టిక్రమం చెబుతూ పక్షులు, సర్పాలు, తర్వాతనే మానవుడు సృజింపబడినట్లు చెప్పబడింది.

"ప్రజాపతి రకామయత ప్రజాఃసృజేయేతి
స తపోఽ తప్యత స సర్పాన సృజత
సోఽకామయత ప్రజాఃసృజేయేతి
స ద్వితీయ మతప్యత సవయాగ్ంస్య సృజత
సోఽకామయత ప్రజాఃసృజేయేతి
స తృతీయ మతప్యత స ఏతద్దీక్షితవాద మపశ్య
త్తమదత్తతోవై సప్రజాఽసృజత
అగ్నిష్టోమేనవై ప్రజాపతిః ప్రజాః సృజత

*దీక్షితేన వక్తవ్యో మంత్రసంఘం దీక్షితవాదః*
*యత్తపస్తప్త్వా దీక్షితవాదం సృజతి*
*ప్రజాయేవ తద్యజమాన సృజతే”*     తైత్తిరీయసంహిత *3-1.1.1.*

“పరమేశ్వరుడు ప్రజను సృజింపగోరి తపము చేయగా మొదట సర్పములు సృజింపబడెను. అనంతరము తిరిగి తపము చేయగా పక్షులు జనించెను. మూడవ పర్యాయము యజ్ఞమందు జ్ఞాతాజ్ఞాత దోషనివృత్తి కొఱకు చేయగా ప్రజలు పుట్టిరి. ఈ దీక్షితవాదమును నిర్వర్తించిన యజమాని ప్రజను సృజించినవాడే యగుచున్నాడని శ్రుతి నిర్దేశము”

మన దీక్షితవాదానికి బైబిల్ సిద్ధాంతానికి తేడా ఏమీలేదు. సృష్టిక్రమ (cosmogony) విషయంలో ఈ రెండు మతాలభావనలు సంవదించడం విశేషం!

“And God said, Let the **waters bring forth abundantly** the moving creature that hath life and **fowl that may fly above the earth** in the open firmament of heaven.

And God created great whales and **every living creature that moveth;** which the waters brought forth abundantly after their kind and every winged fowl after his kind and God saw that it was good.

And God said, **Let us make man in our image,** after our likeness and let them have dominion over the fish of the sea and over the fowl of the air and over the cattle and over all the earth and over **every creeping thing that creepeth upon the earth.”**

— *The Holy Bible, chap. I, Genesis*

బైబిలులో చెప్పబడిన భగవంతుడే మన పురాణాలలో చెప్పబడిన కర్దమప్రజాపతి.

“ససర్జ సృష్టిం తద్రూపం స్రష్టుమిచ్ఛన్ ప్రజాపతీన్”(హరివంశం-2 అధ్యాయం)

*కర్దమ ప్రథమస్తేషాం......*
*కశ్యపశ్చ మహాతేజాస్తేషా మాసీచ్ఛపశ్చిమః*

కద్రూర్నాగసహస్రం తు విజజ్ఞే ధరణీధరమ్
ద్వౌపుత్రౌ వినతాయాస్తు గరుడోఽరుణఏవచ
తస్మాజ్జాతోఽహ మరుణాత్సంపాతిశ్చ మమాగ్రజః।
జటాయురితి మాం విద్ధి శ్యేనీపుత్ర మరిందమ॥

— వాల్మీకిరామాయణం 13వ సర్గ- అరణ్యకాండ 6-33 శ్లో.

ఇది జటాయువు రామలక్ష్మణులతో చెప్పికొనిన తనవంశక్రమం. రావణునికి హితవు చెబుతూ "మనమంతా ఒక తండ్రిబిడ్డలమైయుండి, ఎన్నోయుగాలుగా జీవిస్తూ, యిలా అధర్మమాచరించకూడ"దంటాడు.

కర్దమమనగా బురద. ఇది సృష్టియొక్క రహస్యం!

ఆపః సృజంతు స్నిగ్ధాని చిక్లీత వసమే గృహే।
సాన దేవీం మాతరగ్ం శ్రియం వాసయ మే కులే॥

కౌదనము అనగా తడుపుట. జలమును తడుపునట్టి శక్తినిచ్చు దేవతయే చిక్లీతుడు. తడి యనునది జీవానికి చిహ్నం!

కర్దమేన ప్రజాభూతా మయి సంభవకర్దమ
శ్రియం వాసయ మే కులే మాతరం పద్మమాలినీమ్

— ఋగ్వేద పరిశిష్టం-శ్రీసూక్తమ్ 11, 12 శ్లో

కర్దముడు సృష్టికారకులగు ప్రజాపతులలో నొకడు. ఇతడు తన భార్యయందు సృష్టిసమస్తమును శ్రీకళయైన హిరణ్యకర్దమంగా ఉద్భవింపజేశాడు. ఇతని మహిమవల్ల సూర్యకిరణములనుండి యుద్భవించిన మరుత్తులు వాయువులైనవి. అవే సూర్యకిరణములనుండి పుట్టిన అగ్ని వలన వాయువు జలములైనవి. జలము పృథివీతత్త్వమైనది. వాయు, జల, పృథివీతత్త్వముల సమ్మిశ్రణమగు కర్దముపై (బురదపై) సూర్యకిరణములు ప్రసరించి జీవసృష్టిని కలిగించినది. ఇది యంతయు కర్దమ ప్రజాపతి ప్రభావము. ప్రకృతి శ్రీస్వరూపిణి గనుక కర్దముని సంతతిగ నుద్భవించినదని వేద, పురాణకథనము.

బైబిలు సిద్ధాంతము (Biblical conception)ను యిట్లేయున్నది.

"There went up a **mist from the earth and watered the whole face of the ground.** And Lord God formed Man, of the

**dust of the ground** and breathed into his nostrils **breath of life** and man became a living soul"

— The Holy Bible, Chap. II, Genesis

1. కర్దమం (వాయు, జల, పృథ్వీతత్త్వం — సూర్యకిరణప్రసారం)

2. Dust (mist, water, breath — God breathed into nostrils)

అనేమాటలు తుల్యార్థకములై సృష్టిక్రమాన్ని తెల్పుతున్నాయి. ఇక్కడ ఈ విషయమంతా ఎందుకు చెప్పవలసివచ్చిందంటే వాల్మీకి రామాయణంలో జటాయువు తన వంశక్రమాన్ని రామలక్ష్మణులకు తెలుపగా, విశ్వనాధవారి కల్పవృక్షంలో బహుప్రజాపతిగర్భసంభారుడు, మన్వంతరజీవియైన జటాయువు ముఖతః సృష్టిక్రమాన్ని, సృష్టిరహస్యాన్ని, సనాతనమైన మన ఉపాసనామతంలో సంఘధర్మ స్వరూపాన్ని వ్యాఖ్యానింపజేశాడు మహాకవి. రావణుడు దానిని నిర్లక్ష్యంచేసినా దానికొకస్థితి ఉండనేఉన్నది. దీనిచే రావణుని జీవలక్షణం, సాటెన్ జీవలక్షణం ఒక్కటేనని తెలియుచున్నది.

రావణుడు కూడ సీతాపహరణానికి పన్నాగం పన్ని, ఎత్తుగడతో కార్యసాధన మొనర్చినవాడే. సాటెన్‌కూడ అటువంటి వాడే. ఇద్దరూ కుటిలచిత్తవృత్తిగల క్రూర ప్రతినాయకులు. సీతనుండి రామలక్ష్మణులను వేరు చేసిన పిమ్మటనే రావణుని పన్నాగం ఫలించినట్లుగా, ప్యారడైజ్ లాస్ట్ కావ్యంలోను ఈవ్, ఆడమ్‌లు వేర్వేరు చోట్లలో ఉన్నప్పుడే సాటెన్ యొక్క దుష్టచింతన ఫలించినది. ఈవ్ తనయొక్క స్వకీయ ఆత్మస్థైర్యానికి తానే పరీక్షపెట్టుకొని ఆడమ్‌నుండి వైదొలగి ఉన్నప్పుడే సాటెన్ ఆమెను సమీపించి మానవభాషలో మాట్లాడగా, సర్పాకృతిలోనున్న దానికి మానవభాష ఎలా అలవడినదని ఆమె ప్రశ్నింపగా, మీ భగవంతుడు నిషేధించిన ఆ విజ్ఞానవృక్షఫలసేవనంచేతనే తనకీవిధంగా మానవభాష వచ్చినదనడంతో ఆశ్చర్య చకితయైన ఈవ్, జీవకోటిలో అత్యుత్తమ సౌందర్యమయము మీ మానవజాతి అని సాటెన్‌చే ప్రశంసింపబడి యుండటం స్ఫురించి మానవజాతి కింకా మహత్తరశక్తులు వస్తాయని తలంచి ఆఫలాన్నికోసి తానుతినడమేగాక అప్పుడేఅక్కడికి వచ్చిన ఆడమ్‌చేత కూడ తినిపింపజేస్తుంది. ఇది కర్మఫలభక్షణము. ఇక్కడ ఆడమ్ చిత్తప్రవృత్తి పరిశీలింపదగింది. భగవన్నిషేధితమైన ఆ ఫలభక్షణం తమ పతనానికి దారితీస్తుందని దేవదూత హెచ్చరించి యుండినప్పటికీ ఈవ్ మీది అమితమైనప్రేమవల్ల తానుకూడా పతనం కావడానికే ఆడమ్ సంసిద్ధుడైనాడని మహాకవి మిల్టన్‌వ్యాఖ్య.

"ద్వాసుపర్ణా సయుజా సఖాయా సమానవృక్షం పరిషస్వజాః
తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి అనశ్నన్నన్యోzభి చాకశీతి॥

ఋగ్వేదం, సుపర్ణసూక్తంలోని పై మంత్రానికి ఘట్టం కదా రూపమా అనిపిస్తున్నది. ఇక్కడ బైబిలులో స్త్రీపురుషద్వంద్వం ద్వైధా విభక్తమైన జీవలక్షణానికి ప్రతీక. ఆ ఫలభక్షణసమయంలో ... తుని స్మరించడం అనేది అంతరాత్మ, అంతర్యామి, అంతస్సాక్షియైన ఆ ప్రత్యగాత్మ యొక్క ఉనికిని మానవుడేనాటికీ విస్మరించలేడన టానికి ప్రత్యక్షతార్కాణ. వైదిక, బైబిల్ కథనాల్లోపాము, పక్షులు ఆదిదంపతులురాగా, రామాయణంలో క్రౌంచద్వంద్వం, జటాయువు, మాయలేడి - వీటి మధ్య స్త్రీపురుషులైన సీతారాము ద్వంద్వంపట్టింది.

బంగారులేడి వుండదని రామునికి తెలియదా? అయినాసీత కోర్కెను మన్నించి దాని వెన్నంటినాడనగా ఆమెకోర్కె ఎంత అసహజమైనప్పటికీ దాని యొక్క పర్యవసానాన్ని తానూ సమానంగా అనుభవించడానికి సంసిద్ధుడై లేడివెంటపడినాడన్నమాట! పర్యవసానం ప్యారడైజ్ లాస్ట్ లోను, రామాయణంలోను ఈ ఘట్టంలో దుఃఖమే! పతనమే!

ప్యారడైజ్ లాస్ట్ 9వసర్గ పీఠికలోని THE ARGUMENT యిలావుంది. "**Satan enters into the serpent sleeping.** Adam and Eve in the morning go forth to their labours, which Eve proposes to divide in several places, each labouring apart. **Adam consents not,** alleging the danger lest that enemy of whom they were forewarned, should attempt her found alone. Eve loth to be thought not circumspect or firm enough, urges her going apart, **the rather desirous to make trail of her strength.** Adam at last yields. **The Serpent finds her alone.... The serpent now grown** bolder with many wiles and arguments induces her at length to eat; she pleased with the taste, deliberates a while whether to impart there of to Adam or not; at last brings him of the fruit; relates what persuaded her to eat thereof. Adam, at first amazed but perceiving her lost, **resolves through vehemence of love to perish with her** and extenuating the trespass, eats also the fruit. The effects there of in them both; they seek to cover their nakedness; then fall to variance and accusations of one-another."

ప్రథమ ప్రయత్నంలో విఫలుడైన సాటెన్ రెండవసారి జరుపబోవు ప్రయత్నంలో సర్పాకృతియై కార్యసాధన మొనర్చవలెనని తీర్మానించుకొంటాడు. ఆసందర్భంలో మహాకవి మిల్టన్ వాక్యాలిలా ఉన్నాయి.

**"The serpent subtlest beast of all the field**
Him after long debate, irresolute
Of throughts resolved, his final sentence chose
Fit vessel, **fittest imp of fraud,** in whom
To enter, and his dark suggestions hide
From sharpest sight; for in the wily snake
whatever sleights none would suspicious make
As from his wit and native subtlety
proceeding, which in other beasts observed
Doubt might beget of diabolic power
Active within beyond the sense of brute
Thus he resolved." The Paradise Lost
Book - ix (lines 88 - 97)

నిద్రిస్తున్న సర్పముఖంలో ప్రవేశించిన ఘట్టాన్ని మిల్టన్ మహాకవి సుదీర్ఘంగా వర్ణించాడు. అందులో కీలకమైన కొన్ని పంక్తులివి.

"So saying, through each thicket dark or day
**Like a black mist low creeping he held on**
His midnight search, where soonest he might find.
**The serpent. Him fast sleeping soon** he found.
**In labyrinth of many a round self-rolled.**
His head the midst, well stored with subtle wiles;
Not yet in horried shade or dismal den
Nor nocent yet, but on the grassy herb
Fearless, unfeared he slept. **In at his mouth**
**The Devil entered and his brutal sense.**
In heart or head, possessing soon inspired
with act intelligential, but his sleep
Disturbed not, waiting close the approach of morn."
(Book - ix, lines 179-191)

మానవశరీరంలోని మూలాధారస్థితమైన 'కుండలిని' సర్పాకృతి గల్గినదని భారతీయ యోగశాస్త్రం చెబుతున్నది. ఊర్ధ్వప్రసరణం చేతనేదానికి

యోగసిద్ధి కల్గుతోంది. ఇలా కుండలినీ ఊర్ధ్వప్రసరణాన్ని అధోముఖం చేసిన కుటిలతంత్రం సాటెన్‌ది. దానితో మానవుడు ఉన్నతస్థితినుండి పతనమైనాడు. The serpent fast sleeping in labyrinth of many a round self-rolled" అన్నమాట మూడుచుట్టలు చుట్టుకొని మూలాధారం (labyrinth)లో నిద్రిస్తున్న కుండలినీ సర్పాన్ని ఉద్దేశించినదే నని నా భావన. ప్యారడైజ్‌లాస్ట్ కావ్యకథనుగాని, రామాయణ మహాకావ్య కథనుగాని అంతరంగా సమన్వయించేస్తూ ఆధ్యాత్మికదృష్ట్యా వివేచించి వివరింపవచ్చు. ఏ మహాకావ్యమైనా యింతే! ఆకథను భౌతిక, మానసిక, ఆధ్యాత్మిక స్థాయులలో సమన్వయించవచ్చు. సాటెన్ నిద్రిస్తున్న సర్పముఖంలో ప్రవేశించినాడనగా అర్థమేమి? ఈవ్‌లో స్త్రీసహజమైన కోర్కెను, యుక్తాయుక్త విచక్షణ జ్ఞానరహితంగా ప్రవర్తించే ఒక చాపల్యాన్ని క్రొత్తగా రేకెత్తించి, దానికి పురుషుణ్ణికూడా లోను గావించడంగా పరిణమింపజేయడం. ఫలభక్షణాపేక్షకు తాను లోనుకావడమేగాక, ఆడమ్ చేతకూడ దానిని తినిపింపజేయడం అట్టిది. 'ఆశాపాశము దాగడున్నిడువు లేదంతంబు....'' అని పోతనామాత్యులన్నట్టుగా ఆకోర్కెసంభోగజనితసుఖాభిలాషకు దారితీసి ఆనందమయమైన, భగవన్నిష్ఠమైన స్వర్గధామం నుండి ఆదిదంపతులు ఇంద్రియలోలురై చెడి పతనమైనారు.

కం॥ *బ్రాహ్మణు డింద్రియవశగతి*
*జిహ్మచరణై కనిపుణచిత్తజనిశితా*
*జిహ్మగములపాలై చెడు*
*బ్రహ్మానందాదిరాజ్యపదవీచ్యుతుడై* (2-60)

అని అల్లసానిపెద్దనామాత్యులవారు 'మనుచరిత్ర'లో వరూధినీప్రవర ఘట్టంలో చెప్పినమాటలిక్కడ అనుసంధించుకొంటే బ్రహ్మభావనిష్ఠుడైనవాడు బ్రాహ్మణుడు అని, వాడు కోర్కెలకు దాసోzహమనినప్పుడు, కాముని బాణములచే కొట్టబడి పతితుడై, అనశ్వరమైన, శాశ్వతమైన బ్రహ్మానందాధిరాజ్యపదవినుండి భ్రష్టుడై చెడిపోతున్నాడని మహాకవి ప్రవరుని ముఖతః చెప్పించడం - యిక్కడ ప్యారడైజ్‌లాస్ట్ (స్వర్గచ్యుతి) మహాకావ్యేతి వృత్తానికంతటికీ వ్యాఖ్యాప్రాయమైన పద్యంగా చెప్పవచ్చును.

'పదితలల కుండలంబులు' అనిపై పుటల్లో చెప్పబడిన కల్పవృక్షమందలి కందపద్యం, రావణుని భౌతిక సంపదయొక్క ఆకార పటాటోపాన్ని చెప్పగా, 'పదితలలపాము' అని వెంటనే వచ్చిన పద్యం ఆధ్యాత్మిక లేదా తాత్త్వికదశలో నిదానం లేదా ప్రతీక (symbol)ను సృష్టిస్తోంది.

ప్రాపిత శోకాగ్ని శిఖా
వ్యాపారముగాగ దిశల బరువులు వెట్టెన్

— అరణ్య-జటాయుః-218వ

ఇవిగాక, అప్రధాన విషయాల్లో మహాకావ్యాంతర్గత శైలి, (epic grandeur) వర్ణనల్లో గాఢతమిస్రవర్ణన వాల్మీకి రామాయణంలో కంటె, కల్పవృక్షంలో సీతను రావణుడు చెఱపట్టినఘట్టంలో కవి మహోన్నత స్థాయిలో మహాకావ్యశైలికి నికషోపలంగా తీర్చిదిద్ది ఉన్నాడు.

ఇంత తమస్సాహిత్యము గల్గన్
శాంతము సత్త్వము సాగుట యున్నే
ఇంత తలంచిన నేనును గానే
యింతుల కౌనె యొకింతలు చూడన్ (234. వ)

అరయ దమోగుణ మద్ది యభివృద్ధి నందినకొలది
ధరణిలో దక్కువయగును ధర్మంబు, తద్గతబుద్ధి
పరలోకములదైన సర్వభావంబు పాడ్వడున, తదు
పరి నంధతమసావృతంబ బ్రధ్నాంశు పటలతప్తంబ (240 వ.)

**'అంధతమసంబు' 'ఆదిమాసురశక్తి'**
**'అచ్ఛతమము వెట్టురూపు' 'చీకటి మొదటిముద్ద వెలుగు ముట్టుకోదు'**

అసూర్యానామతే లోకా అంధేన తమసావృతాః।
తాంస్తే ప్రేత్య అభిగచ్ఛంతి యేకే చాత్మ హనోజనాః॥

"అంధతమస్సుచే నావరింపబడిన అసూర్యనామలోకములకు ఆత్మ హంతలగువారు మరణించి చనుచున్నారు" అని ఈశావాస్యోపనిషత్తు.

గీ॥ స్త్రీలను జెఱపట్టుటన్నను చెంగలించు
చక్కటా! దొంగచాటుగా బ్రాణములను
తీయుటన్నను వారికి దెచ్చికొన్న
ప్రథమగుణములు తల్లిగర్భమున నుండి (280 వ.)

ఇందులో చివరిపద్యం మరింత కీలకమైంది. రావణుని తల్లి

పేరు కైకసి. ఆమెభర్త విశ్రవసువు. కైకసి అసుర సంధ్యవేళ భర్తయెంత వారించినప్పటికీ వినక బలవంతంచేయడంతో విశ్రవసువామె కోర్కెను తీర్చాడు. స్త్రీకామప్రాధాన్య విపక్షచేతను, అసురసంధ్యవేళ యగుట చేతను రావణగతకాముకత్వం మిన్ను ముట్టింది. స్త్రీలను చెఱపట్టడం, దొంగచాటుగా ప్రాణాలుతీయడం అనేరెండు దుర్లక్షణాలు అసురుడైన రావణుడు తల్లిగర్భంనుండి పుట్టుకతో తెచ్చికొన్న గుణాలని కవి వ్యాఖ్యానించినాడు. 'ఇంతటి తమస్సాహిత్యము కల్గన్' అన్నపద్యంలో ఈనాటి సంప్రదాయేతర సాహిత్యసృష్టిలో వెలుగుకంటే తమస్సే ఎక్కువని కవి ధ్వనింపజేస్తున్నాడు.* మిల్టన్ ప్యారడైజ్ లాస్ట్ రెండవసర్గలో sin, deathల సన్నివేశాన్నీ, వీరు నరకలోకద్వారపారకులై ఉండగా సాటెన్ వారి అనుమతితో గాఢతమిస్ర లోకానికి (chaos) ప్రయాణమైన సన్నివేశాన్ని సుదీర్ఘంగా వర్ణించాడు.

'Before their eyes in sudden view appear
The secrets of the hoary Deep -a dark
Illimitable ocean, without bound
without dimension; where length, breadth, and hight
And time and place are lost; where eldest Night
And **chaos**, ansestors or Nature, hold
**Eternal anarchy, amidst the noise**
**of endless wars and by confusion stand."** (Book - II)

సాటెన్‌ను 'like a black mist low creeping he held on His midnight search" (Book - ix) అనివర్ణించడంలో మహాకవి మిల్టన్ మహాకావ్యత్వసిద్ధిని (epic grandeur) సంపూర్ణంగాసాధించాడని, కల్పవృక్ష కర్త మిల్టన్ అడుగుజాడల్లో నడవకపోయినా ఆస్థాయిలో సన్నివేశాన్ని చిత్రీకరించాడని మహాకావ్య వాతావరణసృష్టి చేసినాడని చెప్పవచ్చును.

---

* అతినవ్యకవి పఠాభి (తిక్కవరపు పట్టాభిరామరెడ్డి) వ్రాసిన 'సీత' అనే వచనగేయం చదివితే ఈనాటి సాహిత్యంలో తమస్సు ఎంత వుందో తెలుస్తుంది. 'ముద్దుకృష్ణ' కంటే మూడుమెట్లు ముందుకుపోయి అతి వేలమైన కాముకత్వాన్నే 'ప్రేమ'గా, ప్రణయంగా చలామణీ చేయాలనే ధోరణి కనబడుతుంది పఠాభికవిత్వంలో. దీన్ని సాహిత్యం అనడంకంటే తమోమయ కవిత్వం, అనడం సరియైంది. ఏది తమోమయమో అదే అయోమయం (Chaos and confusion). విశ్వనాథసాహిత్య సృష్టి వెలుగుతోకూడినజ్ఞానం. (light with wisdom).

పై పోలికలన్నీ కొంతవరకు సరియైనవే. ఎందుకంటే, మనిషిని నైతికంగా పతనంచేసినా, పతివ్రతను తాకి ఎత్తుకుపోయినా ఒక్కటే. రాక్షసుడైన సాటెన్ — ఆడమ్, ఈవ్‌లను భగవంతుని ఆనంద సామ్రాజ్యం నుండి తన వ్యామోహ సామ్రాజ్యంలోనికి లాగి పతనంచేశాడు. ధర్మసహితదాంపత్యజీవితవిధానానికి, వనవాసవ్రత దీక్షా జీవితానికి ప్రతీక మైన లక్ష్మణరేఖనుదాటి సీత రావణుని చెంగట నిలిచినట్లు. ఈపతనం నుండియే పశ్చాత్తాపం. జీవుని గాఢవేదన ఆవిర్భవించింది.

కదలనిది సుఖము, వీచికలులేవు, కలయనుభూతి
యది యున్నదోలేదో, యనగ ననిపించునది యతితనువు
కదలి గగ్గోలు పెట్టించి, కాయమ్ము కలగుండుపెట్టి,
యెదచీల్చి, మనసునుద్రీల్చి, ఈమేను నేర్చుదుఃఖమ్ము!

— అరణ్య-జటాయుః - *214* వ.

ఆ యాపిల్ పండు తినరాదని, దానివల్ల అనర్థం, దుఃఖం కల్గుతుందని భగవంతుడు ఆదేశించిన మాటల్ని ఆడమ్‌జ్ఞాపకంచేసి ఎంత వారించినప్పటికీ, దానవ మాయావ్యామోహితురాలైన ఈవ్ దానినెంతమాత్రం విన్పించుకోక చివరకు ఆడమ్ కూడా దాన్ని అరగించేట్లుగా బలవంతంచేసింది. కాంతాసమ్మితమైన ఆకోర్కెకు పురుషుడు దాసుడైనాడు. సీత బంగారుజింకను తెచ్చిపెట్టమన్నది. రామలక్ష్మణు లిద్దరూ ఆమెను ఎంతగా వారించినారో, అది చివరకు రాక్షసుడే కావచ్చునని ఎంత వాదించినారో — కాని సీతపట్టిన పట్టు విడువనేలేదు. రాముణ్ణే పంపినతర్వాత, తనకు తోడుగా నిల్చిన లక్ష్మణుణ్ణే నిందించి జింకవద్దకే తరిమింది. తాను రావణునికి పట్టుబడింది. స్త్రీబుద్ధి ప్రళయాంతక మని అందుకే అంటారు. రావణుడు సీతను స్పృశించి తొడపై కూర్చుండబెట్టుకొని లంకచేరాడు. పరపురుషస్పర్శ ఒక్కటేచాలు! ఇది భారతీయదృష్టితో శీలపతనంతో సమానం. ఇక్కడ సీత నిస్సహాయురాలు! కాని, సుందరకాండలో సీతను హనుమంతుడు తన వీపుపై తీసుకువెళతానంటే ఆసూచన తిరస్కరిస్తుంది! రెండింటా సమానత్వమెక్కడ వున్నదంటే ఈవ్, సీతలు భౌతిక వస్తువును చూచి వ్యామోహపడి వాంఛించడంలో.

వాంఛతో పతనం ప్రారంభమవుతుంది. దానికి అంతులేదు. ఒక భౌతిక వస్తువును చూచి అది తనది కావాలని కోరుకోవడంలో పత

నముంది. కష్టనష్టాలున్నాయి. కోరకపోవడంలో విరక్తి ఉంది. వైరాగ్యముంది. ముక్తి ఉంది. విడుదల వుంది. బౌద్ధమత సిద్ధాంతం కూడా యిదే. ఆత్మానందసామ్రాజ్యం కోల్పోవడమే స్వర్గచ్యుతి (Paradise Lost). జీవాత్మ, పరమాత్మల సమన్వయాన్ని సాధించి భగవంతుని కృపకుపాత్రం కావడమే స్వర్గసంపాదన (Paradise Regained) అని మిల్టన్ వ్యాఖ్య. అక్కడ భగవంతుని కుమారుడు మానవుల నుద్ధరించాడు.

ఇక్కడ శ్రీరామావతారమెత్తిన విష్ణువు జీవులనుద్ధరించాడు. అక్కడ యాపిల్ పండు స్త్రీపురుష సంగమజనితమైన భౌతిక సుఖానికి సంకేతం. జిహ్వాచాపల్యంచేత జీవుడు స్వాదుఫలాన్ని ఆస్వాదించడానికి వాంఛించేటట్లు అంతరాంతరాల్లో అజ్ఞాతంగా దాగిన కామవాంఛ, వస్తువ్యామోహమనే ముసుగుతో అందంగా బయటపడి చివరికి అది స్త్రీపురుష సంగమంతో అధఃపతనానికి దారితీస్తున్నది. రెండూ అజ్ఞాన జనితాలైనకర్మలే. 'నాల్కదాటితేనరకం' 'సుఖంవెంటనే దుఃఖం' — ఇది అనుస్యూతమైన, ఎడతెగని లంకె.

ఆత్మస్థానీయమైన స్వర్గశ్రీ నిర్మలానందాన్ని తీసివేసి, దానిస్థానే భౌతికసుఖాన్నిపెట్టి, అదే [illegible]మైన ఆనందంగా భ్రమింపజేసి దుర్వ్యాఖ్యానంచేశారు సాతాన్ — రావణాసురులు. భ్రమయేదో, ప్రమయేదో, సత్యమేదో, అసత్యమేదో, ఆనందంయొక్క అసలుస్వరూపమేదో భగవంతుడిచ్చిన వెలుగుతోకూడిన విచక్షణ జ్ఞానంతో మీరే నిర్ణయించుకోండి! అంటున్నారు ప్రాచ్య పాశ్చాత్య మహాకవులైన వాల్మీకి — మిల్టన్ విశ్వనాథ మహాకవులు.

# 26. మనస్సు చేసే కోతిచేష్టల్ని మానవుడు నియమించాలి

మానవునిలోగల ఆధ్యాత్మికానుభూతి రావణుడనే బహిర్ముఖత్వం గల పదితలల రక్కసిని నామరూపాలు లేకుండా నశింపజేయగలదు. రామాయణంలో సేతుబంధనమనే మహాకార్యం కోతులదండు చేతనే ఎందుకు చేయించాలి? అనిప్రశ్నిస్తే, శాస్త్రచదువుకొని ఆలోచనాజ్ఞానం గలవాడు ఇక్కడ కోతులు అనేమాట దేన్ని ఉద్దేశించి చెప్పబడిందో గ్రహించగలడు. కోతికి సహజలక్షణాలు రెండు. 1. అస్థిరత్వం, 2.

చంచలత్వం. మానవుని మనస్సెంత చంచలమైందో హేళనచేస్తూ ప్రాచీనులొక శ్లోకం చెప్పారు.

కపి రపిచ కాపిశాయన మదమత్తో వృశ్చికేన సందష్టః।
అపి చ పిశాచ గ్రస్తః కింబ్రూమ స్తస్య వైచిత్ర్యమ్॥

అసలే కోతి. అందులో మనోవైకల్యాన్ని కల్గించే కల్లు త్రాగింది. ఈఅవస్థలోదానికి తేలుకూడాకుట్టింది. అదీచాలక పిశాచం ఒకటి పట్టింది. ఇక దాని చాంచల్యానికి తక్కువేమిటి? దీనికర్థమేమి? "చంచలం హి మనః కృష్ణ!" అని అర్జునుడు గీతలో మొరపెట్టుకొన్నప్పుడు "ఇంద్రియాణా మనశ్చాస్మి, భూతానామస్మి చేతనా" ఇంద్రియాలలో మనస్సునూ, భూతములలో చైతన్యశక్తినీ నేనే అని భగవంతుడన్నాడు. అర్థంకాలేదన్నాడు అర్జునుడు. అప్పుడంటాడు కృష్ణుడు—.

అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయిస్థిరమ్।
అభ్యాస యోగేన తతో మామిచ్ఛాప్తుం ధనంజయ॥ *(12-9)*

"ధనంజయా! నాయందు మనస్సు స్థిరంగా నెలకొల్పడానికి సాధ్యంకాకపోతే అభ్యాసయోగమువలన నన్నుపొందడానికి ప్రయత్నించు" అన్నాడు. ఈ మాటలు పాతంజల యోగసూత్రాల్లోని—

"యోగ శ్చిత్తవృత్తి నిరోధః అభ్యాస వైరాగ్యాభ్యాం తన్నిరోధః"

అన్నమాటలతో సంవదిస్తోంది.

కాబట్టి మానవుని మనస్సేకోతి. ఇంద్రియాలు బాహ్య ప్రసరణాలై నిర్మింపబడియుండడం వలన బాహ్యజగత్తుకే ప్రాధాన్యంకలిగి ఆంతర జగత్తును గుర్తించడం కష్టమౌతున్నది. ఈ మనస్సనేకోతి ఒకచోట స్థిరంగా వుండదు. ఒక కొమ్మనుండి మరోకొమ్మకు ఒకచెట్టు నుండి మరోచెట్టుకొమ్మపై కూర్చుంటుంది. కూర్చున్న ఒక్కక్షణం ఊరకుండదు. ఒళ్లంతాగీరుకోవడం ప్రారంభిస్తుంది. ఈవిధంగా క్షణకాలం స్థిరంగా ఉండక శాఖాచంక్రమణం చేస్తూవుంటుంది. కాబట్టేకోతిని శాఖామృగం అన్నారు. ఒకవిషయం నుండి మరోవిషయానికి, అక్కడి నుండి మరోదానికి ఎలాంటి సంబంధం లేకుండా మాట్లేడే ధోరణికి శాఖాచంక్రమణన్యాయం అంటారు సంస్కృతంలో.

మానవుడు సత్సంకల్పంపై బుద్ధినికేంద్రీకరించి, వికల్పాలను, విఘ్నా

లను మనోసంయమనంచే అరికట్టాలి. అందుకే, శ్రీశంకర భగవత్పా
దులవారు శివానందలహరిలో యిలాఅన్నారు.

శ్లో॥ సదా మోహాటవ్యాం చరతి యువతీనాం కుచగిరౌ
నటత్యాశా శాఖా స్వటతి ఝడితి స్వైర మభితః।
కపాలిన్! భిక్షో! మే హృదయకపి మత్యంతచపలం
దృఢంభక్త్యా బద్ధ్వా శివ! భవదధీనం కురువిభో!

ఈశ్లోకానికి ఆధునిక యుగంలోని యిద్దరు ప్రసిద్ధ మహాకవుల అను
వాదాలను చూపుతాను.

1. విశ్వనాథ సత్యనారాయణ (1985 – 1976)
2. తుమ్మలపల్లి వేంకటరత్నం (1909 – 1936)

సీ॥ మోహాటవి జరించు ముగుదల కుచగిరి
నెత్తమ్ము లందున నృత్యమాడు
ఆశా మహాశాఖలందు భ్రమించు బు
త్రు లటన్న ఫలముల రుచి మెలంగు
నోయి కపాలి! భిక్షూ! యీమనస్సన్న
చపలాతి చపలంబు కపివరంబు
భక్తి పేరిట రజ్జు బంధంబునం గట్టి
నీయధీనంబున నిలువుకోవె!

తే॥గీ॥ బాలచంద్రమః శేఖర! పర్వతేంద్ర!
దుహితృ తేజఃకుటుంబి! నిర్ధూతకలుష!
పశుపతీ! పల్పు త్రెంచుక పారిపోవు
పశుల బంధములుంచి కాపాడుమయ్య!

(శ్రీ విశ్వనాథవారి త్రిశూలనాటకము)

మ॥ నిరతంబున్ తరుణీ కుచాద్రులవయిన్ నిద్రించు మోహాటవీ
పరతృష్ణా తరుశాఖలం దగిలి నృత్యంబాడు నాచిత్తవా
నరమున్ భక్తిలతా నిబద్ధమయి యుండంజేసి, భిక్షార్థమై
యరిగేటప్పుడు వెంటబెట్టుకొని పోవయ్యోయి భీమేశ్వరా!

(శ్రీ తుమ్మలపల్లివారి భీమేశ్వరస్తవము)

# 27. తృష్ణాశబ్ద వివేచన

శ్రీ శంకరభగవత్పాదుల వారిని 'ప్రచ్ఛన్న బౌద్ధులని', 'మాధ్యమికస్య అవరావతారః' అని ద్వైత, విశిష్టాద్వైతులు పిలవడానికి ప్రబలహేతువుల్లో 'తృష్ణా' శబ్దాన్ని బౌద్ధదర్శనం నుండి అద్వైతులు గ్రహించడమేగాక, పై శ్లోకంలోని భావం బౌద్ధవాఙ్మయంలో కనబడుతోంది.

మనుజస్స పమత్త చారినో తణ్హా వడ్ఢతి మాలువా వియ।
సో ప్లవతి హురాహురం ఫలమిచ్ఛంzవ వనంస్మి వానరో॥

— ధమ్మపదం - తణ్హావగ్గో-*24-1*

అజాగరూకుడైనవాని తృష్ణ మాలువా తీగలాగా అల్లుకొంటుంది. అడవిలోని అన్నిచెట్లపండ్లనుకూడా రుచిచూడాలనే తృష్ణతో కోతి ఒక చెట్టుకొమ్మనుండి మరోచెట్టుకొమ్మకు దూకేటట్లుగా తృష్ణకులోనైన జీవుడు పుట్టువుల పుట్టలోపడి కొట్టుమిట్టాడుచున్నాడు.

'మాలువా' అనేదొక లతయొక్క పేరు. ఈ తీగ వృక్షాన్ని పూర్తిగా అల్లుకొని కప్పివేస్తుంది. దీని ఆకులు పుటాకారంతో ఉంటాయి. వర్షం కురిసినప్పుడు ఈ ఆకులు జలభరితాలై దాని బరువుచే ఎంతగొప్ప చెట్టునైనా కూకటివేళ్లతో పెళ్లగించి భూపతనమయ్యేటట్లు చేస్తాయి. అంటే తృష్ణకు దాసుడైనవాడు ఇలా పతనమై పోతాడని ధ్వని. వాల్మీకి రామాయణంలో చివరకు భూపతనమైన రావణాసురుడు మనకి క్కడ స్ఫురిస్తున్నాడు. రావణుడు భూమిని కౌగిలించుకొన్నాడని వాల్మీకి యుద్ధకాండలో వర్ణించాడు.

కోర్కె లేదా తృష్ణ (thirst or craze)ను 'మాలువా' అనే అతి ప్రమాదకరమైన తీగతో పోల్చాడు బుద్ధుడు. అత్యంత చపలమైన నరుని మనస్సును శాఖాచంక్రమణం చేసే వానరంతో పోల్చాడు. తృష్ణా, మోహాలనే తీగలను ప్రజ్ఞాకురారంతో ఛేదించమన్నాడు. శ్రీ శంకరులు మాలువాతీగ ప్రసక్తిని వదలి, "జీవుని అత్యంత చపలమైన హృదయ కపిని భక్తి అనే సూత్రంచే బంధించి నీ అధీనంలో వుంచుకోవయ్యా!" అని శివునితో మొఱపెట్టుకున్నాడు.

శ్రీశంకరుల ప్రధానశిష్యులలో ఒకరైన సురేశ్వరాచార్యులు, తైత్తిరీయోపనిషద్భాష్యవార్తికము (II-19) నైష్కర్మ్యసిద్ధి (II-6; III-48); సంబం

ధవార్తికమ్ (శ్లో. 303) లో 'తృష్ణా'శబ్దాన్ని వాడారు. సంసారంపై విరక్తితో, సన్యాసంతో తృష్ణను సమూలంగా నాశనం చేస్తేనే ముక్తి అన్నారు. ఈ 'తృష్ణ' 'భౌతికతృష్ణ' కాక ఆధ్యాత్మిక తృష్ణ (Spiritual longing) అయినప్పుడే ఛాందోగ్య, బృహదారణ్యకోపనిషత్తుల్లోని అద్వైత మహావాక్యాలు అనుభవంలోకి వస్తాయి.

ఉపనిషత్తుల్లోను, గీతలోను 'తృష్ణా' శబ్దం ప్రయుక్తం. 'తృష్ణాం క్షమాం చహిత్వా' అని అథర్వశిరోపనిషత్తు-5, 'సమ్మోహమాళీ తృష్ణే ర్యాకుండలీ' అని మైత్రాయణోపనిషత్తు (6-28). భగవద్గీతలో

*రజోరాగాత్మకం విద్ధి, తృష్ణా సంగసముద్భవమ్।*
*తన్ని బధ్నాతి కౌంతేయ కర్మసంగేన దేహినమ్॥* (14-7)

కౌంతేయా! రజోగుణానికి రాగం లేక అనురాగం ముఖ్యలక్షణం! దీనినుండి తృష్ణ జన్మిస్తోంది. ఇది దేహిని కర్మప్రవృత్తియందు బంధిస్తోంది! 'మన యేవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః' 'బలవానింద్రియగ్రామో విద్వాంసమపికర్షతి' అన్న గీతాకారుడు కూడ కర్మబంధానికి 'తృష్ణ' కారణమని అంగీకరిస్తున్నాడు. రావణుడు గొప్ప విద్వాంసుడే. కాని, అతని మానసం అమితతృష్ణాలసమైంది. సుఖాలు జుర్రుకోవాలనుకొనే రావణుడు యింద్రియనిగ్రహం లేనివాడు. ఈ భావాన్నే బుద్ధుడు కూడా ధమ్మపదంలో మరలా 'మాలువా' తీగనే ఉపమానంగాతెచ్చి యిలాచెప్పాడు.

*యస్స అచ్చంత దుస్సీలం మాలువా సాల మివోతతం।*
*కరోతి సో తథత్తానం యథానం ఇచ్ఛతీ దిసో॥*

— *అత్తవగ్గో(ఆత్మవర్గః) 12-6*

మాలువా తీగలు సాలవృక్షం నిండుగా ప్రాకి దానికొమ్మలను వంచి వేసేటట్లుగా, దుస్స్వభావం నానాటికి పెరిగి మనుజుని నెత్తికెక్కి వానిని అణచివేస్తుంది. అప్పుడు కదా నరుడు దానిని శత్రువని తెలుసుకొంటున్నాడు!

మహాభారతం - అనుశాసనిక పర్వంలో శివుడు పార్వతికి బోధించిన ధర్మరహస్యం యిలావుంది.

*రమణీ! తృష్ణాసమ దుః*
*ఖమును, బరిత్యాగసమ సుఖము గలవే! కా*
*యము ముదిసిన ముగియదు ప్రా*
*ణము గొనిపోజాలు తెవులనం జను దృష్ణన్*

*కామ రసమున నతితృష్ణుడై మనుష్యు*
*డర్థ తృష్ణా పరీతాంతరంగుడైన*
*గొఱియ నడవిలో నెత్తెడు కోలుపులియు*
*బోలె మృత్యువాతని గొనిపోవు దేవి!* *(5-232, 235)*

'పొత్తినూలి ప్రుచ్చట్లు తాన తనకు బంధంబొనరించుకొనువాడు వాస పుడైనా సుఖము పొందజాల'డన్నాడు (5-230) శివుడు. ఈ భావమే శాంతిపర్వంలో వసిష్ఠజనకరాజ సంవాదక్రమంలో చూడవచ్చు.

*తనకు దాన బంధ మొనరించుకొనియెడు*
*పొత్తినూలికాయ పురువు భంగి*
*నగుణమయ్యు నగుణతావాప్తి బొందు న*
*క్షరము ప్రకృతి గుణము సంక్రమించి* *(6-19)*

సరిగ్గా యిలాంటి భావాన్నే బుద్ధుడు ధమ్మపదంలో వ్యక్తీకరించి నివృత్తినికూడ సూచించి యున్నాడు.

*యే రాగరత్తాను పతంతి సోతం*
*సయం కతం మక్కటకోఽవ జాలం।*
*ఏతం పి ఛేత్వాన వజంతి ధీరా*
*అనపేక్ఖినో సబ్బ దుఃక్ఖం పహాయ॥* — తణ్హావగ్గో *(24-14)*

సాలీడు (మక్కటక - మర్కటక) తానల్లిన గూటిలోనే తిరుగు చుండునట్లు కామానికి లోగినవాడు తృష్ణాప్రవాహంలో పడి కొట్టుకొని పోతాడు. ప్రజ్ఞావంతులు కామాన్ని ఖండించి తృష్ణాప్రవాహాన్ని ఎదురీది దుఃఖవిముక్తిని పొందుతారు."

వ్యాసమహర్షి ఈ భావాన్నే ప్రపంచించి యిలా చెప్పారు.

కామబంధనమేవైకం నాన్యదస్తీహ బంధనమ్।
కామబంధన ముక్తోహి బ్రహ్మభూయాయ కల్పతే॥
కామతోముచ్య మానస్తు ధూమ్రామ్రాభ్రాదివ చంద్రమాః।
విరజాః కాలమాకాంక్ష్యన్ ధీరోధైర్యేణ వర్తతే॥
క్లేదనం శోక మనసోః సంతాపః తృష్ణయా సహ।
సత్వమిచ్ఛసి సంతోష చ్ఛాంతి లక్షణ ముత్తమమ్॥
**విశోకో నిర్మమః శాంతః ప్రసన్నాత్మాత్మ విత్తమః**

శాంతిపర్వం — *12-243-7,8,11,12*

ఇంద్రియ నిగ్రహం ఉత్తమధర్మమంటూ వ్యాసమహర్షి తనకుమారుడైన శుకునికి ఉపదేశించిన అంతర్యాగప్రకారంలోని శ్లోకాలివి. దీనికి తిక్కనగారి తెలుగు సేత తనివితీరా చదివి మననం చేయవలసిందే!

విను, **మోహబీజ** సంజనితంబు గౌమద్రుమంబు ప్రమాదజలంబుదనకు బరిషేచనంబుగ బెరుగు **నజ్ఞాన స్థిరాధార కలితమై** యందసూయ పత్రసంపద యది చిత్రతరం బనూనస్కంధదృఢత నున్నతి వహించు **శోక శాఖంబు** ననేక **చింతోపశాఖంబు** బురాకృత కర్మసార

*ఘనము **దృష్ణాలతా** పరిగతమునగుచు*
*బొలుచు దత్ఫలములకు లుబ్ధులు గడంగి*
*ప్రాకి పడుదురు విడుపు శస్త్రముగ నది వి*
***ఖండితము సేసి బుధుడు దుఃఖముల దొఱగు.***

***శాంతము ధర్మ ప్రచయం***
***బంతటికి విశిష్ట మిమ్మహావిద్య** మదీ*
*యాంతఃకరణము సాక్షిగ*
*నెంతయు సంప్రీతి నీకునిచ్చితి బుత్రా!*

— శాంతిపర్వం *(5-199, 186)*

దుఃఖానికి మూలమైన తృష్ణనూ, దానికిలొంగినవాడు పొందే వేదననూ, బౌద్ధులు తొలిసారిగా వివేచించగా, అద్వైతులు దానిని చేపట్టి సిద్ధాంతీకరించినారు. ఆలంకారికుల్లో అగ్రేసరుడైన ఆనందవర్ధనుడు శాంతరసానికి స్థాయి 'శమం' కాదని, 'తృష్ణాక్షయ సుఖమే' స్థాయి అని నిరూపించగా, కాశ్మీర శివాద్వైతియైన అభినవగుప్తుడు దానిని

'లోచన' వ్యాఖ్యలో సమర్థించి వ్యాఖ్యానించాడు. ఇలా అద్వైతంలో వేళ్లు తన్నుకొన్న జీవునివేదన – శాంతరసభావన చివరికి శ్రీవిద్యలో పర్యవసించి జీవుని ముక్తికి యోగమార్గమే శరణ్యంగా భగవత్పాదులు భావించినట్లు ధ్రువపడుచున్నది. ఆ యీ లక్షణాలన్నీ విశ్వనాథవారి కల్పవృక్షమహాకావ్యంలో దర్శించవచ్చు.

'తృష్ణా' శబ్దాన్నిగూర్చి యింతగా ఎందుకు వివేచించవలసి వచ్చిందంటే, వస్తుతః ఆనందమయుడైన జీవుడు స్వాంతసుఖం కంటే మించినదేదో ఆనందం ఉందనికదా, తృష్ణకు లోనైదుఃఖాన్ని అనుభవంలోకి తెచ్చుకున్నాడు! అలాంటి తృష్ణాస్వరూపం యిదమిత్థమని తెలియకుండా దుఃఖస్వరూపవివేచన చేయడానికి వీల్లేదు. దుఃఖక్షయం చేత అంటే తృష్ణాక్షయంచేత సిద్ధించేశాంతరసస్థితి ఆతర్వాతనే తెలిసివస్తుంది. ఈ శాంతానికి అద్వైతానికి దగ్గరిచుట్టంకాబట్టి అద్వైతాన్ని గూర్చిముచ్చటించవచ్చు. అద్వైతానికే శాంతబ్రహ్మవాదం, కేవలాద్వైతవాదం అనికూడా పేర్లు. అద్వైతానుభవం పొందిన జీవుడు యోగమార్గాన్ని సాధనచేసి శ్రీవిద్యోపాసకుడై ముక్తిని, మోక్షాన్ని పొందవచ్చుననేదే విశ్వనాథ కల్పవృక్షంలో ప్రతిపాదించిన మహార్థం! దీన్ని వాల్మీకి "సీతాయాశ్చరితం మహత్' అనే వాక్యం ద్వారా రామాయణంలో కొంత నిరూపించియే యున్నారు. కాని, అద్వైతాదుల ప్రసక్తి, జీవునివేదన, శాంతరసస్థాపన అందులోలేదు. వాల్మీకంలో ప్రధానంగా ప్రతిపాదించబడినవి సాంఖ్యతత్త్వం – కరుణరసం – శ్రీవిద్య అని పలువురు పెద్దల విశ్వాసం! విశ్వనాథ 'జీవునివేదన'చే కరుణరసాన్ని పండించి, అద్వైతంద్వారా శాంతరసాన్ని నిరూపించినారు. వాల్మీకంలో నిక్షిప్తపరచబడిన శ్రీవిద్యారహస్యబీజాలను స్వకీయప్రతిభచే విస్తరింప జేశారు. అందుకే ఆ మహాకావ్యం కల్పవృక్షమైంది.

## 28. యోగవాసిష్ఠం – తృష్ణాశబ్ద వివేచన

సీతారాములకథను రామాయణకావ్యంగా రచించి, కరుణరసాన్ని నిరూపించి, వసిష్ఠ శ్రీరామచంద్రులమధ్య జరిగిన తాత్త్వికసంవాదాన్ని యోగవాసిష్ఠ రామాయణంగా 32 వేల శ్లోకాలతో వాల్మీకిమహర్షియే రచించి ముముక్షువులకు మోక్షమార్గాన్ని నిర్దేశించినాడని, శ్రీరాముని వైరాగ్యచిత్తవృత్తి శాంతరసస్థితిని సాధించి ఎలామోక్షపర్యవసాయియైందో లోకానికి మహర్షి చాటిచెప్పారని చెబుతారు. ఇంతేకాక, శ్రీరాముని

పరమేశ్వరత్వాన్ని, అవతారతత్త్వరహస్యాన్ని, [illegible] మాయాన్వరూపాన్ని వర్ణిస్తూ అధ్యాత్మరామాయణం కూడా ఆలనే వ్రాశాడని చెబుతారు. కాని నిశితంగా పరిశీలిస్తే ఈ రెండు గ్రంథాలు బౌద్ధ జైనమతాల విజృంభణం అరికట్టడానికి అద్వైతమతాచార్యులే [illegible] రచించివుంటారని, స్పష్టంగాతెలుస్తుంది.

భారతీయవేదాంతవాఙ్మయంలో యోగవాసిష్ఠానికి [illegible] ముంది. ఇది క్రీ.శ. 7వ శతాబ్ది ప్రారంభంలో రచింపబడిందని దానిపై విపుల పరిశోధనలు చేసిన డా॥ బిఖన్‌లాల్ ఆత్రేయగారు The Philosophy of the Yoga Vasistha (Adayar, Madras, 1935) అనే గ్రంథంలో నిరూపించారు. డా॥ సురేంద్రనాథ్ దాస్ గుప్తాగారు The History of Indian Philosophy, రెండవసంపుటంలో యోగవాసిష్ఠం వ్రాసినవారు గౌడపాదాచార్యులో లేక శ్రీశంకరుల సమకాలికు లెవరో అయివుంటారని చెబుతూ ఈ గ్రంథం క్రీ.శ. 8వశతాబ్ది ప్రారంభం లోనే బహుళప్రచారంలో వున్నదని తెల్పారు. అలాగే యోగవాసిష్ఠంపై బౌద్ధవిజ్ఞానవాద ప్రభావముందని నిరూపించారు. శ్రీశంకరుల అద్వైతం మీదనే బౌద్ధదర్శన ప్రభావమున్నపుడు అదే శతాబ్దంలో (క్రీ.శ. 7వ శతాబ్ది) పుట్టిన యోగవాసిష్ఠంలో బౌద్ధదర్శన పారిభాషిక పదాలనేకం చోటుచేసుకోవడంలో ఆశ్చర్యంలేదు. ఉదాహరణకు, తృష్ణ-దుఃఖం- ప్రజ్ఞా-నిర్వాణశబ్దాలు బౌద్ధ దర్శనంలోవని. యోగవాసిష్ఠానికి 'మోక్షోపాయ' మనే నామాంతరమున్నా అందలి ఉత్తరార్థ గ్రంధానికి 'మోక్షప్రకరణ' మనే పేరుపెట్టక 'నిర్వాణప్రకరణ' మనే పేరు పెట్టడంలోనే బౌద్ధమతాన్ని వారి పరిభాషలోనే ఎదుర్కొని [illegible] మానస్థాయిలో అద్వైత వేదాంతభావనను ప్రపంచించి ప్రవచించే ధోరణి కనబడుతుంది.

యోగవాసిష్ఠంలో సగంగ్రంధం నిర్వాణప్రకరణమే. పూర్వార్థంలో 5 ప్రకరణాలుండగా, ఉత్తరార్థంలో ఒకే ప్రకరణం. అది నిర్వాణప్రకరణం!

పూర్వార్థం — 1) వైరాగ్యప్రకరణమ్
2) ముముక్షువ్యవహార ప్రకరణమ్
3) ఉత్పత్తి ప్రకరణమ్
4) స్థితి ప్రకరణమ్
5) ఉపశమ ప్రకరణమ్

ఉత్తరార్థం — 6) నిర్వాణ ప్రకరణమ్

వైరాగ్యంతో మొదలైన యోగవాసిష్ఠం నిర్వాణంతో అంతమైంది. వైరాగ్యానికి అడ్డుతగిలే మొదటి ప్రతిబంధకం 'తృష్ణ'ను గూర్చి గ్రంధాదిలోను, గ్రంథాంతమైన నిర్వాణప్రకరణంలోను విపులంగా చర్చించబడి వుండటం చూస్తే బుద్ధుని ప్రవచనమైన 'ధమ్మపదం'లోని 'తణ్హావగ్గ'నికి (తృష్ణావర్గం) దీటుగా, అదే 'పరిభాష'ను పొదిగి అద్వైతదృష్ట్యా విస్తృతచర్చచేయడం కన్పిస్తుంది. 'తణ్హావగ్గం'లో 26 శ్లోకాలుండగా యోగవాసిష్ఠ ప్రథమాధ్యాయం వైరాగ్యప్రకరణంలో 'తృష్ణాభంగ వర్ణనము'లో 17వ సర్గలో 52 శ్లోకాలున్నాయి. చిట్టచివరిదైన నిర్వాణప్రకరణానికి ముందున్న ఉపశమ ప్రకరణంలో ప్రజ్ఞామాహాత్యం, తృష్ణావర్ణన, తృష్ణాచికిత్స, తృష్ణావిచ్ఛేదం, జీవన్ముక్తి చెప్పబడినవి. (ప్రజ్ఞనుగూర్చి 40 శ్లోకాలు, తృష్ణనుగూర్చి 114 శ్లోకాలు, జీవన్ముక్తిని గురించి 30 శ్లోకాలు) రెండవదైన ముముక్షువ్యవహారప్రకరణంలో 'శమ' నిరూపణం, ఉత్పత్తిప్రకరణంలో బంధహేతువులు, పరమార్థం, అవిద్య, దుఃఖం, జ్ఞాన అజ్ఞాన భూమికలు చెప్పబడినాయి. (ఇవి బౌద్ధంలోని దశవిధ భూమికల్ని స్మృతికి తెస్తాయి) స్థితిప్రకరణంలో మనోస్వరూపం, మనోనిగ్రహం, చిట్టచివరిదైన నిర్వాణప్రకరణంలో జగదసత్తా, జాగ్రత్స్వప్నైక్యం, సంసారబీజకథనం, నిర్వాణోపదేశం చేయబడినవి.

బౌద్ధుల శూన్యవాదాన్ని పరాస్తం చేయడానికి, ధమ్మపదానికి ఎదురు తీర్చి దానికంటే విస్తృత ప్రాతిపదికపై అద్వైతసిద్ధాంతాన్ని నిరూపిస్తూ యోగవాసిష్ఠం నిర్మింపబడిందని నిరూపించవచ్చు.

దీనిపై బౌద్ధదర్శనప్రభావమేగాక, శైవదర్శనంయొక్క స్పంద లేక ప్రత్యభిజ్ఞాదర్శన ప్రభావంకూడా వుందని, కాశ్మీరశైవ పరిభాషా శబ్దాలెన్నో ఈ గ్రంథంలో చోటుచేసికొన్నాయని, ముఖ్యంగా ఉపశమ ప్రకరణంపై భారతీయ సమగ్రయోగశాస్త్రమైన 'విజ్ఞానభైరవ' ప్రభావముందని, యోగవాసిష్ఠం సహజయోగ మార్గాన్ని నిర్దేశిస్తూవుందని అనగా ఆత్మజ్ఞానం స్వయంగా తనదైన బోధ (Self Intuition) వల్లనే కలుగుతుందికాని శాస్త్రపాండిత్యం లేదా గురుబోధవల్ల కల్గదనిచెప్పే 'సహజయోగమార్గగ్రంథ'మని పండిత ప్రజవల్ల భద్వివేదీ నిరూపించారు.

ఒక అవైదికమతంనుండి వైదికమతాన్ని సంరక్షించవలసిన పరిస్థితిలో, అద్వైతమతస్థాపనకోసం శ్రీశంకరులు, ఆయన శిష్యులు, అనుయాయులు ఆ పరిభాషలనే కొన్నిటిని గ్రహించినారని చెప్పినంత మాత్రాన ఆచార్యపాదులకుగాని, అద్వైతమతానికిగాని ఎట్టి న్యూనతకల్గడంలేదు,

సరికదా, బౌద్ధదర్శనంలో ప్రధానమైన తృష్ణాక్షయం, ప్రజ్ఞా, నిర్వాణాలు అద్వైతంలో జీర్ణించి, బౌద్ధానికి భారతదేశంలో చోటులేక పోయింది. సన్యాసాశ్రమాన్ని శ్రీశంకరులుకూడ ప్రతిపాదించడంతో బౌద్ధమతం భారతదేశంలో నామరూపాలు లేకుండా నశించిపోయింది!.

యోగవాసిష్ఠంలో మానవుని తృష్ణను చపలమైన ఆడుకోతితో పోల్చడం 'ధమ్మపదం'లోని వానరాన్ని స్మృతికి తెస్తోంది!

*పదం కరోత్యలంఘ్యేఽపి తృప్తాఽపి ఫలమీహతే।*
*చిరం తిష్ఠతి నైకత్ర తృష్ణా చపల మర్కటీ॥*

— *వైరాగ్యప్రకరణమ్ 17-29*

తృష్ణయను చపలమైన ఆడుకోతి ఒకచోటనుండదు. పొందవీలు లేని వస్తువుల బడయ దుముకులాడును. తృప్తినందినను యితర ఫలముల వాంఛించును.

తృష్ణచేత జీవుడెలా కర్మవాగురలో బంధింపబడుచున్నాడో చిత్తదౌరాత్మ్యమనే సర్గలో చెప్పబడింది.

*క్రోడీకృత దృఢ గ్రంథి తృష్ణా సూత్రే స్థితాత్మనా।*
*విహగో జాలకేనేవ బ్రహ్మన్! బద్ధోఽస్మి చేతసా॥* *16-13*

మహాత్మా! వేటకాడు వాగురలనుపన్ని దారాన్ని చేతబట్టుకొని దూరాన పొంచియుండి పక్షులు దానిలో పడినప్పుడు దారాన్నిలాగి ముడిపడేటట్లుచేసి వాటిని బంధించేటట్లు చిత్తం తృష్ణఅనే సూత్రాన్ని, మమతఅనే క్రోడాన్ని ఉంచుకొనినన్ను బంధిస్తోంది.

మరియొక శ్లోకం (17-37) లో 'తృష్ణ' 'మానసారణ్యహరిణి'గా చెప్పబడింది. జీవుడు తృష్ణకు లోనగుటకు ప్రధానకారణం 'మాయ' అనిచెప్పబడింది.

*తృష్ణాచారులతా జాల ప్రవేశవనక్షిక్షతః।*
*స్వ ప్రజ్ఞారచితాచారః పరమాయస్య శిక్షితః॥*

— *నిర్వాణప్రకరణమ్, 44-40.*

మనోరూపహరిణం తృష్ణఅనే మనోహరమైన లతాసమూహంతో ప్రవేశించడంచేగాయపడిన శరీరంతో, స్వబుద్ధిచే కల్పితాలైన అనేక ఆచారా

ంతో కూడికొన్న పరమాత్మయొక్క 'మాయ' ను తెలిసికొనలేకున్నది. 'తృష్ణ'కు లోనైన పరిస్థితిని శ్రీరాముడిలా చెబుతున్నాడు.

భీషయత్యపి ధీరం మామంధ యత్యపి నేక్షణం।
ఖేదయత్యపి సానందం తృష్ణా కృష్ణేన శర్వరీ॥
— వైరాగ్యప్రకరణమ్ *17-16*

తృష్ణ చీకటిరాత్రివంటిది. నేను ధీరుడనైనప్పటికీ అది నాకు భయాన్నికల్గిస్తోంది. కళ్లున్నను గుడ్డివానిగ చేసింది. ఆనందస్వరూపుడనగునాకు దుఃఖాన్ని కల్గిస్తోంది.

దీనినే విశ్వనాథ కల్పవృక్షంలో, శ్రీరాముడు వసిష్ఠునితో "అయ్యా సంపడి పోవుచుంటిగదె తాతా!.... **నాకున్ భయం బయ్యెడిన్**" అని జీవుని సహజలక్షణమైన భయాన్ని వ్యక్తీకరించినాడు.

"రాఘవకులేశుడొక్క వైరాగ్యభావ
తాడితంబైనయట్టి చిత్తంబుతోడ
వృద్ధక్ష్మకలానమట్లు నిర్వేదమందె
బద్ధ సామజమట్లు క్షోభమువహించె" — బాల - కల్యాణ - *189*

"భిందతి హృదయం పుంసాం మాయామయ విధాయినీ" అని యోగవాసిష్ఠం! తృష్ణ మానవహృదయాలను భేదిస్తూ మాయామయ ప్రపంచాన్ని కల్పిస్తోంది! ఇది అద్వైతదృష్టి! అటువంటి దుర్వారమైన తృష్ణను జయించడంఎలా?

అహోబత! మహచ్చిత్రం తృష్ణామపి మహాధియః।
ముచ్ఛేదామపి కృతంతి వివేకినా మలాపినా॥ *(17-47)*

అహో! ఏమి ఆశ్చర్యం! అచ్ఛేద్యమైన ఈ తృష్ణను బుద్ధిమంతులు వివేకమనే నిశితఖడ్గంతో నరుకుచున్నారు. ఈ వివేకమే 'ప్రజ్ఞ'గా చెప్పబడింది.

చింతామణిరియం ప్రజ్ఞాహృత్కోశస్థావివేకినః।
ఫలం కల్పలతేవైషా చింతితం సంప్రయచ్ఛతి॥
— ఉపశమప్రకరణమ్, ప్రజ్ఞామాహాత్మ్యమ్ *12-34*

వివేకు హృదయంలో నివసించే యీ ప్రజ్ఞ, చింతామణి తుల్యమైంది. మరియు కల్పవృక్షలతవలె అది అభీష్టాలను అందజేస్తుంది.

"కవచందరించిన వాణ్ణి బాణం బాధింపజాలనట్లు ప్రజ్ఞావంతుడైన వివేకిని తృష్ణాగుణమగు కామక్రోధలోభమోహాదులచే నుద్భూతాలైన రాగద్వేషచింతా విషాదాది దోషాలు బాధింపలేవు" అని మరొకశ్లోకంలో (12-37) చెప్పబడింది.

ప్రజ్ఞావంతుడైన వివేకి లోకంపట్ల నిర్వేదాన్ని, వైరాగ్యాన్ని అవలంబించి, తృష్ణాక్షయాన్ని సాధించి, ప్రశాంత చిత్తవృత్తిచే నిర్వాణాన్ని చూరగొంటున్నాడు. "సంసార వననిర్వేదం బీజమస్య విదుర్బుధాః" (44-3) సంసారారణ్యంలో పరమవైరాగ్యము, సమాధిఅనే వృక్షం యొక్క బీజంగా తెలిసికొనుమ .

సమాధిబీజం సంసారనిర్వేదః పతతి స్వయమ్।
చిత్తభూమౌ వివిక్తాయాం వివేకిజన కాననే॥ (44-5)

సంసారంపట్ల పరమవైరాగ్యమనే సమాధిబీజము వివేకంచే శుద్ధంగా చేయబడిన చిత్తమనే భూమిలో స్వయంగానే వచ్చిపడుతోంది.

అందుకే కల్పవృక్షంలో బాలరాముడు సహజవిరాగియై వేసిన సంప్రశ్నలకు వసిష్ఠుడు మౌనంవహించాడు. రాముడు సహజవైరాగ్యంతో తనుతానే తెలిసికొన్నాడు. ఇది సహజయోగమార్గం! శ్రీరామచంద్రునికి బాల్యంలోనే గురునిమిత్తం, శాస్త్రపఠనం లేకనే వైరాగ్యబీజం చిత్తంలో మొలకెత్తింది! అది చివరికి సర్వసంగపరిత్యాగానికి దారితీసే శాంతరసానుభవాన్ని కల్గించింది. కావ్యపాఠకునకు కావ్యనాయకునివలన శాంతరసానుభూతి లభ్యమౌతోంది!

శాంత మేక మనాద్యంత మిదమచ్ఛ మనామయమ్।
వ్యవహారవతోఽ ప్యంగజ్ఞస్య మౌనం శిలాఘనమ్॥ 58-22.

ఓ రామచంద్రా! లోకవ్యవహారంలో ప్రవృత్తుడైనప్పటికీ జ్ఞానికి సమస్తజగత్తును శిలవలె చిద్ఘనమై, శాంతమై, ఏకమై, ఆద్యంతరహితమై నిర్మలమై, నిర్వికారమై మౌనస్వరూపమైనట్టి బ్రహ్మమాత్రముగనే యుండును.

రాముడు కల్పవృక్షంలో అరుంధతిచే 'కర్మయోగము' ఉపదేశము

పొందినతర్వాత 'నిష్కామకర్మయోగి'గా పై చెప్పబడిన స్థితిలోనే ప్రవర్తించినాడు. "నిర్వాణమేవ మఖిలం నభవీవ దృశ్యం" (59-23) కంటికి ఆకాశమెలా కనబడుతుందో 'నిష్కామకర్మయోగి'కి అఖిలం నిర్వాణమయుంగా ఉంటుంది. అని చెప్పిన యోగవాసిష్ఠాన్నే విశ్వనాథ కల్పవృక్షంలో శ్రీరామచంద్రుని శీలరచనలో, పాత్రసృజనలో అనుసరించినారు.

బౌద్ధమతాన్ని, బౌద్ధదర్శనాన్ని తీవ్రంగా నిరసించే విశ్వనాథవారు రచించిన రామాయణకల్పవృక్షంపై యోగవాసిష్ఠం, అధ్యాత్మ రామాయణ ప్రభావముంది. యోగవాసిష్ఠంపై, ఆయన అత్యంతమూ అభిమానించే అద్వైతంపై బౌద్ధదర్శన ప్రభావముందని చెప్పటమే నా అభిమతం! కల్పవృక్షాన్ని 'మోక్షలక్ష్మీ మాణిక్య వినూత్నమేఖల'గా తీర్చిదిద్దటంలోను, శాంతరసస్థాపనచేయడంలోను, ప్రేరకము ప్రోద్బలకములైనవి ఈరెండుగ్రంథాలని నిస్సంశయంగా చెప్పవచ్చును. అందుకే కల్పవృక్షం శాంతరసస్వరూపుడైన శివునికి అంకితంచేయడం జరిగింది.

## 29. అధ్యాత్మ రామాయణం – కల్పవృక్షం

అధ్యాత్మ రామాయణమనేపేరే రామాయణానికీ దీనికిగల భేదాన్ని చెబుతోంది. వాల్మీకి, ఆదికావ్యంలో శ్రీరాముని పరమేశ్వరత్వాన్ని వ్యంగ్యంగా సూచించాడేగాని వాచ్యంగా చెప్పలేదు. అలా చెప్పినచోట్లు ఒకటిరెండున్నా వాటిసంఖ్య చాలతక్కువ. అధ్యాత్మ రామాయణం అలాకాక శ్రీరామచంద్రుని పరమాత్మస్వరూపునిగానే చిత్రించింది. దానికనుగుణంగా సీతకూడా ఆదిశక్తిస్వరూపిణిగా గోచరిస్తుంది. కాబట్టి రామకథ ఆధ్యాత్మికరహస్యాలతో కూడుకొన్నదని ధృవపడుతోంది.

కల్పవృక్షంపై అధ్యాత్మ రామాయణ ప్రభావానికి 'వాచవి'గా మూడు నాల్గంశాలుమాత్రం మనవి చేస్తాను. ఇది విస్తృత వివేచన చేయదగిన అంశం!

పావు నెఱుంగుబ్రహ్మ, నగపాలును మాత్రమెఱుంగు బార్వతీ
దేవియు నీవెఱుంగుదువు తెల్లము రామమహాత్త్వకృత్స్నము మా
దేవున కేను యనుమతింబడి నంకితమిత్తు జానకీ
దేవిమనోహరుండు రఘుదేవుని సాధుకథా ప్రపంచమున్

అని 'కల్పవృక్షావతారిక'లో నాల్గవపద్యం. ఇది అధ్యాత్మరామాయణంలోని ఉత్తరకాండలోగల శ్రీరామగీతకు 'ఫలశ్రుతి'లో చెప్పబడిన మొదటిశ్లోకంలోని భావం! ఉపనిషద్వేద్యుడైన శ్రీరామచంద్ర పరబ్రహ్మము లక్ష్మణస్వామికి తత్త్వోపదేశం చేసాడు. ఆ తత్త్వోపదేశమే శ్రీరామగీత! శ్రీకృష్ణపరమాత్మ అర్జునునికి చెప్పిన భగవద్గీతలో కర్మయోగానికి ప్రాధాన్యమీయబడగా శ్రీరామగీతల్లో పరాభక్తికి ప్రాధాన్యం. ఈ శ్రీరామగీతలకు ఫలశ్రుతి పలికినవాడు బ్రహ్మ! ఆయనచెప్పిన మాటలు —

*శ్రీరామగీతా మాహాత్మ్యం కృత్స్నం జానాతి శంకరః।*
*తదర్థం గిరిజావేత్తి తదర్థం వేద్మ్యహం మునే॥*

రామకథపూర్తిగా తెలిసినవాడు శివుడొక్కడే! కాబట్టే ఆ శివునికి విశ్వనాథకల్పవృక్షాన్ని అంకితంచేశాడు! పార్వతికి శ్రీరామమాహాత్మ్యం సగమేతెలుసు. బ్రహ్మకు ఆమెకు తెలిసినదానిలో సగము అంటే పావు భాగమే తెలుసు. ఇలా "శివశ్చహృదయం విష్ణోః విష్ణోశ్చహృదయం శివః" అనే సంప్రదాయరహస్యమిక్కడ స్థాపించబడింది!

రామాయణ కల్పవృక్షంలో అహల్యాకృత రామస్తవం ఉన్నప్పటికీ అది అధ్యాత్మ రామాయణంలోనిదివలె కేవలభక్తిపరమైనదికాదు. విలక్షణమైంది. విశిష్టమైంది.

శిలాతపస్వినియైన అహల్య అద్భుతంపు క్రియతోనైశ్చల్యాన్ని పొందినది. "ఎప్పుడు నీదుమోహమది యెల్లను విచ్చునో రామచంద్రుడైయప్పుడువచ్చుస్వామి!" అన్నాడు గౌతముడు. రాముని రాకతో పరిసర వాతావరణమే మారింది. ఆశ్రమాంతర్భాగంనుండి అహల్యాగౌతములు శ్రీరామచంద్రుని ఆహ్వానించారు. కేవలం రామపాదముల మాహాత్మ్య వర్ణనమే అధ్యాత్మ రామాయణమందుండగా, మహాకావ్యమైన కల్పవృక్షంలో అహల్యాకృత రామస్తవంలో ఒకక్రమికవికాసం నిరూపింపబడింది. మొదట సంబోధనలుగా సాగినస్తుతి.

*"రాస్నలై పేర్చు వాంఛాతరంగములను*
*బలిసి ఖాకట్టుపొందిన పాపములను*
*నర్వలిప్తల బలిసెడు స్ఖలితములును*
*బాసి నాగుండె నడకువల్ బలియుచుండె*

అని ప్రశంసిస్తూ, రాముడే కల్పవృక్షంగా సాంఖ్యతత్త్వ స్వరూపుడైన మహాపురుషునిగా, భావించగలిగింది అహల్య!

ఇంతసభ్యత, ఇంత పరిమళం, ఇంతప్రభులోభం, ఇంత ఆనందం తనయెదలో ఎలాకలిగిందని ఆశ్చర్యపడి తనయెదయే రామభజనమందిరమైనదనుకొన్నది అహల్య! ఈ క్రమిక వికాసానికి 'ఫలశ్రుతి'గా కల్పవృక్షకర్త వ్రాసిన సీసపద్యం మకుటాయమానమైంది!

*ప్రభు మేని పైగాలి పైవచ్చినంతనే*
*పాషాణమొకటికి స్పర్శవచ్చె*
*ప్రభుకాలిసవ్వడి ప్రాంతమైనంతనే*
*శిలకొక్కదానికి చెవులు గలిగె*
*ప్రభు మేని నెత్తావి పరిమళించిన తోన*
*యశ్మంబు ఘ్రాణేంద్రియంబు జెందె*
*ప్రభు నీలరత్న తోరణమంజులాంగంబు*
*గనవచ్చి నాతికి గనులు గలిగె*

*ఆ ప్రభుండు వచ్చి యాతిథ్యమును స్వీక*
*రించినంత నువలహృదయవీధి*
*నువనిషద్వితాన మొలికి శ్రీరామభ*
*ద్రాఖ్య రామమూర్తి యగుచు దోచె!"* – బాల-ధనుస్సు - 354

ఘనీభవించిన పాపరాశితో కరుడుగట్టిన రాతికి కనులువచ్చి విచ్చి చూచిన సన్నివేశచిత్రణలో ఒకక్రమికవికాసం పరస్పరసంవాదభాజకంగా శిల్పించడం నాన్యతోదర్శనీయం! ఈ ఘట్టంలోఅధ్యాత్మరామాయణ దృష్టి వేఱు!

యోషన్మూఢా మజ్ఞా తే తత్త్వం జానే కథం విభో!
తస్మాత్తే శతశో రామ నమస్కుర్యా మనన్యధీః॥

హేవిభో! నేనుస్త్రీని, మూఢురాలను, అవాఙ్మానసగోచరమగునీ తత్త్వం ఎలా గ్రహింపగలను? కనుక ఓరామా! నేను అనన్యమనస్కనై నీకు వందలకొలది నమస్కారాలు చేస్తున్నాను అన్నది అహల్య!

కాని, కల్పవృక్షంలో అహల్యకనులు తెరిచినంతనే రాముడామెపా

దములకు నమస్కరించినాడు. ఋషులు వెంటనే 'మంత్రపుష్పము' పఠించారు. మంత్రపుష్పమొక 'యతి'యైన వానికి, పరివ్రాజకుడైన సన్యాసికి, భగవంతునికి చెబుతారుగాని రాజకుమారునికి చెప్పేదికాదు! ఋషులుచెప్పిన 'మంత్రపుష్పము' భవిష్యత్కథలో రాముడు 'యతి'గా జీవితం గడుపబోయే దాన్ని సూచిస్తోంది. కాగా, యిది అధ్యాత్మరా మాయణ ప్రభావంచే కవియిలా వర్ణించినాడని చెప్పవచ్చును. రాముడు భగవదవతారంగా ఋషులు గ్రహించినారని పరమార్థం!

రాముడు మాయామానుషవి గ్రహుడు. సీత మహామాయాస్వ రూపిణి! ఇది అధ్యాత్మరామాయణంలో ప్రతిపాదింపబడింది. దీనిని విశ్వనాథ కల్పవృక్షంలో బహుధా నిరూపించినారు. ఇది అధ్యాత్మరా మాయణ ప్రభావమే! అహల్యాకృత రామస్తవంలో—

"అహో! విచిత్రం! తవ రామచేష్టితం.
మనుష్యభావేన విమోహితం జగత్"
"మాయాతనుం లోకవిమోహనీయామ్"

అధ్యాత్మం బాలకాండ చివరలో యిలాచెప్పబడింది—

సాకేతే లోకనాథ ప్రథిత గుణగణో లోకసంగీతకీర్తిః
శ్రీరామ స్సీతయాస్తేఽఖిలజన నికరానంద సందోహ మూర్తిః
నిత్య శ్రీర్నిర్వికారో, నిరవధి విభవో, నిత్యమాయానిరాసో
మాయాకార్యానుసారీ మనుజఇవ సదాభాతి దేవోఽఖిలేశః

రెండు పరస్పర విరుద్ధ భావాలు ఏకత్ర సమావేశమైన విలక్షణ, విశిష్టమైన అవతారమే శ్రీరామావతారం! మరిసీత ఎట్టిది?

యోగమాయాఽపి సీతేతి జాతావై తవవేశ్మని।
అతస్త్వం రాఘవాయైవ దేహి సీతాం ప్రయత్నతః॥

సీతయోగమాయ! మహామాయ! ఇది శ్రీవిద్యా రహస్యం!

త్వం వైష్ణవీశక్తి రనంతవీర్యా విశ్వస్యబీజః పరమాసి మాయా।
సమ్మోహితందేవి సమస్తమేతత్ త్వంవైప్రసన్నా భువిముక్తిహేతుః॥
— దేవీమాహాత్మ్యం XI-5

శ్రీరాముడు కల్పవృక్షంలో 'సీతాపతి', జనకసుత భర్త, 'ధరాసుత భాష్యకారుడై యాడెడుస్వామి'గా చెప్పబడగా, సీత, 'ఇదంతయుచేసితిన్' అనగల 'త్రైలోక్య సర్వస్త్రైణాకృతి పూనిన యంబిక'గా నిరూపింపబడింది! వాల్మీకి చెప్పిన 'సీతాయాశ్చరితం మహత్' అనే వాక్యానికిది విశ్వనాథభాష్యం! ఈ 'విశ్వనాధ రామకథాభాష్యకారిత్వము' గ్రంధాంతంలో నిరూపింపబడుతుంది కాబట్టి యిక్కడ విపులీకరించడం లేదు.

ఇది ప్రధానంగా కల్పవృక్షంపై అధ్యాత్మరామాయణప్రభావం! దీనిలో శ్రీవిద్యారహస్యాలను మేళవించారు విశ్వనాధ.

## 30. కల్పవృక్షం – జీవునివేదన

*అమ్మా! దేహమనినన్ విచిత్రమగు దుఃఖారామ మన్పించు దే*
*హమ్ముఁన్నంతన జీవి పొందనగు బాధాసహ్యతల్ చెప్ప శ*
*క్యమ్మా! యొక్కొకజీవి యొక్కొకవిధంబై పొందు దుఃఖమ్ము, రా*
*జ్యమ్మో, రాణియొ, కాననంబొ, ఋషి భార్యారత్నమో చెప్పఁగన్*

— *బాల-కల్యాణ-118* వ.

ఇది శ్రీరామచంద్రుడు తన పంద్రెండటట యేట సీతను వివాహమాడి అయోధ్యకు తిరిగివచ్చుదారిలో తల్లికౌసల్యతో నన్నమాటలు! ఇందు రాజ్యం వలన దశరధుడు, ఆ దశరథుని వలన రాణి కైకేయి, ఆ కైకేయివలన రాముడు, ఆ రాముని వలన సీత, వీరందరికంటె ముందు గౌతమధర్మపత్ని అహల్య పొందిన 'జీవునివేదన' ఇంతింతన రానిది! రామాయణమంతా జరగకముందేరామునినోట ఈమాటలు వెలువడినవి. "ఋషీణాం పునరాద్యానాం వాచమర్థోఽనుధావతి" అని కదా భవభూతి!

క్షత్రియునికి రాజ్యకాంక్ష ప్రప్రధమతృష్ణ! దానిని త్రోసిరాజని సర్వసంగపరిత్యాగియై అడవులకువెళ్లిన రాముడు విరాగి! యోగి!! రామకథలో శాంతరసానికి స్థాయియైన 'తృష్ణాక్షయా'నికి బీజం యిక్కడనే పడింది. 'దేహమనినన్ విచిత్రమగు దుఃఖారామము' అన్నమాట గౌతమన్యాయసూత్రం (4-1-55) లోని – వివిధ బాధనాయోగాత్ దుఃఖమేవజన్మోత్పత్తిః" అనే వాక్యంతో సంవదించడమేకాదు, గౌతముడే మరొకసూత్రం (1-1-2)లో – "దుఃఖజన్మప్రవృత్తి

దోష మిధ్యాజ్ఞానానాముత్తరోత్తరాపాయే తదనంతరాపాయా దపవర్గః" అన్నమాటలు దీనిని వ్యాఖ్యానిస్తున్నాయి!

మిధ్యాజ్ఞానాపచయం → తత్త్వజ్ఞానం → వైరాగ్యం.

వైరాగ్యమే నిర్వేదమని కొందరంటారు. నిర్వేదం మోక్షానికి దారి తీస్తోంది. కాబట్టి నిర్వేదం శాంతానికి స్థాయిభావమని కొందరిమతం. నిర్వేదం శోకప్రభావప్రసరమనీ, వైరాగ్యం రాగద్వేష మోహ విచ్ఛేద మని మరికొందరంటారు.

అధ్యాత్మజ్ఞాన నిత్యత్వం తత్త్వజ్ఞానార్థ దర్శనమ్।
ఏతద్ జ్ఞాన మితిప్రోక్తం అజ్ఞానం యతతోఽన్యథా॥

అని గదాగీత! అధ్యాత్మ విద్యయే అసలైన విద్య!

మిధ్యాజ్ఞానాపచయం → తత్త్వజ్ఞానం → దోషాపాయం.
↓
నిర్వేదం-వైరాగ్యం
↓
ప్రవృత్త్యపాయం
↓
జన్మాపాయం
↓
దుఃఖాపాయం
↓
మోక్షం

"మోక్షసాధ్యే సూత్రస్థానియతా
న ప్రత్యపాది ఆచార్యేణ"

కాని, సూత్రాలలో యిది ప్రత్యక్షంగా
మోక్షమార్గంగా చెప్పబడలేదు
కాబట్టి 'కేచిన్మత' మని కొందరు
చెప్పిన దానిని బట్టి నిర్వేదము
శాంతరస స్థాయిభావమని చెప్పవీలులేదు.

అభినవగుప్తుడు నిర్వేదాన్ని ఖేదరూపనిర్వేదంగా, ఒక వ్యభిచారి భావంగా గుర్తించాడు. కాని ఒక ఉదాత్త తాత్త్వికస్థాయి భావంగా గుర్తించలేదు. కాని, భరతనాట్యశాస్త్రమనుసరించి చూడగా నిర్వేద విభావాల్లో తత్త్వజ్ఞానం చెప్పబడింది.

బాష్పపరిప్లుత నయనః పునశ్చ నిశ్వాసదీనముఖనేత్రః।
యోగీవ ధ్యానపరోభవతి హి నిర్వేదవాన్ పురుషః॥

— నాట్యశాస్త్రమ్ *7-30*

వాల్మీకి రామాయణంలో అధ్యాత్మజ్ఞాననిష్ఠులైన ఋషులు కుశ

లవులు రామకథాగానం విని 'బాష్పపర్యాకులేక్షణులై' 'సాధుసాధు' వని ప్రశంసించారు. కల్పవృక్షంలో సగరపుత్రుల కథను చెప్పినవాడు బ్రహ్మర్షి విశ్వామిత్రుడు — విన్నవారు బ్రహ్మజ్ఞానులైన ఋషులు - శాంతాభిరాముడైన రాముడు — రామానుజుడు. రాత్రి ఎంత గడచినా నిద్రరాక ఆకథలే మనసులో గుడుసుళ్లుపెట్టుచుండగా రామలక్ష్మణులు మేల్కొనే ఉన్నారని ఋషులు లేచి యిలాప్రశంసించారు!

*జామిపువ్వులోని కేసరచ్ఛవి వహించి*
*ప్రాచి తెలివెల్గు గీతలు పాఱుతెంచె*
*ఏమిసాగరుల్! వారలదేమి ప్రభులు!!*
*ఏమికథ! ఏమిచెప్పుట!! ఏమిసాగను!!!* బాల-అహల్య-423.

వాల్మీకంలో, కృచ్ఛ్ర చాంద్రాయణాది వ్రతాలచే కృశీభూత శరీరులై శమదమసంపన్నులైన ఋషులే యిక్కడ బాష్పపర్యాకులేక్షణులైనవారు — ఇంతటి నిర్వేద వైరాగ్యనిష్ఠులైన ఋషులకు శాంతం అనుభవంలో లేదందుమా? శాంతాభిరాముడైన రాముడే దీనికి సాక్షీభూతుడు! రాముడు తల్లికౌసల్యతో — (బాల-కల్యాణ-120-121).

*జననీ! యేను మృగయావిహార మేగిన యెడలన్*
*నానాక్రూరతరమృగప్రాణోత్క్రమణంబులు చిత్రభంగులుకననే!*

*ఇలవయి రాచబిడ్డ బ్రదుకేయిది వానికి మృత్యుతత్త్వముల్*
*దెలియగ దేలికైనపని తెల్లముగాగను దాటకావధా*
*విలగతినే గ్రహించితిని వెక్కసమై చనుజీవి యెంతగా*
*గిలగిలతన్నుకొన్నయది! కేవల మప్పుడు చూడగావలెన్!*

నిషాదునిచే కొట్టబడి మరణించు క్రౌంచమరణవేదన చూచి మృత్యు తత్త్వాన్ని గ్రహించి - జీవునివేదనకు లోనైన మహర్షివాల్మీకివలె - ఋషిస్త్వృద్ధిమాం ఋషిభిస్తుల్యమ్' అన్న రాముడు బాల్యంలోనే మృత్యుతత్త్వాన్ని దర్శించి 'జీవునివేదన'కు లోనౌటలో ఆశ్చర్యంలేదు. It is not death that is painful but the departure of life" 'మరణ ముకన్న ప్రాణోత్క్రమణమే జీవులకు మిక్కిలిబాధాకరము' అని ఒక పాశ్చాత్యదార్శనికుడన్న మాటలు 'జీవునివేదన'ను నిర్వచించడమేకాదు వ్యాఖ్యానిస్తోంది! (విశ్వనాథ కల్పవృక్షంలోనేకాదు, బాణావతి అనే నవల 'చివరిపుట'లో ప్రాణోత్క్రమణవేదనను నిరూపించారు) ఇది

'మరణవేదన'కాగా మరొక రకమైన వేదన కామభావసంజనితమైంది. కాగా, జీవునివేదనకు రెండుకారణాలు.

1. మరణవేదన (departure of life)
2. ఆధ్యాత్మిక వేదన (spiritual sorrow)

రెండవదానినే తాత్త్వికవేదన (philosophical sorrow) అనవచ్చును. దీనికి కల్పవృక్షంలో ఉదాహరణాలు కోకొల్లలు.

'ఎప్పుడు కామమేచినది అప్పుడు దుఃఖము పుట్టె'
"కామము జూడ సృష్టి ప్రథమాహంకారమే జానకీ!"
'ఎప్పుడు మేనుదాల్చితివొయీాతనుసంగతలక్షణంబులుం దప్పవు"

ఇది ఆధ్యాత్మికస్థాయిలో 'జీవునివేదన'. అహల్య జీవితాన్ని చూచిన బాలరామునిలో అట్టి ఆధ్యాత్మిక శోకం పోటుపొడిచింది.

*ఇదియునుగాక గౌతమ ఋషీంద్రుని భార్య యహల్య యెంత*
*వడ్డది యలనామె దుఃఖవికటజ్వలితాగ్ని మదంతరంబునం*
*దొదిగిన కోటి జన్మల మహోన్నత దుఃఖము ద్రవ్విచూపె; నా*
*సదమల దుఃఖశీల క్షితిజాతను నన్నును నట్లు రమ్మనెన్.*

— *బాల-కల్యాణ-122 ప.*

'క్షోభ'చే 'అంతర్గాఢ ఘనవ్యధ'చే అహల్య తనను తానుతెలిసికొనగా, ఆమె జీవితచరిత్ర విన్న రాముడిట్టే ఆమె 'సదమలదుఃఖశీల' అని తెలిసికొన్నాడు! ఆంగ్లంలో షేక్స్పియర్ మహాకవి సానెట్స్‌లో—

**Lust** is a bloody **fire**
Kindled with **unchaste desire**

అన్నమాటలు యిక్కడ కామంనుండి పుట్టిన దుఃఖాన్ని వ్యాఖ్యానిస్తున్నాయి. విశ్వనాథవారు కూడా—

"…. **కామాగ్ని కుండంబునొ** తార్తియాక త్రిలోచనంబు
మము సంధానించు నైశ్వర్యముల్" అన్నారు. త్రిశూలనాటకనాందీ శ్లోకంలో. 'Lust is a bloody fire' అన్నమాట 'కామాగ్నికుండంబు' అన్నమాటలో సంపదించి, అహల్యయొక్క 'దుఃఖవికట జ్వలితాగ్ని'ని వ్యాఖ్యానిస్తున్నాయి.

"కామయేదుఃఖతప్తానాం ప్రాణినాం ఆర్తినాశనమ్"
అనిచెప్పిన యోగవాసిష్ఠ శ్లోకం యిక్కడ అనుసంధించుకోవాలి!

తార్తీయాక త్రిలోచనుడైన శివుడే దీనికి నిష్కృతి చేసిచూపాడు. 'కామదహనం' చేతనే 'దుఃఖనిరాసమ'ని దారిని చూపించాడు. మరి అహల్యకు నిష్కృతి, విమోచనం ఎలా సిద్ధించింది? 'జీవునివేదన'కు తనంతట తనకొక వ్యస్తమైనస్థితిలేదు. దానికి విమోచనమార్గం తప్పక ఉండితీరాలి! అహల్యకు రామపాదములే నిరంతర దుఃఖ విమోచనాన్ని కల్గించింది. అధ్యాత్మ రామాయణంలోను, రామాయణకల్పవృక్షంలోను అహల్యాకృత రామస్తవమే దీనికి ఏకైకసాక్షి!

అహల్య విషయంలో అలా కుదిరింది! మరి సర్వజీవ సమావృతమైన వేదనకు నిష్కృతి ఏమిటి? అని తొట్టతొలుత వివేచించిన వారిలో బౌద్ధులే ప్రాతః స్మరణీయులు! సర్వజీవగత దుఃఖనివారణోపాయాన్ని బౌద్ధులు అన్వేషించారు. దుఃఖమీమాంస చేశారు. కామం (కోరిక, తృష్ణ) నుండి దుఃఖం కల్గుతోంది. బౌద్ధదర్శనం, బైబిలు సిద్ధాంతం, భారతీయవేదాంతం అన్నీ దీనినే సమర్థిస్తున్నాయి. తృష్ణను క్షయింప జేసుకొనుట చేతనే, జీవుడు 'వేదన' నుండి 'దుఃఖం' నుండి విముక్తిని పొందుచున్నాడని, అదే 'సుఖ'మని 'శాంత'మని చెప్పారు బౌద్ధులు. 'శాంతము లేక సౌఖ్యములేదు' అని త్యాగరాజస్వామి! కాబట్టి దుఃఖా నికి (జీవునివేదనకు) మూలకారణం 'తృష్ణ' అని బౌద్ధులు, కామం, అవిద్య, తృష్ణ' మూలమని అద్వైతులు, lust, desire కారణాలని క్రైస్త వులు చెప్పినవన్నీ ఒకేస్థాయిలోనివే! 'వేదనా' శబ్దాన్ని బౌద్ధులుకూడా వాడారు. పంచవిధ స్కంధములలో 'వేదన' రెండవది. తృష్ణ మూడు విధాలు 1) కామతృష్ణ, 2) రూపతృష్ణ, 3) విభవతృష్ణ. బౌద్ధులిలా చెప్పగా ఆధునిక మనస్తత్వ శాస్త్రజ్ఞుడైన, C.G. Jung, 1) Pleasure principle 2) Power principle మీద ఆధునిక మానవుని భౌతికజీవితం నడుస్తున్నదన్నాడు. కామ, రూపతృష్ణలు 'Pleasure Principle' కాగా, విభవతృష్ణ 'Power principle' గా మనం సమన్వయంచేయవచ్చు. రావ ణాసురునిలో ఈ మూడు తృష్ణలు అన్వయమవుతున్నాయి!

## 31. బౌద్ధుల దుఃఖమీమాంస

"దశసు మహాసుర్గేషు భవ్యత్వాద్ అనభిభూతేన బుద్ధి భిత్త్యేన మయా నరక తిర్యగ్భావమ్ దుఃఖం సంపశ్యతా దేవ మనుష్యేషు పునఃపు

నరుత్వాద్య మానేన యత్కించిద్ అనుభూతం తత్సర్వ దుఃఖమేవ ప్రత్యవైమి"  — జైగీషవ్యుని యోగసూత్రభాష్యమ్ III-8

ఇది 'దుఃఖసత్యా'నికి భాష్యకారుని ప్రవచనం. కిష్కింధా కాండారంభంలో వాల్మీకి శ్రీరాముని వియోగాన్ని వివిధంగా వర్ణించాడు.

**సర్వంతు దుఃఖం మమ లక్ష్మణేదం శాంతం శరీరే వనమేత్య శూన్యమ్।**

*సీతా వియోగాత్ పునరప్యుదీర్ణః కాష్ఠై రివాగ్నిః సహసాప్రదీప్తః॥*

అయోధ్యనూ తల్లితండ్రులను విడచివచ్చి నందువలన గలిగిన దుఃఖమంతా క్రమంగా సన్నగిల్లింది. కాని సీతావియోగంచే కాష్ఠప్రదీప్తమైన వహ్నివలె ఆదుఃఖం మరల ఉద్దీప్తమైంది!

విశ్వజనీనమైన జీవుని దుఃఖానికీ, వేదనకు ఆధ్యాత్మికోపాయం అన్వేషణీయమైంది. దీనిని 'ఆర్యసత్యం'గా బుద్ధుడు ప్రవచించినాడు.

1. **దుక్ఖం (దుఃఖం)** — ఈ ప్రపంచం దుఃఖమయం.

2. **దుక్ఖంసముదయం** — దుఃఖకారణము. అట్టి దుఃఖానికి జాతి (పుట్టుక), జరా (ముసలితనం), మరణమే మూలకారణాలు.

3. **దుక్ఖనిరోధం** — దుఃఖనాశనం, దుఃఖోత్పాదకములైనవానిని నశింపజేయాలి.

4. **దుక్ఖనిరోధగామినీ పటిపదా** (దుఃఖనిరోధగామినీ పటిపదము) దుఃఖనాశనోపాయం. దుఃఖదాయకములైన వానిని మూలముట్టుగ నశింపజేయుటకు బుద్ధోపదిష్టమైన ఆర్యాష్టాంగ మార్గమే శరణ్యం. ఆ దారిలో నడచినవారికి ఎల్లదుఃఖాలు నశించి నిర్వాణపదం చేరుకొంటారు.

దేహాన్ని దుఃఖారామంగా గుర్తించిన బుద్ధుడు దుఃఖాన్ని మూడు విధాలుగా విభజించినాడు.

1. దుఃఖ - దుఃఖతా (Pain) 2) తాపదుఃఖతా (desire) 3) సంసారదుఃఖతా (attachment). "సంఖిత్తేన పంచౌపాదన ఖ్కందాపి దుక్ఖా" మేనుదాల్చిన ప్రతిజీవిలోని ఐదు ఉపాదానస్కంధాలు కూడా దుఃఖమయాలుగా గుర్తింపబడినవి.

1) రూప, 2) వేదనా, 3) సఞ్ఞా (సంజ్ఞా), 4) సంఖార (సంస్కార), 5) విఞ్ఞాన (విజ్ఞాన) స్కంధాలు.

ఈ దుఃఖ మీమాంసకు పరిష్కారంగా బౌద్ధులు 'ప్రతీత్యసముత్పాద వాదమును' కనిపెట్టినారు. దుఃఖంయొక్క ఎడతెగని లంకె (chain of causation) లను ఈ వాదంలో ప్రతిపాదించినారు.

(అవిజ్జా) అవిద్య → సంఖార (సంస్కార) → విజ్ఞాన (విజ్ఞాన) → నామరూప → షడాయతన → స్పర్శ → వేదనా → తృష్ణ → ఉపాదాన → భావ → జాతి (పుట్టుక) → జాతిమరణం (జన్మ రాహిత్యం).

దుఃఖానికిగల కారణసముదయాన్ని 12 అంశాలుగా దీనిలోగుర్తించారు. "కేవలస్యైవం ఏతస్య దుఃఖస్కంధస్య సంభవమ్" అని నాగార్జునుని మాధ్యమిక కారిక (26-9).

*"యథాక్షేపం క్రమాద్ వృద్ధః సంతానః క్లేశకర్మభిః*
*పరలోకం పునర్యాతీత్యనాది భవచక్రకమ్*
*యః ప్రతీత్య సముత్పాదో ద్వాదశాంగ త్రికాండకమ్"*

అని నాగార్జునుడు 'ప్రతీత్యసముత్పాదహృదయ' మనే గ్రంథంలో చెప్పాడు. కాబట్టి 'తృష్ణ'ను జయించి, దుఃఖనాశనంవలన అష్టాంగమార్గ ప్రవర్తకుడై శ్రమణుడు నిర్వాణముపొందవలెనని బుద్ధుని ఆదేశం.

న కహాపణ వస్సేన తిత్తి కామేషు విజ్జతి।
అప్ప స్సాదా దుక్ఖాకామా ఇతి విఞ్ఞాయ పణ్డితో॥ బుద్ధవగ్గో-8

బంగారువాన కురిసినా తృష్ణతీరదు. తృష్ణవలనకలిగే సంతోషం అల్పం. క్షణికం. కష్టం అత్యధికం. దీనినెఱిగినవాడే వివేకవంతుడు. 'అరియంచz ట్ఠాఙ్గికం మగ్గం దుక్ఖూపసమగామినం' ఆర్యసత్యములను ఆర్యాష్టాంగమార్గములను, లెస్సగా దెలియునది. "నిబ్బాణం పరమం వదన్తి బుద్ధా" నిర్వాణమే శ్రేష్ఠమైన బుద్ధుడు ప్రవచించెను.

జీవునివేదనకు మొదటచెప్పిన రెండు ఆంతరమైన కారణాలతోపాటు, రెండు బాహ్యమైన కారణాలనుగూడ విశ్వనాథవారు కల్పవృక్షంలో ప్రతిపాదించారు. ఈ ప్రతిపాదనకు ఆయన తర్కశాస్త్రాన్ని ఆశ్రయించారు.

ఒక ఉదాహరణ చూద్దాం —

తెలియగ దుఃఖశీలునకు దేశముకాలము రెండు బంధుతా
స్థలమున జొచ్చి యందు వ్యవధానముచేసి వ్యథన్ ఘటించ్చు, ను
త్తలపడ కాలమైన వ్యవధానము తండ్రికిగల్గె, దేశమై
కలిగెను తల్లికిన్ వగవగా నిదియేటికి నల్పమందునన్
— అరణ్య - పంచవటీ - 85 ప.

ఇవి శ్రీరామచంద్రుడు లక్ష్మణునికి చెప్పిన ఓదార్పుమాటలు. 1) దేశవ్యవధానము 2) కాలవ్యవధానము అను నీరెంటి వలన ఏర్పడుఎడబాటు జీవునికి దుఃఖహేతువౌతోంది! భార్యాభర్తలు ఎడబాటుపొందారు. దుఃఖం కల్గుతోంది. పూర్వరామాయణంలో సీతారాములు విడదీయబడ్డారు. అది కేవలం భౌతికమైన శోకమేనా? దానికంటే మించిన స్థితి ఆ శోకమునకున్నదా? ఉత్తరరామాయణంలో సీతారాములే విడిపోయినారు. ఆ స్థితిలో వారి దుఃఖం యొక్క స్థాయిఎట్టిది? ఈ రెండు అద్వైతభావనాసిద్ధి గల దుఃఖమని భవభూతి వ్యాఖ్యానించాడు. "అద్వైతం సుఖదుఃఖయోః...." అన్నశ్లోకమే దీనికిప్రబల ప్రమాణం. ఉత్తర రామాయణంలో సీతారాములమధ్య ప్రణయం ప్రేమదశను దాటి స్నేహదశచేరి అది అద్వైతసిద్ధికి దారితీసింది. ఇక్కడ కల్పవృక్షంలో ఆదృష్టితోనే కవి సీతారాముల ప్రణయాన్ని చిత్రీకరించారు.

కాలము అఖండమైనది. దానిని మానవుడు తన పరిమితబుద్ధితో వ్యవహారజ్ఞానముకొఱకు భూత వర్తమాన భవిష్యత్తులని మూడుగా వింగడించుకొన్నాడు. కాని, తత్త్వతఃకాలమొక్కటే! దిగ్దేశములును అంతే! అఖండమైనవి. "ఒక మహావిషయనిర్ధారణమునందు కాలఖండములయందున్న భావుకులకంటే అఖండకాలమునందున్న భావుకుల బుద్ధి ప్రమాణము" అని విశ్వనాథవారన్నారు (పద్యవిద్య, పుట-26)

ఇక్కడ లక్ష్మణుడు కాలదేశములను ఖండితమైన దిశలో చూచి దుఃఖించిన ఉపాధిగతుడైన జీవుడుకాగా, ఇవి రెండూ బాహ్యమైన కారణాలని చెప్పి ఓదార్చిన రాముడు అఖండకాలజ్ఞానముగల దార్శనికుడు — .

తర్కశాస్త్రం దీనినే ప్రతిపాదిస్తోంది!

"అతీతాది వ్యవహార హేతుః కాలః నచైకో విభుర్నిత్యశ్చ।
ప్రాచ్యాది వ్యవహార హేతుర్దిక్ సాచైకా విభ్వీనిత్యాచ॥ ॥-6, 7

పరావర వ్యవహారాసాధారణ కారణే పరావరత్వే
పృథివ్యాది చతుష్టయ మనోవృత్తినీ । తే ద్వివిధే —
దిక్కృతే, కాలకృతే చ । దూరస్థే దిక్కృతం పరత్వం ।
సమీపస్థే దిక్కృత మపరత్వమ్ । జ్యేష్ఠే కాలకృతం
పరత్వమ్ । కనిష్ఠే కాలకృత మపరత్వమ్।

— అన్నంభట్టు తర్కసంగ్రహ *(3-11)*

'పరమధర్మతర్కపటు'మైన రాముడు, అయోధ్య-పాదూ ఖండంలో పై దేశ, కాల స్వభావాలను అద్వైతదృష్ట్యా వ్యాఖ్యానించియున్నాడు.

**స్వస్వ నియమిత కాలైక దేశంబులైన జీవులకు**
**యౌగపద్యంబు యాదృచ్ఛికంబు. కాలైక దేశస్థం**
**బనిత్యంబు కాలం బొక్కటియు, నిత్యంబు.**
**అనిత్యంబైనది యున్నయట్లు భాసించునే గాని**
**నిజముగా లేదు. లేని దున్నదనుకొని నీయనుకొన్న**
**ప్రకారము లేనట్లు కనిపించినంత వగవనేటికి?"**

ఈ వచనంలో శ్రీశంకరులు శ్రీదక్షిణామూర్త్యష్టకంలో చెప్పిన "మాయాకల్పితదేశకాలకలనావైచిత్ర్య చిత్రీకృత"మైన జగత్తును, ఆ జగత్తులో లేనిది కల్పించుకుని దుఃఖించు వెఱ్ఱివారైన ప్రజల్ని రాముడు నిత్యానిత్యవివేకంతో, గొప్ప తర్కంతో, ఆర్ద్రహృదయంతో, ధార్మిక వేదనతో విమర్శించాడు. "ఇది యెల్ల మాయసంతకదోయీ!" [అయోధ్య -పాదూ 423] అన్నమాటలు దీనికి అద్వైతసారాంశం.

ఇలా దేశ, కాల వ్యవధానం వలన గలిగే ఎడబాటు దుఃఖమా? అంటే ఒకటి తాత్కాలికం! రెండవది శాశ్వతం! ఈ రెండవదాన్నికూడా అధ్యాత్మవిద్యావేత్తలు అంగీకరించడంలేదు. పునర్జన్మ సిద్ధాంతాన్ని భారతీయవేదాంతులు, క్రైస్తవులు, బౌద్ధులుకూడా అంగీకరించారు. కాబట్టి ఈ రెంటికంటే అతీతమైన కారణమేదో దుఃఖానికి మూలమౌతోంది! అది దేశకాలాతీతం! అదే అధ్యాత్మికశోకం! పునర్జన్మరాహిత్యం, పునరాగమనం లేని ముక్తి దానికి ఫలం! ఈ ఫలం పొందడానికే సార్వకాలికంగా జీవుడు వేదన పొందుచున్నాడు. ఇదే విశ్వజనీనమైన జీవుని వేదన! జీవాత్మ పరమాత్మయందు లీనంకావడంకోసం పడే "నిరంతర నిత్యవిరహదుఃఖం! నితాంత వ్యావల్గన్నిజభజన కృన్నిత్యవిరహీ!" అని

కల్పవృక్షం బాలకాండ - కళ్యాణఖండాంతపద్యం (303) లో విశ్వనాథవారు శివుణ్ణి సంబోధించినారు! కవి స్వర్గసుఖాలను కాంక్షించలేదు. 'క్షీణేపుణ్యం మర్త్యలోకం విశంతి' అని కదా గీతావచనం! కాబట్టి — "కీర్తిం స్వర్గఫలమాహుః' అన్న అలంకారికుల మాటను త్రోసిరాజని కవి యిలా అంటున్నాడు.

కృతిచే సమాత్తమగు గీ
రితి స్వర్గదమంతె, నే వరింపను స్వర్గం
బతిలోక చింతనాగ్ర
స్థితతేజము శివుడు నన్ను జెందెదుగాతన్!

అని కల్పవృక్షావతారికలో (49) కంఠోక్తిగా చెప్పాడు.

దుఃఖం స్వయంకృతమా? పరకృతమా? అనే వివేచనకంటే 'ప్రతీత్యజం' అనడం సముచితమని, 'అవిద్య-కల్పన' దీనికిహేతువులని మాధ్యమికకారికలోని దుఃఖపరీక్ష (12)లో ఆచార్యనాగార్జునుడన్నాడు. 'ప్రజ్ఞ'చే 'అవిద్య'ను 'వేదన'ను నశింపజేసి ఆధ్యాత్మిక శాంతిని సాధింపవచ్చునన్నాడు. మాధ్యమికవాదుల అభిప్రాయంలో ముక్తిని, విడుదలను అనుభవంలోనికి తీసుకురావడానికి 'శూన్యత' అంటే ఏమిటో యథార్థంగా తెలుసుకోవాలి.

"ముక్తిస్తు శూన్యతార్థ్యప్తే స్త దర్థాశేషభావనా
ఇదమేవ ఆచార్యపాదైర్యుక్తమ్।"

అని ప్రజ్ఞాకరమతి, బోధిచర్యావతార పంచికలో చెప్పాడు "సున్నో లోకో ఇతి ఉచ్చతి" అని చెప్పడానికి పూర్వం, బుద్ధుడు అవిద్యామోహములు మానవుని దుఃఖానికి మూలకారణాలని గుర్తించి, చివరికంతా 'శూన్య' మనడం దగ్గరే విభేదించి శ్రీ శంకరులు 'అధ్యాస'ను 'మాయా' వాదాన్ని స్థాపించి 'అద్వైతా'నికి పునాదులువేశారు.

'ఆత్మ'ఉన్నదాలేదా? అని బుద్ధుని ప్రధానశిష్యుడు ఆనందు డడిగినప్పుడు ఆయన 'మౌనం' వహించాడట! బహుశా ఉపనిషత్తుల్లో "ఉపశాంతోఽ యం ఆత్మా" అంటూ వాష్కలి అడిగిన ప్రశ్నకు బాహ్వుని సమాధానమే (Silence is the Atman) బుద్ధుని మౌనానికి ప్రేరకమై యుండవచ్చునని, అనిర్వచనీయమైన ఆత్మకు 'మౌనమే'సమాధానంగా బుద్ధుడు భావించాడని నాకనిపిస్తోంది! "గురోస్తుమౌనం వ్యాఖ్యానం శిష్యాస్తు ఛిన్నసంశయాః"

# 32. ఆలంకారికులు – శాంతరసవివేచన

భరతునితోకూడ ఆలంకారికుల్లో పదహారుమంది శాంతరసాన్ని అంగీకరించారు. భరతముని అష్టరసాలనే చెప్పాడని ప్రతీతి. కాని, నవమ రసంగా శాంతం చెప్పాడని కొందరు వాదిస్తారు. దీనికి ప్రబలాధారం అభినవుని 'అభినవభారతీ'వ్యాఖ్య. కాబట్టి భరతుడు మొట్టమొదటి శాంతరసవాదిగా అంగీకరింపవచ్చు.

"అథ శాంతోనామ శమస్థాయి భావాత్మకో మోక్షప్రవర్తకః
న తు తత్త్వజ్ఞానవైరాగ్యాశయ శుద్ధ్యాదిభిర్విభావైః
సముత్పద్యతే । తస్య యమ నియమాధ్యాత్మ ధ్యాన
ధారణోపాసన సర్వభూత దయాలింగ గ్రహణాదిభిరను
భావై రభినయః ప్రయోక్తవ్యః । వ్యభిచారిణశ్చాస్య
నిర్వేద స్మృతి ధృతి సర్వాశ్రమ శౌచ స్తంభరోమాంచాదయః
అత్రార్యాః శ్లోకాశ్చ భవంతి –
మోక్షాధ్యాత్మ సముత్థస్తత్త్వజ్ఞానార్థ హేతు సంయుక్తః।
నైః శ్రేయసోపదిష్టః శాంతరసోనామ సంభవతి॥
బుద్ధీంద్రియ కర్మేంద్రియ సంరోధాధ్యాత్మ సంస్థితోపేతః।
సర్వప్రాణిసుఖహితః శాంతరసోనామ విజ్ఞేయః॥
న యత్ర దుఃఖం న సుఖం నద్వేషో నాపి మత్సరః।
సమః సర్వేషు భూతేషు సశాంతః ప్రథితోరసః॥
భావా వికారారత్యాద్యాః శాంతస్తు ప్రకృతిర్మతః।
వికారః ప్రకృతేర్జాతః పునస్తత్రైవలీయతే॥
స్వంస్వం నిమిత్త మాసాద్య శాంతాద్భావః ప్రవర్తతే।
పునర్నిమిత్తా పాయేచ శాంత ఏవోపలీయతే।
ఏవం నవరసాదృష్టా నాట్యజ్ఞై ర్లక్షణాన్వితాః॥

దీనిపై అభినవుడేమన్నాడోచూతము. 'ప్రథమం రసాః తేచ నవ. శాంతాz పలాపిన స్త్వష్టావితి తత్ర పఠంతి' (1-267)

శాంతమే ప్రాథమికంగా రసమని తక్కిన రసాలన్నీ దీని రూపాంతరములన్నాడు. శాంతమునసర్వోత్కృష్టమైనరస మెట్లగుచున్నదనగా అది పురుషార్థములలో శ్రేష్ఠమైనమోక్షానికి సంబంధించినది కాబట్టి, అన్నాడు.

పైగా 'రసము' 'రసానందము' ఎప్పుడూ 'అలౌకికం' కాబట్టి ఈ అలౌకికత్వాన్ని, అనంతాన్ని శాంతమే బహుధానిరూపించగలదు. ఇతర రసాలకాశక్తిలేదు అన్నాడు.

"తస్మాదస్తి శాంతోరసః.... తత్ర సర్వరసానాం శాంతప్రాయ ఏవాస్వాదో, న విషయేభ్యో విపరివృత్యా. ఏవం తే నవైవరసాః"
(1-341) (1-339)

శాంతం ఒక్కటే ప్రకృతిరసం. తక్కిన రసాలన్నీ వికృతిరసాలు. శాంతం ఆత్మస్థానీయమైనది. అది స్థాయితమము. అనగా స్థాయికి స్థాయి. సర్వరసాలు శాంతంనుండే పుట్టి శాంతంలో లీనమౌతున్నాయి.

*"అత్ర సర్వ ప్రకృతిత్వాభిధానాయ పూర్వమభిధానమ్"*

"క్వచిచ్ఛమః" అని భరతుడు చెప్పగా, అభినవుడు – "ప్రతీయత ఏవేతి మునినా మప్యంగీక్రియత ఏవ 'క్వచిచ్ఛమః' ఇత్యాది వదతా"

"మోక్షేష్వధవిరాగిణః" అన్నదానిని వ్యాఖ్యానిస్తూ "హృదయసం వాదోఽపి తథావిధ తత్త్వజ్ఞాన బీజసంస్కార భావితానాం భవత్యేవ, యద్వక్షతి "మోక్షేష్వధ విరాగిణః" ఇతి.

కామం, పురుషార్థాల్లో ఒకటైనను మోక్షకామం కూడా కలదని భరతుడు చెప్పాడు.

*ధర్మ కామోఽర్థ కామశ్చ మోక్షకామస్తథైవచ॥* *(24-91)*

ఇది మహాభారతం అశ్వమేధపర్వం (12-16) లోని శ్లోకంతో సంవదిస్తోంది.

*యోమాం ప్రయతతే హంతుం మోక్షమాస్థాయ పండితః।*
*తస్య మోక్షరతి స్తస్య నృత్యామిచ హసామిచ॥*

శాంతరసానికి స్థాయిభావాన్ని నిర్దేశించడంలో వివిధాలంకారికులు వివిధంగా చెప్పారు. స్థాయిభావాలుగావారు నిర్దేశించినపేర్లు యిలావున్నాయి. శమము, నిర్వేదము, వైరాగ్యము, సర్వేంద్రియ ఉపరమము, తృష్ణాక్షయసుఖము, తత్త్వజ్ఞానము, సర్వచిత్తవృత్తిప్రశమము, అనుపజాత నిర్విశేషచిత్తవృత్తి, తృష్ణాక్షయసుఖమేశమము అని యిన్ని విధాలుగా చెప్పారు. వీనినొక పట్టికలో చూడవచ్చును.

| క్రమ సంఖ్య | ఆలంకారికుడు | గ్రంథం పేరు | శాంతరస స్థాయి | విశేషవివరణ |
|---|---|---|---|---|
| 1. | భరతముని (క్రీ.శ. 3వ శతాబ్ది) | నాట్యశాస్త్రం | శమము | వ్యభిచారిభావంగా నిర్వేదం పేర్కొన్నాడు. మోక్షకామాన్ని అంగీకరించాడు అభినవుడు. అభినవభారతీ వ్యాఖ్యలో దీన్ని సమర్థించాడు |
| 2. | రుద్రభట్టు | రసకలిక | శమము | శమం వైరాగ్యంచేతనే సాధ్యమన్నాడు. |
| 3. | రుద్రటుడు 9వ శతాబ్ది పూర్వార్థం | కావ్యాలంకారము | నిర్వేదం | శాంతరసంతో పాటు ప్రేయాన్ అనే పదవ రసాన్ని చెప్పాడు. |
| 4. | హరిపాల దేవుడు | సంగీత సుధాకరం | నిర్వేదం | శాంతరసానికి, బ్రహ్మరసానికి భేదమున్నదని బ్రహ్మరసానికి పార్యంతిక ఫలం మోక్షం అన్నాడు. నిర్వేద శాంతానికి రసస్థితి ఉందన్నాడు. |
| 5. | – | ప్రపంచ హృదయం | – | సర్వేంద్రియ ఉపరమమే శాంతమని చెప్పబడింది. |
| 6. | – | యోగద్వార సూత్రము | – | ప్రశాంత రసముగా చెప్పబడినది. |

| క్రమ సంఖ్య | ఆలంకారికుడు | గ్రంథం పేరు | శాంతరస స్థాయి | విశేష వివరణ |
|---|---|---|---|---|
| 7. | ఆనంద వర్ధనుడు (క్రీ.శ. 9వ శతాబ్ది) | ధ్వన్యాలోకము | తృష్ణాక్షయ సుఖము | శాంతరసస్థితి 'అహంకార ప్రశమైక రూపము'గా నుండుననగా, లోచన వ్యాఖ్యాత అభినవుడు అహంకారప్రశమన'మనగా నిరీహత్వ'మన్నాడు. 'తృష్ణా క్షయసుఖ'మనే స్థాయిభావ నిర్ణయంపై బౌద్ధదర్శన ప్రభావ మున్నదని అస్మద్గురు పాదులనిశ్చితాభిప్రాయం. |
| 8. | భట్ట నాయకుడు (క్రీ.శ. 920) | సహృదయ దర్పణము | – | శృంగారాదులు రసాలు, శాంతం 'మహారసం' అన్నాడు. ఇతడు వస్తు ధ్వనిని తిరస్కరించి 'రసధ్వని'ని సమర్థించిన వాడని అభినవుడన్నాడు. |
| 9. | తౌతభట్టు (క్రీ.శ. 950) | కావ్య కౌతుకము | – | సర్వరసాలలో ప్రధానతమం, మోక్షఫలంగలది శాంతమన్నాడని అభినవుడు చెప్పాడు. |
| 10. | అభినవ గుప్తుడు క్రీ.శ. 920 - 1020 | a)నాట్యశాస్త్ర వ్యాఖ్యానం 'అభినవ భారతి' | – | భరతుడు శాంతరసాన్ని ప్రతిపాదించినవారిలో ప్రథముడని, అతడు నవరసవాది యని సమర్థించినాడు. |

| క్రమ సంఖ్య | ఆలంకారికుడు | గ్రంథం పేరు | శాంతరస స్థాయి | విశేషవివరణ |
| --- | --- | --- | --- | --- |
| | | b)ధ్వన్యాలోక వ్యాఖ్య 'లోచనము' | – | కాని, స్థాయి భావనిర్ణయంలో ఆనంద వర్ధనుని 'తృష్ణాక్షయ సుఖాన్ని' సమర్థించాడు. ఈ స్థాయి నిర్దేశంలో విభిన్నమతాలున్నాయని పేర్కొన్నాడు. 1) తత్త్వజ్ఞానం, 2) సర్వ చిత్తవృత్తిప్రశమము, 3) అనుపజాతనిర్వేశేష చిత్తవృత్తి |
| 11. | ధనంజయుడు క్రీ.శ.974 -1000 ధనికుని 'అవలోకమ'నే వ్యాఖ్య | దశరూపకము | – | అభినవుని సమకాలీనులైన ధనిక ధనంజయులు ధ్వనిని తిరస్కరించిన వారు. మోక్షావస్థగాని, ఆత్మ స్వరూపావగతిగాని అనిర్వచనీయం గావుననే శ్రుతికూడ 'నేతి నేతి' అన్నదని కాబట్టిశాంతాన్ని రసంగా అంగీకరించడం కుదరదన్నారు. |
| 12. | భోజుడు (క్రీ.శ. 1005 - 1050 | a)సరస్వతీ కంఠాభరణం b)శృంగార ప్రకాశము | – | రసాలు ఎక్కువలేవు. శృంగారమొక్కటేరసం అని భోజుని అభిమతం కాని ప్రేయస్, శాంతం, ఉదాత్త, ఉద్ధతరసాలను చెప్పి ఉదాత్తరసాన్నే ఊర్జస్వి అన్నాడు. |

| క్రమ సంఖ్య | ఆలంకారికుడు | గ్రంథం పేరు | శాంతరస స్థాయి | విశేషవివరణ |
|---|---|---|---|---|
| 13. | శారదా తనయుడు | భావ ప్రకాశము | – | రజస్తమోగుణాలు పూర్తిగాతొలగిపోయినపుడు చిత్తము సత్త్వావస్థలో నుండగా జనించునది శాంతరసమన్నాడు. |
| 14. | హేమచంద్ర సూరి (క్రీ.శ. 1088 - 1178) | కావ్యాను శాసనము | తృష్ణాక్షయ సుఖమే శమము | ఇతడు ఆనందవర్ధనుని అనుయాయి యైనను 'తృష్ణాక్షయ సుఖమే 'శమము'గాచెప్పినాడు. |
| 15. | (ద్వితీయ) సింగ భూపాలుడు (క్రీ.శ. 1385 - 1397) | రసార్ణవ సుధాకరము | | శాంతాన్ని, ఉదాత్తరసంగా అంగీకరించినాడు. 'నిర్వేదం' శాంతరసస్థాయి యని కొందరన్నారు! అదెట్లు? అని విమర్శించినాడు. |
| 16. | రూపగోస్వామి (క్రీ.శ. 1490 - 1563) | ఉజ్జ్వల నీలమణి | – | ఆనందవర్ధన, భట్టనాయక, అభినవుల శాంతరసమే ఈయన రచనలో భక్తిరస మైనది. వైష్ణవసంప్రదాయంలో భక్తియే శృంగార రూపము ధరించినది. |
| 17. | జగన్నాధ పండితుడు క్రీ.శ. 1600-1680 | రసగంగా ధరము | – | అభినవుని వేదాంతిమతము ననుసరించినవాడు. అద్వైతవాదిగా, రసధ్వనిని సమర్థించినాడు. శాంత రసాన్ని అంగీకరించాడు. |

ఆనందవర్ధనుడు శమాన్నిగాని, నిర్వేదాన్నిగాని శాంతరసస్థాయి భావంగా గుర్తించక అలంకారికులెవ్వరూ ఊహించని రీతిలో 'తృష్ణా క్షయసుఖము'ను స్థాయిభావంగా నిర్ణయించినాడు.

"శాంతశ్చ తృష్ణాక్షయ సుఖస్య యః పరిపోషః
తల్లక్షణోరసః ప్రతీయత ఏవ. . . . . యది నామ
సర్వజనానుభవగోచరతాతస్యనాస్తి,
నైతావతా సావలోక సామాన్య మహానుభావ చిత్త
వృత్తివిశేషః ప్రతిక్షేప్తుం శక్యః తథా చోక్తమ్—
యచ్చకామసుఖం లోకే యచ్చదివ్యం మహత్సుఖమ్।
తృష్ణాక్షయ సుఖస్యైతే నార్హతః షోడశీ కలామ్"

—ధ్వన్యాలోకమ్ III-26

దీనికి అభినవగుప్తుల 'లోచన' వ్యాఖ్య యిట్లున్నది—

తృష్ణానాం విషయాణాం యః క్షయః సర్వతో
నివృత్తిరూపః నిరోధః తదేవసుఖం తస్య యః
స్థాయీభూతస్య పరిపోషః రస్యమానతా కృతః
తదేవ లక్షణం యస్యస శాంతోరసః"

ఆనందవర్ధనుడు శాంతరసము 'అహంకారప్రశమైకరూప'మైనదని చెప్పగా, లోచనకారుడు 'అహంకారప్రశమన' మనగా 'నిరీహత్వ'మని వ్యాఖ్యానించాడు 'ఈహ' కు వ్యతిరేకపదం 'నిరీహ'. 'సేహానీరహాము' లనే ద్వంద్వ సమాసాన్ని వేదాంతులు వాడుతుంటారు. "ఈహంతే కామభోగార్థం" అని గీతాకారుడు వాడాడు (16-12). అంటే ఏమి? నిరీహుడైనవాడు శాంతిని పొందుతున్నాడు. విహాయ కామాన్ యస్సర్వాన్ పుమాంశ్చరతి నిస్స్పృహః। 'నిర్మమో నిరహంకారః స శాంతిమధిగచ్ఛతి' అని గీత. (2-71)

## 33. తృష్ణాక్షయసుఖము – బౌద్ధదర్శన ప్రభావము

"ఓం శాంతి శ్శాంతిశ్శాంతిః" అనేది ఉపనిషత్తుల్లో శాంతిపాఠం కావచ్చుకాని, శాంతరసమునకు స్థాయియేది? అని నిర్ణయించేపట్ల

ఆలంకారికుడైన ఆనందవర్ధనుని బౌద్ధదర్శనం ప్రభావితంచేసిందని, అసలు శాంతరసనిర్మాణం వెనుకే బౌద్ధమత ప్రభావముందని అస్మద్గురుపాదులు ఆచార్య తుమ్మపూడి కోటీశ్వరరావుగారు అభిప్రాయపడుతున్నారు. దానికి నేను కొన్నికారణాలను యిక్కడ ప్రతిపాదిస్తున్నాను.

1. ఆనందవర్ధనుడు తార్కికుడు, మీమాంసకుడు, వైయాకరణుడేకాదు, ధర్మోత్తరుడు రచించిన "వినిశ్చయ" మనే బౌద్ధగ్రంథంపై వ్యాఖ్య వ్రాశాడు. అంతేకాదు, 'తత్వాలోక'మనే వేదాంతగ్రంథంకూడా వ్రాశాడు. దీనివల్ల బౌద్ధమతంతో బౌద్ధ 'దర్శనం'తో ఆయనకు సన్నిహిత పరిచయం ఉందని తెలుస్తోంది.

2. బౌద్ధదర్శనంలో 'తృష్ణ' దుఃఖానికి మూలంగా చెప్పబడిందని ప్రతీత్యసముత్పాదవాదంమూలంగా, ధమ్మపదంద్వారా ముందే నిరూపించడం జరిగింది. ధమ్మపదంలోని 'తణ్హావగ్గం' దీనికి ప్రబలప్రమాణం. 'తణ్హక్ఖయో సబ్బదుక్ఖం జినాతి' (24-21) తృష్ణాక్షయము సర్వదుఃఖక్షయమునకంటె నుత్తమము. ఇదే ఆనందవర్ధనునికి ప్రేరకమైందని నా ఊహ!

3. 'శాంతము' 'శాంతి' అనేమాటకు పర్యాయపదంగా బౌద్ధదర్శనంలో 'సుఖం' అనేమాటను సర్వేసర్వత్రవాడుతారు. 'తృష్ణాక్షయ సుఖము' అని ఆనందవర్ధనుడు ప్రయోగించడంలో బౌద్ధదర్శన ప్రభావానికిలోనైనాడని స్పష్టంగా చెప్పవచ్చును. 'శాంతి' అనే అర్థంలో భగవద్గీతయందు 'సుఖ' శబ్దం ఏడుసార్లు ప్రయోగింపబడింది.

4. 'మోక్ష'మనే మాటకు పర్యాయపదంగా 'నిర్వాణము'అనే పదాన్ని బౌద్ధులెక్కువగా ప్రయోగిస్తారు. ప్రస్థానత్రయంలో ఒకటైన భగవద్గీతలో 'మోక్ష' శబ్దం 13 సార్లు ప్రయోగింపబడినా,తత్పర్యాయపదాలైన 'పరాంగతిమ్' పరమాంగతిమ్, విముక్తి, ముక్తి, అమృతం, అవ్యయపదం మొదలైన పదాలు వాడినప్పటికీ తృప్తిలేక గీతాకారుడు బౌద్ధులు తరచువాడే 'నిర్వాణ' శబ్దాన్ని ఐదుసార్లు ప్రయోగించియున్నాడు. 'బ్రహ్మనిర్వాణం' అనేప్రయోగం 4సార్లు 'శాంతిం నిర్వాణపరమాం' అని ఒకసారి ప్రయోగింపబడినవి. అలాగే బౌద్ధులు తరుచూవాడే 'ప్రజ్ఞా' అనేది జ్ఞానశబ్దానికి పర్యాయపదం. దీన్ని గీతాకారుడు ఆరుసార్లు ప్రయోగించినారు. 'శాంతి' శబ్దాన్ని 12 సార్లు వాడినాడు. దీన్ని బౌద్ధులు 'సుఖ'మనే మాటతో ప్రస్తావించారు.

ఇలాంటి కొన్ని కారణాలవల్ల బౌద్ధదర్శనప్రభావం అద్వైతంమీదా, విశేషించి శాంతరసనిర్మాణంమీద, తత్రాపి శాంతరసస్థాయి భావమైన "తృష్ణాక్షయసుఖం" మీద పనిచేసిందని నాకనిపిస్తోంది. గీతలో 'తృష్ణా' శబ్దం ఒక్కసారే ప్రయోగింపబడినా, సురేశ్వరులు దానిని ప్రపంచించటం మూలంగా, అది శాంతరసస్థాయిభావంగా ఆనందవర్ధనులు గ్రహించారనిపిస్తుంది! వీటన్నిటికీ మించి ఆనందవర్ధనుని మీదనే బౌద్ధదర్శన ప్రభావంవుందని చెప్పటం సమంజసమనిపిస్తుంది!

శ్రీసురేశ్వరాచార్యుల తైత్తిరీయోపనిషద్భాష్య వార్తికం (బ్రహ్మవల్లి 22, 24 శ్లో.) నైష్కర్మ్యసిద్ధి (II, 6, III -48) సంబంధభాష్యవార్తికము (శ్లో. 303) లలో 'తృష్ణా' శబ్దము ప్రయోగింపబడినవి.

అవిద్యోద్భూత తృష్ణేన పుంసా యత్కల్పితం ఫలమ్।
అనంత ఫలసిద్ధ్యర్థం తదనూక్తిః ప్రవృత్తయే॥

— తై. భా.వా., బ్రహ్మవల్లి, 1-22 శ్లో.

"(The Sruti) relates the fruit, figured by a man whose thirst is caused by ignorance, to make (a man) active for the sake of establishing an infinite result".

Thirst (తృష్ణా): the craving for happiness in this world and the next (అభ్యుదయ). వేదాంతపరిభాషల్లో 'తృష్ణా'శబ్దం అతిప్రాచీనమైంది. Here it may be equated with కామ or రాగద్వేష. The truth relates the result of the meditation which is finite to direct a man's activity to an infinite result viz., release (మోక్ష).

క్షయిష్ణు సాధనాధీనం ఫలం బుద్ధ్వా వితృష్ణతః।
కామహేతో రనుచ్ఛిత్తే రవరాత్పర మీప్సతి॥

— తై. భా.వా., బ్రహ్మవల్లి 1-24 శ్లో.

"Because (ignorance), **the cause of desire,** is not destroyed as a result of **freedom from desire** (which freedom originates when one) has perceived. "A result, dependent on a means, is perishable" one wishes (to attain therefore) something which is higher (viz., release) than (this) lower (world)".

It does not suffice to give up ritual acts only when one desires release. For by giving up ritual acts one becomes

free from thirst or desire, but destroying ignorance is possible only by means of its opposite; Knowledge. In the last resort knowledge is attained by understanding the Basic propositions (మహావాక్యములు) and ultimately వైరాగ్య "freedom from desire" is followed by the striving after release (ముముక్షుత్వమ్).

వా విరక్తస్య సంసారా న్నివివృత్సా తతో భవేత్।
న చానివృత్త తృష్ణస్య పురుషస్య ముముక్షుతా॥

— నైష్కర్మ్యసిద్ధి, II-6

ఇహలోకంపై వైరాగ్యాన్ని అలవరచుకోనకపోతే, సర్వసంగ పరిత్యాగమునకు సిద్ధపడకపోతే, తృష్ణను సమూలంగా నాశనంచేయకపోతే, పురుషునికి ముక్తివైపు అభిముఖ్యముకలుగదు.

తృష్ణా విష్ణవవైర్నామ్నా ప్రత్యక్షాద్యైః ప్రమీయతే।
ప్రత్యగాత్మత్వ హేతో శ్చ స్వార్థత్వా దప్రమేయతః॥

— నైష్కర్మ్యసిద్ధి, III-48

ఏది ధానికదే అంతముకానిదో, అనంతముగా నున్నదో, ఏది తెలియబడదగినదో 'తృష్ణ'కులోనైనవాడు (కర్మేంద్రియపంచకముచే) భావించుపద్ధతిలో ఏది తెలియబడదో, అట్టి ప్రత్యగాత్మ అప్రమేయమైనది.

అసార ఫలసంప్రాప్తిః పుమర్థో నేష్యతే యతః
తృష్ణయా సాధయన్ ప్రీతిం న ప్రీతి లవమిచ్ఛతి॥

— సంబంధ భాష్యవార్తికమ్ శ్లో. 303

మానవుడు తన పురుషకారప్రయత్నానికి ఫలితంగా అసారమైనఫలాన్ని ఎలాకాంక్షించడో, అలాగే తృష్ణగలిగినవాడు ఉన్నతమైన ఆనందాన్నే అభిలషిస్తాడుగాని కాసంతసుఖానికే తృప్తిపడడు.

పై విచారణకంతటికీ ఫలశ్రుతిగా సురేశ్వరులు తైత్తిరీయోపనిషద్భాష్య వార్తికములో ఈ 'తృష్ణ' — భౌతికతృష్ణ కాకుండ ఆధ్యాత్మిక తృష్ణ (Spiritual longing) యైనచో సాధకునికి మహావాక్యములు అనుభవంలోనికి వస్తాయన్నారు. "నదీతీరంలో ఫలాలున్నాయి" అన్న వాక్యంలో ఫలాన్ని మోక్షఫలంగా — అది మహావాక్యానుభవసాధ్యంగా సమన్వయించి, అద్వైతానందానుభూతిని వ్యాఖ్యానించారు.

నద్యాస్తీరే ఫలానీవ ప్రత్యక్షాద్యనపేక్షతః
కిమి వేహాన్యమానేషు తవాపేక్షాఽభిధాశ్రుతేః॥ — బ్రహ్మవల్లి 9-16

If something in the world is the object of knowledge, then there is dependence on something else with regard to understanding as (when it is said) "on the shore of the river (are) fruits". How (are) you (able to) depend for అభిధాశ్రుతి as other means of valid knowledge, when there is no dependence on sensory perception etc.,?"

"On the shore of the river are fruits (నద్యాస్తీరే ఫలానిసంతి) cited also in నైష్కర్మ్యసిద్ధి III-47, is quoted from శబరస్వామి కృత మీమాంసా సూత్రభాష్యమ్. The word అభిధాశ్రుతి denotes those passages from the upanishads, which contain a mere utterance, a contradistinction to niyoga or Vidhi. Among the former are the four (మహావాక్యాలు) Mahavakyas "Basic propositions" Viz.,

1. "తత్ త్వం అసి" (ఛాందోగ్యోపనిషత్ 6-8-7)
2. "అహం బ్రహ్మాస్మి" (బృహదారణ్యకోపనిషత్ 1-4-10)
3. "అయమాత్మా బ్రహ్మ" (బృహదారణ్యకోపనిషత్ 2-5-19)
4. "సర్వం ఖలు ఇదంబ్రహ్మ" (ఛాందోగ్యోపనిషత్ 3-14-1)

## 34. కల్పవృక్షం – శాంతరసం

వ్యాస మహాభారతంలోని శాంతిత్రయం, ఆశ్రమవాసచతుష్టయాలపై బౌద్ధవాఙ్మయంలోని అనేకశ్లోకాలకు అనువాదాలు ప్రక్షిప్తరూపంగా ప్రవేశించాయి. దీనివల్ల బౌద్ధులనుండే మనవేదాంతులు అనేకభావాలు ఎరువుతెచ్చుకొన్నారనడం నాఅభిప్రాయంకాదు, అభిమతమూకాదు.

బౌద్ధ, హిందూవేదాంతాలలో ఆదానప్రదానాలు ఇరువైపులాజరిగాయి. పాతంజలయోగ సూత్రాల్లోని 'ధర్మమేఘసమాధి' లక్షణాన్ని, బౌద్ధులు దశవిధభూమికల్లో అత్యున్నతమైన 'ధర్మమేఘ భూమిక'గా స్వీకరించారని నేను నా సిద్ధాంతగ్రంథం తొలిసంపుటం, "పీఠిక - భూమిక భారతీయసంప్రదాయనేపథ్యం" (1989)లో నిరూపించాను.

ఆనందవర్ధనుల 'తృష్ణాక్షయసుఖా'న్ని బహుధా సమర్థించిన అభినవ గుప్త పాదులు కాశ్మీరశివాద్వైతి. శ్రీశంకరుల అద్వైతానికి, కాశ్మీరశైవానికి పెద్ద భేదమేమిలేదు. పైగా 8, 9 శతాబ్దాల్లో కాశ్మీరదేశంలో బౌద్ధమతప్రభావముండినదని చారిత్రకులు చెప్పారు. అందుకే అభినవులు భగవద్గీతకు, 'గీతార్థసంగ్రహ'మనే భాష్యం వ్రాసి కాశ్మీరశైవాన్ని స్థాపించారు.

శంకరభగవత్పాదుల గురువు గోవింద భగవత్పాదులు. ఈయనకు గురువు గౌడపాదుడు. ఈయన వ్రాసిన మాండూక్యకారికలపై బౌద్ధ మతప్రభావమున్నది. ఈ దృష్టితో పరిశీలించినప్పుడు శ్రీశంకరుల 'సన్యాసాశ్రమ' దీక్షకు, బౌద్ధులు విరివిగా ప్రచారంచేసిన 'సన్యాసాని'కి దగ్గరితనముందని పండితులు ఒప్పుకొన్నారు.

జైన, బౌద్ధులు విశృంఖలంగా ప్రచారంచేసిన అహింసా, సన్యాసాశ్రమాలవల్ల భారతజాతి నిర్వీర్యమై పరదేశీయుల ఔద్ధత్యానికి, ఆక్రమణకు లొంగిపోయి దాసానుదాసులై జీవశక్తినికోల్పోయినవి. కాని భారతీయ వేదాంతంలోని 'అహంబ్రహ్మాస్మి' తత్ త్వం అసి' 'అయమాత్మాబ్రహ్మ' "సర్వంఖలు ఇదంబ్రహ్మ" అన్న అద్వైతమహావాక్యాలు, "జీవోబ్రహ్మైవ నాపరః" అని చెప్పిన శ్రీశంకరుల భాష్యాలూ, భగవద్గీతలో ఐదవ అధ్యాయంలో సన్యాసకర్మయోగాల్లో కర్మయోగమే గొప్పదని చెప్పడం భారతీయులు నిర్వీర్యులనుగాకుండ నిలబెట్టినది. ఆత్మోన్నత్యాన్ని ఆస్తికత్వాన్ని, ఉనికిని సమర్థించినవి.

రామాయణ కల్పవృక్షంలో రాముడు పండ్రెండేండ్లకే వివాహితుడై వైరాగ్యాన్నిపూని వసిష్ఠుని వద్దకుపోయి వేదాంతప్రశ్నలు వేయగా ఆయన మౌనంవహించారు. బాలరాముని అంతర్మథనాన్ని గుర్తించిన అరుంధతి ఆయనకు 'కర్మయోగాన్ని' బోధించి కర్మవీరుణ్ణిగా తీర్చిదిద్దుతుంది. ఇలా కల్పవృక్షకర్త శాంతరసాన్ని కావ్యంలో ప్రతిపాదించినా అద్వైతదృష్ట్యా శాంతరసాన్ని మలచడంవల్ల వ్యక్తి ఆత్మగౌరవం దెబ్బతినకుండా లోకాన్నికూడా కలుపుకొనిపోయే విశిష్టమార్గాన్ని నిర్దేశించారని తెలుస్తోంది! ఇది ఈనాటి యువకులకు మార్గదర్శకంగావుంది!

వాల్మీకి రామాయణంలో అంగిరసం కరుణమనీ, వ్యాసభారతంలో ప్రధానరసం శాంతమనీ ఆనందవర్ధనులు ధ్వన్యాలోకంలో కంఠోక్తిగా చెప్పారు.

"రామాయణే హి కరుణోరసః స్వయమాదికవినాసూత్రితః
"శోకః శ్లోకత్వమాగతః" ఇత్యేవం వాదినా! నిర్వ్యూఢశ్చ
స ఏవ సీతాత్యంతవియోగపర్యంతమేవ స్వప్రబంధముపరచయతా!"
"శోకార్తస్యప్రవృత్తోమే శ్లోకోభవతు నాన్యథా" I. 2.18

"మహాభారతేఽపి శాస్త్రరూపే కావ్యచ్ఛాయాన్వయిని
వృష్ణిపాండవ విరసావసాన వైమనస్యదాయినీం సమాప్తి
మువనిబధ్నతా మహామునినా వైరాగ్యజనన తాత్పర్యం
ప్రాధాన్యేన స్వప్రబంధస్య దర్శయతా మోక్షలక్షణ
పురుషార్థః శాంతోరసశ్చ ముఖ్యతయా వివక్షావిషయ
త్వేన సూచితః । ..... శాంతస్యైవ రసస్యాంగిత్వం
మహాభారతే..... దర్శితం తు వ్యంగ్యత్వేన, 'భగవాన్
వాసుదేవశ్చ కీర్త్యతేఽత్ర సనాతనః' ఇత్యస్మిన్
వాక్యే..... కావ్యనయేచ తృష్ణాక్షయసుఖ పరిపోష
లక్షణః శాంతరసో మహాభారత స్యాంగిత్వేన వివక్షిత
ఇతి సుప్రతిపాదితమ్। అత్యంతసారభూతత్వా
చ్చాయమర్థో వ్యంగ్యత్వే నైవదర్శితో నతు వాచ్యత్వేన"
—ధ్వన్యాలోకం చతుర్థోద్యోతమ్

వ్యాస మహాభారతంలో అంగిరసం శాంతమని ఈనాడు క్రొత్తగా నిరూపించవలసిన పనిలేదు. కాని,

ప్రసిద్ధేఽపి ప్రబంధానాం నానారసనిబంధనే।
ఏకోరసోఽంగీ కర్తవ్యస్తేషా ముత్కర్ష మిచ్ఛతా॥
నంతి సిద్ధరసప్రఖ్యా యేచ రామాయణాదయః
కథాశ్రయా నతైర్యోజ్యా స్వేచ్ఛారసవిరోధినీ॥ —తృతీయోద్యోతం.

అని చెప్పిన ఆనందవర్ధనాచార్యులవారి హెచ్చరిక ననుసరించి చూడగా వాల్మీకి నిరూపించిన కరుణరసాన్ని కాదని కల్పవృక్షంలో విశ్వనాధ శాంతరసాన్ని నిరూపించారు.

"ప్రాగ్వివశ్చిన్మతంబున రసము వేఱు
రెట్లు గొప్పది నవకథాదృతిని మించి"

తత్త్వము, రసధ్వనులకు ప్రాధాన్యమిత్తునని 'అవతారికలో' చెప్పి నారు. ఒకప్రసిద్ధ ప్రబంధంలోని ప్రసిద్ధరసాన్నికాక మరొకప్రసిద్ధరసాన్ని నిరూపింపదలచినప్పుడే కవికి 'గొప్ప ప్రతిభ' యుండితీరవలయును.

"కవి ప్రతిభలోన నుండును కావ్యగత
శతాంశములయందు తొంబదియైనపాళ్లు"

అన్నారు విశ్వనాథ కల్పవృక్షంలో. అంగిరసం శాంతంగా నిరూపింప దలచిన విశ్వనాథ, కావ్యనాయకుడైన శ్రీరామచంద్రుని పాత్రను మొద టినుండి మలచినతీరు ఏతద్రసానుగుణంగా ఎలాప్రవర్తించిందనే అంశం పరిశీలనార్హమౌతోంది!

ఒక మహారాజపుత్రుడై, జ్యేష్ఠతనయుడై, రాజభోగములనుభవింపవ లసిన యౌవనావస్థలో, పట్టాభిషిక్తుడు కావలసిన తరుణంలో రాజ్యా ధికారాన్ని, సకలైశ్వర్యభోగాలను తృణప్రాయంగాత్యజించితండ్రిమాటను నిలబెట్టడానికై అడవులదారిపట్టిన శ్రీరామునిపాత్రను విశ్వనాథ బాల కాండలోనే మలచినతీరు అద్వైతస్థాపనకు, శాంతరస నిరూపణకు అను గుణంగానున్నవి.

శ్రీరామచంద్రుడు అయోధ్యాప్రస్థానఖండంలో (294-97) అడవు లకుపోతూ తల్లితండ్రులనుద్దేశించి అన్నమాటలు ప్రతిపారకుని ఉద్దేశిం చిఅన్నవే!

*1. యతియును మృతుడును లోకపుగతివారలుకారు.*

*2. సంసారులు మీరలు, నిస్సంసారుడనేను, నేమిసంబంధము?*
*ప్రధ్వంసముపొందిన భోగరిరంసామ తోడ మీకురామునితోడన్*

*3. మీరెవ్వరు? నేనె, వ్వారికి నెవ్వరు? విమూఢభావనకాకన్*
*స్వారాజ్యవినుతుడౌ నను నీరాజ్యములోభపెట్టునే?*

అన్నాడు. రెండవపద్యంలో "ప్రధ్వంసము పొందినభోగరిరంస" యే ఆనందవర్ధనుడు చెప్పిన 'తృష్ణాక్షయము'. ఇదియే శాంతరసస్థాయి! రమించే ఇచ్ఛకు 'రిరంస' అనిపేరు! 'ప్రధ్వంసము' అనగా నాశనము. భోగమనగా భౌతికభోగములు. కాబట్టి భౌతికభోగరమణమైన తృష్ణను కోర్కెను సమూలంగా నాశనంచేయుటయే "తృష్ణాక్షయ సుఖము"!

అని విశ్వనాథ నిరూపించినారు. ఈ నిస్సంసారి ఆత్మ 'స్వారాజ్య'-సుఖము కోరుకొనునేకాని పట్టి రాజ్యసుఖము కోరదు. స్వాంతసుఖమే 'స్వారాజ్యసుఖము'. అది తృష్ణాక్షయముచేతనే సాధ్యము. ఇది శాంత రసస్థాపన! ఇది కవిప్రతిభ! వాల్మీకివ్రాసిన రామకథలోనే శాంతరసానికి కావలసినబీజం నిక్షిప్తమైఉండగా దానిని విశ్వనాథవారు పోషించి ఆవి ష్కరించినారు.

మూడవపద్యం రఘునాథనాయకుని వాల్మీకిచరిత్రలో వాల్మీకి చెప్పిన పద్యాలను స్మృతికితెస్తోంది. (2-147, 149)

"సతియెవ్వరు సుతుడెవ్వరు హితులెవ్వారేటివఱద నెందో నొకచో
జతగూడినకాష్ఠంబుల గతినించుక గూడి విచ్చికదలుదు రవలన్"
"మీరెవ్వరు? మేమెవ్వరు? నేరములెంచక చనుండు నిలువకయెటకే
శ్రీరఘుపతియే నాకు నకారణబంధుండు గురుండు గణుతింపంగన్"

శ్రీమాన్ ఎస్.టి.జి. వరదాచార్యులుగారు, "నచేత్ వాల్మీకిరథ విష్యత్" అనే వాల్మీకిప్రశంసలోకరుణాన్ని మించి శమాన్నే మహర్షి నిర్వహించినారంటూ వ్రాసిన శ్లోకాలు విశ్వనాధవారి శాంతరస నిరూ పణకు ప్రోద్బలకంగా వున్నాయి.

సంసారాబ్ధి పరిభ్రాంతా వష్టదిగ్వాయుభీరసైః।
స్వస్థానావస్థితిః శాంతిః పోతస్యాస్తి శరీరిణః।

సంసారమను సాగరమున రసములను అష్టదిక్కులనుండి సమముగ వీచు వాయువులచే జీవియనునావ తనస్థానముననే నిలచుట 'శాంతి' యనబడును.

చక్రస్యారా యథానాభేః శమాదన్యేరసాస్తథా।
అష్టోద్భూతాః పునస్తస్య స్థితా నాయాంతి హేతుతామ్॥

ఏవిధముగ చక్రపునాభినుండి పుట్టిన (ఇరుసునుండి పుట్టిన) ఆకులు తిరిగి ఆనాభి యునికికే హేతువగునో అట్లే శమమువలన పుట్టిన తక్కిన రసములా శమస్థితికే కారణమగును.

సామ్యావస్థా శమోఽవ్యక్తం రసాస్తత్పరిణామజాః।
పరిపోషం యదాయాంతి యాంతి తద్రూపతాం తదా॥

సాంఖ్యమతానుసారము సర్వరసముల సామ్యావస్థయగు శమము అవ్యక్తమనబడును. రసములన్నియు దానిపరిణామముచే వేర్పడినవే. అవియెపుడు పరిపుష్టినందునో అపుడవి మరల శమ అవ్యక్తరూపమునం దును.

ఇలా సాంఖ్యాన్ని అనుసరించి వాల్మీకి అవ్యక్తమైన శమాన్ని నిరూ పించడంవల్లనే, విశ్వనాథ కల్పవృక్షంలో యౌవనంలోనే 'భోగలిప్సా ప్రధ్వంసము' (తృష్ణానాశనము) చేసిన రాముని 'స్వారాజ్యసుఖాన్ని' — ఆత్మస్వారాజ్యసుఖాన్ని — 'స్వాంతసుఖాన్ని' 'శాంతం'గా నిరూపించినారు. 'రాజ్యకాంక్ష'ను తృణప్రాయంగా త్యజించిన రాముడు శాంతరసస్వరూపుడు!

| | | |
|---|---|---|
| శ్రీరామునికి | = | 12వ యేట పెండ్లి |
| (12+6) | = | 18వ యేట సంసారప్రారంభం |
| (18+6) | = | 24 ఆరేండ్లలో సంసారవైరాగ్య భావసమ్మేళనం |
| (24+14) | = | 38 అరణ్యవాసం 14 యేండ్లు |
| | | 38 యేట రావణసంహారం. |

అనూచానంగా రామాయణంలో అందరూచెప్పే రామావతార రహ స్యశిల్పాలు అటుండనిచ్చి, రామాయణకల్పవృక్షంలో తాటకవధ, అహ ల్యాఘట్టం నుండియే బాలరామునిలో "జీవునివేదన" (పంౘ్రెండవయే టనే) ఉద్బుద్ధమైనదని విశ్వనాథ నిరూపిస్తూవచ్చారు. ఆ వివరాలు పూర్వపుటల్లో వ్యాఖ్యాతమైనాయి.

ఈ 'జీవకారుణ్యం' విశ్వనాథవారి కవిత్వంలో అంతర్గతమైన అంత ర్వాహిని యైన కరుణారసస్రవంతి! దీనికి 'జీవునివేదన' అనేపేరుపెట్టి పునాదిగాచేసి శాంతరస మహాసౌధాన్ని నిర్మించారు విశ్వనాథ! బాల్య కాలంలోనే రామునిలోని ఈ జీవునివేదన వివాహానంతరం క్రమంగా వైరాగ్యభావనకు దారితీసినది. రామునిలో కల్గిన ఈ వైరాగ్యం శాంతమహారసనిరూపణకు వీలిచ్చే ప్రధానవిషయం. రామునిలో అప్పటికే 'తృష్ణ'ను నశింపజేయాలనే కోర్కెగాటంగా కల్గిందనడానికి వసిష్ఠుని వద్దకుపోయి ఆయనవేసిన వేదాంతసంబంధమైన ప్రశ్న పరంపరయే తార్కాణం! (చూ॥ బాలకాండ — కల్యాణఖండం — 199-207 పద్యాలవరకు) రాముడు వేసిన పదిప్రశ్నలు దశోపనిషత్తుల లోనివి. వీటికి సమాధానాలు యోగవాసిష్ఠంలో ఉన్నాయి. ఈ పదిప్రశ్నలు రామునిలోని పరమవైరాగ్యాన్ని పట్టియిస్తున్నాయి.

నాటిన కంబమేనెవరు? నాయది విచిత్రభావమే
చోటిది? యస్మదీయమను చోద్యపుభావము పాయుటున్నె? యే
పాటిది యప్డు నేననెడు వస్తువు? దాని స్వరూపమెద్ది? యీ
గాటపు సందియంబు నవుగాములు చెప్పియనుగ్రహింపవే!

శ్రీ రమణమహర్షులు "నేనెవరు?" అని ప్రశ్నించుకొని,

దేహం? నాహం!। కోzహం? సోzహం॥

అని ఉపదేశసారంలో చెప్పిన సమాధానమే పై ప్రశ్నలకు సమాధానం.

దేహం మృణ్మయవజ్జడాత్మక మహం బుద్ధిర్నతస్యాస్తతో
నాహంత త్తద వేత సుప్తిసమయే సిద్ధాత్మ సద్భావతః
కోzహం భావయుతః కుతోవరధియా దృష్ట్వాత్మనిష్ఠాత్మనా
సోzహంస్ఫూర్తి తయాzరుణాచలశివఃపూర్ణోవిభాతిస్స్వయమ్॥

# 35. అద్వైతం – కర్మయోగం

విశ్వనాథవారు అద్వైతభావనకు సీతారాముల నిత్యమైన దాంపత్య భావానికి సమన్వయించడమేకాక ప్రకృతి వర్ణనల్లోనుప్రవేశపెట్టి నావ్యతో దర్శనీయంగా శిల్పమయంచేశారు. లోకాన్ని రాముడుచూచిన దృష్టి ఎంత నిశితమైనదో ఆవైరాగ్యభావననుచెప్పి, అది అద్వైతం చెప్పిన 'మాయ'లో మిథ్యలోఎలాపర్యవసించిందో ప్రకృతివర్ణనల ఆధారంగాచెబుతాను. రాముని లో, రామకథలో, "భావిసస్యసంస్కార గూఢబీజాలను" విశ్వనాథ నాల్గుసీసపద్యాలలో వర్ణించారు. (బాల-కల్యాణ 186-189). మొద టిపద్యంలో సన్యాసాశ్రమం, రెండవపద్యంలో జీవునివేదన వైరాగ్యం, మూడవపద్యంలో యోగసాధన, నాల్గవపద్యంలో జగన్మిథ్యాత్వం చెప్ప బడినాయి. గ్రీష్మర్తువర్ణనలోగల పై నాల్గుపద్యాలలో ఒకటి—

లోని గుంజును గింజనాని కాకము వేపబండు డొల్లనువీడు భావమరసి
సరయూతటీ శుష్కసస్యభూముల నత్తగుల్లలోపల దత్త్వగుప్తి దెలిసి
ముదిసంజ ముకుళితచ్ఛదగుచ్ఛమగు శిరీషద్రుబోధామృతస్థానమెఱిగి
యుగపత్సమాగతులుడురాజు వడగాలిబోధించుద్వంద్వప్రబోధమూని

రాఘవకులేశుడొక్క వైరాగ్యభావ తాడితంబైన యట్టి చిత్తంబు తోడ
వృద్ధకృకలాసమట్లునిర్వేదమందె, బద్ధసామజమట్లు క్షోభమువహించె

ఇందులో సీసపద్యం మొదటిపాదంలో ఉర్వారుక మోక్షాన్ని, పద్మ పత్ర మివాంభసా'అన్న తటస్థభావాన్ని కర్మయోగాన్ని, రెండవపాదంలో, "యథా సంహరతే చాzయం కూర్మోzంగానీవ సర్వశః" అన్న గీతార్థములో ఇంద్రియాల ఉపసంహరణ, మూడవపాదంలో యోగసాధనకుపక్రమించడం, నాల్గవపాదంలో ద్వంద్వాతీతస్థితి చెప్పబడినవి. 'నిర్వేద' 'క్షోభము' లనేవి వైరాగ్యముతోకలసి 'జీవునివేదన' పరిపుష్టంచేసి శాంత రసానుభవానికి దారితీస్తున్నాయి.

శ్రీరాముని వివాహసందర్భంలో "సంకల్పసంభవాస్థానమౌ తెరతోచి పంచీకృతంబులౌ ప్రాణములును" అన్నసీసపద్యంలో అద్వైతం పూర్తిగా ప్రతిపాదింపబడినది. అలాగే, "లేనివున్నట్లుగా గానిపించుట కెండ-మావులు తార్కాణమలయజేసె" అన్న సీసపద్యంలో ఎండమావులు, 'మాయ', మేడిపండు, వడగాలి యివన్నీ అద్వైతమందలి మిధ్యనూ, మాయను 'బ్రహ్మసత్యం జగన్మిథ్యా' అన్నతత్వాన్ని స్థాపిస్తున్నాయి.

మాయామానుష విగ్రహుండయిన రామస్వామి వైరాగ్య రే
ఖాయుక్తిన్ దనయాత్మదీర్చుకొనెగాకన్ సంభవిష్యన్మహో
క్ష్మాయోషా తనయా వియోగ దహనజ్వాలల్ సహింపంగ నె
ట్లైయుండున్ మఱికేవలత్వపు మనుష్యత్వంబె సంధించినన్
— బాల-కల్యాణ 196 ప.

మాయామానుషవిగ్రహుడైన రామునిలో వైరాగ్యభావనాతిశయంచేత రసం శాంతమవుతోంది. రాముడు సాక్షాత్పరమేశ్వరుడు. రాక్షసాదులను చంపి జాలిపొందటం మాయామానుషలక్షణం. ప్రథమదశలో తాను భగవంతుడనని మరచిపోతాడు. ద్వితీయదశలో భగవంతుడనని తెలిసికొంటాడు. ఇదొక విలక్షణమైన శ్రీరామచంద్రునిపాత్ర సృజన, శీలరచన.

సీతారాములు నిత్యదంపతులు. ప్రకృతి పురుషులు. సర్వజ్ఞులు. ఉపాధులు మాత్రమే క్రొత్తవి. "తెర దీసినంతనే తెలిసి నిజస్వరూపంబు బ్రహ్మానందపరిధి యగుచు" అనుపద్యపాదంలో 'మాయ'తొలగుట తోడనే జీవుడు స్వస్వరూపానుసంధానము చేసికొని బ్రహ్మానందనిమగ్నుడగుట చెప్పబడింది. లక్ష్మీనారాయణులైన సీతారాములందు

సుఖము సహజస్థితి. దుఃఖము అసహజస్థితి. పరమేశ్వరుడు సచ్చిదానందస్వరూపుడు గనుక అది ఆయనకు సహజస్థితి. 'ఉపాధి' పరమేశ్వరునకు అసహజస్థితి. ఈ రహస్యమే "కలయికయున్ వియోగము...." (బాల-కల్యాణ-180) అన్నపద్యంలో చెప్పబడింది.

ఇటువంటి ఉపాధిగతుడైన జీవుడుగా రాముడు వేదనకు లోనై వసిష్ఠుని సందర్శించిన తర్వాత మౌనమే సమాధానంగాపొంది లోలోపల 'క్షోభ' పడుచుండగా అరుంధతి రామునిస్థితి గ్రహించి కర్మయోగాన్ని ఉపదేశించినది. శుశ్రూషాపరముండు. (బాల-కల్యాణ-241 ప) అన్న పద్యం మొదలుకొని "తనకున్ జాలదొసీత...." (బాల-కల్యాణ-246 ప) అన్నపద్యం వరకు అరుంధతి రామునికి కర్మయోగాన్ని ఉపదేశించినది. అనగా 'నిష్కామకర్మ' మెట్లుండునో చెప్పినది.

*రామా! మేలగునెద్దియం చదుగ గర్మజ్ఞానయోగోజ్జ్వల*
*న్మీమాంసాపథి గర్మయోగమవుబో మేలందు నీ రెండునున్*
*శ్రీమంతంబువలె బ్రహ్మ మెప్పుడవికారిత్వం బెయా లోకయా*
*త్రామిత్రాత్ముల గర్మయోగుల చరిత్రల్ బిట్టు పాలించెడిన్*

*— బాల-కల్యాణ- 243 ప.*

కర్మ-జ్ఞానయోగాలలో ఏదిమేలని అడిగితే కర్మయోగమే మేలయ్యా రామా! ఇవిరెండూ శ్రీమంతాలే! కాని లోకయాత్రకు కర్మయోగమేశ్రేష్ఠం! అంటుంది. (సన్యాసః కర్మయోగశ్చ..... గీత 5-2) రెండూ శ్రీమంతములెట్లో తెలిసికోవాలంటే బ్రహ్మసూత్రభాష్యంలో చివరిమోక్షాధ్యాయం చదివితే తెలుస్తుంది! దీనితో రాముడు చక్కగా సంసారంచేయుటం ప్రారంభించాడు. లోకాన్ని పాలించటం అంటే ఏమిటో తెలిసికొన్నాడు. ఇక్కడ గమనింపవలసినదేమంటే మహాభారతంలో నిర్వేదానికిలోనైన నరుణ్ణి నారాయణుడు కర్మయోగిగా మలచడానికి గీతోపదేశంచేయగా, ఆ నారాయణుడే రాముడుగా అవతరించిన రామాయణంలో అరుంధతి ఆయనకే కర్మయోగశ్రేష్ఠత్వం తెల్పిందని విశ్వనాథచెప్పిన భాష్యం! రామావతారంలో అరుంధతివద్ద నేర్చుకొన్న కర్మయోగాన్ని కృష్ణావతారంలో అర్జునునికి బోధించాడని అంతరార్థం!

# 36. శ్రీ విద్య

కల్పవృక్షం — బాలకాండ — కల్యాణఖండమందే కవిస్థాపింప దలచు కొన్న జీవునివేదన, అద్వైతభావన, శాంతరసస్థాపన, కర్మయోగము, శ్రీవిద్య అనే అంశాలకు బీజావాపంజరిగినది. అవి మహావృక్షంకావడమే మిగిలింది.

వాల్మీకి 'సీతాయాశ్చరితం మహత్' అన్నాడు. విశ్వనాథ తాను రామకథాభాష్యకారుడనని చెప్పికొన్నాడు. కథాభాష్యకారిత్వం అంటే రామాయణం — 'సీతాయణం' ఎలాఅవుతుందో భాష్యంచెప్పడమే! అది 'శ్రీవిద్యారహస్య మయముశైనవి. 'శ్రీవిద్యానిధియై' అని ధూర్జటి కావ్యారంభం చేసినట్లుగా, 'శ్రీ మంజూషిక' అనే తొలిపద్యంలోనే ఇది 'శ్రీవిద్యారహస్యములకుపెట్టె' వంటిదని చెప్పబడినది. బాలరాముడు విశ్వామిత్రునివెంట మిథిలకు వెళుతూదారిలో విశాలానగరమునకు వెళ్లి నప్పుడు —

'శ్రీవక్షస్థలమందుడిగ్గినగతిన్ చెల్వొందిగాఢోరసుండు' అన్నపద్య ములో "లక్ష్మీదేవి శ్రీరామునివిశాలవక్షస్థలం మీదికి దిగిందా అన్నట్లున్న గాఢోరస్కుడని'కవి చెప్పడం భంగ్యంతరంగా అదివరకే ఉన్న లక్ష్మి యిప్పుడు సీతగా అవతరించింది కాబట్టి ఆమె కార్యనిర్వాహణకోసం రాముడేర్పడినాడని వ్యంగ్యం!

ఇప్పుడు అరుంధతి చేసిన ఉపదేశం కూడా అదే! సీతాదేవియే శ్రీదేవి అంటోంది —

*"మిథిలాజాత యయోనిజాత పసిసామీ! నీదు పుణ్యాత్మయో*
*యి! ధురాసంగతమైన భాగ్యము కదోయీ!"*

— బాల-కల్యాణ-**242**

*తనకుం జాలదొసీత! నీవిభవ సౌందర్యంబులన్ జిక్కి వి*
*న్నునె మన్నించునుగాక యెల్లపుడు తన్నుంజూచుకోలేదా?*

— బాల-కల్యాణ-**246**

రామునికి సీత భార్యగా లభించడం ఆయన చేసుకొన్నపుణ్యమట! అనంతకోటిసంవత్సరాలు ఈ సర్వసృష్టినీ పాలించేందుకోసం, విష్ణువు

గావటం కోసం చేసినతపః ఫలితంగా సాక్షాత్తు శ్రీదేవి, లలితాపరాభట్టా రిక లక్ష్మీరూపంపొంది నీవద్దచేరింది. ఇది దురాసంగతమైన భాగ్యము అంటోంది అరుంధతి!

రెండవపద్యంలో సీత — పట్టిప్రకృతికాదు. 'శ్రీదేవి' అంటున్నది అరుంధతి. సాంఖ్యమతంలో ప్రకృతి జడపదార్థం, అద్వైతమతాదులట్లుంచి శ్రీవిద్యయందు పరమేశ్వరి తానేబ్రహ్మపదార్థకల్పురాలు. సృష్టికి పర మేశ్వరుని కంటె ఆమెయే మూలహేతువు. అందుకే వాల్మీకిమహర్షి "సీతయాశ్చరితం మహత్" అన్నాడు. ఈ రహస్యమే కల్పవృక్షంలో మాటిమాటికి నిరూపింపబడుతుంది. (చూ॥ విశ్వనాథ రామకథా భాష్యకారిత్వము — S.V. University Oriental Journal Vol. No. XX, 1977 pp. 17-35) కల్పవృక్షం యుద్ధకాండలో పరమేశ్వరియొక్క మహాస్వరూపం వివరింపబడింది. (పై వ్యాసం గ్రంథాంతంలోచూడ వచ్చు.)

ఈవిధంగా కర్మయోగియైన శ్రీరామచంద్రుడు తాను సహజంగా వైరాగ్యనిష్ఠుడు. ఉపాధికృతమైన మాయనుగెలిచినవాడు. గెలిచి సీతకు సంబంధించినంతవరకు మరల తాను రామునివలెనే ప్రవర్తించును. "ఆత్మ నిన్ను నిత్యంబుగా హత్తుకొందు"నన్నవాడు. సీతావియోగాదులనుభవించిన వాడు. కాని అవి తనకుపట్టవు. ఇక్కడ మరొక రహస్యమున్నది. ఆసీతకూడ తనవంటిదే. ఆమె కూడబ్రహ్మపదార్థమే. అందుకే "ఆత్మనిన్ను నిత్యంబుగా హత్తుకొందు"నంటున్నాడు.

కల్పవృక్షంలో కవి ప్రవేశపెట్టదలచిన అద్వైతభావనకు, శ్రీవిద్యకు కల్యాణఖండంలోనే చక్కగా పాదులు త్రవ్వటం జరిగింది. సుందర కాండలో రావణుడు సీతతో మాట్లాడిన సందర్భమంతా శ్రీవిద్యారహ స్యగంధిలంగా ఉంటాయి! రావణుడు శ్రీవిద్యోపాసకుడుగదా! ఇక్కడ "అద్వైతానికి శ్రీవిద్యకు ఎలాపొసగుతుంది! అనవచ్చు. రెండూ ఒకటియే! ఇది మంత్ర శాస్త్రములోని రహస్యం!" అన్నారు విశ్వనా థవారు 'కల్పవృక్షరహస్యములు' అనేగ్రంథంలో..

సీతారాములకు ఈ కల్యాణఖండంలోనే 'దూరవియోగరేఖ' భాసిం చింది. పరమేశ్వరీ పరమేశ్వరులైన యిద్దరికీ రామావతార భవిష్యత్కథా వ్యవహారము భాసించిందని అర్థం!

"ఇట్లు వైరాగ్య సంసారభావంబులు ప్రయాగక్షేత్రస్థగంగా యమునలవలె సీమప్రసారరమ్యంబులైన" —బాల-కల్యాణ-293.

ఆ లక్ష్మీనారాయణులు తాముచరించబోవు అవతారకథాగమనానికి తమ ఆత్మలను సిద్ధంచేసికొనియున్నారని అర్థం!

ఈవిధంగా వాల్మీకంలోలేని అనేకాంశాలు - అవాల్మీకాంశాలు - కల్పవృక్షంలో చోటుచేసికొన్నాయని, దీనిచే వాల్మీకిహృదయం మరింతగా ఆవిష్కరింపబడిందని, అది శబ్దంమొదలుకొని రసంవరకు వ్యాపించి యున్నదనితెలుస్తోంది!

# 37. వాలి అనే వానరరాజు అధర్మకామానికి సంకేతం

సంకల్పస్థిరత్వంలేని మానవుడు వికల్పాలచేత పతనమైపోతాడు. అప్పుడు కామానికి ప్రతీకయైన వానరం నరుణ్ణి లొంగదీసుకుంటుంది. అంటే మనిషి కామానికి బానిసఅవుతాడన్నమాట! అందుకే నీతివేత్తలైనపెద్దలు, అధ్యాత్మవిద్యలో అగ్రేసరులైన భగవత్పాదులవారు మానవులనిలా హెచ్చరించారు.

మనో నామ మహా వ్యాఘ్రో విషయారణ్య భూమిషు।
చరత్యత్ర న గచ్ఛంతు సాధవో యే ముముక్షవః॥
(వివేక చూడామణి — *176* శ్లో)

"మనస్సనే పెద్దపులి కోర్కెలనే అరణ్యంలో విహరిస్తూవుంది. కాబట్టి సాధువులైన ముముక్షువులు అక్కడికి పోరాదు."

"మా సంచర మనః పాంథ తత్రాస్తే స్మరతస్కరాః"

"ఓ మనస్సా! నీవు యిచ్చవచ్చినట్లు సంచరించకు! అక్కడ మన్మథుడనేదొంగ నిన్నుదోచుకోగలడు."

కామాదిరోగకలుషీకృతదుష్టమైనది చిత్తము. అందుకే వివేక చూడామణిలో, "మనః ప్రసూతేవిషయానశేషాన్" అని భగవత్పాదులవారు చెప్పారు. దీనికి సమాధానం భర్తృహరివైరాగ్యశతకంలో రెండుశ్లోకాల్లో వివరించారు.

గావటం కోసం చేసినతపః ఫలితంగా సాక్షాత్తు శ్రీదేవి, లలితాపరాభట్టా రిక లక్ష్మీరూపంపొంది నీవద్దచేరింది. ఇది ధురాసంగతమైన భాగ్యము అంటోంది అరుంధతి!

రెండవపద్యంలో సీత — పట్టిప్రకృతికాదు. 'శ్రీదేవి' అంటున్నది అరుంధతి. సాంఖ్యమతంలో ప్రకృతి జడపదార్థం, అద్వైతమతాదులట్లుంచి శ్రీవిద్యయందు పరమేశ్వరి తానేబ్రహ్మపదార్థకల్పురాలు. సృష్టికి పర మేశ్వరుని కంటె ఆమెయే మూలహేతువు. అందుకే వాల్మీకిమహర్షి "సీతయాశ్చరితం మహత్" అన్నాడు. ఈ రహస్యమే కల్పవృక్షంలో మాటిమాటికి నిరూపింపబడుతుంది. (చూ|| విశ్వనాథ రామకథా భాష్యకారిత్వము — S.V. University Oriental Journal Vol. No. XX, 1977 pp. 17-35) కల్పవృక్షం యుద్ధకాండలో పరమేశ్వరియొక్క మహాస్వరూపం వివరింపబడింది. (పై వ్యాసం గ్రంథాంతంలోచూడ వచ్చు.)

ఈవిధంగా కర్మయోగియైన శ్రీరామచంద్రుడు తాను సహజంగా వైరాగ్యనిష్ఠుడు. ఉపాధికృతమైన మాయనుగెలిచినవాడు. గెలిచి సీతకు సంబంధించినంతవరకు మరల తాను రామునివలెనే ప్రవర్తించును. "ఆత్మ నిన్ను నిత్యంబుగా హత్తుకొందు"నన్నవాడు. సీతావియోగాదులనుభవించిన వాడు. కాని అవి తనకుపట్టవు. ఇక్కడ మరొక రహస్యమున్నది. ఆసీతకూడ తనవంటిదే. ఆమె కూడబ్రహ్మపదార్థమే. అందుకే "ఆత్మనిన్ను నిత్యంబుగా హత్తుకొందు"నంటున్నాడు.

కల్పవృక్షంలో కవి ప్రవేశపెట్టదలచిన అద్వైతభావనకు, శ్రీవిద్యకు కల్యాణఖండంలోనే చక్కగా పాదులు త్రవ్వటం జరిగింది. సుందర కాండలో రావణుడు సీతతో మాట్లాడిన సందర్భమంతా శ్రీవిద్యారహ స్యగంధిలంగా ఉంటాయి! రావణుడు శ్రీవిద్యోపాసకుడుగదా! ఇక్కడ "అద్వైతానికి శ్రీవిద్యకు ఎలాపొసగుతుంది! అనవచ్చు. రెండూ ఒకటియే! ఇది మంత్ర శాస్త్రములోని రహస్యం!" అన్నారు విశ్వనా థవారు 'కల్పవృక్షరహస్యములు' అనేగ్రంథంలో..

సీతారాములకు ఈ కల్యాణఖండంలోనే 'దూరవియోగరేఖ' భాసిం చింది. పరమేశ్వరీ పరమేశ్వరులైన యిద్దరికీ రామావతార భవిష్యత్కథా వ్యవహారము భాసించిందని అర్థం!

"ఇట్లు వైరాగ్య సంసారభావంబులు ప్రయాగక్షేత్రస్థగంగా యమునలవలె సీమప్రసారరమ్యంబులైన" —బాల-కల్యాణ-293.

ఆ లక్ష్మీనారాయణులు తాముచరించబోవు అవతారకథాగమనానికి తమ ఆత్మలను సిద్ధంచేసికొనియున్నారని అర్థం!

ఈవిధంగా వాల్మీకంలోలేని అనేకాంశాలు - అవాల్మీకాంశాలు - కల్పవృక్షంలో చోటుచేసికొన్నాయని, దీనిచే వాల్మీకిహృదయం మరింతగా అవిష్కరింపబడిందని, అది శబ్దంమొదలుకొని రసంవరకు వ్యాపించి యున్నదనితెలుస్తోంది!

# 37. వాలి అనే వానరరాజు అధర్మకామానికి సంకేతం

సంకల్పస్థిరత్వంలేని మానవుడు వికల్పాలచేత పతనమైపోతాడు. అప్పుడు కామానికి ప్రతీకయైన వానరం నరుణ్ణి లొంగదీసుకుంటుంది. అంటే మనిషి కామానికి బానిసఅవుతాడన్నమాట! అందుకే నీతివేత్తలైనపెద్దలు, అధ్యాత్మవిద్యలో అగ్రేసరులైన భగవత్పాదులవారు మానవులనిలా హెచ్చరించారు.

మనో నామ మహా వ్యాఘ్రో విషయారణ్య భూమిషు।
చరత్యత్ర న గచ్ఛంతు సాధవో యే ముముక్షవః॥
(వివేక చూడామణి – *176* శ్లో)

"మనస్సనే పెద్దపులి కోర్కెలనే అరణ్యంలో విహరిస్తూవుంది. కాబట్టి సాధువులైన ముముక్షువులు అక్కడికి పోరాదు."

"మా సంచర మనః పాంథ తత్రాస్తే స్మరతస్కరాః"

"ఓ మనస్సా! నీవు యిచ్చవచ్చినట్లు సంచరించకు! అక్కడ మన్మథుడనేదొంగ నిన్నుదోచుకోగలడు."

కామాదిరోగకలుషీకృతదుష్టమైనది చిత్తము. అందుకే వివేక చూడామణిలో, "మనః ప్రసూతేవిషయానశేషాన్" అని భగవత్పాదులవారు చెప్పారు. దీనికి సమాధానం భర్తృహరివైరాగ్యశతకంలో రెండుశ్లోకాల్లో వివరించారు.

వ్యాఘ్రీవ తిష్ఠతి జరా పరితర్జయంతీ
రోగాశ్చ శత్రవ ఇవ ప్రహరంతి దేహమ్।
ఆయుః పరిస్రవతి భిన్నఘటాదివాంభో
లోకస్తథా వ్యహిత మాచరతీతి చిత్రమ్॥

ముసలితనం ఆడుపులివలె మెత్తగా పొంచివున్నది. రోగాలు శత్రువులవలె దేహాన్ని పీడిస్తున్నాయి. ఆయుస్సు చిల్లిపడిన కుండలోని నీరులాగా అనుక్షణమూ తరిగిపోతున్నది. ఇలావుండికూడా లోకమందలి జనులు చెడుమార్గాన్నే అవలంబించటం చిత్రంగాఉంది.

తత్సంసార మసారమేవ నిఖిలం బుద్ధ్వాబుధా బోధకా।
లోకానుగ్రహ పేశలేన మనసా యత్నస్సమాధీయతామ్॥

సంసారం సర్వత్రా అసారమైనదే. ఈసత్యం పండితులైనవారు లోకానుగ్రహపేశలమైన బుద్ధితో చెప్పారు. కాబట్టి మనస్సును ప్రయత్నంచేత సమాధానపరచుకోవాలి.

కేవల కామవిషయానికే యిన్ని ఆంక్షలు, హెచ్చరికలు ఉండగా ఇక అధర్మకామవిషయం గూర్చి చెప్పవలసిన పనిలేదు. దీన్ని నశింపజేయడం ఎలా? ఈ అధర్మకామాన్ని వెనకనుండి చావుదెబ్బ తీయాలి. ముఖాముఖిగా కాదు. అధర్మకామాన్ని ఎదురుబదురుగా నిల్చొని జయించాలనుకోవటం ఎలావుందంటే ఒక తాగుబోతు సారాసీసాను ముందు పెట్టుకొని తాగుడును జయించాలని పంతం వేసినట్లుంటుంది. సీసా ముందు కూర్చున్నంత మాత్రాన వాడాకోర్కెను జయించలేడు. అలా చేసినట్లయితే వాడిలో సగంబలం చచ్చినట్లయి ఆమద్యం వాణ్ణి మూడింతలు తనవైపు లాక్కొంటుంది. దాంతో ప్రతిసారి ఈ ప్రయత్నంలో వాడిలో త్రాగాలనేకోర్కె జయిస్తుంది. వాడు పరాజయం పొందుతాడు.

నీకు నిజంగా కామాన్ని జయించాలని వుంటే, నీవు దాన్ని వెనుక నుండి పొంచి దెబ్బతీయాలి. కాబట్టే రాముడు, కామానికి మరోపేరైన వాలిని చెట్టుచాటునుండి బాణంతో చంపాడు. వాలికి యెలాంటి మహత్తర శక్తి వున్నదంటే శత్రువెవడైనా సరే యుద్ధంలో ఆయనకు ఎదురుగావచ్చి నిలుచుంటేచాలు, ఆ శత్రువులోని సగంశక్తి వాలిలో ప్రవేశించి వాలి రెట్టింపు బలవంతుడౌతాడు. అధర్మకామం యొక్క ఆకర్షణశక్తి అంత గొప్పదని దీని అంతరార్థం! ఈ ప్రబలకారణంచేత రాముడు వాలిని

చాటుగా పొంచి చంపడంలో న్యాయం వుందనవచ్చు. పైగా, రాముడు నరుడు, ఏకపత్నీవ్రతుడు, రావణసంహారానికై బయలుదేరివచ్చినవాడు. వాలి వానరుడు, అధర్మకాముడు, రావణుని చంకలో నిరికించుకొని సప్తసముద్రాలలో సంధ్యవార్చినవాడు, రావణుని ఒకబొమ్మగా అంగదుని ఊయెలకు కట్టినవాడు. నరులైనరాజులు దుష్టజంతువుల్ని చాటునపొంచి చంపుతారు. అలా వాలినిచంపాడు రాముడు. ఎందుకు? తమ్ముడు సుగ్రీవుని తరిమికొట్టి అతనిభార్య రుమను అధర్మంగా అనుభవిస్తున్నం దుకు.

# 38. సర్వేంద్రియాలను స్వాధీనంలో వుంచుకొన్నవాడే సుగ్రీవుడౌతాడు

ఇలా అధర్మకామాన్ని క్షాళనంచేసిన తర్వాత ఆ కిష్కింధా రాజ్యాన్ని ఎవరికి ధారాదత్తంచేయాలి? దానికి సుగ్రీవుడికంటే అర్హుడెవరున్నారు? గ్రీవమంటే అధీనంలో వుండేది. సుగ్రీవమంటే సుష్ఠు అధీనంలో వుండే దని అర్థం. సంకల్పమనేమాత్రం ఎవడి స్వాధీనమందైతే వుంటుందో వాడి ఆలోచనాసైన్యాలు ఒక్కత్రాటిపై నడిచి జీవనసముద్రతరణం చేసి ఆవలితీరాల్లో ఉన్న లంకనుచేరి పదితలల రక్కసిని చంపి పున రాగమనంలేని మోక్షమనే సీతను తీసుకుని తిరిగిరాగలవు. అటువంటి సంకల్ప కల్పద్రుమం శ్రీరామచంద్రుడే.

సుగ్రీవుడు మాత్రం తక్కువవాడా? వాలి భార్య తనకు వదిన యైన తారను భార్యగాస్వీకరించలేదా? అని ప్రశ్నించవచ్చు. వాలి సుగ్రీవులది వానరజాతి. ఆజాతిలో వావివరుసలులేవు. మానవజాతిలో దేవరన్యాయం మహాభారతకాలం నుండి ధర్మశాస్త్ర సమ్మతమైఉంది.

# 39. అమ్మవారిలోని యోగశక్తికి బాహ్యప్రతీక హనుమ

"వేయిమందిలో ఒకడికి నన్నుగూర్చిన జిజ్ఞాస కలుగుతుంది. అలాంటి జిజ్ఞాసువులు వేయిమందిలో ఒకడే నిజంగా నన్ను తెలి

సికొంటున్నాడు" అన్నాడు. భగవంతుడు గీతలో, రాముడు దేవుడని తెలిసినవాడు రామాయణంలో హనుమ ఒక్కడే! కృష్ణుడు భగవంతుడని తెలిసినవాడు భారతంలో భీష్ముడొక్కడే! హనుమ ఆజన్మబ్రహ్మచారి. భీష్ముడు ఆలుబిడ్డలులేనట్టివాడు. ఇద్దరూ అధ్యాత్మ విద్యావేత్తలు. పరిపక్వహృదయులు. రామాయణంలో సుందరకాండ ఎంత పవిత్రమైందో, భారతంలో భీష్మపర్వం అంత ఉదాత్తమైంది. ఎందుకంటే, భగవద్గీత భీష్మపర్వంలోనే వస్తుంది. భగవద్గీతతో తుల్యమైంది భీష్మస్తవరాజము. అది చదివితే భీష్ముడెంత పరిపక్వమైన చిత్తవృత్తి కలవాడో ఎంతటి మహాభక్తుడో తేటతెల్లమవుతుంది.

హనుమ జన్మసంవత్సరం రుధిరోద్గారి. రుధిర మనగా రక్తం. నెత్తురు చిప్పిలజేయునది అని దీనికర్థం. అటువంటి రక్తస్రావ నామకమైన సంవత్సరంలో జన్మించిన హనుమ అక్షతమైన శరీరంతో అమోఘమైన కార్యాలెన్నో సాధించాడు. అందుకే సంప్రదాయశ్లోకం యిలావుంది.

హనూమంతం వాయుసుతం రుధిరోద్గారి సంజ్ఞకమ్।
సముద్రలంఘనోద్యుక్తం దీర్ఘలాంగుల మాశ్రయే॥

వాయుసుతుడైన హనుమంతుని, రుధిరోద్గారి వత్సరంలో జన్మించిన వానిని, పొడవైనతోక కలిగిసముద్రాన్ని లంఘించడానికి సిద్ధంగాఉండు వానిని నేను ఆశ్రయిస్తున్నాను. రుధిరోద్గారి సంవత్సరంలో హనుమంతుని స్మరణచే రక్తము మొదలుగాగల శరీరసప్తధాతువులకు రక్షణ కలుగుతుంది.

## 40. సుందరశబ్ద విచారం

రామాయణంలో అన్నికాండలకు కథాపరంగా బాలకాండ, అయోధ్యాకాండ, అరణ్యకాండ అని పేర్లుపెట్టి సీతాన్వేషణ కాండకు 'సుందర కాండ' అని నామకరణం చేయడంలోగల ఔచిత్యాన్ని గూర్చి పలువురు పెద్దలిదివరకే ఎన్నో గ్రంథాలలో ముచ్చటించారు. దానికి వారు చెప్పిన కారణాలనేకం ఉన్నాయి. ఆ కారణాలన్నిటినీ యిక్కడ క్రోడీకరించటం నా పనికాదు కాని ఒకటిరెండు బలవత్తరమైన కారణాలను మాత్రం నేనిక్కడ ప్రస్తావిస్తాను.

హనుమంతుని జీవితచరిత్రను నిశితంగా పరిశీలిస్తే హనుమ అస లుపేరు 'సుందరుడు'. ఆయనతల్లి అంజనాదేవి పెట్టినపేరు అదే. అంజనాతనయుడు ఆంజనేయుడైనాడు. సూర్యుణ్ణి ఫలమని భ్రమించి గ్రసించడానికి వెళ్ళినప్పటినుండి హనువుభాగం పెద్దదగుటవలన హనుమం తుడనుపేరు ప్రసిద్ధమై ప్రచారంలోకి వచ్చింది.

హనుమ జన్మతః 'సుందరుడే', కాలకర్మవశంగా ముఖాకృతి వికృత మైనా ఆత్మసౌందర్యం కోల్పోనివాడు. అసలు సుందరత్వమనేది ఆత్మకు పర్యాయపదం. గొప్ప మనోనిగ్రహం, హృదయసౌందర్యం గలవారెంత కురూపులైనా సుందరులుగానే పరిగణింపబడుతారు. భౌతిక సౌంద ర్యాన్ని లోకం గుర్తించినంతగా ఆత్మసౌందర్యాన్ని గుర్తించకపోవచ్చును. అప్పడేమవుతోంది? లోక మావ్యక్తిని గుర్తించేటట్లుగా కొన్ని ఘన కార్యాలు చేస్తేచాలు. సరిగ్గా అలాంటి ఘనకార్యాలనే హనుమంతుడు చేశాడు. చిరస్థాయియైన కీర్తినిగడించాడు.

హనుమంతుడు సంగీతవిద్యావేత్తయని, నవవ్యాకరణవేత్తయని, వాగ్వి శారదుడని ఎందరికి తెలుసు? హనుమ సముద్రలంఘనం చేశాడని, లంకాదహనం చేశాడని, సంజీవనీ పర్వతం తెచ్చాడని ఈనాడు కొత్తగా చెప్పవలసిన పనిలేదు. లోకంలో విద్యాగతమైన పాండిత్యం, సంగీతవే త్తృత్వం, వాగ్విశారదత్వం — ఆత్మసౌందర్యంతోకలిసి చప్పన గుర్తిం పుపొందవు. సర్వకాల సర్వావస్థల్లోను వీటియొక్క ఔన్నత్యం, అగాధత్వం విశాలత్వాలను లోకం జ్ఞప్తియందుంచుకోదు. ఆయా విద్యాప్రదర్శ నవేళల్లోని విలక్షణవిన్యాసాలు విస్మృతిపథంలోపడిపోయి కాలగర్భంలో కలిసిపోవచ్చు. కాని ఒక మహావీరుని ఘనకార్యాలు అద్భుతావ హమైనప్పుడు లోకం దానినెప్పుడూ మరువక జ్ఞప్తియందుంచుకొం టుంది. కనుక సముద్రలంఘనం, లంకాదహనం, సంజీవనీపర్వతాన యనం అనేవి హనుమంతునివంటి మహాపండితునికి, మహాగాయకునికి, మహాయోగికి, అవలీలగా చేయగలిగిన కృత్యాలేయైనప్పటికి లోకం దానికే అత్యంత ప్రాధాన్యంయిచ్చి స్వతస్సిద్ధమైన పాండిత్యాదులను ప్రక్కకు నెట్టినది. హనుమంతుడొక మహాయోగిగా తనజీవలక్షణాన్ని పుంజీభ వింప జేసికొన్నాడని, ఆయన తన యోగప్రజ్ఞచే మహాద్భుతకార్యాలను సాధించడంవల్ల 'సుందర' శబ్దం ఆయన 'ఆత్మ'కు సంబంధించిందని, సుందరకాండకాపేరు రావడానికిది యొక కారణమని నాభావన.

లోకంలో ఒకమంచివాణ్ణి, అజాతశత్రువును, అమృతహృదయుడని, హృదయసౌందర్యం గలవాడని, ఆత్మోన్నత్యం గలవాడని అనటంవుంది.

ఆత్మ — అమృతము — సుందరం. కావున అట్టి అమృత, హృదయ సౌంద ర్యాలుగల హనుమ ఆత్మోన్నత్య సూచకంగా మహర్షి 'సుందరకాండ'యని నామకరణం చేసియుండవచ్చునని నా ఊహ!

వస్తుతః హనుమలోగల మహాగుణాలే సుందరమైనవి. దానికివి ప్రోద్బలకాలవుతున్నాయి. ఆసుందరగుణాలను కొంత వివేచించుకొంటే తెలుస్తుంది.

సంగీత సంప్రదాయమేమి చెబుతోందంటే కర్ణాటక సంగీతానికి లేక దాక్షిణాత్యసంగీతానికి ఆద్యపురుషుడు నారదమహర్షియని, హిందూస్థానీ లేక ఔత్తరాహసంగీతానికి మూలపురుషుడు హనుమంతుడని ప్రతిపాది స్తోంది. హనుమ మహాగాయకుడు, సంగీతవిద్యావేత్త అనడానికి ప్రమా ణమెక్కడుందని ప్రశ్నిస్తే వాల్మీకిరామాయణంలోనే రెండు క్లిష్ట ఘట్టాలలో హనుమ సంగీతవేత్త అని నిరూపింపబడడమేకాక, మానవ మనోవైజ్ఞానికుడని (Human Psychologist) కూడా నిరూపింపబడినట్లు ఆధారాలున్నాయి.

రామవిరహాన్ని భరింపలేక సీత ఆత్మహత్య చేసికోవడానికై నిర్ణ యించుకొని శింశుపావృక్షశాఖకు తన దీర్ఘవేణిని చుట్టి కంఠానికి బిగించుకొనుచుండగా రామదూతగా వచ్చిన మరొకడైతే ఆ క్లిష్ట పరిస్థితిలో ఏంచేసివుండేవాడు? వాడు హఠాత్తుగా దుమికి 'రాముడు వస్తున్నాడ'ని చెబితే ఆ క్షుభితహృదయురాలైన స్త్రీ ఆమాటలు విని నమ్మదగిన స్థితిలో ఉన్నదా? ఉంటుందా? వాడిప్రయత్నం శతధా వ్యర్థంకావడమేకాక నిష్కారణంగా స్త్రీహత్యాదోషం వాణ్ణి చుట్టుకొం టుంది. ఇట్టి విపత్కర, నిస్సహాయపరిస్థితిలో హనుమ సమయస్ఫూర్తి ఎలా ప్రసరించింది? సీత ఆత్మహత్యాప్రయత్నమెట్లు విరమించింది? అని ప్రశ్నిస్తే వాల్మీకంలో ఆఘట్టం చదివితీరాలి.

హనుమ కమ్మని కంఠంతో మధురమూ, సుందరమూ అయిన రామకథను గానం చేయసాగాడు. శింశుపావృక్ష శాఖల గుబురులలో దాగి వాల్మీకి కోకిలంకూస్తున్నదా! అనేటట్లు హనుమ రామకథాగానం వీనుల విందుగా విన్నసీత చేష్టలుడిగి, తన్మయురాలై, ఆ గానం చేస్తు న్నదెవరో చూడవలెననే ఉత్కంఠ కనబరచుచుండగా వెంటనే హనుమ నేలపై నిలిచాడు. ఇంతటి మనోవిజ్ఞానవేత్త ఎవ్వరుంటాడు? ఇంతటి సంగీతజ్ఞుడెవ్వరుంటాడు?

రాముని పదునాలుగేండ్ల వనవాసం పూర్తియైంది. భరతుడు సన్న్యాసిగా నందిగ్రామంలో ఉన్నాడు. పదునాలుగేండ్లు దాటిన మరునటిరోజున కనబడకుంటే అగ్నిప్రవేశంచేస్తానన్న భరతుని ప్రతిజ్ఞను రాముడు మరచినవాడుకాడు. పుష్పకవిమానంలో ప్రయాణమైపోయి చెప్పవచ్చును గదా? అనవచ్చు. కాని దానికంటె వాయువేగ, మనోవేగాలతో పోగల హనుమ యుండగా వాహనం నిష్ప్రయోజనంకదా! హనుమను పంపినాడు రాముడు. భరతుడు ధర్మనిష్ఠురుడు. వాని మనస్సున కెక్కేటట్లుగా రాముని ఆగమనవార్త చెప్పటకు సమర్థుడైనవాడు హనుమఒక్కడే.

కన్నులనుండి నీరుధారగా స్రవిస్తూవుంటే, యిహలోకవైరాగ్యాన్ని పూని, నిర్లిప్తుడై, నిరంతర రామపదారవిందదర్శనౌత్సుక్యవ్యగ్రచిత్తుడై తత్ప్రతీక్షఅంతా వృథకాగా ఆత్మాహుతిచేసికోవడానికి అగ్నిప్రదక్షిణంచేస్తున్న భరతుని ఆక్షణంలో ఆపగలవారెవ్వరు? ఒకవైపు భయభీతులైన ప్రజల హాహాకారాలు మిన్నులు ముట్టుచుండగా ఎవడో ఒక ఆకాశచారి, వికృతరూపుడువచ్చి "రాముడు వస్తున్నాడయ్యా! కాస్త అగు" అంటే ఆగునట్టి పరిస్థితిలో నున్నాడాభరతుడు? అసలామాటలు విన్పించుకొనేదెవ్వరు? ఇలాంటి సునిశితసన్నివేశంలోనే కవికి, కవిప్రవేశపెట్టిన పాత్ర నడవడికి అగ్నిపరీక్ష తటస్థిస్తుంది! హనుమ అప్పుడేంచేశాడు? సుదూరంలో తనగొంతు వినబడేటంత దూరంలో నిల్చొని మృదుమధురస్వరంతో సుందరమైన రామకథను గానంచేశాడు. ఆగానం వాయుతరంగితమై భరతుని జడత్వాన్ని సడలించి క్రమక్రమంగా చైతన్యాన్ని ప్రసాదించింది. ఇహలోకస్పృహను తెచ్చిపెట్టింది. ఇంతటి సంగీతవిద్యావేత్త వేరొకడెవ్వడు? ఇంతటి మనోవైజ్ఞాని మరొకడుంటాడా?

రామాయణం మొత్తంమీద పరిశీలిస్తే రామునితో సంస్కృతంలో సంభాషించినవ్యక్తి, అది కూడ వ్యాకరణదోషంలేకుండ విస్పష్టమైన ఉచ్చారణతో, ఉదాత్తస్వరంతో, సగౌరవంగా సంభాషించినవ్యక్తి ఒక్క హనుమంతుడే. వివేకి, కోవిదుడు, సత్పురుషుడు అయిన హనుమకు వాల్మీకి సాధారణముగ వాక్యజ్ఞః, వాక్యకోవిదః, వాగ్విదాంవరః, వాక్యవిశారదః యిత్యాది విశేషణాలను వాడియున్నాడు." తదర్థోపహితం వాక్యం ప్రశ్రితం హేతుసంహితం" (సుం.కాం. 56 స. 6 శ్లో) ఈవిధంగా హేతుసహితంగా, సమయోచితప్రజ్ఞతో మాట్లాడగలవాడొక్క హనుమయే. అందుకే రాముడు దక్షిణదిశవైపు పోవు వానరులలో హనుమనే పిలిచి అంగులీయకమిచ్చి సీతకిమ్మంటాడు. రామునికి హనుమచేతనే ఈకార్యం సాధింపబడగలదనే గాఢమైన నమ్మకముండటం చేతనే అలా

చేశాడు. లక్ష్మణప్రాణదాత యైన హనుమను రాముడు విష్ణువు శివుని కౌగిలించుకొనినట్లు గాటంగా కౌగిలించికొన్నాడు.

సుందరకాండలో సీతాన్వేషణ సందర్భంలో రావణుని పుష్పకమందు రమణమందిరాన్నిచూచి అందులో సుందరవనితలు వివిధ భంగిమలలో మదిరాపాన వివశులై శయనించియుండడం చూచికూడ అత్యంత మనోనిగ్రహాన్ని ప్రదర్శించిన హనుమ గొప్ప శీలవంతుడు.

వాల్మీకి రామాయణంలో హనుమ సుందరుడని చెప్పబడకపోయినా, సీత, రాముడు, రావణుడు సుందరులని చెప్పబడివున్నా హనుమలోని పై విలక్షణగుణగణాలే సుందరములైనవని నా తీర్మానం. ఇది అంతర సౌందర్యదృష్టి గలవానికే సాధ్యంగాని బహిస్సౌందర్య పరాస్తమతులకు తెలియదు.

"పరాశర సంహితలో సుందర హనుమన్మంత్రమున్నను ఆ సంహిత రామాయణ మహాభారతాలకు కొన్ని వందలయేండ్ల తర్వాత వచ్చినదగు టచే 'సుందర' మనుమాట ఆమంత్రమును నిర్మించినవారు కల్పించినదే. పరాశరసంహితలో ఈ ఒక్కమంత్రమే కాదు. కొన్ని వందలదేవతల మంత్రములు చెప్పబడినవి. కనుక సుందరహనుమన్మంత్రము ఒకానొక ఫలవిశేషమును సాధించుటకు కల్పింపబడినదనియు పంచముఖాంజనేయ, సువర్చలాంజనేయ మంత్రాదులవంటి మరొకమంత్రమే అనుకొనవచ్చును. సుందర హనుమన్మంత్రాధిష్ఠాన దేవతను సుందరాకారుడుగా హృత్కమల మున భావించి ధ్యానించుటయే ఈ మంత్రవిధి కనుక ఆదేవత యొక్క మూర్తి తన్మంత్రధ్యాన శ్లోకాదులందు తదనుగుణముగానే వర్ణింప బడెను. అసలీ సుందరమంత్రము, సుందరయంత్రము అని వాడుక తంత్రములందున్నట్లు కనిపించుచున్నది. ఈ 'సుందర' శబ్దము మహా లక్ష్మికి అన్వయించు విశేషణమని భావించుట మిక్కిలి సమంజసము. సుందరయంత్రమనినట్లే సుందరకాండయును."

"రాముడు సుందరుడు; సుందరి కలవాడు. సుందరకాండ సౌందర్య కాండ. బ్రహ్మాండపురాణము సౌందర్యకాండ అనుమాట వాడినది. ఈ సౌందర్యము శ్రీశంకరులవారు 'సౌందర్యలహరి' అనిచెప్పిన మాటయే. కనుక సుందరహనుమంతుడనగా దేవీభక్తుడైన హనుమ అని అర్థ-మేగాని హనుమ సుందరముగా నున్నాడని గాదు." హనుమ-యొక్క నిరంతర దేవీధ్యానమే జపమే, యోగమే సుందరకాం-డగా దర్శనమిచ్చుచున్నది." అని గుంటూరు శేషేంద్రశర్మగారు

షోడశి-రామాయణరహస్యములన్న గ్రంథంలో చెప్పట సమంజసమేగాని, ఒక్కసందేహం — "మంత్రం — అంతర్ముఖ సమారాధ్యంగాని బహిర్ముఖ సుదుర్లభం గనుక, ఆంతర సౌందర్య విశిష్టుడైన, విలక్షణుడైన హనుమను మంత్రబద్ధంచేసి జపించుట అనేది లేదని చెప్పలేము. ఎందుకంటే దేవియే — త్రైలోక్యమోహనాకారయగు దేవియే — 'అంతర్ముఖసమారాధ్యా బహిర్ముఖసుదుర్లభా, యని చెప్పబడింది కాబట్టి హనుమ బహిరాకారంతో యిక్కడ నిమిత్తం లేదని చెప్పవచ్చును. హనుమ జన్మించిన సంవత్సరమే రుధిరోద్గారి యైనప్పుడు ఆయన పరమ సుందరుడని యెవ్వరు చెప్పటలేదు. బాహిరమైన సౌందర్యం అశాశ్వతమైనది. ఆంతరసౌందర్యం అనశ్వరమైనది. ఈ దృష్టితో సుందరకాండ వివేచనం జరగాలి.

తుములమైన సమరంలో దృఢగాత్రులైన మహావీరులు క్షతగాత్రులౌతున్న తీరును వర్ణిస్తూ తిక్కన మహాకవి 'ఉగ్రసుందరము' అనే పదబంధాన్ని తరచువాడుతాడు. 'వారొండొరుల రక్తధారాప్లుతులజేసి పుల్లకింశుక భంగిబొలిచి' వంటి సుందరమైన చిత్రణం చేసినట్లుగా, హనుమను వాల్మీకంలో భీమ, మహాబల, రుద్ర, అగ్ని, బ్రహ్మ కోపముగా, విష్ణు తేజముగా, ఇంద్రునిగా, భీకర సర్వదేవతాకమూర్తిగా పేర్కొనబడటం చూడగా హనుమసౌందర్యం శ్రీరామచంద్రుని సౌందర్యంవలె ఆపాత మధురమూ, శిరీషకుసుమపేశల సుకుమారమూకాక, ఉగ్ర సుందరమూ భీమ భయంకర స్పృహణీయమని చెప్పవీలవుతోంది.

ఈ సందర్భంలో వాల్మీకలోనూ — కల్పవృక్షంలోను హనుమ ఆకారవర్ణనలెలా అమరియున్నాయో చూడవచ్చును.

"అహోభీమ మిదం రూపం వానరస్య దురాసదం"

తొలుత సీత హనుమను చూచినప్పుడు యిట్లున్నాడు. హనుమకు 'భీమ' శబ్దాన్ని వాల్మీకి పునః పునః ప్రయోగిస్తూవుంటాడు. శివునికి భీముడన్నది ఒకపేరు. రావణుడు హనుమను చూచినప్పుడు—

"సర్వథా తన్మహద్భుతం మహాబలపరిగ్రహం
మహాత్మత్మ్య మిదం జ్ఞేయం కపిరూపం వ్యవస్థితం"
"కిమేష భగవాన్నందీ భవేత్సాక్షా దిహాగతః"

అని అతని భీకరాకారాన్నిచూచి ఆశ్చర్యచకితుడైనాడు.

ఇక లంకాదహనఘట్టంలో హనుమ, రుద్రుడుగాను, అగ్నిగాను, రాక్షసవినాశార్థం వచ్చిన బ్రహ్మకోపంగాను, విష్ణుతేజంగాను, ఇంద్రాదులుగాను — యిలా భీకరమైన సర్వదేవతాకమైన మూర్తిగా పేర్కొనబడినాడు. భీకరాకారంలో ఒక సౌందర్యం ఉంటుంది. దీనినే ఆంగ్ల భాషలో 'awe - inspiring' అంటారు. విశ్వరూపసందర్శన ఘట్టంలో అర్జునుడు యిలాంటి భావానికే లోనైనాడు. నిశ్శబ్ద కాననప్రకృతి ఎంత రమణీయమో అంత భయానకం. వర్డ్సువర్తు కవి దీనిని, చక్కగా నిరూపించియున్నాడు. సరిగ్గా హనుమ బహిరాకారసౌందర్యం అలాంటిది. 'awe-inspiring beautiful' అనవచ్చును. దానిలో స్త్రీ సౌకుమార్యం కన్న (feminine beauty) పుంస్త్వరామణీయకం (masculine beauty) ఎక్కువ. కాబట్టి ఈచర్చ వలన తెలిసినదేమనగా విస్తార నిస్తబ్ద ప్రకృతి ఎంతరమణీయమో అంత భయావహమైనట్లు సాలప్రాంశులోమ పుంజ భీమబలుడైన హనుమ అంత సుందరుడు, అంత భయానకుడు కూడ. ఇది ద్విపార్శ్వశోభితసౌందర్యం.

ఇక, కల్పవృక్షంలో విశ్వనాథవారెలా హనుమ్మ ఆకారవర్ణనను చేసినారో చూద్దాం. తొలిసారిగా సీత హనుమను, శింశుపావృక్షాంతర్గతుని తలయెత్తిచూడగా యిలాకనిపించినాడు.

గీ॥ క్రూరదంష్ట్రాకరాళంబు ఘోరపింగ
వర్ణలోచన భయదంబు వవి విఘాత
దీర్ణగాఢ గల్లాధః ప్రదేశ గర్తి
యైన యొక భీకరాస్యంబు కానిపించె

గీ॥ ఆపలిత ఘోరపుచ్ఛసర్పాభవాల
ముజ్జ్వల శ్యామలాంగము నుగ్రమూర్త
బాధనఖఖడ్గ కుంతాభ బాహుయుగము
నైన యొక భీకరాకృతి కానిపించె

గీ॥ పరమ బుద్ధిమంతు, బహుభీకరాకారు
బరమ సత్త్వమూర్తి, బరమశూరు
బరమ వాగ్మి మఱియు బరమ మౌనాకారు
జూచె జెట్టుమీద క్షోణిజాత!

గీ॥ తెల్లనారచీర ధృతిదాల్చునాతని
వెల్లజన్నిదంబు వెలయువాని
బ్రహ్మచారివేషభాసురు వానరు
జూచె జెట్టుమీద క్షోణిజాత!

గీ॥ శింశుపాశాఖ దగ్ధంబు సేయనట్టి
వహ్నివన మెల్లయును భగ్నపరచనట్టి
ప్రళయపవమాను, విలయభావ మఱురుద్రు
జూచె శాఖాంతరంబున క్షోణిజాత!

(సుందర-ఉష॰ 55-59 ప)

వాల్మీకంలో చెప్పబడిన 'భీమ' 'రుద్ర' శబ్దాలు కాని, కల్పవృక్షంలో చెప్పబడిన 'భీకర' 'రుద్ర' శబ్దాలుగాని హనుమ శివావతారమని చెబుతున్నాయి.

"అజోఽహం లోకరక్షార్థం రామదూతోఽస్మి చాదరాత్"

అని పరాశరసంహితలో శివుడే పార్వతితో చెప్పియున్నాడు. కాబట్టి, "అంజనేయునియందు ప్రధానమైన రుద్రాంశము శ్రీరామావేశము. శ్రీరామభక్తులైన సర్వవానరుల యొక్క మహిమావేశము. సాగర, మైనాక, నాగమాతృసురస దేవతలయొక్క సంపూర్ణశక్త్యావేశము — కలుగుటవలననే ఈ దేవతకు సుందరత్వము నిరూఢమైనది. సుందరమైనకథ, సుందరమైన నాయికానాయకులు, సుందరమైన ప్రబోధము, సుందరమైన పఠన శ్రవణ ఫలము కలిగినవి. కనుకనే యీ కాండమునకు సుందరకాండమని వాల్మీకి పేరుపెట్టినాడు" అని 'శ్రీ హనుమన్మహో విద్యాప్రకాశిక' యందు లంకావేంకటేశ్వర శాస్త్రిగారు వ్రాసినారు.

దశావతారాల్లో పరశురామునిది ఆవేశావతారం. అంతమాత్రాన ఆయనలో దయ, శాంతగుణాలు లేవంటామా? ప్రాధాన్యవివక్షచే ఆవేశంవైపుకే మొగ్గు. అట్లే హనుమ ఎంత భీకరాకారుడైనా అంత శాంతస్వరూపుడు కూడ. శివునిలో ఈ రెండు లక్షణాలున్నాయి. హనుమను పొగడినంతనే రౌద్రాకారుడౌతాడు. ఇష్టకామ్యార్థసిద్ధిని కల్గజేస్తాడు. శివుని ప్రశంసించినంతనే కోరికలు వర్షిస్తాడు. అందుకే, హనుమ ఎంతశాంతుడో అంత గంభీరుడన్నది సత్యం. ఈ సత్యాన్ని వెన్నంటి శివ-సుందరాలు, మంగళ-సౌభాగ్యాలు వస్తుందనడం జగమెఱిగిన సత్యం.

'సత్యం-శివం-సుందరం' అనడంలో సత్యమే శివమై, శివమే సుంద రమై యొప్పారుననడంలో విశ్వజనీనసత్యమిమిడియుంది. సౌందర్యానికి మూలబీజం సత్యంకాగా, ఆ సౌందర్యాన్ని లోకంలో నిలిపేది శివం.

సత్యం-శివం-సుందరం అనేవి సచ్చిదానందాత్మకమైన పరబ్రహ్మానికి పర్యాయపదాలు. హనుమంతుడు పరబ్రహ్మస్వరూపుడవటంవల్ల ఆతనిలో సుందరశబ్దం సార్థకమైంది.

'కాదినవ, టాదినవ, పాదిపంచ, యాద్యష్టౌ' అను సాంకేతిక సూత్రాన్ని బట్టి సు = 7, ద = 8, ర = 2 = 17 అ సంఖ్యను సుందరశబ్దం బోధిస్తోంది.

శ్రుతి: "యోవై సప్తదశం ప్రజాపతిం యజ్ఞమన్వాయత్తం వేదప్ర తియజ్ఞేన తిష్ఠతి, న యజ్ఞాద్భ్రగ్ంశతి, ఆశ్రావయేతి చతురక్షరం అస్తు శ్రౌషడితి చతురక్షరం, యజేతిద్వ్యక్షరం, యే యజామహ ఇతి పంచాక్షరం, ద్వ్యక్షరో వషట్కారః ఏషవై సప్తదశః ప్రజాపతిః"

— యజుస్సంహిత (కాం-1 ప్ర-1)

దర్శపూర్ణమాసయాగంలో హోమంచేసే క్రియాకలాపాన్నిచెప్పిన 'ఆశ్రావయ' అనే నాలుగక్షరాలు, అస్తుశ్రౌషట్ అనే నాలుగక్ష రాలు, 'యజ' అనే రెండక్షరాలు, 'యే యజామహే' అనే ఐదక్ష రాలు, 'వషట్' అనే రెండక్షరాలు — ఇవన్నీ కలిస్తే పదహేడు అక్షరాలౌతాయి. అందుకే ప్రజాపతి సప్తదశ సంఖ్యాకుడు. ఈ సప్తద శసంఖ్యాబోధకమైన సుందరశబ్దం బ్రహ్మవాచకం. కాబట్టి సుందరకాండ మనేదానికి బ్రహ్మ ప్రస్తావక కాండమని చెప్పడం నిష్కృష్టార్థం.

సుందరకాండమని పేరుపెట్టిన వాల్మీకి తాత్పర్యాన్ని బరిశీలిస్తే 'సుందర' శబ్దానికి హనుమంతుడనే అర్థమే యుక్తమని, సుందరుని (హనుమంతుని) బలపరాక్రమాది విషయాలను, బ్రహ్మస్వరూపత్వాన్ని బ్రతిపాదించేకాండం కాబట్టి దీనికి సుందరకాండమని వాల్మీకి పేరుపె ట్టినాడని తెలుస్తోంది.

హనుమంతుని పరబ్రహ్మస్వరూపాన్నిగూర్చి, రాముని దశకంఠవ ధను చెప్పిన వాల్మీకిరామాయణంలోను, శతకంఠ, సహస్రకంఠవధలు చెప్పిన పరాశరసంహితలోను విపులంగా వివరింపబడినాయి. వాచవిగా పాఠకులకు ఒకటిరెండు ఉదాహరణాలు తెలియజేస్తాను.

# 41. దశకంఠరామాయణం – హనుమ

వాల్మీకిరామాయణాన్ని దశకంఠరామాయణంగా చెప్పవచ్చును. వాల్మీకియే తొలినాల్గు సర్గలలో 'పౌలస్త్యవధం' 'దశశిరశ్చవధం' అని రెండుసార్లు ప్రయోగించి యుండటంచే దశకంఠ రామాయణమే వాల్మీకి రామాయణ మనవచ్చును.

లంకకేగుచున్న హనుమంతుని మేధాశక్తిని, బలపరాక్రమాదులను, బ్రహ్మస్వరూపత్వాన్ని వివరించడానికై దేవతలచే పంపబడిన సురసయొక్క వృత్తాంతంలో —

*స సంక్షిప్యాత్మనః కాయం బభూవాంగుష్ఠ మాత్రకః।*
*అంతరిక్షే స్థిత శ్శ్రీమానిదం వచన మబ్రవీత్॥* — సుందర-సర్గ-1

దీనిలో హనుమంతుని అంగుష్ఠమాత్రునిగా వర్ణించడంచే 'అంగుష్ఠ మాత్రః పురుషః' అని శ్రుతిలో వర్ణింపబడిన పరబ్రహ్మస్వరూపుడు హనుమంతుడని వాల్మీకి వ్యంగ్యధోరణిలో దెల్పినాడు. లంకాదాహకుడగు హనుమంతుని గూర్చి లంకలోని రాక్షసులిలా తలపోసారు.

*కింవైష్ణవం వా కపిరూప మేత్య రక్షోవినాశాయ పరం సుతేజః।*
*అనంతమవ్యక్తమచింత్యమేకం స్వమాయయా సాంప్రత మాగతం వా॥*

నాశంలేనిది, మనోగ్రాహ్యం కానిది, అద్వితీయమైనట్టి పరమాత్మ తన మాయచే రాక్షససంహారానికై వానరరూపంధరించి వచ్చినాడా యని ఆశ్చర్యపడ్డారు. కాబట్టి స్పష్టంగా రాక్షసవాక్కులద్వారా వాల్మీకి మహర్షియే, హనుమంతునికి పరబ్రహ్మస్వరూపాన్ని ఉపసంహారన్యాయంతో వివరించినాడు. హనుమంతునిచూచి రావణుడిలా అనుకొన్నాడు.

*కిం బ్రహ్మణస్సర్వ పితామహస్య సర్వస్యధాతు శ్చతురాననస్య।*
*ఇహాగతో వానరరూపధారీ రక్షోపసంహారకరః ప్రకోపః॥*

ఇది బ్రహ్మయొక్క ప్రకోపమా? లేక విష్ణువుయొక్క మాయారూపమా? అని రావణుడు సందేహపడ్డాడు. అనంతం, అవ్యక్తం, అచింత్యం, ఏకం అనేవి పరబ్రహ్మకు చెప్పదగిన విశేషణాలు. హనుమంతుడు సాక్షాద్బ్రహ్మస్వరూపుడని వాల్మీకియే ప్రతిపాదించియున్నాడు.

హనుమంతుని విశ్వరూపత్వాన్ని సుందరకాండలోని యీక్రింది ఘట్టం రూఢిచేస్తోంది. హనుమంతుడు సీతాదేవిని తన వీపుపై

మోసికొనిపోయి రాముని వద్దకు చేరుస్తానంటాడు. నీ వింత చిన్నవాడవు. నన్నెలా మోసికొనిపోగలవని సీత మందహాసంతో ప్రశ్నిస్తుంది. ఆ సందర్భంలో —

ఇతి సంచింత్య హనుమాం స్తదా ప్లవగసత్తమః।
దర్శయామాస వై దేహ్యా స్స్వరూప మరిమర్దనః॥
స తస్మాత్పాదపా ద్ధీమానాప్లుత్య ప్లవగర్షభః।
తతో వర్ధితు మా రేభే సీతా ప్రత్యయకారణాత్॥
మేరుమందర సంకాశో బభౌదీప్తానల ప్రభః।
అగ్రతో వ్యవతస్థే చ సీతాయా వానరోత్తమః॥
హరిః పర్వత సంకాశ స్తామ్రవక్త్రో మహాబలః।
వజ్ర దంష్ట్రనఖో భీమో వై దేహీ మిద మబ్రవీత్॥
స పర్వత వనోద్దేశాం సాట్ట ప్రాకార తోరణాం।
లంకా మిమాం సనాథాం వా నయితుం శక్తి రస్తి మే॥

తనకామరూపం ఆమెకు చూపాలని హనుమంతుడు చెట్టుమీదినుండి దూకి తనరూపాన్ని పెంచనారంభించాడు. ఆయన మేరుమందర పర్వతములంతవాడై యగ్నిహోత్రునిలాగా వెలిగిపోతున్నాడు. పర్వతాకారుడై ఎఱ్ఱని మొగంతో, మహాబలంతో, వజ్రాలవంటికోఱలు, గోళ్లను గలవాడై తాను తలచుకొన్నచో లంకా పట్టణాన్ని బురుజులు, గోపురాలతో, పర్వతవనాలతో రావణునితోసహా తన భుజాలపై పెట్టుకొని పోగలనని చెప్పాడు.

ఈ పై వృత్తాంతాన్నిబట్టి హనుమంతుడు విశ్వాకృతియైన పరమేశ్వరుడని మనం నిశ్చయింపవచ్చు. హనుమత్సహస్ర నామస్తోత్రంలో —

త్రివిక్రమ స్త్రిపాదూర్ధ్వ స్తరణి స్తారణి స్తమః।
బ్రహ్మపుచ్ఛో బ్రహ్మపరః వానరో వానరేశ్వరః॥

త్రిపాదూర్ధ్వః అనటంవల్ల 'త్రిపాదూర్ధ్వ ఉదైత్పురుషః' అనే పురుషసూక్తప్రమాణంవలన బ్రహ్మమని, 'బ్రహ్మపుచ్ఛః' అనటంలో 'బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా' అనే తైత్తిరీయవచనం వ్యాఖ్యాతమౌతోంది. ఈ విశేషణం స్వామి పుచ్ఛానికి అనేభ్రాంతి కలుగుతుందేమోనని 'బ్రహ్మపరః' అని స్పష్టప్రతిపత్తిగా నిర్వచింపబడింది. రుద్రయామిళంలో హనుమంతుని విరాడ్బ్రహ్మస్వరూపం రూఢిగావింపబడింది.

# 42. శతకంఠ రామాయణం – హనుమ

హనుమంతుని పరబ్రహ్మత్వాన్ని నిశ్చయించడానికై పరాశరసంహిత లోని శతకంఠరావణవధ వృత్తాంతాన్ని చూడవచ్చు.* రావణ సంహారా నంతరం సంతోషనిమగ్నుడైన రామచంద్రునితో ఆకాశవాణి, దశకం ఠుని సంహరించడంలో గొప్పలేదు. శతకంఠుని సంహరిస్తే నీ ప్రతిష్ఠ శాశ్వతమౌతుందని హెచ్చరించింది. శతకంఠుని పట్టణం లంకాపురానికి నూఱామడల దూరంలోఉంది. అది భూమిమీద లేదు. అంతరిక్షంలో ఉంది. రాముడు దానిని సాధించడం ఎట్లాఅని చింతపడసాగాడు. అప్పుడు హనుమంతుడు —

తదా హనుమాన్ దుర్ధర్షః ప్రాకారాగ్నిం సరిత్పతౌ।
క్షిప్త్వా తత్పుర పర్యంతం స్వలాంగూల మవర్ధయత్॥

శతకంఠరావణుని అంతరిక్షపురానికి అగ్నిప్రాకారంఉంది. దానిని హనుమంతుడు తన వాలంతో సముద్రంలోపడవైచి ఆపురందాకా తన తోకను వ్యాపింపజేశాడు. అప్పుడు వానరులకు శతకంఠుని భటులకు యుద్ధం జరిగింది. శతకంఠుని తలలను రాముడు తఱిగిపోశాడు. కాని వాని తలలు పుట్టుతూనే ఉండినాయి. నెత్తురు చుక్కలు పడిన చోటులనెల్ల శతకంఠరావణులు పుట్టసాగారు. ఇంతలో రామచంద్రుడు తమ్ములతో సహా మూర్ఛపోయాడు. సీతాదేవి రణానికి పూనుకొనింది. గర్గమహర్షి వచ్చి సీతకు హనుమన్మంత్ర ముపదేశించాడు. ఆ మంత్రప్ర భావంవల్ల —

తస్మాత్ప్రసన్నో హనుమా నభవద్విశ్వరూపధృత్।
వానరం ముఖమేకం తం ద్వితీయం సింహవక్త్రకమ్॥
తృతీయం గారుడం వక్త్రం చతుర్థం సౌకరం ముఖమ్।

---

* తెలుగులో వెలసిన శతకంఠరామాయణాలు.

a) శతకంఠ రామాయణము(పద్యకావ్యం) — మర్దనకవి.
b) శతకంఠ రామాయణము(పద్యకావ్యం) — ఏలుకుర్తి లింగన
c) శతకంఠ రామాయణము(పద్యకావ్యం) — లింగకవి రంగకవి
d) శతముఖ రామాయణము(పద్యకావ్యం) —
e) శతకంఠ రామాయణము(వచనం) — నేలటూరు వేంకటసుబ్బశాస్త్రి.

హయాననం పంచమం చాప్యేకైకం నయనై స్త్రిభిః॥
దశబాహుసమోపేతం దశాయుధ సమన్వితమ్।
తదాప్రభృతి కథితం పంచాస్యో హనుమానితి॥
రూపం తస్య బభౌ యద్వ ద్రుద్రస్య పురఘాతినః।

హనుమంతుడు పంచముఖాంజనేయుడై ప్రకాశించాడు. మొదటిది వానరముఖం. రెండవది సింహముఖం. మూడవది గారుడం. నాల్గవది సౌకరం. ఐదవది హయాననం. పదిచేతులు, పది ఆయుధాలతో ఒప్పి హనుమంతునికి పంచాస్య హనుమంతుడని ఖ్యాతికలిగింది.

అప్పుడు హనుమంతుడు సీతాదేవిని భుజాలపై కెక్కించుకొని యెందఱు శతకంఠులుండిరో అన్నిరూపాలను దాను గూడ ధరించి యుద్ధం సాగించాడు. తన లాంగూలాన్ని విస్తరింపజేసి శతకంఠుని రక్తం భూమిపై బడకుండ కప్పివేశాడు. దానితో మిగిలిపోయిన శత కంఠునొక్కని సీతాదేవి కాళీరూపం ధరించి హతమార్చింది. దీన్నిబట్టి హనుమంతుడు పరబ్రహ్మస్వరూపుడని రూఢియౌతోంది.

# 43. సహస్రకంఠ రామాయణం – హనుమ

సహస్రకంఠరావణసంహారసందర్భంలో,* పరాశర సంహితలో శ్రీరా మునితో హనుమ యిట్లన్నాడు.

లాంగూల రోమ జాతేషు నక్షత్రాణి తథాగ్రహాః।
దృశ్యంతే దర్భపుంజేషు యథైవ హిమబిందవః॥

"రామచంద్రా! నేను నాతోకము సప్తసముద్రాంతము పెంచుతాను. నీవు నాతోక మీదుగా సప్తసముద్రాలను దాటివెళ్లి సహస్రకంఠుని వధించు" అప్పుడు ఆంజనేయుడు తన తోకను పెంచగా అది సముద్ర

---

* తెలుగులో వెలసిన సహస్రకంఠ రామాయణాలు.

a) సహస్రకంఠ రామాయణము (పద్యకావ్యం) - ముద్దులక్ష్మీనారాయణ (సహస్రకంధర రామాయణము)

b) సహస్రకంఠ రామాయణము - (పద్యకావ్యం) - రా. కొంపయ్యశాస్త్రి

c) సహస్రకంఠ రామాయణము - (వచనం) నేలటూరు వేంకటసుబ్బశాస్త్రి

సప్తకం దాటిపోయింది. ఆ తోకపై నక్షత్రాలు, గ్రహాలు, దర్భకొసలపై మంచునీటి బిందువుల్లాగా ప్రకాశించాయి.

సహస్రకంఠ రావణుని సంహరించడానికై శ్రీరామచంద్రుడు హనుమంతుని నియోగించాడు. అప్పుడాయన తన విశ్వరూపాన్ని చూపాడు. అలా పెరిగిన హనుమంతుని రోమకూపాలలో బ్రహ్మాది దేవతలు, ఋషులు, కన్పడినారు. ఆ మహామూర్తికి సహస్రశీర్షాలు, సహస్రబాహువులు ఉండినవి. ఆయన దిక్కులనన్నిటిని ఆక్రమించాడు.

## 44. హనుమంతుడు రుద్రాంశ సంభూతుడు

పరాశరసంహితలోని శతకంఠరావణసంహార సందర్భంలో, "రూపం తస్యబభౌ యుద్ధ్వ (రుద్రస్య పురఘాతినః" అని ఉంది. శతకంఠ రావణునితో యుద్ధంచేస్తున్న హనుమంతునిరూపం త్రిపురసంహారంచేస్తున్న రుద్రునివలె కనిపించింది. ఇదివట్టిఉపమానంకాదు. హనుమంతుడు సాక్షాద్రుద్రుడే!

తారసారోపనిషత్తులో ఒక రహస్యంఉంది. 'ఓం నమోనారాయణాయ' అనునది తారకం. ఈ అష్టాక్షరిలో ఓం అనేది పరమాత్మ. నమ అనే ద్వ్యక్షరము ప్రకృతి. నారాయణాయ అనే ఐదక్షరాలు పరబ్రహ్మ. — ఇది ఒకవిభాగం. దీనికి రెండవ విభాగం ఉంది. ఓం బ్రహ్మనకారం విష్ణువు. మకారం రుద్రుడు. నకారం ఈశ్వరుడు. రకారం విరాట్టు, యకారం పరమాత్మ. ఇక మూడవ విభాగంఉంది. అకార, ఉకార, మకారాలు వరుసగా ప్రథమ, ద్వితీయ, తృతీయాక్షరాలు. నాల్గవది బిందువు. ఐదవ అక్షరం నాదం. ఆఱవ అక్షరం కల. ఏడవ అక్షరం కలాతీతం. ఎనిమిదవ అక్షరం పరమాత్మ! అదియే తారకం!

1. అకారం — జాంబవంతుడు
2. ఉకారం — ఉపేంద్రుడు (విష్ణువు) — సుగ్రీవుడు
3. మకారం — రుద్రుడు — హనుమంతుడు
4. బిందువు — ఇంద్రుడు — శత్రుఘ్నుడు
5. నాదం — భరతుడు
6. కల — శేషుడు — లక్ష్మణుడు
7. కలాతీతం — (యకారస్వరూపిణి) — సీత
8. పరమాత్మ — తారకం — శ్రీరామచంద్రుడు.

దీనిలో ముఖ్యంగా, తెలిసికోవలసిన అంశమేమంటే మకారం రుద్రాంశకలిగిన హనుమంతునికి ప్రతీక. కాబట్టి హనుమ సాక్షాత్పరమేశ్వరుడు.

నాద బిందు కలాతీతం ఉత్పత్తి స్థితి వర్జితమ్।
సాక్షాదీశ్వర రూపంచ హనుమంతం నమామ్యహమ్॥

రుద్రయామళంలో శివుడు పార్వతితో యిలా చెబుతున్నాడు.

దశ విష్ణుర్ద్వాదశార్క స్తై చైకాదశ సంస్మృతాః।
రుద్రః పరమచండశ్చ లోకేzస్మిన్ భుక్తిముక్తిదః॥
హనుమాన్ స మహాదేవః కాలకాల స్సదాశివః।
భుక్తిదో ముక్తికైవల్య ముక్తిదః సర్వకామదః॥

విష్ణువులు పదిమంది, సూర్యులు పన్రెండుగురు, రుద్రులు పదునొకండుగురు. హనుమంతుడు కాలకాలుడైన సదాశివుడు. అతడు పంచాస్యుడు. శివునికి కూడ పంచముఖాలున్నవికదా!

1. సద్యోజాతం, 2. వామదేవం, 3. అఘోరం, 4. తత్పురుషం, 5. ఈశానం. ఇవి ఐదును హనుమంతుని పంచాస్యములైనాయని తెలియాలి. ఇది మంత్రరహస్యం.

## 45. హనుమంతుడు – శివ విష్ణ్వాత్మకుడు

ఆనంద రామాయణంలో ఒక ఐతిహ్యం యిలా చెప్పబడింది.*

పురా త్రిపురసంహారే సబాణత్వ ముపేయుషే।
విష్ణవే రామరూపాయ కరిష్యన్ ప్రత్యుపక్రియాం॥
అఖిలైః ప్రమథైశ్శంభుః హనుమద్రూప మాయయౌ।
తథా ప్రత్యుపకారం సః విధాయాతి కృతజ్ఞతాం॥
శివ ఏవ హరిస్సాక్షాత్ హరిరేవ శివస్స్మృతః।
ఉభయోరంతరం నాస్తి భేదకృత్పాపమశ్నుతే॥
విజ్ఞాత మనయోర్యత్తు రూపం తదుభయాత్మకం।
ఉపాస్య హనుమత్సంజ్ఞం భోగమోక్షప్రదం నృణామ్॥

---

* ఆనందరామాయణమ్ — (ఆంధ్రతాత్పర్య వివరణం) సిద్ధాంతిశివశంకర శాస్త్రి, ఆర్సీనియన్ముద్రాక్షరశాల, చెన్నపురి, 1902.

త్రిపురాసురసంహారంలో విష్ణువు శివుని ధనుస్సున (మేరుపర్వతము) బాణంగా వెలిశాడు. ఆ ఉపకారాన్ని మనస్సులో పెట్టుకొని కృతజ్ఞుడైన శివుడు రామావతారం ఎత్తిన విష్ణువుకు హనుమంతుని అవతారమెత్తి సాయంచేసాడు. ఇంకొక విశేషమేమంటే హనుమంతు దుభయాత్మకుడు. అనగా శివవిష్ణ్వాత్మకుడు. కాబట్టి భోగమోక్షాలు రెండూ ఈయగల్గినవాడు. ఐశ్వర్యాన్ని కోరువారు శివుణ్ణి, మోక్షాన్ని కోరేవారు జనార్దనుణ్ణి కొలిచే సంప్రదాయం మనదేశంలోఉంది. హనుమంతుని కొల్చేవారికి భోగమోక్షాలురెండూ కరతలామలకాలు.

యత్రాస్తి మోక్షో నహి తత్ర భోగః
యత్రాస్తి భోగో నహితత్ర మోక్షః।
శ్రీమారుతే స్సేవన తత్పరాణాం భోగశ్చ మోక్షశ్చకరస్థ ఏవ॥

ఇంద్రజిన్నాగబంధం వదిలించడానికి వచ్చిన గరుడుడు రామునితో యిట్లంటాడు.

సాక్షాత్త్వం భగవాన్ విష్ణుః లక్ష్మీస్తు జనకాత్మజా।
సౌమిత్రిః ఫణిరాజోఽయం రుద్రాశ్చకపయ స్స్మృతాః॥

నీవు సాక్షాత్తు విష్ణువవు. సీత-లక్ష్మి, లక్ష్మణుడు-శేషుడు. కపులందరు రుద్రులని గరుడుడు చెబుతాడు. పైగా అతడు ఏయే రుద్రులు ఏయే వానరులైనారో వివరించి చెబుతాడు.

| | | |
|---|---|---|
| సుగ్రీవుడు | = | వీరభద్రుడు |
| నలుడు | = | శంభువు |
| నీలుడు | = | గిరీశుడు |
| సుషేణుడు | = | మహాయశుడు |
| జాంబవంతుడు | = | అజైకపాదుడు |
| అంగదుడు | = | అహిర్బుధ్న్యుడు |
| దధివక్త్రుడు | = | పినాకధృత్ |
| తారుడు | = | అయుతాజి |
| తరళుడు | = | స్థాణువు |
| మైందుడు | = | భర్గుడు |
| హనుమంతుడు | = | శివుడు |

సాక్షాత్తుశివుడే హనుమంతుడయ్యాడు.

# 46. హనుమంతుని వీరగాథావిస్తృతి - వివేచన

గోష్పదీకృత వారాశిం మశకీకృత రాక్షసమ్।
రామాయణ మహామాలారత్నం వందేఽహం అనిలాత్మజమ్॥

హనుమంతుడు రామాయణమనే మహామాలకు రత్నంవంటివాడని వాల్మీకి మహర్షియే చెప్పినాడు! పరాశరసంహితలో మైత్రేయ మహర్షితో పరాశరమహర్షి యిలా చెబుతున్నాడు.

ఏకోదేవ స్సర్వద శ్రీహనూమా నేకోమంత్ర శ్రీహనూమత్ప్రకాశః।
ఏకోమూర్తి శ్రీహనూమత్స్వరూపా చైకం కర్మ శ్రీహనుమత్సపర్యా॥

ఒక్కడేదేవుడు. అతడు హనుమంతుడు. ఒక్కటేమంత్రం. అది హనుమన్మంత్రం. ఒక్కటే మూర్తి. అది హనుమన్మూర్తి. ఒక్కటే సేవ. అది హనుమత్సేవ.

పరాశరమహర్షియే మరల యిలా చెబుతున్నాడు.

జలాధీనా కృషిస్సర్వా భక్త్యధీనం తు దైవతమ్।
సర్వం హనుమతోఽధీన మితిమే నిశ్చితామతిః॥

లోకంలో వ్యవసాయమంతా జలానికి అధీనమై ఉంటుంది. నీరులేకుంటే పంటలు పండవు. దైవతమెప్పుడును భక్తికధీనమై ఉంటుంది. భక్తిలేకుంటే ఏదేవతకూడ సాక్షాత్కరింపదు. కాని హనుమంతునికీ సర్వం అధీనములై ఉంటుంది. సర్వకృషియు, సర్వదేవతలును హనుమకు అధీనములని అర్థం. ఇది నాయొక్క దృఢనిశ్చయం అంటున్నారు మహర్షి!.

జానపద సాహిత్యమే కాలక్రమంలో శిష్టసాహిత్యంగా రూపొందుతోంది. రాముని వీరగాధలో కాలక్రమేణ హనుమవీరగాథకు కూడా ప్రాధాన్యం యినుమడింపసాగింది. ఈవీరగాథావిస్తృతి లక్షణ వివేచనం చాల ఆసక్తికరంగా ఉంటుంది. కేవలం గాథారూపంగా ఉండే సంఘటనలు ఒక కవిచేతిలో ప్రకృష్టకథాకల్పనంగా పరిణమించినప్పుడు కాలక్రమంగా సంప్రదాయంలో ఆ కథ స్థిరపడి సంస్కృతితో దేశీయ జన జీవితంతో అవినాభావసంబంధాన్ని సమకూర్చుకొంటుంది. తత్ఫలితంగా సంప్రదాయం మతవిశ్వాసంపై ఆచారవ్యవహారాలపై నాధారపడి

ఉంటుంది. కనుక మతప్రాతిపదికపై నిర్మింపబడిన ఆ ప్రసిద్ధకావ్యం లోని ప్రధానపాత్రలపై దైవత్వం ఆరోపింపబడి వారి వారి కృత్యాలకు కార్యకారణకల్పనమొనర్పబడుతుంది. పర్యవసానంగా ఆ పాత్రలు పైకి మానుషలక్షణం గలవారైనప్పటికీ లోపల అవతారలక్షణాన్ని ప్రకటించే దేవతాసంబంధమైన వ్యక్తులుగా నిరూపింపబడుతారు.

వాల్మీకికి పూర్వం రామగాథ మానుషప్రపంచంలోనడచిన ఒకవీర గాథ. అది వాల్మీకి నాటికే కొంత సహజత్వాన్ని కోల్పోయినప్పటికీ రామునిలో మాత్రం మానుషసహజలక్షణాన్నే నిల్పి ప్రతినాయకుడైన రావణునిలో కొంత అద్భుతలక్షణాన్ని సంక్రమింపజేసినాడు. ఏతత్ఫలితంగా ఒక శిరస్సు, రెండుచేతులు ఉండే రావణునికి పదితలలు, ఇరువదిచేతులు ఏర్పడినాయి. ఇది అభూతకల్పనమే. మొట్టమొదట రామగాథయొక్క తొలిదశలో రావణుడేక శిరస్కుడే. వానిని అసురుడుగా నిరూపింప దలచినప్పుడు కవి, వాని అసురలక్షణ ద్యోతకంగా దశశిరస్సులను కల్పించినాడు. శిరస్సులు పదియైనప్పుడు బాహువులు ఇరువదియైనవి. వింశతిప్రభుభుజాహంకారుడైనాడు రావణాసురుడు. అలంకారికంగా తీసి కొన్నను ప్రతినాయకోత్కర్ష ప్రధాననాయక పాత్రకుద్దీప్తికి, ప్రాచుర్య ప్రాశస్త్య సంధాయకం కాబట్టి యిలా చేసినాడనవచ్చును. ఒక తల, రెండు చేతులుగల ఒక మానవుడు, పదితలలు యిరువదిచేతులు గల రక్కసుని సంహరించినాడనగా అది నాయకోత్కర్షాపాదకమనుట నిర్వివాదాంశం. వాల్మీకి యిలా ప్రకల్పించడంలో అప్పటికే తంత్రగ్రంథాల రచనావ్యాసంగం ప్రారంభమైయుంటుందని నాఊహ. దీనికితోడు నాయకునికి ప్రధాన సహాయకుడగు హనుమపాత్రలో కొన్ని అమానుష అద్భుతలక్షణాలు చోటుచేసికొని యుండటంవల్ల మతవిశ్వాసంపై ఆధారపడిన సంప్రదాయగ్రంథాలలో క్రమక్రమంగా దేవతాలక్షణం ఆరోపింపబడిన ఆపాత్రలు మంత్రాధిష్ఠానదేవతలై సర్వశక్తిమంతులుకావడం సంభవించింది. వాల్మీకి విరచిత రామాయణాంతర్గత ప్రధానపాత్రలు నలుగురు —

1) శ్రీరాముడు, 2) సీత, 3) హనుమంతుడు, 4) రావణాసురుడు

వీరిచుట్టూ మంత్ర తంత్ర గ్రంథవిస్తృతివలన వీరందరూ మంత్ర తంత్రాధిష్ఠానదేవతలైనారు. దశోపనిషత్తులుగా ఉన్న ఉపనిషత్తులు అష్టోత్తరశతోపనిషత్తులైనట్లు. అందులో శైవ, వైష్ణవ, శాక్తేయ, యోగ, సన్న్యాస, సామాన్య ఉపనిషత్తులు వేర్వేరైనవి. శాక్తేయ ఉపనిషత్తుల్లో

కొన్ని మంత్ర తంత్ర గ్రంథరచనాప్రభావంగలవి. ఉదాహరణానికి సీతా ఉపనిషత్తు. పూర్వ పూర్వ కార్యకారణకల్పనమన్నది ప్రాచీనతా పౌరాతన్య సూచకమని మనవారు విశ్వసించటంచేతనే పురాణాలలో ఆయా తాంత్రికదేవతల చుట్టూ కథారూపంగా గాథలల్లబడినాయి. పరాశరసంహిత రామాయణ, భారత కాలాలకంటే రెండుమూడువందల యేండ్ల తర్వాతపుట్టినది. వాల్మీకి రామాయణంలో కేవలం రాముని నమ్మిన బంటుగా నున్న హనుమ ఆ తర్వాతికాలంలో 'ఇంతింతై వటుడింతయై' యన్నట్లు పెరిగిపెరిగి శివవిష్ణ్వాత్మకుడై చివరికి త్రిమూర్త్యాత్మకుడై విరాడ్రూపముదాల్చి విరాట్పురుషుడైనాడు. ఇది దేవతామూర్తి స్వరూపప్రకల్పనలోని పరిణామ పరిణాహాలను సూచిస్తోంది. ఈ దశావిశేషాలను మూడుదశలలో (త్రిదశలలో) (మూడడుగులతో వామనుడు విరాట్పురుషుడైనట్లు) హనుమ అంగుష్ఠాకారం నుండి విశ్వమునంతటిని ఎలా ఆక్రమించినాడో పరిశీలించుటయే హనుమంతుని వీరగాథావిస్తృతిలక్షణ వివేచనంలో నేను ప్రతిపాదిస్తున్నాను.*

* అష్టోత్తర శతోపనిషత్తుల్లో రామరహస్యోపనిషత్ ఒకటి. ఇది సనకాదిమహామునులకు హనుమంతునికి మధ్య జరిగినసంవాదం.
హనుమంతుడిట్లన్నాడు —
రామ ఏవ పరంబ్రహ్మ రామ ఏవ పరం తపః।
రామ ఏవ పరంతత్త్వం శ్రీరామోబ్రహ్మతారకమ్॥
"రామస్య అంగాని వాయుపుత్రాదీని" వాయుపుత్రాదులు రామునియొక్క అంగాలు. 'తాన్యంగాని వినా రామో విఘ్నకారోభవతి' అని చెప్పబడింది. గృహస్థులు రామనామ ప్రణవాధికారులని, రామనామ జపంచే సర్వపాపనివృత్తి యనిచెబుతూ ఏకాక్షరరామమంత్రం మొదలుకొని ఏకత్రింశదక్షరమంత్రందాకా చెప్పబడింది. రామమాలామంత్రం, సీతామంత్రం, లక్ష్మణ, భరత శత్రుఘ్న హనుమన్మంత్రాలున్నాయి. ఈ ఉపనిషత్తు తంత్రగ్రంథాలప్రభావంచే రచింపబడినా యిది వైదిక దేవతామంత్రం కిందనే వస్తుంది. వేదాంతకావ్యవాఙ్మయానికిది ప్రేరకం!
అలాగే శాక్తేయ ఉపనిషత్తుల్లో సీతాఉపనిషత్తు ఉన్నది. సీత ప్రకృతియనీ, ప్రణవమనీ చెబుతూ సీతా శబ్దానికి 'మాయ' అనేది అర్థమనీ, 'ఈ' కారము విష్ణువనీ, 'స' కారము సత్యము, శివుడనీ, 'త' కారము సరస్వతి, వాగ్దేవి అనీ అది బ్రహ్మతో కూడినదని తెల్పబడినది. ఆమె శ్రీరామునితోకూడి ప్రపంచసృష్టి స్థితి సంహారక్రియ జరుపుచున్నదని ఓంకారము నెఱుగుటయే సీతను తెలిసికొనుట అని నిరూపింపబడినది. దీనిపై సాంఖ్యదర్శన ప్రభావం ప్రబలంగా ఉన్నప్పటికీ తంత్రగ్రంథాల ప్రభావంచేతనే నిర్మించబడిందని చెప్పాలి. సౌభాగ్యలక్ష్మీ ఉపనిషత్తే దీనికి ప్రబల ప్రమాణం.

# 47. త్రిదశలలో హనుమంతుని వీరగాథా విస్తృతి

| దశ | ఆకరగ్రంథం | రావణాకారం | లంక/సేతువు | రావణవధ | హనుమరూపం | సమన్వయం |
|---|---|---|---|---|---|---|
| ప్రథమదశ | దశకంఠ రామాయణం (వాల్మీకి రామాయణం) | 10శిరస్సులు 20బాహువులు | లంక సముద్ర మధ్యంలో — లంకసేతుబంధనం కపులసాయంతో. | రామునిచే దశకంఠ రావణసంహారం | ఏకశిరస్కుడు. ద్విబాహువు. రామదూత. | శివ/రుద్రాంశ. మహాయోగి. |
| ద్వితీయదశ | శతకంఠ రామాయణం (పరాశరసంహిత) | 100శిరస్సులు 200బాహువులు | అంతరిక్షంలోలంక. చుట్టుఅగ్నిప్రాకారం. హనుమపైనెక్కి సీతారామ లక్ష్మణులక్కడికి చేరారు. | రామలక్ష్మణులు మూర్ఛపోగా సీత, హనుమసాయంతో కాళీరూపంతో శతకంఠుని వధించింది. గర్గమహర్షిసీతకు పంచముఖాంజనేయ మంత్రోపదేశంచేశాడు. | సీతహనుమభుజం పై ఎక్కి శతకంఠ సంహారంచేసింది. హనుమ (శివ) సీత (శక్తి) శివశక్తిసమ్మేళనం 5 ముఖాలు 10 బాహువులు/ మంత్రాధిష్ఠానదేవత | హనుమకుగల వానర/సింహ/ గారుడ/సౌకర/ హయాననములే శివుని పంచముఖ స్థానీయములు. |

| దశ | ఆకరగ్రంథం | రావణాకారం | లంక/సేతువు | రావణవధ | హనుమరూపం | సమన్వయం |
|---|---|---|---|---|---|---|
| తృతీయదశ | సహస్రకంఠ రామాయణం (పరాశరసంహిత) | 1000శిరస్సులు 2000బాహువులు | సప్తసముద్రాల కవతల లంక. హనుమతోకయే సేతువు కాగా రాముడు సముద్రాన్ని దాటాడు (ఇది పద్మకల్పంలో శివుడు పినాకాన్ని వాల్చగా రాముడు కపిసేనలు సముద్రతరణం చేసినదాన్ని స్ఫురింపజేస్తున్నది) | రాముని ఆజ్ఞతో హనుమయే సహస్రకంఠుని సంహరించినాడు | సహస్రబాహువులు. సహస్రశీర్షములు. అనంతత్వస్ఫోరకం త్రిమూర్త్యాత్మకుడు. విశ్వాకృతి. హనుమ విశ్వరూపదర్శనం. మంత్రాధిష్ఠానదేవత తాంత్రికవ్యవహారం | ప్రతినాయకునితో సమానస్థాయి కల్పనం. సుందరహను మన్మంత్రంలో బ్రహ్మ-విష్ణు-రుద్రులు హనుమదు పాసకులుకావడం హనుమత్రిమూర్త్యాత్మకత్వ సూచకం. |

ఈ విధంగా మూడుదశల్లో హనుమంతుని వీరగాధా విస్తృతిలక్ష ణాన్ని వివేచింపవచ్చును. ఈ విస్తృతికి మూలహేతువు మంత్ర తంత్ర గ్రంధరచనా ప్రాధాన్యమే.

మొట్టమొదట రావణుడేకైక శిరస్కుడే. వాల్మీకినాటికి దశకంఠు డైనాడు. ఆయనతర్వాత శతకంఠుడైనాడు. ఆ పిమ్మట సహస్రకంఠు డైనాడు. దీనికి ప్రధానహేతువు రామాయణంలో వీరకృత్యాలు చేసిన హనుమ యోగిగా నిరూపింపబడినాడు గనుక ఆయనను మంత్రాధిష్ఠాన దేవతను చేసి ఆమంత్ర తంత్రశక్తిని కధారూపంలో కల్పన చేయవలసిన అవసరం తంత్రగ్రంథ రచయితలకు కల్గడం. దానిచే ప్రతినాయకుని శిర స్సులు ఉత్తరోత్తరోత్కర్షగా పరిణమింపజేసి, నాయకస్థానాన్ని హనుమయే ఆక్రమించి ప్రతినాయకునితో సమానస్థాయిగల మంత్రాధిదేవతగా వానిని సంహరించినాడు.

దీని వెనుకరెండు ప్రధానరహస్యా లిమిడియున్నాయి. సృష్టిలోనే సత్తుకు, అసత్తుకు స్థానముంది. అసత్తు ఆసురీశక్తి! దాన్ని సమూ లంగా నశింపజేయడం సాధ్యంకాదు. అందుకే వైదికసాహిత్యంతో పాటు అవైదిక, మంత్ర తంత్ర సాహిత్యాలు కూడపుట్టుకొచ్చాయి. మంత్రాలు రెండువిధాలు.

1) వైదిక మంత్రాలు, 2) శాబర మంత్రాలు

వైదికమంత్రాలు వైదిక దేవతల నాధారంగాచేసికొని కల్పించినవి కాగా అవైదిక లేదా శాబరమంత్రాలకు క్షుద్రదేవతలుఆధారం. అట్టి అవైదిక మంత్రాలు మూడు ప్రధానమైనవి. ఇక్కడ అవైదిక మనగా దుష్టశక్తులను ఉపాసించడం అని నాభావన.

1) రావణుడు అధిష్ఠానదేవతగాగల ఖడ్గరావణమంత్రం.

2) సహస్రబాహువు కార్తవీర్యార్జునుడు అధిష్ఠానదేవతగాగల కార్తవీ ర్యార్జునమంత్రం.

3) బేతాళమంత్రం.

వైదిక తంత్రగ్రంథ రచయితలు రామభక్తుడైన హనుమను మంత్రా ధిష్ఠాన దేవతగాచేసి సహస్రకంఠ రావణుని సంహరింపించుటలో వైదిక మంత్రం అవైదిక, క్షుద్ర మంత్రాలను సమూలంగా నశింపజేయగలశక్తి గలవి అని నిరూపించడానికే. గాయత్రీ మంత్రజపానికి, రామనామ జప

మహిమకు శాబరమంత్రాలు నిర్వీర్యములైన సందర్భాలనేకంఉన్నాయని తాంత్రికులు చెబుతున్నారు.

'రావణుండు ఖడ్గ రావణుండయ్యెను' అని కల్పవృక్షకర్త చెప్పిన దానిలో రాముడే క్షుద్రమంత్రాధిదేవతయైన సహస్రకంఠ రావణుని సంహరించినాడని భంగ్యంతరంగా చెప్పినట్లయింది. కాని విష్ణుమూర్తి సహస్ర కంఠునికై మరొక అవతారమెత్తవలసిన అవసరమెందుకని రామభక్తుడైన హనుమనే మంత్రాధిష్ఠాన దేవతగాచేసినచో రామనామ మాహాత్మ్యం లోకానికి మరింత తేటతెల్లమవుతుందని ప్రాచీనులు విశ్వసించియుండవచ్చును. పైగా విష్ణువంతటిగొప్ప వైదిక దేవత, అవైదిక క్షుద్రదేవతతో తలపడి పోరాడినాడనుట శాబర మంత్రోపాసకులకు ప్రాధాన్యం కల్పించినట్లవుతుందని తలంచి రామాజ్ఞచే హనుమయే విరాడ్రూపంధరించి సహస్రకంఠుని సంహరించినాడనుటలో రామభక్తునికే యింతటిశక్తి సామర్థ్యాలున్నప్పుడు యింక రాముని మాట చెప్పడందేనికి అది భంగ్యంతరంగా నాయకోత్కర్షాపాదకమేనని తంత్రగంధరచయితలూహించి యుండవచ్చును.

తంత్రగ్రంథ రచయితల తీర్మానానుసారం.

1) దశకంఠ సంహారకర్త — రాముడు
2) శతకంఠ సంహారకర్త్రి — సీత
3) సహస్రకంఠ సంహారకర్త — హనుమ

ఈ ఉత్తరోత్తరోత్కర్ష వలన రామునికంటే రామభక్తుడు గొప్పవాడైనాడు. త్రిమూర్త్యాత్మకుడు — విరాట్పురుషుడైనాడు. ఇది పరోక్షంగా రామనామమాహాత్మ్య ప్రభావమే!

| రావణుడు | హనుమంతుడు |
|---|---|
| 1) పది తలలు | 1) ఏక శిరం |
| 2) శత శిరములు | 2) పంచ శిరములు |
| 3) సహస్ర శిరములు | 3) సహస్ర శీర్షుడు |
| ద్విసహస్రబాహువు | సహస్రబాహువు |
| (పరిమిత సంఖ్య) | అనంతరూపం, విరాడ్రూపం. |
| | (అపరిమిత సంఖ్య) |

ఈ సంఖ్యాశాస్త్రం ఏం చెబుతోందంటే క్షుద్రదేవతాకమైన మంత్రశక్తులు ఒకపరిమితికి లోబడిమాత్రమే పనిచేస్తాయిగాని కాలంయొక్క

అనంతత్వ, విశాలత్వ గభీరత్వాలను మార్కొని నిలువజాలవు. అది వైదిక భావనగల మంత్రవేత్తలకే సాధ్యం అని నిరూపించడానికే సంఖ్యను పెంచుకొంటూపోవడం జరిగింది. దీనితో రాముడు — హనుమంతుడు యిద్దరు సమానస్కంధులైనారు. రాముడు — రామభక్తుడు యిద్దరికీ అవినాభావసంబంధం, అభేదప్రతిపత్తిసిద్ధించింది. ఎలా? దాన్ని వివరిస్తేగాని తెలియదు. వైదికదేవతకు — మంత్రాధిష్ఠానదేవతకు సమానప్రతిపత్తి తంత్రశాస్త్రమే సమ్మతిస్తోంది. 'మంత్రాధీనంతు దైవతమ్' అనేమాటకర్థమిదే.

ఇప్పుడు జరుగుతున్నది శ్వేతవరాహకల్పం. భవిష్యత్కల్పంపేరు ఋశ్యవరాహకల్పం. దానికి ప్రజాపతి హనుమంతుడు. ఇది రామభక్తుడైన హనుమ అధిష్ఠించిన ఉన్నతోన్నత స్థానం. భవిష్యత్కల్ప బ్రహ్మ కావడం నిరంతర రామనామ జప మాహాత్మ్యఫలమైనప్పుడు ప్రజలు రామునిపట్ల భక్తిని ఎలాంటి పరిస్థితుల్లోను వీడరుకదా! క్షుద్రదేవతా నిర్మూలనమే వైదికదేవతా ప్రథమకర్తవ్యం. ఆక్షుద్ర దేవత సర్వశక్తి సమీకరణం చేసికొని అజేయుడైనప్పుడే అవతారానికి ప్రాధాన్యం ఏర్పడుతోంది. లేకుంటే ఆ దేవతల భక్తులే చాలు. అలాంటి క్షుద్రదేవతా శక్తుల నశింపజేయడానికి.

శ్రీరామ — హనుమలు సమానస్కంధులన్నాము. దానికి వాల్మీకి రామాయణమందే సాక్ష్యమున్నది. శ్రీరాముడు 'నేనెవరిని' అని బ్రహ్మనే అడిగినప్పుడు ఆయన యిట్లన్నాడు.

ఓ రామా! నీవు పూర్వం అష్టవసువుల్లో ప్రజాపతియైన ఋతధాముడనే పేరుగలవాడివి. అష్టరుద్ర మూర్తులలో ఎనిమిదవ మూర్తియైన మహాదేవుడివి. సాధ్యులలో వీర్యవంతుడనే ఐదవవాడవు. నీవు ముల్లోకాలకు ఆదికర్తవు. పరమ స్వతంత్రుడవు. సర్వనియామకుడవు. నీకు అశ్వినీదేవతలు శ్రోత్రములు. సూర్యచంద్రులు నేత్రములు. సృష్టికి ముందు, ప్రళయానికి పిమ్మట నీవొక్కడవే కనబడుతావు" అన్నాడు. ఇలాంటి సర్వశక్తిమంతుడే విష్ణువన బడుతాడు. విష్ణుపదాన్ని అధిష్ఠించడానికి పైచెప్పిన మహాలక్షణాలన్నీ ఉండాలి. కాబట్టే రాముణ్ణి విష్ణువు అవతారంగా లోకం ప్రశంసించడం.

రాముడు ప్రజాపతి. హనుమ-ప్రజాపతి. వీరిద్దరూకలిసి అవైదిక క్షుద్రదేవతాకమైన శక్తి రావణరూపంగా విజృంభించి త్రిలోకనాశనహేతువగుచున్నప్పుడు ధర్మసంరక్షణార్థం చేదోడు వాదోడుగా అవతరించి,

ఆ దుష్టశక్తిని సంహరించి అంతర్ధానులైనారు.

మరొక ప్రమాణం రామరక్షాస్తోత్రంలో లభిస్తూవుంది.

ధర్మ దృఢబద్ధమూలో వేదస్కంధః పురాణశాఖాఢ్యః।
క్రతుకుసుమో మోక్ష ఫలో **జయతి కల్పద్రుమోవిష్ణుః॥**

**ఆరామః కల్పవృక్షాణాం** విరామః సకలావదామ్।
అభిరామ స్త్రిలోకానామ్ రామః శ్రీమాన్సనః ప్రభుః॥

కల్పవృక్షకర్తకూడా — రామునికల్పవృక్షంతో పోల్చడంచేతనే రామ కథకు కల్పవృక్షమని పేరుపెట్టినాడు.

"ఒక మహాగాధ వెంచిన యొక్కడైన
చెట్టుకాని చెట్టుతనమ్ము...." — బాల-అహల్య-*552* ప.

అనడంలో రామకథ — మహాగాథగా వృక్షంలాగా శాఖోపశాఖాన్వితమై పుంఖానుపుంఖంగా విస్తరిల్లిందని స్పష్టమౌతోంది.

ఆశ్రమే రామబీజోత్థ రమాయణ మహావటమ్।
ద్వీపద్వీపాంతరావ్యాపి శత శాఖాప్రవిస్తరమ్॥

ఆ భావోత్కర్షనే పైన మనం పరిశీలించాము. రాముడు కల్పవృక్షమైనప్పుడు హనుమసైతం అంతటివాడేకదా! పైగా రామభక్తుడు రామునికంటే గొప్పవాడని లోకంలో పెద్దలంటారు.

హనుమాన్ కల్పవృక్షో మే హనుమాన్ మమ కామధుక్।
చింతామణి స్తు హనుమాన్ కో విచారః కుతోభయమ్?

హనుమంతుడు మా కల్పవృక్షం. మా కామధేనువు. మా చింతామణి. ఇక మాకు విచారమెందుకు? మాకు భయమెందుకు? అని పరాశరమహర్షి పరాశరసంహితలో చెప్పారు. కాబట్టి శ్రీరామ-హనుమలు యిద్దరూ కల్పవృక్షాలే. అనగా వాంఛితార్థఫలప్రదులే.

వాల్మీకి రామాయణంతో బాగాపరిచయమున్న వారిక్కడ ఒక సందేహం లేవదీయవచ్చును. వాల్మీకియే హనుమ ముఖతః రావణుని కల్పవృక్షంలో పోల్చియున్నాడుకదా అని. ఆ శ్లోకాన్ని పరిశీలిస్తాం.

స కల్పవృక్షప్రతిమో వసంత ఇవ మూర్తిమాన్।
శ్మశానచైత్య ప్రతిమో భూషితోఽపి భయంకరః॥

రావణుడు రెండు పరస్పర విరుద్ధ ప్రతిపశక్తుల సమన్వయస్వరూపుడుగా వాల్మీకి అభివర్ణించియుండటం యిక్కడ గమనింపదగింది. లోపలఎంత వైదికత్వముందో బయటఅంతక్షుద్రంగా ప్రవర్తించే లక్షణం కల్గినవారిలావుంటారు. అంతరాంతరాల్లో ఎక్కడో అభిజాత్యమైన బ్రాహ్మణత్వవైదికత్వాలు బీజప్రాయంగా ఉన్నప్పటికీ ఆ బీజం పొటమరించి కొసలుదేరి పుష్పించి ఫలోన్ముఖం గాకుండా వాడిలో విజృంభించిన ఆసురీశక్తులు క్షుద్ర సంస్కారానికే నివాళులెత్తాయి. దానితో బ్రాహ్మణత్వం కోల్పోయి రాక్షసప్రవృత్తిగలిగిన రావణాసురుడుగా ఖ్యాతిపొందాడు. ఇతడు వేదాలను వింగడించినవాడు. శాస్త్రమర్మాలు రహస్యాలను తెలిసినవాడు. మహాపండితుడు. విద్వాంసుడు. వీడొక మంత్రాధిష్ఠాన దేవతగా కూడా అయితే యిక చెప్పవలసిన పనిలేదు. అష్టదిక్పాలకులు ముల్లోకాలు వాడి అధీనంలోవుండగా "తాదృశం ఖడ్గమాప్నోతి యేనహస్త స్థితేనవై అష్టాదశ మహాద్వీప సమ్రాడ్భోక్తా భవిష్యతి". అని దేవీ ఖడ్గమాలాస్తోత్రంలో చెప్పబడింది.

పరాశక్తి చేతిలోని కత్తివంటి కత్తి తనచేత కల్గినవాడు ఖడ్గరావణుడు. ఈ మంత్రాధిష్ఠాన దేవతను మట్టుపెట్టడానికి వేదమాతమైన పరాశక్తి సీతగా, ఋతధాముడనే ప్రజాపతి రాముడుగా, ఋశ్యవరాహకల్ప ప్రజాపతి హనుమంతుడుగా, అవతరించి అవైదిక క్షుద్రశక్తిగల ఖడ్గ రావణ మంత్రాధి దైవతాన్ని సమూలంగా నాశనంచేశారు. మూడుదశలలో ఆ సంహారం ముగ్గురిచేతుల మీదుగా నడచింది. ఇదియే విశ్వనాథవారు చెప్పిన 'ఒక మహాగాథ'! అది చెట్టువలె పెరిగి పెద్దదై 'కల్పవృక్ష'మైనది. ఆస్తిక మహాజనులకు ఆలోచనామృతఫలాన్ని ప్రసాదించింది.

# 48. హనుమంతుని త్రిమూర్త్యాత్మకత్వం – సమన్వయం

సమన్వయమే సంప్రదాయం. సంప్రదాయంలోనే సమన్వయం నిక్షిప్తమై ఉంటుంది. రామకథా భాష్యకారుడైనకవి ఆ సమన్వయాన్ని సాధించి కథాముఖంగా పులిగాపుపెట్టి తళతళ లాడిస్తాడు. అప్పుడే ఆఘట్టం రహస్యార్థస్ఫోరకంగా భాసిస్తుంది.

తంత్రగ్రంథ రచనావిస్తృతిచే ఒక్క హనుమంతునికే అనేకరూపాలు అనేక మంత్రాలు అనేక యంత్రాలు కల్పింపబడినాయి. పరాశర సంహితలో హనుమంతుడధిష్ఠానదేవతగా ఈ క్రింది మంత్రాలున్నాయి.

1) సుందర హనుమన్మంత్రం — మంత్రద్రష్ట — వాల్మీకిమహర్షి
2) ఆపదుద్ధారకహనుమన్మంత్రం — మంత్రద్రష్ట — విభీషణఋషి (శచీపురందరఋషి అని విశ్వనాథ రామాయణ కల్పవృక్షం)
3) పంచముఖాంజనేయ మంత్రం
4) హుంకార హనుమన్మంత్రం
5) సువర్చలాంజనేయ మంత్రం
6) స్వప్నాఖ్య హనుమన్మంత్రం
7) హనుమన్ముఖ గండభేరుండ జ్వాలానృసింహమంత్రం

ఒక్క దేవతకిన్ని విధాలైన మంత్రాలుండటం యెలాపొసగుతుంది? అంటే మంత్రం వైయక్తికమార్గనిష్ఠం. 'ఇది తాంత్రికవ్యవహారమని గుర్తించటం యుక్తం' అంటున్నారు శ్రీగుంటూరు శేషేంద్ర శర్మ గారు. ఆయన యింకా యిలా వ్రాశారు.

"రామ, కృష్ణ, హనుమదాది అవతారపురుషుల్ని మంత్రాధిష్ఠాన దేవతాస్థానాలకెత్తి వారికి బీజాక్షర, మంత్ర, యంత్ర, క్షేత్ర తీర్థ మాహాత్మ్యాదులను కల్పించే ప్రకరణం తాంత్రికం. నానా ఫలసిద్ధికై నానా విధరూపాలు, నానావిధమంత్రసంపుటీకరణాలు ఒక్కదేవతకే చేస్తారు. ఆప్రక్రియను తంత్రశాస్త్రంలో గ్రథితాది ప్రయోగాలంటారు.

గ్రథితాది ప్రయోగం చ మంత్రాణాం సిద్ధికారణమ్।
గ్రథితం సంపుటం గ్రంథిసమస్తం చ విదర్భితమ్॥
తదా చాక్రాంత మాద్యంతం గర్భస్థం సర్వతోవృతమ్।
తథాయుక్తి విదర్భం చ విదర్భగ్రథితం తదా॥
ఇత్యేకాదశ మహామంత్రాః ప్రయుక్తాః సర్వసిద్ధిదాః।

వీని ఫలాలుగా ఆకర్షణ, వశీకరణ, త్రైలోక్యైశ్వర్య, రణమారణ గ్రహమారణ, శత్రూచ్చాటనాదులు చెప్పబడినాయి. పైగా ఒక దైవానికే ఏక ద్విత్రిచత్వారాద్యక్షర మంత్రకల్పనలు చేయడంవుంది.

'వింశత్యర్ధధికాః మంత్రాః మాలామంత్రాః ప్రకీర్తితాః'

అని నిత్యాతంత్రంలోని మంత్రవిభాగకథన ప్రకరణంలో చెప్పబడింది. ఈ విధంగా నానావిధాక్షర, నానాగ్రథితాది ప్రయోగ, నానా రూపకల్పనాది ప్రక్రియలచేత ఒక్క దేవతకే నానామంత్ర యంత్రాలు కల్పించి నానావిధ సిద్ధులు సాధించడం తంత్రశాస్త్రవిధానం. అంతేగాని అట్టి మంత్రాధిష్ఠాన దేవతలకును వాటిమూల స్వరూపాన్ని చెప్పిన రామాయణ, భారత, భాగవతాదులకును తాంత్రిక కల్పనావిశేషాలలో ఎలాంటి సంబంధము లేదనుకొంటే మనం అనవసరమైన ప్రమాదాలకు లోనుగాకుండావుంటాము."

గ్రథితాదిప్రయోగంలోవిదర్భితంచేసేవిధానమే విచిత్రంగాఉంటుంది. విచిత్రమంటేవిలక్షణమైందని అర్థం. నృసింహానితో హనుమకు సమానత్వం కల్పించడం విదర్భితవిధానం వల్లనే. ఈ విధానాన్నిగూర్చి ఎక్కిరాల కృష్ణమాచార్యులవారు శ్రీ సూక్త వ్యాఖ్యాన పీఠికలో యిలావ్రాశారు.

"పురుషసూక్తంతో పాటు శ్రీసూక్తానికి స్థానముంది. 'సహస్రశీర్షా' అని ప్రారంభించే పురుషసూక్తానికి, 'హిరణ్యవర్ణామ్' అని ప్రారంభించే శ్రీసూక్తానికి మొదటి అక్షరాలైన 'స'కార, 'హ'కారాలతో 'సోzహం' అనేమంత్రం దర్శింపబడింది. ఇది మానవుల ఉచ్ఛ్వాస నిశ్వాసాలలో సహజమైన హంసమంత్రమై యొప్పారుతోంది. సోzహం అనుమంత్రంలో ప్రణవమైన ఓంకారం దాగియున్నది. అది ఎట్లంటే 'సోzహం' మంత్రంలోని హల్లులైన సకార హకారాలను తొలగిస్తే 'ఓం' అని మిగులుతుంది. దీన్ని ఆధారంగా చేసికొని శ్రీసూక్త, పురుష సూక్తాల ఉపాసనాసంప్రదాయం ఒకటి యేర్పడింది. అది యెట్లంటే పురుషసూక్తంలో, అనుష్టుప్ ఛందస్సులోనున్న మొదటి పదునైదు ఋక్కులను స్వీకరించి విదర్భితం చేసి గానం చేస్తారు. కృష్ణపక్షంలో మొదట పురుషసూక్తంలోని మొదటిమంత్రాన్ని, తరువాత శ్రీసూక్తంలోని మొదటిమంత్రాన్ని అటుపైన పురుషసూక్తంలోని రెండవమంత్రాన్ని ఈ విధంగా అల్లికచేసి గానంచేస్తారు. ఇలా నలభైది నాలు ఉపాసిస్తూ మారేడుచెట్టుక్రింద నివసించి భిక్షాటనంచేసి, మారేడు దళాలతోను, పద్మాలతోను హోమం చేస్తారు. ఇలా నలభైరోజులు చేస్తారు. అనుదినం మంత్రాంతంలో భాగవతంలోని నారాయణకవచం పారాయణం చేస్తారు. దీనివల్ల భోగమోక్షప్రదమైన వెలుగు భక్తులనావేశించి ఏడుతరాలవరకు ఇహపరసౌఖ్యప్రదమవుతుంది. ఈ ఉపాసనాక్రమాన్ని "శ్రీనివాసవిద్య"అంటారు.

ఈ విదర్శిత విధానం వల్లనే ఒక్కదేవతకు అనేకానేక మంత్రకల్పనలు చేయడానికి వెసులుబాటైంది. పరాశరసంహితలో పార్వతితో శివుడే స్వయంగా తాను "రామదూతగా" అవతరించానని చెప్పాడు. దానికి లోకరక్షార్థం హేతువుగా చెప్పాడు. వాల్మీకి రామాయణంలో ఇది నిరూపింపబడింది.

శివ విష్ణ్వాత్మకుడైన హనుమంతుని కొలిచేవారికి భోగమోక్షాలు రెండూ కరతలామలకములవుతాయి. ఈ శివకేశవాభేదము శ్రీశంకరుల కాలం నాటికేగలదు.

శ్రీరామ రామ రామేతి రమే రామ మనోరమే।
సహస్రనామ తత్తుల్యం రామనామ వరాననే॥

శివుని వేయినామాలు ఒక్క రామనామంతో తుల్యమైనది. రాముడు శివనామం జపిస్తూవుంటే, శివుడు రామనామం జపిస్తూవున్నాడు. "శివశ్చహృదయం విష్ణోః విష్ణోశ్చహృదయం శివః" ఇది ప్రాచీన సంప్రదాయం.

పరాశర సంహితలో, హనుమ త్రిమూర్త్యాత్మకుడని చెప్పబడింది. "బ్రహ్మవిష్ణు శివాऽంశత్వా త్రిమూర్తి రితి విశ్రుతః" అని బ్రహ్మకృత ఆంజనేయస్తుతి. ఉమాసంహితలోని ఆంజనేయస్తవంలో —

ఆంజనేయం మహావీరం బ్రహ్మవిష్ణు శివాత్మకమ్।
బాలార్క సదృశాభాసం రామదూతం నమామ్యహమ్॥

పరాశర సంహితలోనే ఏకోనవింశతిపటలంలో —

సప్తకోటి మహామంత్రాః వినా బ్రహ్మాస్త్రవిద్యయా।
హనుమన్మంత్ర జాలానాం మిత్రాణీతి విదుర్బుధాః॥

బ్రహ్మాస్త్ర విద్య యొక్కటితప్ప తక్కిన సప్తకోటి మహామంత్రాలును హనుమద్విద్యకు లొంగినవే. ఒక్క బ్రహ్మాస్త్రానికి మాత్రం హనుమంతుడేడు నిమిషాలు లీలగాకట్టుపడ్డాడు. ఆ బ్రహ్మయైనా హనుమదనుగ్రహం చేతనే ఆయనను కట్టడానికి సమర్థుడైనాడు. ఇక్కడ ఒక్కవిశేషం. బ్రహ్మాస్త్రవిద్యను బ్రహ్మదర్శించినప్పటికీ అది శ్రీబగళా విద్యాతత్త్వంలో త్రిపురసుందరీ దేవతాత్మకమైనది. హనుమంతుడక్కడ జగన్మాతయందు గౌరవవిశేషంచే దానికి లొంగినాడని విశేషజ్ఞులు గమనింపగలరు.

పరాశర సంహితలో—

కేవా న పూజయంతీహ ప్రత్యక్షవరదాయకం।
అర్చయంతి హనూమంతం బ్రహ్మ, విష్ణు, శివా అపి॥
హనుమత్సదృశం దైవం నాస్తినాస్త్యేవ భూతలే।
తస్మిన్ సంపూజతే భానుర్బ్రహ్మగౌరీ మహేశ్వరః॥
శ్రీ జానకీపతి స్సాక్షాదాది నారాయణః ప్రభుః।
ఈశ శక్రాది లోకేశాః కుమారో గణ నాయకః
బ్రహ్మర్షయో వసిష్ఠాద్యా స్సనకాద్యాశ్చ యోగినః।
పితరో వసవోరుద్రాః పూజితా స్స్యుర్న సంశయః॥

శ్రీరామచంద్రుడే హనుమదుపాసకుడని సుందరోత్తరకాండ వచనాల వల్ల స్పష్టమౌతుంది. హనుమన్మంత్రానికి శ్రీరామచంద్రుడే ఋషియై నాడు. అనగా హనుమన్మంత్రద్రష్ట శ్రీరామచంద్రుడే. ఈ విషయం అగస్త్యసంహితలోను, శ్రీరామోత్తర తాపిన్యుపనిషత్తుల్లోను ప్రతిపాదిం పబడింది. అయినను కోరినకోరిక లెల్ల ప్రత్యక్షముగా దీర్చు పరమ దైవమైన హనుమంతునెవ్వరుపాసింపరు? బ్రహ్మ విష్ణురుద్రులు కూడ హనుమదుపాసన చేస్తుంటారు. హనుమంతుని బోలిన దైవం భూత లంలో లేనేలేదు. హనుమదుపాసన చేసినందువలన సూర్యుడు, బ్రహ్మ, గౌరీశంకరులు, సాక్షాదాది నారాయణ మూర్తియైన శ్రీరామచంద్రు డును, ఇంద్రాద్యష్ట దిక్పాలురును, స్కందగణపతులును, బ్రహ్మర్షులైన వసిష్ఠాదులును, పరమయోగిపుంగవులైన సనకాదులును, పితృ వసురుద్ర గణంబులును పూజింపబడిన వారౌతారు. హనుమంతుడు సర్వదేవా త్మకుడని దీనివలన రూఢియౌతోంది.

సర్వదేవతాత్మకుడైన హనుమ 'ప్రజాపతి' యని ముందే నిరూపింప బడింది. భవిష్యత్కల్పప్రజాపతియైన హనుమ సర్వదేవతాత్మకుడనుటలో అన్వర్థమున్నది. ఇది శ్రీహనుమంతుని వైశిష్ట్యం. ఇది తంత్రగ్రంథాల ప్రకల్పనం, తప్ప వాల్మీకి రామకథలోని హనుమవట్టి రామదూ తయే! రామభక్తుడే! రామమంత్రోపాసకుడే! వాల్మీకి రామాయణ కథానుసారం ఆసంప్రదాయంలో వెల్వడినగ్రంథాలలో పరశురామపంతుల లింగమూర్తి గురుమూర్తి రచించిన శ్రీసీతారామాంజనేయసంవాదం ప్రసిద్ధమైంది. ఈ గ్రంథంలో మూడు ఆశ్వాసాలున్నాయి. వేదాంత శాస్త్రంలోని తారకం, సాంఖ్యం, అమనస్కం వరుసగా ఈ మూడు అధ్యాయాల్లో వివరించబడినాయి. అందులో విశేషమేమంటే తారకయో

గాన్ని సీతాదేవి ఆంజనేయునికి బోధిస్తుంది. సాంఖ్య, అమనస్క యోగా లను శ్రీరాముడు ఆంజనేయునికి బోధిస్తాడు. ఇది అద్వైతవేదాంతాను యాయుల్లో విస్తృతప్రచారం పొందినగ్రంథం.

వాల్మీకిరామాయణంలోను, రామాయణకల్పవృక్షంలోను హనుమ గొప్ప సహృదయుడుగా, దేవీభక్తుడుగా నిరూపింపబడినాడు. సుందర హనుమంతుడనగా దేవీభక్తుడైన హనుమ అని అర్థమేగాని హనుమ సుందరంగా ఉన్నాడనికాదు. హనుమ యొక్క నిరంతర దేవీధ్యానమే, జపమే, యోగమే సుందరకాండగా దర్శనమిస్తోంది.

తదున్ననం పాండుర దంత మవ్రణం
శుచిస్మితం పద్మపలాశలోచనం
ద్రక్ష్యే తదార్యావదనం కదాన్వహం
ప్రసన్నతారాధిప తుల్య దర్శనం — సుందరకాండ *13*స. *68* శ్లో.

ఓ తల్లీ! నిన్నెప్పుడు చూతునోకదా! అని హనుమ పరితపించిపో వుచు చెప్పిన వాక్యమిది. ఆ దేవిని చూడగానే—

స ముహూర్త మివ ధ్యాత్వా బాష్పపర్యాకులేక్షణః।
సీతామాశ్రిత్య తేజస్వీ హనుమాన్ విలలాపహ॥ — సుందర.*16-2.*

ఆమె కష్టదశను చూచి కన్నీరు పెట్టుకొని విలపించాడు.

"ప్రహర్ష మతులం లేభే మారుతిః ప్రేక్ష్య మైథిలీం" — సుం.*17-30*

సీతాదర్శనమహద్భాగ్యంచేత హనుమ మిక్కిలి హర్షాన్ని పొందాడు.

రామాయణ కల్పవృక్షంలో కూడ శ్రీ విశ్వనాథవారు హనుమను కవి-సహృదయస్థానీయుడుగా మలచియున్నారు. ఒక మహాయోగి తపస్సు ఫలించి యిష్టదేవతను సందర్శించినప్పుడు కలిగే భావశబలత్వాన్ని కవి యిలా వర్ణించినాడు.

సీ॥ మాతృదేవీ సమాజ్ఞాతీర్థ సుస్నాత వినతాతనూజుండు వేల్పు బువ్వ
కనుగొన్నయట్లుగా గనుగొంటి జానకీ దేవి గవేషణాతీర్థ ఫలము
పరమయాజ్ఞికులు నిర్భరమహోచ్ఛందోవతారంబు గాయత్రిదత్త్వమూర్తి
గనుగొన్నయట్లుగా గనుగొంటి జానకీ దేవి శ్రీరఘురాము దీపదంబు

తే॥గీ॥ కవిమహర్షి తపోఽగ్ని చే క్రాగి క్రాగి
సర్వతేజః ఫలంబు రసంబు తుదకు
చూచినట్లుగ జూచితి క్షోణిజాత
జారితార్థ్యంబు జన్మకు సంఘటింప. — సుందర-ఉష-52 ప.

తాను సీతను చూచిన విషయాన్ని రామునితో హనుమయిలా నివేదిస్తున్నాడు.

**కాంచితిసీత** *బాష్పకలికావలికాంతకపోల రామనా*
*మాంచిత నిత్య కంపిత సితాధర భీకరదైత్య కామినీ*
*సంచయ భర్త్సనోక్తి చయ సంచలలోచన వారిజాత వ*
*త్రాంచల విప్రయోగ దహనాగ్ర శిఖామయదేహ లంకలో!*
— సుందర-సంధ్యా ప. 137

స్వామికార్యమే తన జీవితధ్యేయంగా మలచుకొన్నవాడు హనుమ. తల్లిని చూచిన సంతోషంలో, రావణుడి మీదకోపంతో లంకాదహనంచేసినా అది ఆయన స్వామిభక్తి నే శతధా చాటుతుంది. లంకఅంటేఏమిటి? నాల్గువైపుల నీళ్లున్న ఒక ఎత్తైన ప్రదేశాన్ని లంక అంటారు. నదీతీరాలలో యిసుక లంకలు మనం చూస్తూనేవున్నాం. లంకలు సామాన్యంగా నదీగర్భంలో ఉంటాయి. అంటేఏటికడుపులో వెళితేగాని అక్కడక్కడా లంకలు నీకు తారసపడవు. అందుకు నీవు నదిని దాటాలి. నది కీవలివైపు నీవున్నావు. మధ్య నది ప్రవహిస్తూవుంది. ఈ కూలంకష నీకూ లంకకూ ఉన్న హద్దు. ధాన్ని నీవు దాటావు — సీత గీత దాటినట్లు. లంకచేరావు. అది వేరే ప్రదేశం. అంటే నీవు స్వస్థితిని కాదని కాలదన్ని మరోస్థితిని నూతనత్వాన్ని వాంఛించావన్నమాట! "స్వధర్మేనిధనం శ్రేయః పరధర్మో భయావహః" అంటున్నది గీత! సీత బ్రతుకు సంశయగ్రస్తం కావడానికింత నేపధ్యం వుందన్నమాట! పరధర్మంచే భయగ్రస్తురాలైన సీత స్వధర్మాన్ని చింతించి ఆత్మహత్యకు ప్రయత్నించింది కదా! దైవవశాత్తుగా హనుమ అక్కడే వుండడంతో ఆయన రామకథాగానం ఆమెలో జీవితాశలు రేకెత్తించాయి.

జలం ఎప్పుడూ అవ్యక్తానికి (unconscious) చిహ్నం! అది దైవం! "జలమున్ గౌగిట బూనినన్ నిలుచునా సంస్రావ శిలంబు" అంటారు విశ్వనాథ! వ్యక్తస్థితి (conscious state) లో నీవున్నావు. అది స్వధర్మం! వ్యక్త స్థితినుండి అవ్యక్తాన్ని కాదని వ్యక్తావ్యక్తస్థితి (sub-

conscious) లోనికి నీవు ప్రవేశించావు. అది పరధర్మం. అదొక అనిశ్చిత స్థితి. దానికి శాశ్వతత్వం లేదు. అలాంటప్పుడు ధర్మాధర్మాలకు నీలో సంఘర్షణ బయలుదేరుతుంది. సరిగ్గాసీత యిలాంటి ఆంతర సంఘర్షణకు లోనైంది. చివరికి ధర్మం జయించింది. కాపురుషుడైన రావణుని కామలంకను సీత యోగాగ్నిలో దగ్ధంచేసింది. తిరిగి పవిత్రమైన మనస్సుతో రాముని చేరుకొంది. అంటే హనుమ బాహ్యంగా దగ్ధమొనర్చిన లంకను సీత ఎప్పుడో ఆంతరంగా దహించివేసిందన్నమాట! మహాభారత యుద్ధంలో అర్జునుడిచేత చచ్చిన వీరులందరూ భగవంతుడైన శివునిచేత తత్పూర్వమే చంపబడ్డవాళ్లు. నిమిత్తమాత్రంగా వ్యవహరించినవాడు అర్జునుడు. అలాగే యిక్కడ హనుమ. అందుకే, అర్థం అయిందనుకొన్న అమ్మవారు అర్థంకాలేదు హనుమకు. 'చివరికి' రామదూతగా మిగిలిపోయాడు. 'నీవు నా పుత్రుడివి' అంటుంది తల్లి. కాని, పరపురుష స్పర్శ సహించనంటుంది. 'నీవు మహాశక్తిశాలివని తెలుసు' అంటుంది. కాని రాముడే రావాలి. రావణుణ్ణి చంపాలి అంటుంది. ఇవి హనుమకు అర్థంకాని విషయాలు.

అమ్మవారిలోని ఒక అంశ హనుమ. లక్ష్మణ, భరతశత్రుఘ్నులు రామునిలోని అంశలైనట్లు. "ఇది నారాయణమూలమౌతరువు...." "లక్ష్మణుడుస్వామిలో ముక్క, సూక్ష్మమిద్ది" ఇవి కల్పవృక్షంలోని పద్యపాదాలే! హనుమ, తల్లిలోని పూర్ణయోగమే మూర్తిదాల్చినవాడు. యోగశక్తి ఏంచేస్తుంది? ఏకాగ్రతతో, స్థిరనిశ్చయంతో కార్యసాధనకు కావలసిన మార్గాన్ని చూపెడుతుంది. అలా మహాశక్తిశాలియైన హనుమ సీతాదేవి ఎక్కడుందో, ఎలావెళ్లాలో, రావణుణ్ణి ఎలా సంహరించాలో యిత్యాది అనుపానులన్నీ చక్కగా తెలిసికొనివచ్చి రాముడికి చెప్పాడు. రాముడు పురుషప్రయత్నంలో ఆకార్యాన్ని సాధించాడు. సీత, రాముడేవచ్చి తనను విడిపించాలని కోరడంలో పురుషకారం చేతనే పనులు చక్కబడుతాయని లోకానికి తెలియజేయటానికోసమే హనుమ సవినయంగా అమ్మవారిని తన వీపునెక్కి రమ్మని, రామునివద్దకు చేరుస్తానని, విన్నవించినా పరపురుష స్పర్శ సహించనని ఆతని సూచనను మెల్లగా త్రోసిపుచ్చింది.

తల్లిని యథార్థంగా దర్శించడానికి ఆమె దయ పరిపూర్ణంగా ఉండాలన్న మాట! హనుమ తల్లికి నచ్చిన బిడ్డ! నిత్యమూ పాదాభివందనం చేసే మరిది లక్ష్మణుని కన్న హనుమపై ఆమెకు అత్యంతమైన అనుకంప! ఇలా తల్లి కృపకు పాత్రుడైన హనుమ, జన్మచరితార్థ మైనదనుకొన్నాడు.

శతకంఠ రావణులు ఎత్తివచ్చినా తల్లి కళ్లు ఎఱ్ఱుపుతిరిగితే చాలు, బూడిదపాలైపోతారు. సహస్రకంఠ రావణులు ఒక్కుమ్మడి వచ్చి నిల్చినా హనుమయిట్టే వారికి పరలోకాలు చూపించగలడు. అటువంటిది ఒక్కగా నొక్క రావణవధకోసం రాముడిన్ని అష్టకష్టాలు పడి సముద్రం దాటివచ్చి వాణ్ణి యుద్ధంలో చంపాలా? అంటే, అవును! దానికి క్రింది శ్లోకాలే సమాధానం!

ఆలస్యం హి మనుష్యాణాం శరీరస్థో మహాన్ రిపుః।
నాస్త్యుద్యమ సమో బంధుః కుర్వాణో నావసీదతి॥

— భర్తృహరి నీతిశతకం

ఆలస్యమంటే అలసత్వం,సోమరితనం. ఇది మానవశరీరంలోని మహా శత్రువు. ఉద్యమమంటే ప్రయత్నం. ప్రయత్నంకంటె మించిన బంధు వులేదు. ప్రయత్నంచేతనే కార్యాలు ఫలిస్తాయి.

ఉద్యమేవహి సిద్ధ్యంతి కార్యాణి న మనోరథైః।
నహి సుప్తస్య సింహస్య ప్రవిశంతి ముఖే మృగాః॥

ప్రయత్నం చేతనే పనులు ఫలిస్తాయి. ఎంత పరాక్రమం గలదైనా, నిద్రించే సింహం నోటిలో మృగాలు తమంతతాముగా వచ్చిపడవుకదా! కాబట్టి గొంతెమ్మకోర్కెలు మానుకొని కార్యరంగంలో దూకి కృషి చేయాలి మానవులు — అందుకే మానుషజన్మ యెత్తిన పురుష సింహుడైన శ్రీరామచంద్రుడు లోకానికి పురుషకార ప్రబోధం చేయడం కోసం సకల ప్రయత్నాలుచేసి, సర్వకష్టాలను భరించి చివరికి రావణుణ్ణి సంహరించాడు.

కలికాలంలో పురుషుడు ఎలాంటి వాడంటే, 'అలసత పరున్న మనుజుండు కలియుగంబు' అంటాడు. ఆముక్తమాల్యదాకారుడు. సోమ రితనంతో సుఖంగాపడుకొని చమత్కారంగా మాట్లాడడం కలిపురుషుని లక్షణమట! ఒక కార్యం నిర్ణీతకాలంలో ఋజువుగాచేసి చూపలేడు. "యుగేతురీయే యమకప్రపంచః" అంటాడు నీలకంఠ దీక్షితుడు. తురీ యమైన ఈ నాల్గవయుగం కలియుగం. ఇందులో యమకానికే ప్రాధాన్యం వచ్చిందట! ఆలంకారికులు యమకాన్ని క్షుద్రకావ్యాలకే పరిమితం చేశారు. మహాకావ్య ధ్వనులు అంతరించి యమకాలే మిగిలాయి ఈకాలా నికి! అంత్యప్రాసలు, యమకాలగమకాలే నిజమైన కవిత్వంగా చెలామణి అవుతోందని వ్యాఖ్య! అల్పకవులు మహాకవులుగా ముద్రవేయించుకొని అందలం ఎక్కి ఊరేగుతున్నారుకదా!

అలాంటి కలిలో మానవుల ప్రవర్తనను ఒరవడి దిద్దాలని రాముడు సర్వశక్తిమంతుడైనప్పటికీ ఒక కార్యసాధనలోని సాధకబాధకాలు స్వయంగా అనుభవించి లోకానికి మార్గదర్శకుడయ్యాడు. కల్పకల్పానికి రామకథ పునరావృత్తమవుతూనే ఉంటుంది. ఇప్పుడు జరిగేది శ్వేత వరాహకల్పం! పద్మకల్పంలో జరిగిన రామాయణంలో రాముడు సేతువు నిర్మించలేదు. శివుడు తన పినాకమనే పేరుగల ధనుస్సును సముద్రంమీద వాల్చాడు. అదే సేతువుకాగా కపిసేనలు దానిమీద నడిచివెళ్లాయి. మత విశ్వాసం తగ్గి ఆస్తికత్వం నశిస్తున్న ఈ కల్పంలో రాముడు సేతువును నిర్మించి మరీవెళ్లాడు. హేతువాదులుకూడా సేతునిర్మాణ విషయంలో ఏమీమాట్లాడడంలేదు. "కల్పభేదం పురస్కృత్య కథాభేదం జగాదహ" కాబట్టి కల్పకల్పానికి రామకథ కొద్దికొద్దిగా దేశకాల వ్యవస్థానుకూలంగా, మౌలిక లక్షణాన్ని పోగొట్టుకోకుండా మారుతూ అజరామరసందేశాన్ని అందిస్తూవుంది.

## 48. శ్రీరాముని కోదండమే శివుని పినాకం

పద్మకల్పంలో జరిగిన రామాయణంలో శ్రీరాముడు సేతువు నిర్మించలేదనీ, పినాకపాణియైన శివుడు తన పినాకమనే ధనుస్సును సముద్రం మీద వాల్చాడనీ, అదేసేతువుగా పనిచేసిందనీ అనుకొన్నాం. మరి ఇప్పుడు జరిగే శ్వేతవరాహకల్పంలో శివుడలా చేయకపోవడానికి హేతువేమి? కాలాన్ని బట్టిమానవుని భావాలు వికృతి దశను, పరిణామాన్నీ పొంది, భౌతికహేతువులకు సన్నిహితం అవుతుండడం వలన, మానవ నిర్మితమైన విషయాలనే మనిషి విశ్వసించే స్థితిలోలేని ఈ కల్పంలో, హేతువాదానికినిల్చే సేతునిర్మాణమే మంచిదని శివుడు భావించివుంటాడు. కాలపరిణామమన్నది మానవుని మేధస్సును, మనస్సును వికార్యమాణం చేస్తోంది. ఈ హేతువును ప్రతిపాదించే ఈక్రింది శ్లోకం యిక్కడ అనుసంధించుకోవాలి.

ఉద్యోగినం పురుష సింహ ముపైతి లక్ష్మీ
ర్దైవం హి దైవమితి కాపురుషావదంతి।
దైవం నిహత్యకురు పౌరుషమాత్మ శక్త్యా
యత్నే కృతే యది న సిద్ధ్యతి కోఽత్రదోషః॥

అన్నసూక్తికి సార్థక్యం కల్గించడానికి కలియుగంలోని ప్రజానీకానికి ఉద్యమం యొక్క ప్రాధాన్యాన్ని చాటి చెప్పడానికి రాముడు స్వయంగా

పురుషకారంతో సేతునిర్మాణానికి పూనుకొన్నాడు. కృష్ణుడు సము ద్రజలానికి రథగమన పర్యంతం ఆరూపు కల్పించి వెళ్లినాడు. కాని రాముడు కాలినడకతో సేతువుపై నడచివెళ్లినాడు. శ్రీరాముడు పురు షుల్లో సింహం వంటివాడు. అటువంటివాడు ఉద్యమిస్తే, ప్రయత్నిస్తే లక్ష్మిని సంపాదింపగలడు. ఇక్కడ సూక్తి శ్రీరామచంద్రుని పట్ల సార్థకమవుతోంది. ఎందుకంటే శ్రీమహాలక్ష్మి అవతారమే సీతాదేవి "ఆత్మానం మానుషం మన్యే" అనిచెప్పిన, మానుషావతార మెత్తిన శ్రీరాముడే పురుషసింహుడు.

శ్రీకృష్ణావతారంలో కూడా రుక్మిణి శ్రీకృష్ణునిలా సంబోధించింది.

*శ్రీయుతమూర్తి! యో పురుషసింహమ!*
**సింహము పాలిసొమ్ము గోమాయువు కోరుచందమున...**

ఇది రామావతారానికీ అన్వయించేదే! శ్రీయుతుడైన పురుషసిం హుడు శ్రీరామచంద్రుడు. సీత రామునిసొమ్ము. రావణుడనే నక్క ఆమెనుకోరడంచేత దండింపబడినాడు. అక్కడ రుక్మిణిని చేది దేశాధీ శుడైన శిశుపాలుడు కోరాడు. కృష్ణునిచేత వధింపబడ్డాడు.

రాముడు ధర్మసంరక్షణార్థం చేసిన ఉద్యమానికి లక్ష్మీదేవి వంటి సీత ప్రాప్తించడంలో ఆశ్చర్యంలేదు. కాని, రాముడు కేవలం పురుషకా రంతో, "యత్నేకృతే యదిన సిద్ధ్యతి కోఽత్ర దోషః" అని ప్రయత్నిం చిన వాడుకాడు. తన ప్రయత్నమందు సంపూర్ణమైన ఆత్మవిశ్వాసం కలవాడు. కాబట్టే ప్రారంభించిన పనికి ఫలితాన్ని సిద్ధింపజేశాడు.

మరి శ్రీరాముని కోదండం, శివుని పినాకమెలా అవుతుంది? ఇది లోతుగా విచారించవలసిన విషయం. మానవ శరీరంలోని వెన్నెముకనే తీసుకొందాం! వెన్నెముకపై భాగంపై డిప్పలా శిరస్సు బోర్లింపబడి వుంది. క్రిందిభాగం మూలాధారం - లంక. శిరస్సు దేవతలకు స్థానం 'అయోధ్య' — ఇదే సహస్రారకమలం. అడుగుభాగం మూలా ధారం — పాతాళం — నాగలోకం. ఇక్కడే 'కుండలిని' అనేసర్పం మూడు చుట్టలుగా ముడుచుకొనివుంది. దీన్నే లంక అని భావించుకోవాలి. 'లంక'లోని సీతయే కుండలిని. ఇది సుందరకాండలోని రహస్యం! సుంద రకాండ కథాకథనమంతా కుండలినీ యోగరహస్యమే! నని శ్రీగుంటూరు శేషేంద్రశర్మగారు షోడశి-రామాయణరహస్యాలలో నిరూపించారు. "సా

వా ఇయం సర్వైవ వేదిః” అని వేదము, “పృధివీ తస్యపీఠికా”అని బౌద్ధదర్శనమూ, ‘ఏకపీఠం జగత్సర్వం’అని వీరశైవమతమూ, యిలా ఎన్ని మతాలు దర్శనాలూ ఎన్నివిధాలుగా చెప్పినప్పటికీ ఏకైకమైనదీ అచంచలమైనదనీ, విశ్వజనీనమైనదీ కుండలినీయోగము. ‘కుండలిని’కే శక్తిపీఠికా, శివభూమికా’ అనికూడ పేర్లు.

వేయిపడగల్లో వస్తుసంవిధానకంగా మహాకవి విశ్వనాథ ‘ముక్కాలి పీట’ను ప్రతీకాత్మకంగా నిర్దేశించినాడు. త్రిపుటికి సూచకంగా పీట కుగల మూడుకాళ్లూ, పీఠము-మూలాధారశక్తికీ సహస్రారానికి కూడా సమన్వితమౌతున్నట్లుగా భావించాడు. ఎట్లంటే ముక్కాలిపీటను తిర గవేస్తే ‘పీట’ మూలాధారమౌతుంది. ఆకాశం సహస్రారమౌతుంది. భూమిపై నిలబెడితే ‘భూమి’ మూలాధారమౌతుంది. పీట సహస్రార మౌతుంది. ఆరోహణానికీ అవరోహణానికీ షట్చక్రాలు నిచ్చెనలాంటిది. సహస్రారపద్మం అధోముఖంగా ఉంది. ఊర్ధ్వముఖంగా లేదుకదా!

ఇలా వేయిపడగలు విశ్వనాధవారి సిద్ధాంతగ్రంథం! దానిలోని మూల సూత్రమే ఆయన సర్వవాఙ్మయ సృష్టిలో అంతస్సూత్రంగా వ్యాపింపగా కథాముఖంగా బహుధా వ్యాఖ్యాతమైంది.

“సీతమ్మతల్లి ప్రజ్ఞాకథనమే నా రామాయణ రచనలక్ష్యం” అని చెప్పిన విశ్వనాథ, ‘సీతాయాశ్చరితం మహత్’ అని చెప్పిన మహర్షి వాల్మీకి రామకథకు భాష్యంచెప్పారు. వాల్మీకియే ఆయనకీ విద్యలో ఆదిగురువు — ఎట్లంటే —

“భూమౌ ఆసీనాం” — సీత భూమియందు కూర్చునియున్న దట! భూమిలో లభించడంకూడా ఆమె ‘మూలాధారస్థితకుండలిని’ అని స్ఫురింపజేస్తుంది. విశేషార్థముద్దేశింపక పోతే ఈ మాటకావ్యంలో ప్రత్యేకంగా ఎందుకు చెప్పాలి? ‘ప్రవాళకృత సోపానం తప్త కాంచన వేదికామ్’ (సుందరకాండ 15-15, 16) అని వర్ణింపబడి స్వర్ణవేదికపై సీత యున్నదని చెప్పి ఇప్పుడు ‘భూమి’ అనడం ఏమిటి? ఇంకొక చోట — “అసంవృతాయా మాసీనాం ధరణ్యాం సంశ్రితవ్రతా” సీత భూమిజ! అయోనిజ! అయోనయే నమః। ‘భూమౌ ఆసీనాం’ — అనగా పృథ్వీతత్త్వమైన మూలాధార కమలమందున్న పరాశక్తి సూచితం. ఈ విషయమే సౌందర్యలహరిలో — “అవాప్యం స్వాం భూమిం భుజగనిభ మధ్యుష్ట వలయం” అనిచెప్పబడింది.

'స్వాం భూమిం' అనగా 'స్వకీయం భూమిం' ఆధారచక్రం — అనివ్యాఖ్య. కనుక 'శక్తి'ని కులయోగిని' అంటారు. 'కులం' అనగా "కుః పృధివీ తత్త్వం లీయతే యత్ర తత్కులం — ఆధారచక్రం" అని లోల్ల లక్ష్మీధరులవ్యాఖ్య. కనుక సీత మూలాధార స్థితకుండలిని' అని ధ్వని. హనుమంతుడు అశోకవనం ప్రవేశించినప్పుడు సీతను భూమిమీద వెదుకుతాడు.

*స వీక్ష్యమాణస్తత్రస్థో మార్గమాణశ్చ మైథిలీం।*
*అవేక్షమాణశ్చ మహీం సర్వాం తాం అన్వవైక్షత — సుం. 15-1*

కాబట్టి వాల్మీకి మహర్షియే 'భూమౌ ఆసీనాం' 'తాం మహీం అన్వవైక్షత' అనిచెప్పడంచేత సీతను ఆధారకమలవాసినిగా సూచించినాడు. రాముడు అయోధ్యలో జన్మించినవాడు. ఎక్కడ యుద్ధము, సంఘర్షణలులేవో అది అయోధ్య— సహస్రార కమలస్థానీయం. శాంత రసస్థితి.

మన శిరస్సుకు పైన అతి మానసతత్త్వం లేదా విశ్వచైతన్య స్పందం ఉంది. ఇదే ఓంకారం! వ్యక్తిచైతన్యస్పందం విశ్వచైతన్య స్పందంతో సమన్వయం పొందడమే యోగసిద్ధి! ఈ ఓంకారానికే వైకుంఠమనీ, కైలాసమనీ వివిధమైన నామధేయాలున్నాయి.

వైకుంఠం నుండి విష్ణువు అయోధ్యలో అవతరించాడు. ఇది మర్త్య లోకంలోనికి దివ్యచైతన్యం యొక్క అవతరణ. కుండలిని ప్రయాణించే ఆరు చక్రాలున్న బ్రహ్మదండియే శివుని పినాకం — అదే శ్రీరాముని కోదండం. అది మూలాధారం నుండి సహస్రారం వరకు వ్యాపించివుంది. భ్రుకుటిలోగల ఆజ్ఞాచక్రమే శివునిమూడవనేత్రం. అది పరమశివుని కృపీటయోని. విజ్ఞాననేత్రం కాబట్టి యోగశాస్త్రపరంగా చూస్తే శివునికీ — శ్రీరాముని రావణాసురసంహారమనే మహాకార్యానికీ భేదంలేదు. శివుని కామదహనం యుగాదిలోనే జరిగింది. ఈ కాముని, పార్వతీదేవి బ్రతికించింది. "హరనేత్రాగ్నిసందగ్ధకామసంజీవనౌషధిః" అని లలితాసహస్రనామం. రామావతారంలోసీత, కృష్ణావతారంలో రుక్మిణి వీరిద్దరూ ఒకేవిధమైన మనస్సుగలవారు. "శ్రీయుతమూర్తి...." అని చెప్పినపై పోతనగారిపద్యంలో రుక్మిణి తననుగూర్చి, "నీ పదాంబుజధ్యాయిని యైన నన్ను వడిదా గొనిపొమ్మెదనంచునున్నవాడాయధమాధముండు." అన్నమాటలు సీతారుక్మిణుల 'నిరంతర భర్తృపదాంబుజధ్యాయిత్వాన్ని

చెబుతున్నాయి. అనగా సీతారాములు, రుక్మిణీకృష్ణులు అన్నది అవిభాజ్యమైన, విడదీయడానికి వీలులేని ద్వంద్వం. వీరే · సహస్రారంలోని పాలకడలిపై నున్న లక్ష్మీనారాయణ ద్వంద్వం. శివపార్వతీ ద్వంద్వం. రాముడు లంక (మూలాధారం)లో నున్న సీతనుతీసికొని మళ్లీ యోగ మార్గంలో ఉత్థానుడై అయోధ్య (సహస్రారం) చేరుకొన్నాడు. ఎట్లవతరించాడో అట్లే పునరుత్థానుడై స్వస్థానాన్ని చేరుకొన్నాడు. కాబట్టి శ్వేత వరాహకల్పంలో రాముడు సేతువుకట్టినా అది యోగమార్గంచేత ఎప్పుడో కట్టబడివుంది. యోగులకది రూఢియైన మార్గం-సేతుమార్గం. సేతు నిర్మాణమనే మాటలో నిర్మాణమనేదానికి అర్థం, జీవుడు తన లోని అంతశ్శక్తులను ప్రోదిచేసికొని అంతశ్శత్రువులైన అరిషడ్వర్గాలను జయించి సక్రమమార్గంలో ఉన్నతోన్నత కక్ష్యలను అధిరోహిస్తూ ఉత్కర్షను సాధించడమే నిర్మాణం — అదే సేతునిర్మాణమంటే! 'శ్రమైక జీవనసౌందర్యం' అన్నది కేవల భౌతిక వాదులది. కపులు రాళ్లెత్తిన కూలీలనుకోవడం మన అవివేకమే అవుతుంది. సేతుబంధనకార్యంలో సర్వత్రా అనుస్యూతంగా సర్వకపుల హృదయాంతరాలలో వ్యాపించినది రామభక్తి! నిష్కామకర్మ! దీనిస్థాయి వేరు! కూలీలసంఘటిత శక్తులు, నినాదాలు ఆస్థాయివేరు! మొదటిది 'విడుదల'కై ఆత్మసాక్షాత్కారానికై చేసేప్రయత్నం! రెండవది పొట్టకూటికి చేసేప్రయత్నం! కూలీలు వెట్టిచాకిరీనుండి విముక్తులై, విడుదలపొందిన తర్వాత చేయవలసిన మహాకార్యమిది. దీనిని రామకథ ప్రతిపాదిస్తూ ఉంది.

కాబట్టి పతనమైన జీవుడు పునరుత్థానం కావడానికి మార్గం ఉండనేఉంది. రాముడుకట్టించిన సేతువు ఎప్పుడో సముద్రగర్భంలో కలిసిపోయింది. కాని, శివుడు కనిపెట్టిన యోగసేతువు శాశ్వతమైనది. అనశ్వరమైనది. పరమయోగులు పరిపరివిధాల రాకపోకలు సాగించే రమణీయ సేతువది. పైగా శివుడు సర్వదా రామనామాన్నే జపించేవాడు. రాముడు నిరంతరం శివుణ్ణే ధ్యానించేవాడు. బయట రాజ్యమూ — పరిపాలనా — వ్యక్తి. లోపల వైరాగ్యమూ- వేదాంతమూ-విరక్తి! ఇది రాముని జీవిత రహస్యం! రామునికీ- శివునికీ భేదంలేదు. అందుకే ఆధునిక మహాకవి విశ్వనాథ రామాయణ కల్పవృక్షాన్ని శివాంకితంచేశారు —

*కృతిచే నమాత్తమగు గీరితి స్వర్గద మంతె; నే వరింపను స్వర్గం*
*బతిరూక్ష చింతనాగ్ర స్థితతేజము శివుడునన్ను జెందెడు గాతన్!*

"నా యెద నీతో రావెద నర్దాని ఫలంబు జెందింమ శివా!"

అవి కంఠోక్తిగా చెప్పారు! కాబట్టి సృష్టిలో విశిష్ట జీవుడైన మానవ శరీరంలోని బ్రహ్మాదండియే శ్రీరాముని కోదండమనీ – అదే శివుని పినాకమనీ పరమయోగుల దర్శనం! ఇది క్షతిలేని సేతువు! అక్షతమైన అమోఘయోగసేతువు!!



Fig - 1


అతిమానస తత్త్వం
విశ్వచైతన్య స్పందం
సహస్రారకమలం
ఆజ్ఞాచక్రం
విశుద్ధ చక్రం
కుండలిని
అనాహత చక్రం
బ్రహ్మదండి
మణిపూర చక్రం
స్వాధిష్ఠాన చక్రం
మూలాధార చక్రం

Fig-2

| సంఖ్య | సప్తకమలాలు | స్థానం | తత్త్వం | తత్త్వకాంతులు | దళములు | వర్ణములు | జ్ఞానేంద్రియాలు | రంగు | మండలాకారం |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 7 | సహస్రారం | శిరస్సు | ఆత్మ | అనంతం | 1000 | 1000 | — | — | — |
| 6 | ఆజ్ఞాచక్రం | భ్రూమధ్యం | మనస్సు | 64 | 2 | హం, క్షం | చిత్తము మనస్సు | — | బిందువు |
| 5 | విశుద్ధం | కంఠం | ఆకాశం | 72 | 16 | అచ్చులు-16 | వికసనం శ్రవణం శ్రోతం | తెలుపు | చక్రం |
| 4 | అనాహతం | హృదయం | వాయువు | 54 | 12 | 'క' నుండి 'ఠ' వరకు | సంచలనం స్పర్శం త్వక్కు | వ్యోమం | షట్కోణం |
| 3 | మణిపూరం | నాభి | అగ్ని | 52 | 10 | 'ఢ' నుండి 'ఫ' వరకు | వ్యాపనం రూపం చక్షువు | ఎఱుపు | త్రికోణం |
| 2 | స్వాధిష్ఠానం | లింగస్థానం | జలం | 62 | 6 | 'బ' నుండి 'ల' వరకు | సంకోచనం రుచి జిహ్వ | తెలుపు | అర్ధచంద్రం |
| 1 | మూలాధారం | గుదస్థానం | భూమి | 56 | 4 | వ శ ష స | సంయోగం గంధం ఘ్రాణేంద్రియం | పసుపు | చతుష్కోణం |

హనుమనుగూర్చి, సేతువునుగూర్చి యింతగా యెందుకు చెప్పవలసివచ్చిందంటే పై చెప్పబడిన యోగమార్గం హనుమకు హృత్కావిలె. హనుమకు సీత యోగశాస్త్రంలో గురువు. రాముడూ గురువే. ఇది సీతారామాంజనేయసంవాదం చదివితే తెలుస్తుంది. హనుమమాటలివి—

నే నమస్కరింతు నీరజాతాప్తుని సకల వివిధ శబ్దశాస్త్రగురుని
నే నమస్కరింతు నీరజేక్షణ నీరజాక్షి *గూఢయోగశాస్త్ర గురువు*
— *సుందర-సంధ్యా-36*

ప్రాణాయామపరుడైన ఒక మహాయోగికి భౌతికమైన శతయోజన గమనమన్నదొక లెక్కలోనిదికాదు. కావుననే అవలీలగా సముద్రతరణంచేసి బుద్ధిబలంతో కార్యాన్ని సాధించి అక్షతమైన శరీరంతో తిరిగివచ్చినాడు. కావుననే కల్పవృక్షంలో లంకనుచేరిన హనుమనుగూర్చి కవియిట్లు చెప్పినాడు.

తే॥గీ॥ *హనుమ యెగిరినట్టి యాకాశముంగాంచి*
*నవ్వుకొనియె నంత దవ్వటంచు*
*నట్లె చనిన నున్న యాకాశమంతయు*
*బట్టదేమొ చెమటబొట్టుతనకు* — (*సుందర-పూర్వరాత్ర ప-19*)

హనుమయొక్క అప్రాకృతపరాక్రమానికి మదిలో ఆశ్చర్యపోయిన రాముడిలా అనుకొన్నాడు.

చ॥ *ఇతడు సముద్రముంగడచె నెట్టులు?! దైత్యుని పట్టణంబులో*
*నితడును గుప్తిగా జనియె నెట్టులు?! దుర్జనమైన రాక్షసా*
*వృతి మెయి దట్టుకో గలిగె నెట్టులు?! జానకి గాంచె నెట్టు?! లా*
*క్షితిసుతతో బ్రసంగమును జేయగ నేవల మీతడే తగున్!*
— *సుందర-సంధ్యా-305* ప.

ఇది హనుమంతునికి రాముడిచ్చిన గొప్ప ప్రశంసాపత్రం! అనితరసాధ్యమైన హనుమ ఘనకార్యములట్టివి. సూక్ష్మాతిసూక్ష్మమైన హనుమ బుద్ధికుశలత్వ మాయన మహాయోగియగుటచేతనే విలక్షణమై ప్రకాశించినది. సీతారామసమాగమములో హనుమ కీలకమైనవ్యక్తి! అవ్యక్తి యింత విశిష్టుడగుటచేతనే సుందరకాండ కంత ప్రాధాన్యము సంఘటించినది.

హనుమనుగూర్చి రావణునితో అక్షుని మాటలివి—

*అతండు శివుండు కాని యెడ నక్కట నన్ను నహోమహోహవ*
*క్షితిగెలువంగ లేదు మఱికేవలమున్ శశిఖండమౌళి దై*
*వతమయి వానరాకృతిని వచ్చిన నష్టములేదు త్వత్కృపా*
*గతియును దత్కృపాగతియు గన్న జనుష్ఫలమున్నె వేఱుగన్*

*— సుందర-దివా-178*

## 49. పాతివ్రత్యానికి అగ్నిపరీక్ష

రామాయణం మొత్తంమీద చూస్తే రెండు సంఘటనలు ఎంతో ఆశ్చర్యాన్ని కల్గిస్తాయి.

1. పంచవటిలో పర్ణశాలను వదలని లక్ష్మణుని సీత నిందించడం.
2. రావణసంహారం తర్వాత రాముడు సీతను నిందించడం.

ఇందులో మొదటిదానికి సాధ్యమైనంతవరకు సమాధానం చెప్పకున్నాం. రెండవది పరిశీలిద్దాం!

రాముడు రావణుణ్ణి సంహరించాడు. ఈ వార్త సీతాదేవి చెవులకు అమృతసేచనంలా అయింది. వెంటనే రాముణ్ణి చూడాలనుకొంది. స్నానంచేసి విభీషణునివెంట రాముడుండే చోటికి వెళ్లింది. రాక్షసులు, కోతుల సమూహంలో కలకలం ఆరంభమైంది. ఏం జరుగుతుందో చూడాలని వాళ్లంతా ఆత్రంగా ఎదురుచూస్తున్నారు. విభీషణుడు వాళ్ళందరిని వెళ్లిపొమ్మని ఆజ్ఞాపిస్తుంటే రాముడే స్వయంగా అక్కడికివచ్చి "సీతాదేవి యిప్పుడేం అంతః పురస్త్రీకాదు. అందరూ ఆమెను చూడవచ్చు" అని అనుమతించి కూర్చోబెట్టాడు.

సీతకూడా రాముని అనుమతిలేకుండా ఏమీరాలేదు. హనుమ సీతతో, "తల్లీ! శ్రీరామచంద్రునితో నేమి చెప్పమందు" వనగా నామె "నేనాయనను జూడ నెంచు చుంటినని చెప్పు" మన్నది. ఇవే మాటలు హనుమ వచ్చి రామునితో చెప్పగా రాముడు విభీషణునితో యిట్లన్నాడు.

*కమలాయతాక్షి జానకి*
*నమరగ నీవేగి స్నాతననులిప్తాంగిన్*

కమనీయభూషణాంచిత
విమల సిచయధారణీన్ విభీషణ! తెమ్మా!

"నీవు వెళ్లి పిలిస్తే జానకి నమ్మినీతో వస్తుంది. నీవు నన్ను నమ్ము కున్నవాడివి. నీవెంట వచ్చిందంటే నన్ను తప్పక చూస్తుంది. వెళ్లు" అన్నాడు రాముడు. అప్పుడు రాముని కళ్లలోని బడబాగ్నులు చూచి కోతులు, రాక్షసులు భయపడ్డారు. అక్కడసీత, తన భర్త జయించాడనే వార్తవిని ఉప్పొంగిపోతోంది.

రాముడు చెప్పినట్లే సీత స్నాతానులిప్తాంగియై విభీషణుని వెంట వచ్చింది. అప్పుడు రాముడిలా అంటున్నాడు. "నేనిదంతా స్నేహితుల పరాక్రమసహాయంతో సాధించానుగాని నీకోసంచేయలేదని తెలుసుకో! సదాచారాన్ని రక్షించడానికి, నా వంశానికి వచ్చిన అపకీర్తిని పోగొట్టు కోవడానికి నేనింతకష్టపడి విజయాన్ని సాధించానుగాని వేరే కారణం దానికి లేదు."*

ప్రాప్త చారిత్ర సందేహా మమ ప్రతిముఖే స్థితా॥
దీపో నేత్రాతురస్యేవ ప్రతికూలాసి మే దృఢా॥

శీలసంపత్తి విషయంలో సందేహం గలిగి నాయెదుట నిలిచివున్న నీవు నేత్రరోగం గలవాడికి దీపం యెట్లో అట్లు ప్రతికూలవైయున్నావు.

ఈశ్లోకంలో 'నేత్రాతుర' శబ్దానికి వాల్మీకి హృదయమేమి? నేత్రా తుర శబ్దమునకు 'నేత్రరోగి' అనే రూఢ్యర్థంఉంది. కాని ఆ రూఢ్యర్థం వాల్మీకినాటికే ఉన్నదా అనేప్రశ్న యిక్కడ ముఖ్యమైనది.

"ఆతురశబ్దమునకు రెండర్థములు కలవు. ఒకటి సంభ్రమము. రెండు రోగపీడ. లేక పీడ. అమరకోశ వ్యాఖ్యయందు సంభ్రమో స్యాస్త్రీతి ఆతురః (ఇత్వరా సంభ్రమే) అనికలదు. కనుక ఆతురశ బ్దము ఎన్ని అర్థములందు తర్వాత ప్రయోగింపబడినను వాల్మీకి నాటికి

---

* సీతకు రఘువంశంలో జన్మించిన రాముని ఆంతర్యం తెలియును. అందుకే హనుమతో (సుందర-ఉష-346 ప.) — రఘురాముడు సైతము ధర్మకీర్తులం గామము గల్గువాడగు నికామ మకాముడుగాడు మారుతీ! అన్నది. అంతే-కాదు, ఊర్మిళ, లక్ష్మణునితో (యుద్ధ-ఉపసంహారణ-386) "ధర్మముగాక మీ యెదల దాల్తురె కూర్ములు మీరు రాఘవుల్" అని దెప్పిపొడిచింది. ఇది నిసర్గ మానవస్వభావచిత్రణ.

అనగా అంతప్రాచీనకాలమున యౌగికార్థము నందే ప్రయుజ్యమానమగు చుండి యుండును. తర్వాతనే ఈ యౌగికార్థము నుండి రూఢ్యర్థము పరిణమించియుండును..... ఈవిధముగా నేత్రాతురః అనుటకు దీర్ఘ కాలము చీకటియందున్నవాడు వెలుగును చూచుటకై ఆతురుడైనట్లు అనిఅర్థము చెప్పుటయే సమంజసము."

ఇక్కడ ప్రకరణమునుబట్టి సమంజసార్థముకూడ నిదే.

అహ మప్యత్ర గచ్ఛామి మైథిలీం జనకాత్మజాం।
ప్రత్యయార్థంతు లోకానాం త్రయాణాం సత్యసంశ్రయః॥

నహిశక్తస్స దుష్టాత్మా మనసామపి మైథిలీం।
ప్రధర్షయితు మప్రాప్తాం దీప్తామగ్నిశిఖామివ॥

— యుద్ధకాండ, *122* సర్గ *16, 18* శ్లో.

ఈ 'దీప్తామగ్నిశిఖామివ' యే ముందుచెప్పిన 'దీపోనేత్రాతురస్యేవ' లోని దీపము. కనుక 'ప్రాప్తచారిత్ర సందేహా'ది శ్లోకములో కవి యభిప్రాయము సీతచరిత్ర నిష్కళంకము అనిస్పష్టము. రామునిదృష్టి యందును సీత నిష్కళంక చరిత్రయే. మరి, రాముడు ప్రాప్తచారిత్ర సందేహా అన్నప్పుడు ఆ సందేహమెవరిది? అనగా రామునిదిగాదు, ప్రత్యయార్థంతు లోకానాం అనుటచేత లోకముది. కనుక యిచ్చట ఉపమాన మెట్లుండవలెను? సీతారాములపట్ల నిష్కళంకతను చెప్పున దిగానే ఉండవలెను. శ్లోకమున సీతదీపము. రాముడు నేత్రాతురుడు. నేత్రాతురునకు దీపమెట్లు ప్రతికూలమో అట్లే సీత రామునకు ప్రతి కూలము. 'నేత్రాతుర' సమాసమునకు నేత్రరోగపీడితుడని చెప్పినచో రాముడు నేత్రరోగపీడితునివలె ఉన్నాడన్నట్లగును. వాల్మీకి, రామునకు సీతపై సందేహము లేదనికూడ అనుచున్నాడు. మరి, సీత అతనికి ప్రతికూల యెట్లాయెను? ఇక్కడ 'ప్రతికూల' అనగా 'అస్వీకార్య' అని మాత్రమే. ఇచ్చట దోషము లోకముదేగాని రామునిదిగాదు. కనుకనే ఈ పరిస్థితిని అవగాహనచేసికొని సీతారాములకు కళంకము లేనివిధముగా అర్థము గ్రహింపవలెను."

"రాముడు సీతాదర్శనాతురుడు. అట్లే చీకటి యందున్నవాడు దీప దర్శనాతురుడు. కాని వానికి తీరా వెలుతురు లభింపగానే వెంటనే చూడలేడు. వెల్తురు చూడగానే వాని కన్నులు మూతలు పడును.

నేత్రరోగ ముండుటచేతకాదు, ఆరోగ్యవంతమైన నేత్రములకు కూడా యిట్టిది సహజమే. ఇది లోకానుభవము. ఇట్టి లోక న్యాయమును పురస్కరించుకొని వాల్మీకి యిచ్చట చమత్కరించెను. ఈ యర్థము యొక్క పక్షమున రాముని కన్నులదోషముకాక చుట్టు ఉన్న చీకటిదోషముచేత అనగా లోకము చీకటిచేత చూడలేకపోవుట సంభవించినది. కనుక ఈ అర్థముచేత వాల్మీకి ఉద్దేశించిన సీతారాముల నిష్కళంకత ఆ ఉపమాలంకారమున ప్రతీతమానమగును. సాధారణమైన రూఢ్యర్థమున ఈ చమత్కార సౌరభము సిద్ధింపదు. 'నేత్రాతుర' శబ్దమునకు నేత్రరోగి అను రూఢ్యర్థము బహుశః ఈ వాల్మీకీయ ప్రయోగమును అపార్థము చేసికొనుటలో నుండియే పుట్టియుండును." అని 'నేత్రాతుర' శబ్దచర్చలో గుంటూరు శేషేంద్రశర్మగారు నిర్ణయించిరి.

సీతతో రాముడింకాయిట్లన్నాడు. "నీకు అనుజ్ఞ యిస్తున్నాను. దశదిశల్లో నీయిష్టం వచ్చిన చోటికివెళ్లు. నాతో నీకుపనిలేదు. ఎంతో కాలం పరుని యింట్లో నివసించిన భార్యను సత్కులంలో పుట్టినవాడు, అందులో పరాక్రమవంతుడైన పురుషుడు యెవడు మిక్కిలి ప్రీతితో గ్రహిస్తాడు?

రావణాంక పరిక్లిష్టాం దృష్టాం దుష్టేన చక్షుషా।
కథం త్వాం పునరాదద్యాం కులం వ్యపదిశ న్మహత్॥

ఇంతకాలం రావణుని తొడపై కూర్చుని యిప్పుడే దిగివచ్చినదానివి. రావణునిచే కామాతురమైన దృష్టిచే చూడబడిన దానివి. నిన్ను నేను మరలా యెలా గ్రహిస్తాను? యుద్ధంలో జయించి, పోయినకీర్తిని తిరిగి సంపాదించాను. నాకు నీమీద ఆసక్తి ఎంత మాత్రమూలేదు. నీయిష్టం వచ్చిన చోటికిపోవచ్చు.*

---

* ఒక మహాకావ్యానికి రెండు ప్రయోజనాలుంటాయి. 1) మానవభావచిత్రణ, 2) అవతార ప్రయోజనరహస్యం. కథపైకి కనబడేది మానవస్వభావమే. ఈరెండూ విడివిడిగా చూచుకోవాలి! మహాభాగవతంలో శ్రీకృష్ణుడు కూడ రుక్మిణిని ఒకసందర్భంలో ఆమె తనను వివాహమాడిన పద్ధతిని ఎగతాళిచేసి ఎక్కడికైనా పొమ్మన్నాడు. రామకృష్ణులెంత అవతారపురుషులైనప్పటికీ విశ్వనాథ కల్పవృక్షంలో రాముడన్నట్లు "ఎప్పుడు మేమదాల్చితివొ ఈ తనుసంగత లక్షణంబులుం దప్పవు" మానవస్వభావ పరిధిలో మనం పై ఘట్టాన్ని చూడాలితప్ప అవతార తత్త్వానికి దీనికి సంబంధంలేదు.

తదద్య వ్యాహృతం భద్రే మయైతత్కృత బుద్ధినా।
లక్ష్మణేవాథ భరతే కురు బుద్ధిం యథాసుఖమ్॥
శత్రుఘ్నే వాథ సుగ్రీవే రాక్షసే వా విభీషణే।
నివేశయ మనః సీతే యథా వా సుఖమాత్మనే॥
నహిత్వాం రావణో దృష్ట్వా దివ్యరూపాం మనోరమామ్।
మర్షయత్యచిరం సీతే స్వగృహే పర్యవస్థితామ్॥

"లక్ష్మణుడివద్దగాని, భరతునివద్దగాని, వానరరాజయిన సుగ్రీవుని వద్దగాని, రాక్షసరాజయిన విభీషణునివద్దగాని లేక నీకెచట సుఖమని తోస్తుందో అక్కడ వుండి నీ శేషజీవితాన్ని గడువు. దివ్యమైన రూపం గలదానివి. అందగత్తెవు. తన యింటనే వుండేదానివైన నిన్ను చూస్తూ చపలుడైన రావణుడు యింతకాలం మన్మధ బాధ సహించి వూరకుండి వుంటాడా? నాకు నమ్మకంలేదు."

భర్తవద్ద ప్రియమైన మాటలనే ఎప్పుడూ వినే సీత అప్రియమైన మాటల్ని తన ప్రియుని ముఖతః వినగానే మదపుటేనుగుతొండంచే కొట్టబడిన పూలతీగవలె విలవిలలాడిపోయింది. చివరికిలా అంది.

"ఒక సామాన్య మానవుడు అసామాన్య విషయాన్ని పలికినట్లుగా నీవు చెప్పడానికికాని, నేను వినడానికి కాని యోగ్యంకానిదీ, పరుషమూ, శ్రవణదారుణమైన మాటలతో నన్నేల దూషిస్తావు? నీవు అనుకొనేటట్లు నేను ఏదోషాన్ని పొందలేదు. ఏదైన ఒకప్రమాణంచేత నమ్ము! నీకునమ్మకం కల్గడానికై నా సచ్చరిత్రం పైననే ఆనపెట్టి చెబుతున్నాను."

"దుష్టలైన స్త్రీలెవరో దుర్వృత్తి గావిస్తారని స్త్రీజాతి నంతటినీ అలాగే తలపోస్తున్నావు. నీకు నాస్వభావంచక్కగా తెలిస్తే నావిషయంగా యీసందేహాన్ని విడిచిపెట్టు! రావణుడు నన్ను అపహరించి నప్పుడు అతని దేహస్పర్శను నేను సహించలేదు. ఆతప్పుదైవముదేకాని నాదికాదు. నామనస్సు ఇతరుల కర్ధంకాదు. అది నీయందే సదాలగ్నమై వుంటుంది. అస్వతంత్రనైయున్నప్పుడు నా అంగములస్పర్శకు నేనేం చేసేది? నీవూ నేను యింతకాలమూ కలిసిబతికాము. ఇంకా నేను నీకు అర్ధంకాకపోతే నేను మిక్కిలి దురదృష్టవంతురాలినే! అలాంటి వాడివి హనుమను ఎందుకు పంపావు? నీవు నన్ను విడిచానని చెప్పి పంపివుంటే నేన ప్పుడే ప్రాణాలు వదిలేదాన్ని. ఇప్పుడదంతా నిష్ప్రయోజనమయింది

కదా? పురుషోత్తముడైన నీవు అల్పపురుషునిలాగా కోపాన్నే వహిం చావు. యుక్తాయుక్తాలు విచారించకుండా స్త్రీజాతినంతటినీ ఒకటిగానే భావించావు. కాని నా శీలాన్ని గురించి ఆలోచించలేదు. నా శీలమే నీకు అప్రమాణమైనప్పుడు నేనుబ్రతికి యేం ప్రయోజనం? కాబట్టి చితిలో ప్రవేశిస్తాను" అని సీతాదేవి అగ్నిప్రవేశం చేసింది.

వివాహ మంత్రంలో 'నాతి చరామి' అని వరునిచేత పురోహితుడు చెప్పించే మంత్రానికి 'న+అతి చరామి' ఈమెను వదలి వేరొక స్త్రీయందు వ్యభిచరింపను' అనే అర్థమే కాకుండా 'ఈ స్త్రీయందు కూడా అతిగా కామవిషయకంగా ప్రవర్తింపను' అనే రెండో అర్థంకూడా చెప్పుకోవాలి. సీత ఈ వివాహప్రసక్తినీ, ఆమంత్రాన్నీ రెండుచోట్ల ప్రస్తా వించినది.

న ప్రమాణీకృతః పాణిర్బాల్యే బాలేన పీడితః।
మమ భక్తిశ్చ శీలంచ సర్వం తే పృష్ఠతః కృతమ్॥

నీవు చిన్నవాడవై యున్నప్పుడు నా చిన్నతనంబున నన్నుఅగ్నిసా క్షికంగా వివాహమాడిన విషయం నీకిపుడు ప్రమాణం లేనిదయింది. నాకు నీయందుండే భక్తి, నా సౌశీల్యం అంతానీకు అప్రమాణమైంది. ఈమాటలు మిధిలలో సీతారామ వివాహసందర్భంలో జనకుడు రాము నితో చెప్పిన—

ఇయం సీతా మమ సుతా సహధర్మచరీ తవ।
ప్రతీచ్ఛచైనాం భద్రంతే పాణిం గృహ్ణీష్వ పాణినా॥
పతివ్రతా మహాభాగా ఛాయే వాను గతాసదా।*

అనే శ్లోకాన్ని జ్ఞప్తికి తెస్తోందికదా! రాముడా మాటలుజ్ఞప్తికి తెచ్చు కోవాలనే సీత అలాపలికింది. ఇలా అన్న వెంటనే చితిని ప్రవేశిస్తూ—

కర్మణామనసా వాచా యథా నాతి చరామ్యహమ్।
రాఘవం సర్వధర్మజ్ఞం తథామాం పాతు పానకః॥

---

* భాసుని ప్రతి మా నాటకంలో దశరథుడు సీతారామలక్ష్మణులు అడవికి-వెళ్లినారని తెలిసిన తర్వాత చెప్పినమాటలు—
"సూర్య ఇవ గతోరామః దివస ఇవ లక్ష్మణోఽనుగతః।
సూర్య దివసావసానే ఛాయేవ న దృశ్యతే సీతా॥
సూర్యుణ్ణే అనుసరించే ఛాయవలె సూర్యవంశజుడైన రామవనగమనంతో సీత అనే నీడకూడ లోపించిపోయింది అంటాడు. ఇది భానునిపై వాల్మీకిప్రభావం!

"త్రికరణశుద్ధిగా నేను రాముని తప్ప పరపురుషుల చూడకుండ ఉన్నట్లయితే సమస్తలోకసాక్షి యైన అగ్నిహోత్రుడు నన్ను రక్షించుగాక" అని ప్రార్థించడంలో సీత భర్తృవ్రతనిష్ఠ ఎంతగాఢమైందో స్పష్టమౌతోంది.

అగ్నిప్రవేశం చేసేటప్పుడు సీత శ్రీరామునికి ప్రదక్షిణ నమస్కారాలు చేసింది. ఈ మహాద్భుతాన్ని చూచి వానరులు, రాక్షసులు హాహాకారాలు చేశారు. సీత అగ్నిలో ప్రవేశించింది. బ్రహ్మాది దేవతలందరు అప్పుడు ప్రత్యక్షమైనారు. వారంతా రామునితో యిట్లన్నారు.

"ఓ రామా! నీవు పూర్వం అష్టవసువుల్లో ప్రజాపతియైన ఋతధాముడనే పేరుగలవాడివి. అష్టరుద్ర మూర్తులలో ఎనిమిదవ మూర్తియైన మహాదేవుడివి. సాధ్యులలో వీర్యవంతుడనే ఐదవవాడవు." "నీవు ముల్లోకాలకు ఆదికర్తవు. పరమ స్వతంత్రుడవు. సర్వ నియామకుడవు. నీకు అశ్వినీదేవతలు చెవులును, చంద్రసూర్యులు నేత్రములు, సృష్టికి ముందు, ప్రళయానికి పిమ్మట నీవొక్కడవే కనబడుతావు. అలాంటి నీవు — "ఉపేక్షసే చ వైదేహీం మానుషః ప్రాకృతో యథా" ఏమీ తెలియని సామాన్య మానవునివలె సీత అగ్నిలో ప్రవేశించుచుండగా, చూస్తూ ఎలా మౌనం వహించియున్నావు? అని ప్రశ్నించారు.

అంతకుముందు సీతకూడా యిలాగే ప్రశ్నించింది.

కి మా మసదృశం వాక్య మీదృశం శ్రోత్రదారుణమ్।
రూక్షం శ్రావయసే వీర ప్రాకృతః ప్రాకృతామివ॥
త్వయాతు నరశార్దూల క్రోధమే వాను వర్తతా।
లఘునేవ మనుష్యేణ స్త్రీత్వమేవ పురస్కృతమ్॥

బ్రహ్మాది దేవతలకు, తత్పూర్వం సీత అడిగిన ప్రశ్నలకూ కలిపి యిప్పుడు రాముడు బ్రహ్మనే యిలా ప్రశ్నిస్తున్నాడు.

ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజమ్।
యోఽహం యస్య యతశ్చాహం భగవాన్ తద్బ్రవీతు మే॥

నేను దశరథ కుమారుడగు రాముడనియే తలంచుచున్నాను. నేనసలు ఎవరను? ఏసంబంధంవల్ల ఎందుకోసం యిక్కడ పుట్టాను? ఆ వివరాలన్నీ నాకు భగవంతుడైన బ్రహ్మదేవుడు చెప్పాలి" అన్నాడు.

రాముడడిగిన ఈ ప్రశ్న ఋగ్వేదమందలి నాసదీయసూక్తాన్ని స్పృశి స్తోంది. సరిగ్గా యిదే ప్రశ్న మంత్రద్రష్టయైన మహర్షికి స్ఫురించింది.

కో అద్ధావేద క ఇహ ప్రవోచత్ కుత ఆజాతా కుత ఇయం విసృష్టిః
అర్వాగ్దేవా అస్య విసర్జనే నాథా కో వేద యత ఆ బభూవ॥
— నాసదీయసూక్తమ్ (ఋగ్వేదమ్ X-129-6)

ఎవడికి నిజంగా తెలుసు? ఎవడు చెప్పగలడు? ఇది ఎక్కడినుంచి పుట్టింది? వివిధరూపమైన ఈసృష్టి యెక్కడనుంచి వచ్చింది? దేవ తలందరూ ఈసృష్టికి తర్వాతివారే. అప్పుడు ఎవడికి తెలుసు ఈ సృష్టి ఎక్కడినుండి ఉత్పన్నమైందని?

'న-అసత్-ఆసీత్' అని చెప్పనదియే నాసదీయ సూక్తము. ఈ మంత్రద్రష్ట 'పరమేష్ఠి' అనేపేరుగల ప్రజాపతి ఋషి. వియదాది భావ యుతమై సృష్టి స్థితి ప్రళయాదులను ప్రతిపాదించే ఈ సూక్తంలో ప్రతిపాదింపబడినవాడు పరమాత్ముడే! "పరమేష్ఠీ పితామహః" అన్నట్లు పరమేష్ఠియైన బ్రహ్మనే ప్రశ్నిస్తున్నాడు రాముడు. "భగవాన్ తత్ బ్రవీతు మే" అని రాముడు బ్రహ్మదేవుని అడిగిన ప్రశ్నకు వేదర్షి పరమేష్ఠియే నాసదీయసూక్తంలో తన దర్శనాన్ని యిలా ప్రసరింపజేసి యున్నాడు.

ఇయం విసృష్టిర్యత ఆ బభూవ యది వా దధే యది వాన।
యో అస్యాధ్యక్షః పరమే వ్యోమన్ త్సో అంగవేద యది వా నవేద॥
— ఋగ్వేదమ్ X-129-7

ఎప్పుడీ వివిధరూపమైన సృష్టి భూమిపై అవతరించింది? దీని నాతడు ధరించినాడా లేడా? (లేకుంటే ఎవ్వరు ధరింపగల సమ ర్థులు?) ఎవడీ సృష్టికి అధ్యక్షుడు? అతడు పరమవ్యోమంలో ఉన్నాడు. అతడే నిశ్చయంగా దీన్ని తెలిసినవాడు! ఇది అతనికే తెలియకపోతే (మరి ఎవడికి తెలుస్తుంది?) ఆర్ష ఋషియైన వాల్మీకి నాసదీయసూక్త రహస్యాన్ని యిక్కడ ప్రతిపాదించినాడనాలి. లేకుంటే, యిలా ఒక మంత్రద్రష్టయైన మహర్షివలె దర్శించి, ప్రశ్నించిన రాముడు "ఋషిస్స్వి ద్ధిమాం, ఋషిభిస్తుల్యమ్" అన్న వాల్మీకి మహర్షి మాటలను అన్వర్థ మొనర్చినాడు కదా! పైగా రాముడు ప్రజాపతియైన ఋతధాముడు. ప్రజాపతి అంటే సృష్టి ప్రక్రియకు హేతుభూతుడు. ఋతమంటే సత్యం!

దీన్నే మనం Rhythm అంటున్నాం. ఋతమెప్పుడూ మహర్షిదర్శనానికి చెందింది. దీన్నే 'ఆర్షంతే ప్రాతిభం చక్షుః' అన్నాడు భవభూతి. ఆర్షము అనాది. సనాతనమైనది ఋతం! శ్రీరామచంద్రుడు సనాతనుడైన పరబ్రహ్మముకదా! మాయామానుష విగ్రహుడైనప్పటికీ ఆ దర్శనశక్తి ఆదర్శమునందువలె ప్రతిఫలించడంలో ఆశ్చర్యంలేదు.

## 50. సీతారాముల అలౌకిక దాంపత్యం

శ్రీరామచంద్రుడు బ్రహ్మను అడిగినది సంప్రశ్న! (Great Question) ఈ సంప్రశ్నకు సమాధానం బ్రహ్మదేవుడే యివ్వగల సమర్థుడు. వాల్మీకి రామకథా చర్వణదశలో నిమీలితుడై, ధ్యానసమాధిలో నున్నప్పుడు బ్రహ్మప్రత్యక్షమై ఎలా రామాయణ మహాకావ్య రచనకు మహర్షిని ప్రేరేపించినాడో, రామాయణ కథావసాన ఘట్టంలోకూడా ఆ బ్రహ్మదేవుడే రామునికి ప్రత్యక్షమై కథానాయకుని 'సంప్రశ్న'కు సమాధానం చెప్పితిరిగి కథాగతికి దోహదం చేస్తున్నాడు. ఇదొక విచిత్రమైన, విశిష్టమైన, విలక్షణమైన శిల్పంగా మనం పరిగణించాలి. మహాభారతంలో ధర్మసందేహం తలెత్తిన ఘట్టంలోనెల్లా "వ్యాసోనారాయణో హరిః" అన్నట్లు, నారాయణుడేయైన వ్యాసమహర్షి — మహాభారత సంహితాకర్తయే వచ్చి ఆ ధర్మసందేహ నివృత్తి కల్గించేటట్లు, రామాయణ కావ్యరచనకు పురికొల్పిన బ్రహ్మదేవుడే కావ్యనాయకుని 'మహాప్రశ్న'కు బదులిచ్చుటలో కథలోని ఒక మహాక్లిష్టమైన ఘట్టంలో అవతరించుటలో యిదియొక అద్భుతమైన, అతిలోకమైన శిల్పంగా పాఠకుడు సంభావింపక తప్పదు.

శ్రీరాముని 'సంప్రశ్న'ను మననం చేస్తే, అది రాముని ఆత్మౌన్నత్యాన్నీ, పరిపక్వమైన హృదయాన్నీ, సర్వసమత్వాన్నీ తెలియజేస్తున్నాయి. అప్పుడు బ్రహ్మ యిలా అంటాడు. "శ్రీరామచంద్రా! సీత సాక్షాత్ లక్ష్మీదేవి. నీవు సృష్టి స్థితిలయకారణుండును, భూనిర్వృతి ప్రదుండును, సర్వలోకనాథుండును అగు విష్ణుడవు! రావణవధార్థం భూలోకంలో మనుష్యశరీరంతో అవతరించావు" ఈ మాటలు బ్రహ్మఎప్పుడు అంటున్నాడు? రాముడు తాను అవతారపురుషుడనని తెలియక మానుషజన్మలోని కష్టనిష్ఠూరాలనుభవించి రావణుని సంహరించిన తర్వాత అంటున్నాడు. అంటే అర్థమేమి? వ్యక్తి తనకుతానై ఒక మహాకార్యసాధనలోని ఒడుదుడుకులనెదుర్కొని దానిని సాధించినపిమ్మటనే అతడు 'కారణ జన్ముడని'

'మహాత్ముడ'ని 'అవతారపురుషుడ'ని లోకం గుర్తించి నివాళులర్పిస్తుంది. అంతవరకు వాడి తిప్పలు వాడివే! వాడి అగచాట్లు వాడివే! వాడి పనులలో ఎంతవాడితనఉన్నా లోకం దానిని విమర్శిస్తూనే ఉంటుంది. బ్రహ్మవాక్కు లోకరీతికి ప్రతిబింబంగా ఉండడంలో ఎంతైనా ఔచిత్య ముంది. కావ్యం లోకానికి ప్రతిబింబమనే (Poetry at bottom is the criticism of life) పాశ్చాత్యసూక్తిని వాల్మీకి మహాకవి యిక్కడ భంగ్యంతరంగా ప్రతిపాదించాడనిచెప్పాలి.

అప్పుడు అగ్నిదేవుడు —

"అంకే నిధాయ వైదేహీ ముత్పపాత విభావసుః"

సీతాదేవిని తొడపై పెట్టుకొని చితినుండి లేచివచ్చాడు. అప్పుడు సీతమ్మవారెలా ఉంది?

*తరుణాదిత్య సంకాశాం తప్తకాంచన భూషణామ్।*
*రక్తాంబరధరాం బాలాం నీలకుంచిత మూర్ధజామ్॥*
*అక్లిష్టమాల్యాభరణాం తథారూపం మనస్వినీమ్।*
*దదౌ రామాయవైదేహీ మంకే కృత్వా విభావసుః॥*

ఇది శ్రీమహాలక్ష్మీదేవీ స్వరూపం! రావణుడు సీతను తొడపై కూర్చుండబెట్టుకొని స్పృశించి తీసుకొని వెళ్లినాడని, కాముక దృష్టితో చూచినాడని, ఆమె అపవిత్ర అయిందని, ఆమెశీలం కళంకపూరిత మైందని రాముడు లోకానికి ప్రాతినిధ్యం వహించి నేరారోపణచేశాడు. సీత తన పవిత్రతనూ, పాతివ్రత్యాన్నీ నిరూపించడానికి అగ్నిప్రవేశం చేయగా అగ్నిదేవుడు ఆమెను అంకారోపితను చేసికొనితెచ్చినాడు. ఇది అచ్చమైన దేవీ స్వరూపవర్ణన. శ్రీసూక్తమందలి దేవీస్వరూపమిదే.

*హిరణ్యవర్ణాం హరిణీం సువర్ణరజతస్రజామ్।*
*చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమవహ॥*
*తాం మావహ జాతవేదో లక్ష్మీమనపగామినీమ్।*
*యస్యాం హిరణ్యం విందేయం గామశ్వం పురుషానహమ్॥*
*కాంసోస్మితాం హిరణ్య ప్రాకారా ఆర్ద్రామ్।*
*జ్వలంతీం తృప్తాం తర్పయంతీమ్*
*పద్మేస్థితాం పద్మవర్ణాం తామిహోపహ్వయే శ్రియమ్॥*

ఇది శ్రీసూక్తమందలి "నివసతు హృదిబాలా నిత్యకల్యాణ శీలా" — అనిచెప్పబడిన దేవీస్వరూపం.

ఇది దేవి సీత అంతరస్వరూపముకాగా, బాహ్యంగా ఈ సంఘటనదేనిని స్ఫురింపజేస్తున్నదనగా, సీతారాముల వివాహవేళ అగ్నిసాక్షిగా వివాహమాడిన తర్వాత ఆమెను జనకుడు రాముని తొడపైకూర్చుండబెట్టినది జ్ఞప్తికి రాకమానదు. అక్కడ సాక్షి 'అగ్ని' — యిక్కడ మరల అదే పవిత్రమూర్తిని అగ్ని తనతొడపై నుంచుకొని తెచ్చినాడనగా హవ్యవాహనుడు తండ్రికాగా 'సీత' కుమార్తె యగుచున్నది లేక 'అగ్ని' జనకస్థానీయుడు. సీత నేమనుటకు వీలులేదు. రాముడు లోకమునోరు మూయించినాడు. అప్పుడు అగ్ని చెప్పినమాటలు, (యుద్ధ కాండ — సర్గ 122 శ్లో. 18) 'దీప్తామగ్నిశిఖామివ' 'దీపోనేత్రాతురస్యేవ అను పదబంధములను తాకుచున్నవి. రామాయణకల్పవృక్షములో హనుమ సీతను 'ఈమె యొక నూతనాగ్నిశిఖ' అనుకొన్నాడు. ఈమాటలు సీతలోని యోగశక్తిని, దేవీలక్షణమును పట్టియిచ్చుచున్నవి.

"ఇట్లు పంచాగ్ని మధ్యమ్మునందుండి తపించుచున్న మహాయోగీశ్వరి వోని దుఃఖభాగేశ్వరియైన జనకరాజదుహితను, రాఘవులస్నుషను విలోకించి విలోకించి సమాధిగతుండయిన యోగిరాజువలె నక్కపిరాజు...." (సుందర-పరరాత్ర 102.వ)

"అనిన హనుమంతు డీమెయోగిని, నిర్మమురాలు, నీతి విశారద, యుద్ధనీతికుశల, భక్తురాలు, దీనురాలు, నీమె యొకనూతనాగ్నిశిఖ యని భావించి యీతల్లికి నేనేమి సేవ చేయగల్గుదునని తలంచి"
— సుందర-ఉషః-265వ

*ఏ యోగశక్తిచేతను*
*కాయము నిలిపితివొ యింతగా, బదిమాసా*
*లా యోగశక్తిచేత మ*
*హీయుని రాముని నను్రగహింపం గదవే!* — సుందర-ఉషః-*267*వ.

*"కాంచితిసీత.... విప్రయోగ దహనాగ్రశిఖామయదేహ లంకలో"*
— *సుందర-సంధ్యా 137 వ.*

వాల్మీకంలోవలె, రామాయణకల్పవృక్షంలోను సీత అగ్నిప్రవేశ ఘట్టం పునరాగమనం విశిష్టంగా ఉన్నది.

"మఱియు నొక్క జ్వాల యరుణవర్ణుండు నరుణ సటాకిరీటుండు నరుణాక్షుండునై పురుషాకృతి వహించి, రెండవజ్వాల సముదయవసంత వేళాప్రముదిత నిరంతకిసలయ మధురిత నవారుణాంగకయైన జానకీ దేవిగా గనుపించినంత, నగ్నిదేవుండు శ్రీరామచంద్రునితో నిట్లనియె."

*ప్రాణపతీ! యనింధన మహాగ్నివి నీవయి నీవ యాఱిపో*
*వేను, జగత్త్రయానలమ సేంధన వహ్నిన యాఱిపోదు నా*
*లోనన నీవు చొచ్చినను లోకములెల్ల జెడున్ జగత్ప్రభూ!*
*నేనిట నాఱియుండు నవనీసుత నన్ గృప జూడకున్నచో*

*నీసగమ్ము నేను నీకు నర్పించితి*
*నన్ క్షమింపు మయ్య నాథ నాథ!*
*యనుచు నగ్నిదేవు డంతర్హితుండైన*
*యొకతె సీత నిలచి యుండెనచట.* — యుద్ధ-ఉపసంహారణ
*196 — 199* ప.

ఈ ఘట్టాన్ని శ్రీవిశ్వనాధవారే "సీతాయాశ్చరితం మహత్" అన్న ఉపన్యాసంలో వ్యాఖ్యానించారు. "మనం లోకంలో చూచేది ఏదో ఒక యింధనాన్ని యంటిపెట్టుకున్న అగ్ని. శ్రీరామచంద్రుడు అనింధనమహాగ్నిట! మనంచూసే అగ్ని ఏదోఒకవస్తువును ఆశ్రయించి నది. దేన్నీ ఆశ్రయించకుండావున్న అగ్నినిచూడలేము. ఆ పరమేశ్వ రత్వం అనింధనమహాగ్ని! అదీ అగ్నే! ఏ యింధనాన్నీ అంటిపెట్టుకోని అగ్ని! అగ్నిహోత్రుడు సేంధన వన్నెతో బహిర్గతమైనాడు. ప్రాణపతీ! అనింధనమహాగ్నివి నీవు! నీవు ఆరిపోవు. 'మూడులోకాలు ఏఅగ్నిచేత నడుస్తున్నాయో ఆ అగ్నియైన నీ అర్ధభాగం జానకీదేవి' సేంధనమైన నాలో ప్రవేశిస్తే ఏమవుతుంది? Higher faculty అమ్మవారు. Lower facultyని నేను. అమ్మవారొచ్చి నాలో ప్రవేశిస్తే ఏమవుతుంది? నేను చచ్చి వూరుకుంటాను. పరవాలేదుండరా నాయనా అంది. లేకపోతే ఆరిపోయేవాడినే. తల్లినన్ను దయచూచింది కాబట్టి ఆరిపోలేదు. బయ టికొచ్చినీతో చెప్పడానికి వీలయింది. అంటూ అగ్నిహోత్రుడు నీలోని సగాన్ని నీకే అర్పిస్తున్నానంటూ అంతర్హితుడైనాడు "ఒకతె సీత నిలచి యుండెనచ్చట" — ఇప్పుడేం చేస్తాడు శ్రీరామచంద్రుడు?

*.... రఘువంశ శేఖరుని యాస్యం బెల్ల బుష్పించి సీ*
*తానారిం గని నవ్వుదేనియల గోదండంబు నందీయగా*
*దానిం గైకొనె సీత.....*" (యుద్ధ- ఉపసంహారణ *201* వ.)

ఇలా సీతారామ పునస్సమాగమం అగ్నిసాక్షిగా, బ్రహ్మసాక్షిగా లోకము సాక్షిగా సంఘటించినది. వాల్మీకంలో అగ్నిదేవుడు రామునితో ఇట్లంటున్నాడు.

ఏషాతే రామ! వేదీహీ పాపమస్యా న విద్యతే।
నైవ వాచా న మనసా నాను ధ్యానాన్న చక్షుషా॥
సువృత్తా వృత్త శౌండీర! నత్వామతి చచారహా।

"రామా! ఇదిగో నీపత్ని సీత! ఈమె ఎంతమాత్రమూ పాప మెఱుగదు. ఈ సీత త్రికరణశుద్ధిగా నిన్నుతప్ప మరొక పురుషుని ఎంతమాత్రమూ తలచినదికాదు."

ఇక్కడ అగ్నిలో ప్రవేశించక ముందున్న సీత, 'మాయాసీత' అనీ, అగ్నిహోత్రుడు తెచ్చియిచ్చిన సీత 'అసలైన సీత' అనీ బ్రహ్మాండ పురాణాంతర్గతమైన అధ్యాత్మరామాయణం చెబుతోంది. అప్పుడు సీతారాములింతవరకు మాట్లాడినది వట్టి నాటకమైపోతున్నది. ఒక కథకు పురాణసమన్వయం వేఱు. కావ్యసమన్వయం వేఱు. ఏది ఏమైన ప్పటికీ "హేమ్నః సంలక్ష్యతే హ్యగ్నౌ విశుద్ధి శ్యామికాపివా" అన్నట్లు, సీత 'బంగారుతల్లి' అయినప్పటికీ అగ్నిశుద్ధయై పులుకడిగిన ముత్యంలా అత్యంత పవిత్రమైన మనశ్శరీరాలతో రామునికి మరల అప్పగించబడింది. అగ్నిదేవుని మాటలకు రాముని సమాధానం వింటే ఆయన ప్రవర్తన లోకానికెంత ఆదర్శమయంగా వుందో తెలుస్తుంది.

"ముల్లోకాల్లోను సీత పాపంలేని దనడం వాస్తవమే! కాని సదాచార సంపన్నమైన ఈమె రావణుడి యింట్లో ఎంతోకాలం వుండిపోయింది. నేను సీతను పరీక్షించకుండా గ్రహిస్తే పెద్దలు నన్ను "మూఢుడు కాముకుడు, దశరథుని కొడుకు ధర్మచింతన లేనివాడని నిందిస్తారు".

అనన్యహృదయాం భక్తాం మచ్చిత్త పరివర్తనీమ్।
అహమప్యవగచ్ఛామి మైథిలీం జనకాత్మజామ్॥

"జనకమహారాజు కుమార్తెయైన సీతకు ఆచారము మరొకరు చెప్పాలా? సీత నాయందే మనస్సు నుంచినదనియు, నాయందే మిక్కిలి భక్తి గలదనియు నామనస్సును అనుసరించునదియేకాని యెంత మాత్రమూ స్వతంత్రవ్యాపారము లేనిదని నాకు బాగుగా తెలియును".

శ్రీరాముడు చెప్పిన ఈ మాటలు గీతలో శ్రీకృష్ణభగవానుడు 'శరణాగతి' సందర్భంలో చెప్పిన శ్లోకంలో ఎంత చక్కగా సంవది స్తోందో చూడండి (రాజవిద్యా రాజగుహ్యాయోగం, 9-21).

అనన్యాశ్చింతయంతో మాం యేజనాః పర్యుపాసతే।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్॥

అనన్యమైన చింతనతో సీత రాముణ్ణే సదా సర్వకాలమూ ధ్యానిస్తూ జీవించింది. అటువంటి భక్తురాలైన సీతను శ్రీరామచంద్రుడు ఉద్ధరింపక ఊరుకుంటాడా? ఇక్కడ రాముడుచెప్పిన "అనన్య హృదయాంభక్తాం" అన్నమాట "అనన్యాశ్చింతయంతో మాం" అని గీతావాక్యంతో సంవ దించి భగవంతుని ఆర్తత్రాణపరాయణత్వమనే కల్యాణగుణం బహుధా వ్యాఖ్యాతమవుతోంది.

సీత పాతివ్రత్య మహిమను గూర్చి రాముడింకాయిట్లంటున్నాడు.

ఇమా మపి విశాలాక్షీం రక్షితాం స్వేన తేజసా।
రావణో నాతి వర్తేత వేలామపి మహోదధిః॥
న హి శక్తస్స దుష్టాత్మా మనసాపి హి మైథిలీమ్।
ప్రధర్ష యితు మప్రాప్తాం దీప్తా మగ్నిశిఖామివ॥

నిజప్రభావం చేతనే సురక్షితయై యున్న విశాలాక్షియైన సీతను రావణుడు అతిక్రమింపజాలునా? సముద్రము చెలియలికట్ట నతిక్రమింప జాలనట్లు ఎంతమాత్రమూ అతిక్రమింపజాలడు. చెనకుటకైనా అలవికాని యీ సీతను దురాత్ముడైన రావణుడు మనస్సుచేతకూడా అతిక్రమిం పలేడు. మండుచున్న అగ్నిజ్వాలను ఎవడు స్పృశిస్తాడు?

రాముడు చెప్పిన పైమాటలు పతివ్రత లందరి విషయంలో నిజమై నవే. కృతయుగంలో వేదవతిగా, త్రేతాయుగంలో సీతగా పుట్టిన పతివ్ర తయే ద్వాపరయుగంలో ద్రౌపదిగా అవతరించింది. ద్రౌపది 'ఛాయాసీత' అనీ, 'స్వర్గలక్ష్మి' అని పురాణాలు చెబుతున్నాయి. 'ఛాయాసీత' ఎట్లేర్పడినదనగా రావణుడు పంచవటికి భిక్షార్థమై వచ్చినపుడు సీత పర్ణశాల లోపలికివెళ్ళి అగ్నిదేవుని ప్రార్థించి అగ్నిహోత్రుని సన్నిధిలో 'అసలు సీత' యుండిపోగా, ఆమె ప్రతిరూపము (Replica) 'ఛాయా సీత'గా బయటకి రాగా రావణుడామెను స్పృశించి తొడపై నిడికొని

పుష్పకమెక్కిపోయినాడని అధ్యాత్మరామాయణకథనము. ఈ 'ఛాయా సీత'యే అశోకవనమందలిసీత అనీ, తిరిగి రాముని పొందబోవునప్పుడు 'ఛాయాసీత' అగ్నిప్రవేశము చేయగా, అగ్నిహోత్రుడు 'అసలుసీత'ను తెచ్చి రామునికి సమర్పించినాడనీ, ఈ 'ఛాయాసీత' కొకవరమును దేవతలు ప్రసాదించిరని ఆమె ద్రౌపదిగా ద్వాపరమున అవతరించె నని అందుకే ద్రౌపది 'అయోనిజ'గా ద్రుపదుని యజ్ఞకుండమునుండి జనించుటలో రహస్యమిమిడియున్నదని పౌరాణికులు చెబుతారు.

మహా పతివ్రత, పంచపాండవ పత్నియైన ద్రౌపదిని కౌరవులు మాన భంగం చేయడానికి సమకట్టినపుడు వ్యాసుడు సరిగ్గా వాల్మీకి వ్రాసినట్టే వ్రాశాడు.

పాతివ్రత్యం పురస్కృత్య న శశాపవతీ తదా।
కౌరవాన్భస్మసాత్కర్తుం సమర్థా అపి ద్రౌపదీ॥

పాతివ్రత్యాన్ని పురస్కరించుకొని ద్రౌపది కౌరవులను శపించలేదు. వారిని భస్మీపటలము చేయగల పాతివ్రత్య మహిమ ఆమెలో లేకపోలేదు. సీత మండే అగ్నిజ్వాల అయితే ద్రౌపది నివురుగప్పిననిప్పు! వారిని దురు ద్దేశంతో బలాత్కరించినవాడు దగ్ధపటలమైపోతాడు. ఇంతకీ రావణుడు సీతనెందుకు బలాత్కరింపలేకపోయాడో అతని మాటల్లోనే విందాం!

శప్తోఽహం వేదవత్యాచ యదా సా ధర్షితా పురా।
సేయం సీతా మహాభాగా జాతా జనకనందినీ॥
— యుద్ధకాండ సర్గ. 60-శ్లో.10

పూర్వం నేను వేదవతిని బలాత్కరించినప్పుడు ఆమె నన్ను శపిం చింది. మహాభాగురాలగు ఆ వేదవతియే యిప్పుడు జనకపుత్రి సీతగా పుట్టినది. అనగా ఆనాడు యోగాగ్నిదగ్ధమైన వేదవతియే సీతగా పుట్టి తన ప్రతిజ్ఞ నెరవేర్చుకొన్నదన్నమాట!

## 51. రావణుడి మరణానికి లక్ష కారణాలు

"అరయంగా కర్ణుడీల్గె ఆర్గురిచేతన్" కర్ణుని మరణానికి భూతులు ఆర్గురని మహాభారతకథనం. ఆవిధంగా చూస్తే రావణుడి మరణానికి సీత ఒక్కతే కారణంకాదు. ఇంకా ఎందఱో ఉన్నారు.

ఉమానందీశ్వర శ్చాపి రంభావరుణకన్యకా।
యథోక్తా స్తపసా ప్రాప్తం నమిథ్యా ఋషిభాషితమ్॥

పార్వతి, నందీశ్వరుడు, రంభ, వరుణునికుమార్తె పుంజికస్థల వీరలశాపాలేగాక, తపఃప్రభావయుతులైన ఋషులవచనాలు అబద్ధంకాలేదు.

ఎంతశివభక్తుడైనా ఆ శివుని ప్రక్కనే ఉన్న అతని అర్థాంగి పార్వతీదేవిని కోరిన రావణుడు — కాముకుడైన శివభక్తుడు!

పార్వతీ పరమేశ్వరు లొకసారి ఏకాంతవాసంగా కైలాసంలో ఉండగా రావణుడు ప్రవేశించడంచూచి ద్వారపాలకుడైన నంది ఆతనిని అడ్డగించినాడు. రావణుడు కోపగించుకొని నందిని "ఓయీ కోతిమొగము వాడా" అని ప్రక్కకు త్రోసాడు. అప్పుడు నంది రావణునిట్లు శపించాడు. 'ఓరీ దుష్టుడా! ఒక కోతి చేతనే నీలంక నీవు సర్వనాశనమవుతారు.

బ్రహ్మాస్త్రమునకు కట్టుబడిన హనుమను, ఇంద్రజిత్తు రావణసభలోనికి పిలుచుకొని వచ్చినప్పుడు —

కిమేష భగవాన్నందీ భవేత్సాక్షాదిహాగతః।
యేన శప్తోఽస్మి కైలాసే మయా సంచారితే పురా॥
— సుందరకాండ (50-2)

ఇదేమి? భగవంతుడైన నందీశ్వరుడే యిట్లీ రూపమున వచ్చెనా యేమి? పూర్వమునేను కైలాసమున చేసిన ఆజ్ఞోల్లంఘనమునకు శపింపబడితినికదా! అని తలంచెను.

తన ప్రియుడైన నలకూబరుని అభిసరించు రంభను, వరుణుని కుమార్తె పుంజికస్థలను మానభంగము కావింపగా వారిర్వురు శపించిరి. తపస్సంపన్నులైన ఋషుల యజ్ఞకుండములు ధ్వంసముగావించి వైదిక మత వ్యతిరేకమైన ఆసురీ శక్తులను ప్రయోగించుటచే ఆ ఋషులెల్ల రావణనాశమునకై బద్ధకంకణులై రాముని శరణుజొచ్చినారు.

కృతయుగంలో వేదవతి తపస్సుచేసికొనుచుండగా ఆమె సౌందర్యమునకు ముగ్ధుడైన రావణుడు ఆమె కేశముల స్పృశించి బలాత్కరించినాడు.

రావణేన గృహీతాయాః కేశేషు ద్విజసత్తమాః।
తద్వ్యధాయ చ సా ప్రాణాన్ ముముచే శోకకర్శితా॥

తతో జాతాగృహే రాజ్ఞో జనకస్య మహాత్మనః।
సీతా నామేతి విఖ్యాతా రామపత్నీ పతివ్రతా॥
సా హృతా రావణేనాహ వినాశాయాత్మనః స్వయం।
రామేణ రావణం హత్వా అభిషిచ్య విభీషణమ్।
సమానీతాగృహం సీతా కీర్తి రాత్మవతా యథా॥
— వామన పురాణే సరోవరమాహాత్మ్యే అధ్యా. *16, 10-12* శ్లో.

రావణుడు వేదవతి కేశములను పట్టుకొనగా ఆమె వానిని శపించి యోగాగ్నిదగ్ధయైనది. ఇది సరస్వతీ నదీతీరమున జరిగిన సంఘటన. వేదవతియే సీతగా అవతరించినది. వేదవతీ వృత్తాంతము వామనపురాణమున, దేవీ భాగవతమున, బ్రహ్మవైవర్తపురాణమున, విష్ణుధర్మోత్తరమున, స్కాందపురాణమున చెప్పబడియున్నది.

వాల్మీకి రామాయణమున రావణుడు సీతను "కరాంతమిత మధ్యాసి సుకేశీ సంహతస్తని!" అని సంబోధించుచు—

సతామసిత కేశాంతాం భాస్కరస్య ప్రభామివ।
వసనా భరణోపేతాం మైథిలీం రావణోఽబ్రవీత్॥

క్రోశంతీం రామరామేతి రామేణ రహితాం వనే।
జీవితాంతాయ కేశేషు జగ్రాహాంతక సన్నిభః॥

ప్రధర్షితాయాం సీతాయాం బభూవ స చరాచరం।
జగత్సర్వ మమర్యాదం తమసాఽంధేన సంవృతమ్॥
— అరణ్యకాండ *46* సర్గ-*21* శ్లో *49-11, 52-9,10*

దీనికి వరుసగా తిలక, శిరోమణి, భూషణ వ్యాఖ్య లిట్లున్నవి.

"భాస్కరస్య ప్రభామివ తస్యా అపి పర్యంతే శ్యామరూపతాయా శ్చాందోగ్య ఉక్తిః। జీవితాంతాయ అనేక పరస్త్రీ కేశస్పర్శోయస్య కస్యాపి జీవితాపహారీతి బోధితమ్।" — తిలకవ్యాఖ్య

"అసిత కేశామిత కృష్ణకేశ విశిష్టామిత్యర్థః। రామేణ రహితాం అత ఏవ రామరామేతి క్రోశంతీం సీతాం అంతకసన్నిభో రావణః జీవితాంతాయ స్వజీవన విధ్వంసాయ కేశేషు జగ్రాహ।
— శిరోమణివ్యాఖ్య

"అసిత కేశాంతాం నీలకేశాగ్రాం కేశాగ్రే పైంగలం దుర్లక్షణమ్।
భాస్కరస్య ప్రభామిత్యనేన దుష్ప్రసహత్వ ముచ్యతే వననేత్యాదికా దుస్త్యజత్వ ముచ్యతే" —భూషణవ్యాఖ్య

రామాయణకల్పవృక్షంలో ఈఘట్టం యిలా చిత్రింపబడింది.

"అంత రావణుడు సీత వెంటనంటి యామె మూర్ధజాకర్షణంబున పర్ణశాలా పురోపదేశంబునకు దేగా—

॥విపుల॥ ఈ దీర్ఘవేళ గౌసల్యాదేవత దీవనల బలంబుచెడెన్
గాదేని యసుర యొక్కడు నాదౌ జడముట్టగలుగునా వీడై

వ॥ అమ్మయ్యో! వీని వంగడపు గుదుళ్లు కూలిపోను. తలవెంద్రు-కల కుదుళ్లు వీనిచేతిలోనికి బెగిలివచ్చునేమో! అయ్యో! మహాక్రతు పరిమోదరేఖా నిశ్చలస్థితుడైన నాతండ్రి జన్నంపు నాగలి కట్టుకూడ గిసికొనిపోని నా తలకట్టు వీని నఖంబుల వ్రచ్చునేమి?
—అరణ్య-జటాయుః 82, 87, 90

మహాభారతంలో దుశ్శాసనుడు ద్రౌపది కేశపాశములను లాగినప్పుడు "....పావనములైన శిరోజములందెమల్చి పాపావహా డీడ్చి తెచ్చె" అని తిక్కన వ్రాసినాడు. సభాపర్వంలోని ఈ విషయంలో ఉద్యోగ పర్వంలో మరల స్మరింపబడింది.

ఇక మహావిష్ణువు మానుషజన్మయే యేల ఎత్తవలసివచ్చినదనగా దీనికి రావణుడే యిలాసమాధానం చెబుతున్నాడు. బ్రహ్మచేత అనేక విధాలుగా చావునుండి తప్పించుకునే వరంపొందిన రావణుడు మనుష్యజాతిని మరచిపోయాడు.

అవధ్యత్వం మయాప్రాప్తం మానుషేభ్యో న యాచితమ్।

అప్పుడు బ్రహ్మ యిలా అన్నాడు—

మానుషేభ్యో విజానీహి భయం త్వమితి తత్తథా।

నీకు మనుష్యులవల్ల భయం కలుగుతుంది అన్నాడు బ్రహ్మ. భయమే మృత్యువు. మృత్యువే భయం. భయమే మరణానికి మూలహేతువు. ఆ హేతువును పట్టుకొని రాముడు సేతువుకట్టి రావణుణ్ణి చంపాడు. దీనికి ఒక బలమైన కారణాన్ని రావణుడే యిలా ఏకరువు పెట్టాడు.

"పూర్వం ఇక్ష్వాకు వంశజాతుడైన అనరణ్యుడు నాచే వధింపబడు నప్పుడు రాక్షసాధమా! కులాధమా! దుర్బుద్ధియైన రావణా! నిన్ను యుద్ధంలో పుత్రమంత్రి బలాశ్వ సారధి సహితంగా వధించే పరమ పురుషుడొకడు నావంశంలో జన్మిస్తాడు" అని ప్రతిజ్ఞచేశాడు. దశరధ పుత్రుడైన ఈ రాముడే ఆ మహాపురుషుడని తలుస్తాను."

రాముడెంత అవతారపురుషుడైనప్పటికీ, ఆసురీశక్తి పేరుకొని, కరుడుగట్టి, రాటుదేలి, యుద్ధవిద్యలో ఆరితేరిన రావణాసురుని ధాటికి తట్టుకోలేకపోయాడు. రావణుడెంత వేదపండితుడో అంత భండనపండితుడు కూడా. రావణుని మాటల్లోనే చెప్పాలంటే— మమ చాప మయీాం వీణాం శరకోణైః ప్రవాదితాం" ధనుస్సును బాణాలతో వీణలాగా అవలీలగా మీటుతూ హేలగా (యుద్ధంలో శత్రువుల్ని) వాయిం చేస్తాను. అని చెప్పిన రావణుని శక్తి అసామాన్యమైనది. శ్రీరామునికి సర్వఋషుల ఆశీర్వాదబలమున్నది. వారు తమ తపస్సంతయు ధార వోసి యిచ్చిన అస్త్ర శస్త్ర సంచయమున్నది. కాని మాయావిశక్తులు, ఆసురీవిద్యలు రామునికడలేవు.

"శ్రీరామచంద్రుని ధనుర్హస్తకమే ఆజ్ఞాచక్రం" అనే శీర్షికలోను, "శ్రీరామునికోదండమే శివుని పినాకం" అనే శీర్షికలోను రాముని ధనుస్సును యోగశాస్త్రపరంగా సమన్వయించటం జరిగింది. అది గుప్త విద్య. ఇక్కడ అవతార రహస్యంతో సమన్వయించబడుతుంది.

*ప్రభు మహోయుధ మూలవిరాట్టు కదలి*
*కూడి విజయేందిరోగ్ర భ్రూకుటి యనంగ*
*విధృతమై లస్తకంబున వెడలివచ్చె*
*స్వామి భుజలంబమానమై శార్ఙ్గ ధనువు* —బాల-అవతార-4వ.

శ్రీమన్నారాయణుని ధనుస్సుపేరు శార్ఙ్గం. శివుని ధనుస్సుపేరు పినాకం. ఒకరు శార్ఙ్గపాణి కాగా మరొకరు పినాకపాణి. రామావతారంలో శార్ఙ్గపాణి— కోదండపాణిగా అవతరించవలసియుండగా అవతరణవేళ అతడే యితడని ఋషులు, దేవతలు ఎలాగుర్తుపట్టగలిగారు? అవతారమంటేనే వివర్తమని అర్థం! ఆత్మవస్తు వివర్తరూపమే రామాయణ కల్పవృక్షం కాబట్టి నారాయణుడు, రాముడుకాగా, శార్ఙ్గం కోదండ మయింది. అయోధ్యకాండ మొదలుకొని యుద్ధకాండవరకు రాముని రూపమెట్టిది? తాపసిరూపం! ఆరూపం ఏనాటిది? రామకథలో

తదౌచిత్యమెంత రమణీయంగా ఉందో ఈపద్యమే వ్యక్తీకరిస్తోంది.

తన బహుకల్ప నిత్యమగు తాపసిరూపున వచ్చియున్న శా
ర్ఙ్గిని తొలివెల్గుబొట్టు, బదరీవనిలో ముదిచెట్టుక్రింద ప
చ్చని వెలుగొౌచు వచ్చుటను శార్ఙ్గ ధనుశ్చటులోగ్రశృంగ గుం
ఫనములు లేనిచో గుఱుతు పట్టియ యుండరు సర్వదేవతల్
— బాల-అవతార- 5 ప.

దశరథుని పుత్రకామేష్టి సమయంలో నిత్యమైన తాపసిరూపంలో నారాయణుడు అవతరించడం— సీత అరణ్యకాండలో రామునితో చేసిన "వాగ్వాదం"— తత్పూర్వఘట్టంలో రాముడు తపస్విజనులకిచ్చిన 'వాగ్దానం' తటుక్కున మెరుస్తోంది! "తొలి ముని బుజమ్ముపై నొప్పె తొలిధనుస్సు" (బాల అవతార-7 ప.) ఆ ధనుస్సే ఈ ధనుస్సని అది తనవలె 'అనపాయిని' యని 'వేదవతి' యైన సీతకు తెలియదా ఏమి? మరి రాముని 'ధర్మనిష్ఠ'ను పరీక్షించడానికి సీతపెట్టిన పరీక్షలో 'ధనుస్సు' ప్రధాన స్థానమాక్రమించడంలో 'రామోవిగ్రహవాన్ ధర్మః' 'రామోద్విర్నాభిభాషతే' అన్న మహర్షివాక్యాలు బహుధావ్యాఖ్యాతమౌతోంది' ఈవాగ్దానం యిప్పటిదికాదు! నారాయణుడుగా వైకుంఠంలో చేసినవాగ్దానమే మరలా యిక్కడ అవతారవేళ పునరావృత్తమయింది. దీన్నే "జ్ఞాపకం" అనవచ్చు!

ధనుష్ఖండంలో రాముడు శివధనుస్సు విఱిచినవేళ వెలువడిన నాదం ఐదుపద్యాల్లో వర్ణింపబడింది. ఇది అవతార ప్రయోజన సూచకం! (బాల-ధనుస్సు 301-305 ప.) ధనుః కల్యాణ ఖండాలలో ధనుః ప్రాధాన్యం కొంత వివేచించుకొన్నాము. అరణ్యకాండ-దశవర్ష ఖండంలో ధనుస్సుకథ గ్రంథాంత వ్యాసంలో చూడబోతున్నాము. ఈ ధనుస్సే యుద్ధకాండ సంశయఖండంలో ఎలావుందోచూద్దాము.

*కోటిం గూర్చిన యల్లెత్రాడుగను గైకోలస్తకం బందునన్*
*జ్యాటంకారము చేసె రాముడు.... (203 ప.)*

"మమ చాపమయీం వీణాం శరకోణైః ప్రవాదితాం" అని రావణాసురుడు యుద్ధకాండలో చెప్పగా తత్పూర్వమే రాముడు

*"వింటి లస్తకము వంచియు వంచక యల్లెత్రాడునం*
*గదలిక ప్రక్కగా జెదరగానొక నేరుపు మీటు మీటి"నాడు.*
*వరగబుద్ధియందు బ్రత్యగ్రమైయున్న* — *204* ప.
*శార్ఙ్గకంఠరవము సంతరించి*
*మృదులరీతి వీణ మీటినయట్లుగా*
*నార్చె రామచంద్రు డల్లెత్రాడు* — *207* ప.

"శార్ఙ్గకంఠరవము సంతరించి" అన్నమాట అవతార రహస్య సూచకం! రావణపరంగా వాల్మీకిచెప్పిన మమచాపమయీం వీణాం — 'వీణ మీటినయట్లుగా' — రాముని పట్లనే సార్థకమౌతున్నదని మహాకవి విశ్వనాథ తీర్మానము. "న శక్నోతి బాణమాదాతుం తూణేరాద్రఘు నందనా" అన్నమాటలు రావణుడు ఖడ్గరావణుడై విజృంభించినప్పటి స్థితియని విశ్వనాథ సమన్వయము, అప్పుడు రాముడు 'పరాశక్తి'యే యైనాడు! ఈ వినూత్నఅపూర్వధ్వని విన్న లక్ష్మణుడే ఆశ్చర్యచకితు డైనాడు

*ఈ వరమోద్యన్నవ రావమున్ విని ప్రభు ప్రావీణ్యధారానిరం*
*తర నూత్నత్వము నందుగాంచె దశకంఠచ్ఛేదనారంభమున్*
— *208* ప.

పద్మకల్పంలో శివుడు పినాకంవార్చి సేతువు సంతరించినట్లుగా, మహాకవి విశ్వనాథకల్పనలో బాలకాండలో కనబడి వినబడిన శ్రీరాముని ధనుష్టంకారం యుద్ధకాండ చివరి వరకు ఎలా ప్రసరించిందో చూడ వచ్చును.

*"అల్లెత్రాటి వినదంబులుదార మనోజ్ఞగీతికా స్వానమువోలె"*
*"రఘువరు జ్యానినాద మధురధ్వనులన్ వినుచున్"*
*"జ్యానినాదంబు ధారా కచ్ఛపీనాద సుందరము"*

ఈ 'జ్యానాదం' రక్షసుల ప్రాణాలకు హాయిగా, తీయగా 'భీదాయి'గా విన్పింపగా, కపులకు అఘుతతి నుండి క్రమంగా ముక్తుల్తిచేస్తూ యుద్ధో త్సాహాన్ని కల్గిస్తోంది!

*వాల్మీకేర్మని సింహస్య కవితావనచారిణః।*
*శృణ్వన్ రామకథానాదం కోనయాతి పరాంగతిమ్॥*

మునిసింహుడైన వాల్మీకి రామకథానాదమే శ్రీరాముని ధనుష్టంకారం!

యజ్జ్యానినాద శ్రవణాత్సురాణాం చేతాంసి నిర్ముక్తభయాని సద్యః।
భవంతి దైత్యాశని బాణవర్షి శార్ఙ్గం సదాహం శరణం ప్రపద్యే॥

"సంగరమందు రావణుని సంహరించవలెనని రాముడు నిశ్చయించినాడు." ఆ సంకల్పం రావణునికెలా తెలిసిందో—

"రావణుండు ఖడ్గరావణుండయ్యెను" —యుద్ధ-నిస్సంశయ-375ప.

కం॥ అంతట నిరస్త్రకంబుగ
గుంతమ్ములు ప్రాసములును గోలలు పరిఘల్
వింతగ బట్టిసములును ధ
రాంతమ్ముగ నెసగె దిక్చయాంతంబుగనై 376 ప.

మ॥ కదలెన్ మిన్నులు భూమి క్రక్కదలె నింకన్ వార్ధులల్లాడె నీ
చదలీ ధారుణిభాగ మీకడలి నాగా లేక శేషించె న
న్నది లేకుండగ ఖడ్గరావణ మహోనాగోగ్ర దంష్ట్రానలో
న్మద కాకోలము మండబెట్టదొడగెన్ నాళీకగర్భాండమున్ 377 ప.

ఎవరీ ఖడ్గరావణుడు? రావణుడు ఖడ్గరావణుడెలా అయ్యాడు? దానిచే వాడు సాధించిన అప్రతిమాన శక్తులేవి? వీటన్నిటికీ సమాధానం 'సీతాయాశ్చరితం మహత్' అనే ఉపన్యాసంలో విశ్వనాథ వారే యిలా సెలవిచ్చారు.

"శ్రీవిద్య అని ఒకవిద్య ఉంది మనదేశంలో, ఆ విద్యలో అయిదు ఆమ్నాయాలున్నాయి. ఆమ్నాయమంటే కొన్ని మంత్రముల సంపుటి. ప్రాగామ్నాయం, దక్షిణామ్నాయం, పశ్చిమామ్నాయం, ఉత్తరామ్నాయం, ఊర్ధ్వామ్నాయం అని అయిదు సంపుటీకృత మంత్రాలు. ఈ మంత్రాలన్నీ ఓంకారం లోనివే. ప్రణవమే యిలా పరచుకొనివుంది. దక్షిణామ్నాయ మంతా విష్ణుమంత్రాలు. ఈ రీతిగా ఉన్నది మంత్ర సమామ్నాయం. కాగా శ్రీవిద్యాపరమరహస్యమంత్రాలన్నీ సంపుటీకరించుకొని 'కామకళా విలాసమ్' అని ఒక మహాగ్రంధమున్నది. అది శ్రీవిద్యకు బైబిల్ లాంటిది. అద్వైతసిద్ధాంతానికి తల్లి లాంటిదా పుస్తకం. మన తెలుగు దేశంలో సంప్రదాయ సిద్ధంగా మూడే మంత్రాలున్నాయి. శ్రీదేవీ మహామంత్ర దక్షిణామ్నాయ మంత్రత్రయమే ఉన్నది.

మొదటి మంత్రంపేరు దత్తాత్రేయమంత్రం. రెండవది ఖడ్గరావణ మంత్రం. మూడవది బేతాళమంత్రం. దేవీస్తోత్ర రత్నావళి తీసి చదివితే అందులో దేవీఖడ్గమాలాస్తోత్రమని ఉంది.

"తాదృశం ఖడ్గమాప్నోతి యేన హస్త స్థితేనవై
అష్టాదశ మహాద్వీప సమ్రాడ్భోక్తా భవిష్యతి"

ఎవడు ఈ ఖడ్గమాలాశక్తికి దేవతయైనటువంటి అమ్మవారిని కొలుస్తాడో వాడు సప్తద్వీపయైన వసుంధరకు సామ్రాజ్యం వహించేటటువంటి ఖడ్గమును పొందుతాడని దీని అర్థం. అదే ఖడ్గమాలాస్తోత్రం. ఏమంటుందో జాగ్రత్తగా చూడండి. 'తాదృశం ఖడ్గమాప్నోతి' అని ఉన్నది. అదిపొందాడు రావణాసురుడమ్మవారినుండి. **అప్పటినుండే రావణాసురునకు ఖడ్గరావణుడనిపేరు.** వాడంతేకాదు. రావణాసురుడెటువంటివాడంటే వాడొక మంత్రాధిదేవత కూడా. ఇక్కడొక చిన్నరహస్యం. భారత, భాగవత, రామాయణాలున్నాయి. పురాణాలున్నాయి. అనేక మంది మహానుభావులు, ఋషులు ఉన్నారు. వసిష్ఠుని ప్రార్థించేందుకు వసిష్ఠమంత్రం ఎక్కడన్నాఉందా? చెప్పండి. విశ్వామిత్రుని ప్రార్థించేందుకు విశ్వామిత్ర మంత్రముందా? లేదు. కానీ ఖడ్గరావణమంత్రముంది. ఇంత పురాణజగత్తులోను రెండే రెండు మంత్రాలున్నాయి. ఒకటి ఖడ్గరావణమంత్రం రెండవది కార్తవీర్యార్జునమంత్రం. ఖడ్గరావణమంత్రం జపిస్తే రావణాసురుడు ప్రత్యక్షమౌతాడు. ఇట్లా వాడొక మంత్రాధి దేవతన్నమాట! అంతేగాని రావణుడంటే మజాకాదు. అట్టి రావణాసురుడు రాముణ్ణి యుద్ధంలో చచ్చేట్టుగా కొట్టాడు. వాల్మీకి ఏమన్నాడో చూడండి— "న శక్నోతి బాణమాదాతుం తూణీరాద్రఘునందనా" రావణుని ధాటికి రాముడు అంబులపొదినుండి బాణములను తీసికొనుటకు కూడా శక్తిలేనివాడయ్యెను. అట్లాకొట్టాడు రావణుడు. మరివాడు సామాన్యుడా?"

"అమ్మవారి ప్రయాణం రామాయణం! ఆ రావణాసురుని అమ్మవారెందుకు వధించవలె? ఈ రావణాసురుడు మహారాక్షసుడు!మంత్రాధిదేవత! లోగడ చెప్పిన మూడు ప్రసిద్ధమంత్రములలో రాజసగుణ సర్వస్వమూ మూటగట్టిన విష్ణుమూర్తిదశలో నున్న ఖడ్గరావణ మంత్రాధిదేవత! కాబట్టి రావణుడు విష్ణుమూర్తిలో మూడవభాగం! అప్పుడు రావణాసురుడొక అవతారం! ఈ ఖడ్గం వీడిచేతికి వచ్చిందిగా! సప్తద్వీపవసుంధర వీడిసామ్రాజ్యం! తన కన్నా మగవాడు లేడనుకున్నాడు.

విష్ణుమూర్తి తనకన్నా గొప్పఏమిటని పుట్టింది వీడికి! అసలు రామాయణరహస్యం యిది. శివునికి మెడకాయలు కోసియిచ్చిన వాడు వీడు. అమ్మవారికి పరమభక్తుడు. తల్లి ఖడ్గం ప్రసాదించింది. ఇంతకీ రావణాసురునికి తెలియనిదేమంటే, ఆతల్లికీ, తక్కినస్త్రీలకు భేదములేదని తల్లియొక్క అవతారములే సర్వస్త్రీలు అని. ఈ సృష్టిలోనే సగము ఆడది, సగము మగవాడు అని ఎప్పుడు?' బహుస్యాం ప్రజాయేయేతి'అన్న సంకల్పం జరిగినప్పటినుండి. ఆ బ్రహ్మపదార్థం సృష్టిగా పరచుకొన్నప్పుడు తాను సగంగా విభక్తమయింది తల్లి. అందుచేతనే వేదవతిని తత్పూర్వం కోరాడు. ఆ లక్ష్మీదేవియే సీతగా పుట్టిందని వాడికి తెలుసు. సీతాదేవి సాక్షాత్ పరమేశ్వరియొక్క అంశ అనితెలుసు. సీతాదేవిని గనుక వశంచేసికొంటే విష్ణుమూర్తికి సున్నకు సున్న! హళ్లికి హళ్లి! ఇదేమి భావము? ఎందుకురా! అంటే బ్రహ్మప్రళయములు, విష్ణుప్రళయములు, రుద్రప్రళయములు అని వింటూవుంటాము. బ్రహ్మదేవుడున్నాడు. చతుర్దశ మన్వంతరాలున్నాయి. ఒక్కొక్క మన్వంతరాని కొక్కొక్క బ్రహ్మ, ఒక్కొక్క విష్ణువు, ఒక్కొక్క రుద్రుడు, ఒక్కొక్క యింద్రుడు యిలా వుంటుంది సృష్టి!

ఇక్కడ రావణుని ఎత్తుగడ ఏమంటే తాను భవిష్యద్విష్ణు పదాన్ని అధిష్ఠించాలనీ, అలాకావడానికి వైష్ణవీశక్తియైన అమ్మవారిని తనవశం చేసికోవాలనీ వాడిపన్నాగం! దానికి వాడేం చేయాలనుకొన్నాడంటే రాముణ్ణి—విష్ణ్వవతారుడైన రాముణ్ణి—తొలగిస్తే ఆస్థానాన్ని తాను స్వీకరించి శక్తిసహితుడై ఈసృష్టిని అసురీశక్తితో నింపివేయాలనివాడి సంకల్పం! అందుకే వాడీ పన్నాగంలోని భాగంగా సీతను అపహరించాడు.

వాడు పులస్త్యబ్రహ్మ (బ్రహ్మమానసపుత్రుడు) మనుమడు. బ్రహ్మదేవుని మనుమడుకదా! బ్రాహ్మణుడు కాబట్టి తపోమార్గమున దానిని సాధించి భవిష్యద్బ్రహ్మకావచ్చునుకదా యన్నచో రావణుడు రజోగుణసముద్భూతుడై అసురసంధ్యవేళ జన్మించినవాడవటం మూలాన బ్రహ్మసంబంధమైన సాత్త్వికగుణములోపించి, క్షత్రియోచితమైన రజోగుణత్వము మెండుగా గలవాడగుటచే బ్రహ్మపదవికంటె, రజోగుణము గల విష్ణుపదము నధిష్ఠించుటకు శివుని ఆశ్రయించినాడు. అసురులు రాక్షసులు, శివభక్తులుగదా! ఆ మార్గమున సూక్ష్మములో మోక్షమన్నట్లు సులువుగా అమ్మవారిని మెప్పించి ఖడ్గమును పొంది, లక్ష్మీదేవి అపరావతారమైన సీతను వశపరచుకొని వైష్ణవీశక్తిని సాధించి, విష్ణుస్థానీయుడైన రామునివధించి భవిష్యత్కల్ప విష్ణువుకావాలని ఆకా

సానికి నిచ్చెనలు వేశాడు. తల్లివాడి ప్రణాళికను పసిగట్టింది. వాడు వేదవేత్తయైనా బ్రహ్మద్వేషి. యజ్ఞయాగాదులకు వ్యతిరేకి. సాత్త్వికగుణ మహత్త్వముతెలియని వాడు. దానిని బలహీనత క్రింద జమకట్టు అవి వేకి. స్త్రీలంపటుడు. కనబడిన సౌందర్యవంతులైన స్త్రీలందరూ తన సౌఖ్యానికే అనుకొనే రావణుని అంతర్యమేమిటనగా సృష్టిని రజోగుణ, తమోగుణములచే నింపినగాని తన భవిష్యద్విష్ణు పదత్వమునకు భంగ మురాకుండ నుండునని. ఇక్కడనే తల్లి వానిని బోల్తాకొట్టించినది. వాని రజోగుణమే వాని వినాశనహేతువైనది.

శ్రీమద్రామాయణ కల్పవృక్షం, యుద్ధకాండలో రావణాసురుడు చనిపోతూ ఒక విచిత్రమైన స్ఫూర్తిని పొందుతాడు. అది "చావు తెలివి" అనుకోవచ్చునేమో! ఆ జ్ఞానోదయలక్షణాన్ని విశ్వనాథ వారిలా వర్ణించారు —

చ॥ ఇతనికి దేవికిం దనరు నింతటి భేదము, స్వ్యాతభావనా
తతముగ దేవియే యితడు తానగు, నన్నువధింప బ్రహ్మనా
గతమగు దీప్తికాదొలి వికారము నందలి తేజమౌచు న
చ్యుతుడును దాను దేవియు, త్రిశూలియు, నందఱునైన
చోటునన్ — యుద్ధ-నిస్సంశయ. 384 ప.

'ఇతనికి' అంటే శ్రీరామచంద్రునికి. రామునికి దేవికి అభేదప్రతి పత్తి. ఆదేవి ఎవరు? (దేవీమాహాత్మ్యంలో చెప్పబడిన)

త్వం వైష్ణవీశక్తి రనంత వీర్యా విశ్వస్యబీజః పరమాసిమాయా।
సమ్మోహితం దేవిసమస్త మేతత్ త్వం వై ప్రసన్నాభువిముక్తి హేతుః॥

అనంతవీర్యముగల వైష్ణవీశక్తియే దేవి! ఆమె యిక్కడ పార్వతీదేవియొక్క పరాశక్తిత్వమును కలుపుకొని 'సీత'గా అవతరించినది. దేవి మానుషమైన పురుషరూపం దాల్చివచ్చిరావణుణ్ణి సంహరించింది. ఇది నిత్యమైన చైతన్యభావన! ఈ భావనాతాదాత్మ్యము రావణునికి మరణాసన్నపు క్షణములలో హఠాత్తుగా స్ఫురించినది. ఈ స్ఫురణకు ఆధారమెక్కడిది? మహాకవి విశ్వనాథ దీనిని కులార్ణవతంత్రమందలి ఉపాసనాస్తబకంలోని శ్రీదుర్గాదకారాది సహస్రనామస్తోత్రమునుండి గ్రహించినట్లు తెలుస్తోంది.

దశశీర్ష వధోపాత్త శ్రీరామచంద్ర రూపతా।
దశశీర్ష రాష్ట్ర దేవీ దశ శీర్షారిసారిణీ॥ (127 వనామం)

శ్రీరాముడు లలితోపాసన చేసియే రావణుణ్ణి సంహరించాడు. ఎందుకంటే మండోదరి దేవీ భక్తురాలు 'దశశీర్ష వధూప్రియా' అని దుర్గాసహస్రనామము.

ఆదిపరాశక్తియే తన శక్తిని మూడుగా విభజించి బ్రహ్మ విష్ణు మహేశ్వరులను సృష్టించినది. ఆదిపరాశక్తి యొక్క తనయులే త్రిమూర్తులు. వారికి స్త్రీ మూర్తులను ఆమెయే కల్పించినది. రావణుని కుట్ర మూలభూతమైన శక్తికే తగులునట్లున్నది, కావున తల్లి ఆజ్ఞ చొప్పన వేదగత తత్త్వము-వేదవతి అవతరించగా రావణుడామెను చెనకినాడు. వేదవతి-సీతయై-భూమిలో నుండి వెల్వడినది. వాడామెను తస్కరించి, రాముని వధింప నెంచినాడు. రాముడే విష్ణువని వానికి తెలియజేయాలని 'సీత' వేదగత తత్త్వశక్తి యైనప్పటికీ రాముని ఆజ్ఞలేదని వూరకుండినది. రాముడేవచ్చి చంపునప్పుడు ఆ రాముని యుద్ధప్రతాపము చూచి రావణుడు పరాశక్తిని స్మరించినాడు. ఈ స్ఫురణ వాని సంస్కార సూచకము. అప్పటికన్ని మించిపోయినది. చేతులు కాలిన పిమ్మట ఆకులు పట్టుకొని ఏమిలాభము?

రాముడు బ్రహ్మాస్త్రముతో రావణుని సంహరించినాడు. బ్రహ్మాస్త్రము పైతామహమైన అస్త్రము. తన పితామహుడైన బ్రహ్మయొక్క అస్త్రశక్తియే రావణుని మరణానికి హేతువగుట దుఃఖకరము! ఆశ్చర్యకరముకూడ. ఎందుకనగా, బ్రహ్మభావనలో నిమగ్నము కావలసిన రావణుని జీవుడు, సాత్త్వికబ్రహ్మవిద్యను గౌరవించవలసిన వేదవిద్యావేత్త — సప్తద్వీపవసుంధరాచక్రవర్తిగా, సాత్త్విక లక్షణమును కాలరాచవలెనని కంకణముకట్టుకొన్నప్పుడు ఆ బ్రహ్మత్వమే బ్రహ్మాస్త్రమై వాని గుండెలను చీల్చినది. సర్వగుణ సమాదరణము చక్రవర్తికి ఉండవలసిన ప్రథమగుణము ప్రధానగుణము. అది లేని రావణుడు అంధతమస లోకముల చేరినాడు. అనగా నామరూపములు కోల్పోయినాడు.

"వేదగతార్థము శక్తి యోచు బొల్చిన తొలి శక్తివచ్చినది." 'చేసెదు స్వామికి దప్పు దెప్పుడున్' తల్లి ఆజ్ఞను పరిపాలించేవాడే రాముడు. వేద తత్త్వము శక్తి — పార్వతి వంటిది. లక్ష్మీసరస్వతుల వంటిదికాదు. వేద పండితుడైన రావణుడు వేదతత్త్వ వ్యతిరేకి. కావున పండితుడుగా వానిపై ఎంత గౌరవమున్ననూ, వాని దురభిమానము శిక్షింపదగినది గావున సర్వసృష్టి మూలహేతువగు బ్రహ్మాస్త్రముతో చంపించినది. అనగా వేదతత్త్వము బ్రహ్మాస్త్రము వంటిది. సృష్టితత్త్వమునే మార్చవలెనని సంకల్పించిన రావణునికి వేదతత్త్వము అవిదితబ్రహ్మపదార్థమును,

సృష్టికభిముఖమైన బ్రహ్మపదార్థమును విదితమొనర్చు చున్నదన్న పరిజ్ఞానము లేకపోయినది. పైగా వాడా తత్త్వమును తనలో కలుపుకొనవెంచినాడు. అక్కడ శిక్షార్హుడైనాడు. 'నా రాముడు' పుట—

ఏ దేవియైతే తనకు ఖడ్గమిచ్చినదో ఆదేవియే వేదమాతయని, పరాశక్తియని తెలియని రావణుడు ఆమెనే వశపరచుకొని సృష్టితత్త్వాన్ని తల్లక్రిందులు చేయాలని సంకల్పించగా ఆ వేదశక్తి వైష్ణవీతేజస్సుతో కలసి అవతరించి పురుషరూపంగా వానిని వధించినది.

ఈ పరాశక్తి తత్త్వం అర్థం కావలెనంటే సౌందర్యలహరిలోని—

అతస్త్వా మారాధ్యాం హరి హర విరించాదిభిరపి
ప్రణంతుం స్తోతుం వా కథమకృత పుణ్యః ప్రభవతి

తనీయాంసం పాంసుం తవచరణ పంకేరుహ భవం
విరించిః సంచిన్వ న్విరచయతి లోకానవికలం।
వహత్యేనం శౌరిః కథమపి సహస్రేణ శిరసాం
హరః సంక్షుద్యైనం భజతి భసితోద్ధూలన విధిమ్॥

త్రయాణాం దేవానాం త్రిగుణ జనితానాం తవశివే
భవేత్పూజా పూజా తవ చరణ యోర్యా విరచితా।
తథా హి త్వత్పాదో ద్వహన మణిపీఠస్య నికటే
స్థితా హ్యేతే శశ్వన్ముకులిత కరోత్తంస మకుటాః॥

ఈ చిట్టచివరిశ్లోకం ప్రధానమైనది. బషోలీ తైలవర్ణచిత్ర మొకటున్నది. అందు దేవిదుర్గ ఎత్తైనపీఠము పై నిలిచియుండగా బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ముగ్గురు పుష్పములు ఆమెపాదములందు సమర్పించుచు వినతులైవంగి నమస్కరించుచున్నారు. (చూ॥ Pahari Paintings and Sikh portraits in the Lahore museum — F.S. Aijazuddin)

రావణునికి పరాశక్తి తత్త్వమే వేదతత్త్వంగా రూపుదాల్చిన దన్న అభిజ్ఞానం లేకపోవడంచే, వేదవతియైన సీతను స్వాధీనపరచుకొన్న సృష్టి కధీశ్వరుడు కావచ్చునని భ్రమపడి చెడినాడు.

రావణుని వంశవృక్షమీ క్రింది విధంగాఉంది. మొదట తండ్రి వైపు వంశవృక్షాన్ని పరిశీలిస్తాము. ఈ ప్రజాపతులవంశపు కోవలోనే విశ్వామిత్రుడును జన్మించినాడు.

## రావణ, విశ్వామిత్రుల వంశవృక్షం (తండ్రివైపు)




## రావణుని వంశవృక్షం (తల్లివైపు)




రావణుడు పులస్త్యబ్రహ్మమనుమడు. విశ్రవసుని కుమారుడు. విశ్రవసుని కిద్దరుభార్యలు. దేవవర్ణిని, కైకసి. దేవవర్ణిని కొక్కడే కుమారుడు. వాడే కుబేరుడు. వాడు శివుని కృపతో అష్టదిక్పాలకులలో నొక్కడై పుష్పకవిమానముపై విహరించువాడు. అతని కుమారుడే నలకూబరుడు. రావణుని తల్లికైకసి అసురసంధ్యలో భర్త ఎంత వారించినను వినక కామక్రీడకు లోనవుటచే కాముకుడై రజోగుణ భూయిష్ఠుడై, ఆసురీబుద్ధులు గలిగిన దశగ్రీవుడు జన్మించినాడు. బ్రాహ్మణుడై పుట్టినందువలన

వేదవేదాంగములభ్యసించి తపస్సు చేశాడు. కాని ఆ తపస్సు రజో గుణముతో నిండి లోకకంటకంగా తయారైంది. అన్నయైన కుబేరుని ఐశ్వర్యాన్ని చూచి ఈర్ష్యచెంది అలకానగరాన్ని స్వాధీనపరచుకొన్నాడు. పుష్పకాన్ని సొంతం చేసికొని షికార్లు ప్రారంభించినాడు. అదికూడా తల్లి కైకసి ఒకరోజు రావణుడికి పుష్పకంపై పోతున్న వైశ్రవసుని (కుబేరుని) చూపి వాని ఆధిక్యాన్ని పొగడి తనబిడ్డలు వట్టి పనికి రానివారయ్యారని ఎత్తిపొడవగా, రోషంతో రావణుడు తపస్సుచేసి బ్రహ్మచేత అవధ్యత్వ మును వరంగాపొంది దేవేంద్రునికి ప్రక్కలో బల్లెమయ్యాడు. రావణుని తమ్ముడు కుంభకర్ణుడు నోరుజారి నిద్రనువరంగా పొందాడు. స్త్రీలం దరూ తల్లియొక్క ప్రతిరూపాలన్న పరిజ్ఞానంలేకుండ పుట్టుకతోవచ్చిన దోషాన్ని అతిక్రమించలేక పరదారావ్యామోహం చేత, కన్నుగానని గర్వం చేత కాలకర్మవశుడై ఖడ్గరావణ మహామంత్రాధిదైవతమైన రావణాసురుడు శ్రీరామచంద్రునిచేత రణరంగంలో మరణించాడు. వేదవేత్తయైనా, వేదా లను వింగడించిన వాడైనా ఏం ప్రయోజనం? చేతులారా చేసికొన్నది అనుభవింపక తప్పదు కదా! "యాదృశీ భావనా యత్ర సిద్ధిర్భవతి తాదృశీ" "మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః"

# 52. రావణసంహారం

*"గగనం గగనాకారం సాగరం సాగరోపమా!*
*రామ రావణయోర్యుద్ధం రామరావణయోరివ"*

అన్నాడు వాల్మీకిమహర్షి! అనగానేమి? రావణుని సంహరించుట అంత సులభంకాదని తాత్పర్యం!

*తల తెగెనా! తెగినది, భూ*
*తలమున గన్పించు తెగినతల, యింకొకడౌ*
*తలయున్నది కృత్తమ్మవు*
*తల యుండినచోట మౌళి తలమున నదిరా!*

*సంచిత సూర్యతేజుడయి సంగతధీ మధుసూదనుండు న*
*క్తంచర రాట్ప్రయుక్తము గదాముసలాదిక వర్షమున్ నిరో*
*ధించుచు నప్రమత్తతను ద్రెంచనిదౌ తలద్రెంచినట్లు ఖం*
*డించెను మాటయొక్కవరి నిండిన శీర్షము నిండినట్లుగన్*

ఇలా నూటయొక్క తలలు ఖండించినా రావణుడు చావలేదు! అప్పుడే రాముని దేవ్యవతారంగా రావణుడు గుర్తించినది. ఆ స్ఫూర్తి వానినుండి దేవసారధియైన మాతలికి వచ్చి, మాతలి రాము నితో ఇంద్రుడు, అగస్త్యుడు యిచ్చిన బ్రహ్మాస్త్రము సంధించవలసినదిగా కోరినాడు. రావణ పైతామహంబైన ఆ యస్త్రప్రయోగముతో—

శా॥ ప్రాణం బెచ్చట నుండు నాస్థలమునంబట్టెన్ మహాస్త్రంబని
ద్రాణం బొచు ద్రిశూలమట్లు హృదయగ్రంథిన్ విభేదించె బా
రీణంబైన సుదర్శనంబన మహాస్ఫుల్లా్నదు లేర్చెన్ మఱిం
దూణీరంబును జొచ్చె శస్త్రమును దైత్యుం డుర్విపై వ్రాలగన్

శా॥ కానెన్ వెన్నెల లచ్చ శారద నిశాకల్హారకాంతానట
ద్దాస శ్రీకము లప్సరశ్చయ దృశా వ్యాపారసంచారముల్
భాసిప్రోజ్జ్వల వార్థితీర సికతాపర్యంక నిద్రాళు క
న్యాసంగత్యతిభోగభాగహివదేహాంశు ప్రభాచోదముల్

— యుద్ధ-నిస్సంశయ *380, 381, 388, 392*

సుందర-సంధ్యాఖండములో హనుమ, జాంబవదాది మహావీరులతో, లంకనుండి తిరిగి వచ్చిన తర్వాత చెప్పిన మాటనుమనమిక్కడ స్మరిం చుకొందము.

అతడు మహా విద్వాంసుం
డతనికి దన తప్పు తెలియు, నది శల్యంబై
యతని యెడద నాటికొనియె
నతనికి మఱి చావు తెచ్చు నది రామునిచే! (*191* ప.)

ఇది రావణసంహారానికి భరతవాక్యం!

## 53. బుద్ధి అంతర్ముఖమైతే ఏకాంతవాసం కోరుతుంది

రాముడు తనకోసంకాక లోకంకోసం సీతను తిరిగి స్వీకరించాడు. లోకంకోసం సంతానం పొందాడు. ఆ సంతానం కళ్లచూడకముందే లోకాపవాద మనే నెపంతో సీతను మరల అడవులకు పంపాడు కాని,

బుద్ధికి ప్రతీకయైన సీతలో యిప్పుడా బహిర్ముఖత్వంలేదు. మరి అంత ర్ముఖత్వం పెరిగింది. పూర్తిగా అంతర్ముఖమైన బుద్ధికి లోక జీవనానికి పొత్తు కుదురదు. కాబట్టి సీత లోకుల నోళ్లలో అపనిందల పాలైంది. లోకులిలా స్వేచ్ఛగా సీతపై నీలాపనింద వేయడానికి కారణం రాముడే మొట్టమొదట సీత అగ్నిప్రవేశానికి సమ్మతించడం. పూర్వ రామాయ ణంలో సీత అగ్నిప్రవేశంకాని, ఉత్తరరామాయణంలో సీత వనవాసగమ నంగాని సీత తానై కోరి విధించుకొన్నట్లుగానే వాల్మీకంలో చెప్పబడింది. రామాయణ కల్పవృక్షంలో ఉత్తరకాండ ప్రసక్తిలేదుగాని, పూర్వరామా యణమందలి సీత అగ్నిప్రవేశానికి కవి యొక కార్యకారణకల్పనమొనర్చి యున్నాడు. అదెట్లనగా, రామలక్ష్మణులిద్దరు ఇంద్రజిత్తు నాగాస్త్రముచే బంధింపబడి మూర్ఛపోగా రావణుడు సీతవద్దకు వచ్చి నీభర్త, మరిది పరలోకగతులైనారని చెప్పగా విని సీత యిట్లు మ్రొక్కుకొన్నది.

చ॥ ఇది యొక మ్రొక్కు మ్రొక్కెదన, యెవ్వరు నెప్పుడుగాని మ్రొక్కన
ట్టిది యిది, నేను సామి పొగలెక్కెము పెన్దముదారు సాక్షిరై
పొదలగ బెండ్లి యాడితిమి, మోహనరూపుడు రాఘవుండు నా
పద యిది దాటినన్ త్రిదశవంద్యున కాహుతి నౌదు నగ్నికిన్

వ॥ నాకీ యూహ గలిగించిన రావణుని గురువుగా స్వీకరించి యాతనికి నమస్కరించెద.

మ॥ ప్రొదరూపంబుగ నేర్పరించి చితి నేనగ్నిప్రవేశంబు నే
సెద, నీ మ్రొక్కును మ్రొక్కినన్ హుతవహా! శ్రీరామచంద్రుండు నా
యెదలో నుండిన దీప మారమికి నీ వీ కోర్కి పాలించినన్
మదకుంభీనస మూర్తి లక్ష్మణునకున్ మన్నించినం బ్రాణముల్
— యుద్ధ-సంశయ-357, 358, 359

సీత రావణుని గురువుగా ఎందుకు ఎన్నుకొనవలెను? అగురువు కల్గించిన యూహయేమి? అనగా — రావణుడు తత్పూర్వం యిలా అంటాడు.

సుదతీ! యింక నతండె నీకు బతి యంచుం గూరుచుంటేని దా
నది యుండెం గద వానివంటి పతిచే నగ్నిప్రవేశంబు త
ప్పదు నీ కేటికి జావగావలయునే బాలేందుఫాలస్థలీ!
— యుద్ధ-సంశయ-341 ప

సీత మునికన్యలను కూడి స్వేచ్ఛగా విహరించవలెననే కోర్కె కోరగా దాన్ని మన్నించు చున్నట్లుగా రాముడు సీతను వనవాసమునకు పంపినాడు. సీత తన కోరికతో దానికి వెసులుబాటు చేకూర్చినది. లోకానికి దూరంగా ఆమె అడవుల్లో నివసించసాగింది. అచ్చమైన వేదాంతం అడవుల్లోనే కదా పుట్టింది? పైగా ఆమె బృహదారణ్యకోపనిషత్ వీథులలో విహరించే రాజర్షి జనకుని కుమార్తె. వేదాంతం మైథిలికి ఒంటబుట్టిన, ఒంటబట్టిన విద్యయే కదా!

కాని, సీత లేకుండ రాముడు రాజ్యపరిపాలన వేదవిహితంగా చేయ లేడు సరికదా! అసలు రాజ్యపాలనకే అర్హుడుకాడు. ఇదేమాట సీత అగ్నిప్రవేశం చేయుకముందు రామునితోచెబుతుంది.

*భరతు డొసగిన ధర ధర్మపత్ని ప్రక్క*
*లేక యేలెడు నర్హత లేదు నీకు*
*నరపతివి కాక నన్ను గొనంగ వచ్చు*
*నుభయతో భ్రష్టతం బొందుచుంటి రామ!*

— యుద్ధ-ఉపసంహారణ *172* ప.

"నేను లేకుండా రాజ్యపాలనాధికారం నీకులేదు. రాజ్యం వద్దనుకొని నన్నుగ్రహిస్తే రాజరికంలేకపోతుంది. ఇలా ఉభయ భ్రష్టుడౌతున్నావు. ఆలోచించుకో" అందిసీత. ఇది కథలోని క్లిష్టసమస్య!

కాబట్టి, లోకరంజనమే తన జీవితధ్యేయంగా గలరాజుగా శ్రీరాముడు "అంతర్ముఖ సమారాధ్య" యైన దేవి సీతను అడవులలో విడిచిపెట్టినా "బహిర్ముఖ సుదుర్లభ"యైన ఆమెను హృత్పుండరీకంలో స్థాపించుకొని లోకంకోసం కపిలమహాముని అనుగ్రహించిన మిథ్యాసీతను లేదా మాయాసీతను ప్రక్కనపెట్టుకొని రాజ్యపాలన కొనసాగించాడు.

పూర్వరామాయణంలో సీతాదేవి జీవవేదనాభాష్యకారిణికాగా, ఉత్తరరామాయణంలో రాముడు జీవవేదనాభాష్యకారుడు. భవభూతి ఉత్తరరామచరితము చదివితే ప్రజారంజకమైన రాజ్యపరిపాలనకూ వైయక్తిక దాంపత్య ధర్మానికీ మధ్యఏర్పడే సంఘర్షణ — ఈరెంటి మధ్య జీవుడెలా సతమతమౌతాడో విస్పష్టంగా తెలుస్తుంది.

# 54. సీతారామతత్త్వాన్వేషణలో త్రివిధసంప్రదాయాలు

1. ఆదికవియైన వాల్మీకి, రామాయణంలో ఉత్తమోత్తమకావ్యసంప్రదాయంతోపాటు, కావ్యంలో అంతర్గతంగా సాంఖ్యతత్త్వాన్ని నిక్షిప్త మొనర్చినారు.

2. వశిష్ఠ - శ్రీరామసంవాదాత్మకమైన యోగవాసిష్ఠము గురుశిష్యసంవాదాత్మకమైన అధ్యాత్మవిచారణాసహితమై అద్వైత సంప్రదాయ ప్రతిపాదకంగా ఉంది.*

3. శ్రీరామచంద్రుడే పరబ్రహ్మమని ప్రతిపాదించే ముముక్షుజనోపాదేయమైన బ్రహ్మాండపురాణాంతర్గత అధ్యాత్మ రామాయణ సంప్రదాయం — విశిష్టాద్వైత సూచకం.

ఇవి స్థూలంగా చేయబడిన విభజనమే! అధ్యాత్మ రామాయణంలోని బాలకాండ - ప్రథమసర్గలో 'శ్రీరామహృదయము' ఉపనిబద్ధమైయున్నది. ఇది మోక్షసాధనమైన సీతారామ మరుత్సూను సంవాదాత్మకమైనది. ఈ శ్రీరామహృదయాన్ని విస్తరించి సాధకజనోపయోగముగా సాంఖ్య-తారక- అమనస్క యోగాలతో 'సీతారామాంజనేయ సంవాద'మనే మహాగ్రంథాన్ని రచించిన వారు శ్రీపరశురామపంతుల లింగమూర్తి గురుమూర్తిగారు.

ఇవిగాక వ్యాఖ్యాతృసంప్రదాయం ఒకటుంది. వాల్మీకి రామాయణానికి లెక్కలేనన్ని వ్యాఖ్యలు వెలిశాయి. ఈ వ్యాఖ్యాతలు ఒక్కొక్కరు ఒక్కొక్క దృష్టితో రామాయణాన్ని వ్యాఖ్యానించారు. బాదరాయణుని బ్రహ్మసూత్రాలకు మతాచార్యులు ఒక్కొక్కరు తమ తమ మతభేదంతో వివిధంగా ఎలావ్యాఖ్యానించారో, ఆమతాచార్యుల అడుగుజాడల్లో నడిచిన ఆయామతస్థులైన వ్యాఖ్యాతలుకూడ తమ తమ సిద్ధాంతాల కనుగుణంగా వాల్మీకి రామాయణాన్ని వ్యాఖ్యానించారు.

---

* ఉపనిషత్తులు గురుశిష్య సంవాదాత్మకంగానే ఉండడం, బౌద్ధమతంలోని 'మిళిందపన్హా' అనేగ్రంథం హైందవుడై బౌద్ధమతం స్వీకరించిన నాగసేనునికి, మిళిందుడు (మినాండర్) అనే గ్రీకురాజుకు మధ్య జరిగిన తాత్త్విక సంభాషణ. యోగవాసిష్ఠంకూడ తాత్త్వికజిజ్ఞాసయే మూలబీజంగా గల్గియుండడం గమనింపదగింది.

అసలిన్ని దృక్పథాలు వాల్మీకి కున్నవా? అని ప్రశ్న! వాల్మీకి నాటికి ప్రబలంగా ప్రచారంలో ఉన్నది సాంఖ్యం అంటారు. కాబట్టి సాంఖ్యతత్త్వాన్ని వాల్మీకి రామాయణ మహాకావ్యంలో ప్రతిపాదించాడని చెప్పాలి.

సాంఖ్య తత్త్వాన్ని బుద్ధునికి పూర్వమే కపిలుడు ఒక దర్శనంగా వ్యవస్థీకరించాడుగాని ఆయనరచన లేవీ లభింపలేదు. సాంఖ్యంతోనే మానవుని ఆధ్యాత్మిక జిజ్ఞాస ప్రారంభమౌతోంది! దీనినే 'వేదాంతవిచారణ' అనవచ్చును.

సాంఖ్యంలో చెప్పబడిన అవ్యక్తము సూక్ష్మము అయిన 'ప్రకృతి'యే, ఉపనిషత్తుల్లో 'మాయ'గా చెప్పబడింది. సాంఖ్యంలో సమస్తవిశ్వానికి మూలం ఒకటేపదార్థం - అది ప్రకృతి. 'ప్రకరోతీతి ప్రకృతిః'! అనగా బాగుగా కార్యసాధనచేయునది. లేదా అన్ని వస్తువులకు వ్యాపారములకు ముందు (ప్రాక్) ఉండునది. ఇలా సమస్త వస్తువులకు ఏకకారణము, పరిణామముచే మారి యున్నదిగా కనబడునది, దాని అసలు స్వరూపములో ఎన్నడును వ్యక్తముకానిది, అన్ని కార్యములకు ఆధారమగునది (ప్రధానము) ప్రకృతి. అది నిత్యము వ్యాపకము, స్వతంత్రము, నిరవయవము.

వాల్మీకి రామాయణంలో సీత ప్రకృతి. రాముడు పురుషుడు. సాంఖ్యంలో పురుషుడు అకర్త, గుణరహితుడు. కాని ప్రకృతి త్రిగుణాత్మకము. సమస్త భౌతిక మానసిక కార్యములు, సుఖదుఃఖమోహాదులు లఘుగురుత్వాదులు, గతి స్థిత్యాదులు సామ్యావస్థయైన ప్రకృతి, అసామ్యావస్థ వికృతిచేత గల్గును.

సాంఖ్యులు నిర్గుణము, కైవల్యయోగ్యమైన వస్తువొకటి వుందని దానినే 'పురుషుడ'ని చెబుతారు. పురుషులు అకర్తలు, సాక్షిమాత్రులు, ఉదాసీనులు, దుఃఖాది రహితులు పురుషసాన్నిధ్యం వలన ప్రకృతి వ్యాపారవంతమై వికృతులుగ పరిణామమొందును. స్ఫటికము ప్రక్కనున్న జపాకుసుమపు ఎరుపు అందు ప్రతిబింబించినట్లు. కాని నిజముగా అందే వికారము కలుగునట్లు పురుషునిలో ఏ వికారమునుకలుగదు. సుఖదుఃఖాద్యనుభవము కేవలము ప్రతిభాసించును. ప్రకృతి కార్యములను గాంచి, తన స్వరూపమును విస్మరించి ప్రకృతితో తాదాత్మ్యము నాపాదించుకొని పురుషుడు అనుభవమునకు లోనైనట్లు భ్రాంతి చెందుచున్నాడు. పురుషునిలో యిట్లు బుద్ధి మనశ్శరీరాదు

వ్యాపారములు ప్రతిబింబించుట బంధము. ప్రతిబింబ మాత్రమగు మిథ్యాదుఃఖమే బంధము.

కైవల్యము కొరకు పంగ్వంధుల సంయోగము వంటిది ప్రకృతిపురుష సంయోగము. పురుషుడు నిష్క్రియుడు. ప్రకృతి సక్రియము. పురుషాధిష్ఠితమగు ప్రకృతి అతని ప్రయోజనము కొరకై పరిణామము చెందును. పురుషుడిది చూచుచు దీనికి తాను కర్తనని తనకొరకే యిది అగుచున్నదని తలంచునంత వరకే ఈ నాటకము సాగును. తాను అకర్తనని దీనితో తనకు సంబంధము లేదని గ్రహించినంతనే కైవల్యము సిద్ధించును (ప్రకృతినుండి వేరగుట). ఈ ప్రకృతి వియోగము వివేకము వలనవచ్చును. ప్రకృతి, వికృతి పురుషులను గూర్చి మననముచే వివేకము కలుగును.

నేను జన్మింపలేదు — నాకు శరీరములేదు — నేను కర్తను గాను — నేను భోక్తనుగాను — అను అవగతి దీనివలన కలుగగానే "అహం" లేకుండపోవును. అపుడు పురుషుడు కేవలియై స్వరూపమగు **నిర్గుణత్వమును** అవబోధించుకొనును. ఇట్టి జ్ఞానము కలిగిన పురుషునికి కూడా వెంటనే దేహపాతము కాదు. ఎందుకనగా అది ఈ వరకే ప్రకృతికీయబడిన గతిఫలము. అది వ్యయముకాగానే అట్టి పురుషునికి మరి జన్మఉండదు. **ఆత్యంతికకైవల్యము** కలుగును.

సాంఖ్యంలోని 'ప్రకృతి'యే ఉపనిషత్తులలో 'మాయ'గా చెప్పబడినది. సృజించు శక్తిమాయ. ఈశ్వరుడీశక్తి నవష్టంబించియే సృజించును. ఏ శక్తిచే పరిపూర్ణమునందు ఖండము కలుగునో, అసీమమునందు సీమ కలుగునో ఆ శక్తియే మాయ. అసీమము నందు సీమ ప్రకాశమే సృష్టి. దేశకాలములు లేని వస్తువు దేశకాలములలో నుండి వికసించుట సృష్టి. అనంతమగు వస్తువును బ్రహ్మాండంగా, పిండాండంగా చూపడమే మాయయొక్క ఖేల లేక లీల! లీలయొక్క కౌతుకమయమైన శక్తియే మాయ! దీనిరహస్యం రహోగర్భం!

బ్రహ్మము శక్తికి అతీతమైనప్పటికీ శక్తికి ఆశ్రయము. మాయ ఈ శక్తి! మాయ ననుసరించి జ్ఞానమునందు, రసమునందు, శక్తియందు ఆత్మయొక్క విశ్వవిభూతి ప్రకాశదశకు వచ్చును.

**మాయంతు ప్రకృతి విద్యాన్మాయినం తు మహేశ్వరమ్।**
**తస్యావయవ భూతైస్తు వ్యాప్తం సర్వమిదంజగత్॥**

అని శ్వేతాశ్వతరోపనిషత్తు.

ఉపనిషత్తుల్లో నాలుగు మహావాక్యాలున్నాయి. త్రిసత్యాన్ని తెలిపేది మహావాక్యం. జీవబ్రహ్మ సంబంధ ప్రతిపాదకం మహావాక్యం!

1. ప్రజ్ఞానం బ్రహ్మ
2. అహం బ్రహ్మాస్మి
3. తత్త్వమసి
4. అయమాత్మాబ్రహ్మ

మధ్వాచార్యులు జీవేశ్వరులు అత్యంత భిన్నులన్నారు. రామానుజులు భేదాభేదములు పరస్పరసంబంధములన్నారు. శంకరులు జీవేశ్వరులు కభేదము నంగీకరించారు. ఉదాహరణకు "స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో" అనే ఛాందోగ్యమహావాక్యంలో—

1. ఆత్మా + అతత్త్వం + అసి అని పదచ్ఛేదం చేసి జీవబ్రహ్మభేదాన్ని ద్వైతులు చెప్పారు.

2. తత్త్వమ్ — 'నీవు బ్రహ్మసంబంధివి' అని విశిష్టాద్వైతులు అర్థము చెప్పి జీవ బ్రహ్మములకు ఒక సంబంధంచెప్పారు. ఆ సంబంధం అంగాంగి భావరూపమైన నిత్య సంబంధం.

3. తత్, త్వమ్, అసి = నీవు అతడవు — అనగా బ్రహ్మమవు. అని అద్వైతవాదులు చెప్పారు.

వ్యక్తికి జీవితంలో ఆధ్యాత్మికానుభూతియే ప్రధానమైనది. ఏ దార్శనిక మీమాంస ఆధ్యాత్మిక జీవనరహస్యాలను ఆవిష్కరింపదో అది మానవజీవిత సమస్యాపరిష్కారం చేసినట్లు కాదు. ఈ సందర్భంలో రోమారోలా (Romain Rolland) చెప్పిన వాక్యం జ్ఞాపకానికివస్తోంది. "The only religion that can have any hold on intellectual people is the rationalistic religion of Advaita."

## 55. బ్రహ్మసత్యము – జగత్తు మిథ్య

అయోధ్యకు తిరిగివచ్చిన రాముడు మళ్లీ తన పూర్వపు టాధ్యాత్మికానుభూతిని పొందినట్లుగా భావించి శాంతచిత్తంతో, పరిణతమనస్కుడై ప్రజాపరిపాలన కావించసాగాడు. ఆకాశం ఎలా సర్వాన్నీ తనలో యిముడ్చుకొని ఎటువంటి మార్పుకూ లోనుకావడం లేదో అలాగే

సకల కల్యాణగుణ పరిపూర్ణుడైన రాముడు, సీతాసంబంధమైన గత స్మృతులను విస్మరించక తన హృదంతరాళంలో నిక్షిప్తపరచుకొని దానిచే తానెటువంటి మనోవికారాన్ని పొందక నిశ్చలకాసారంలా, స్థితప్రజ్ఞుడై జీవితం గడపసాగాడు. ఇక్కడ శ్రీరామచంద్ర ప్రభువు, శ్రీశంకర భగవత్పాదులు అద్వైత సూత్రంగా ప్రవచించిన "బ్రహ్మసత్యం, జగన్మిథ్యా, జీవోబ్రహ్మైవనాపరః" అన్నస్థాయికి అంటే "అహంబ్రహ్మాస్మి" అన్న పరిపక్వమైనస్థితికి చేరుకొన్నాడన్నమాట! అందుకే పూర్వరామాయణంలో లాగా ఉత్తరరామాయణంలో రాముని బాహ్యజీవితానికి సంబంధించిన సంఘటనలేవీ ఆయన అమోఘ పరాక్రమాన్ని వ్యక్తీకరించవు. సీతారాముడు పట్టి రాముడుగా మిగిలిపోయాడు చివరకు.

శ్రీ శంకరాచార్యులవారు అద్వైత వేదాంతమనే ఒక గొప్పసౌధాన్ని 'అధ్యాస'అనే పునాదిమీద కట్టారు. బ్రహ్మసూత్రాలకు భాష్యం వ్రాస్తూ మొట్టమొదటగా ఆచార్యపాదులు అద్వైతమతానికి పీఠికగా అధ్యాసభాష్యాన్ని రచించారు.

1. బ్రహ్మ మనగా పరమేశ్వరుడు — ఒకడే వున్నాడు-వేతేమియులేదు.
2. బ్రహ్మమునందు జగద్భ్రాంతి (అధ్యాస) కలుగును.
3. జగత్తు లేనే లేదు.

బ్రహ్మమునందు జగత్తు కల్పితమగుచున్నది. చీకటిలో త్రాడును చూచి పాము అనుకొన్నట్లు, ఎండలో తళతళలాడే ఆలిచిప్పనుచూచి వెండిరేకనుకొన్నట్లు, ఎడారులలో ఎండమావులను చూచినట్లుగా, ఆ త్రాడుయందు పాము ఆరోపితమైనది. ఆలిచిప్ప వెండియైనది. తెలిసిన పిదప త్రాడు త్రాడే! ఆలిచిప్ప ఆలిచిప్పయే! ఈ రీతిగ బ్రహ్మమునందు జగత్తు ఆరోపితమైనది. తెలిసినచో అంతయు బ్రహ్మమే!

1. పరమేశ్వరుడు లేక బ్రహ్మము.
2. జీవాత్మ లేక నేను
3. ప్రపంచము లేక జడము.

**బ్రహ్మము:** బ్రహ్మము సత్+చిత్+ఆనందస్వరూపము సత్ అనగా ఎల్లప్పుడును నశింపక ఉండునది. చిత్ = చేతనస్వరూపము అనగా ఎఱుకయే స్వరూపముగా గలది. మరి, ఆనందం కూడ బ్రహ్మస్వరూపమే!

**జీవుడు లేక నేను:** 'నేను' అనే ఎఱుకకు తావైనవాడు జీవుడు. ఇతడు దేహేంద్రియాదులగు ఉపాధులతో కూడుకొని వున్నాడు. ఇతడే ఆత్మ; జీవాత్మ; ప్రత్యగాత్మ; చిదాత్మ; కర్మభోక్త.

**ప్రపంచము లేక జడము:** బుద్ధి మొదలుకొని శరీరం వరకుగల ప్రకృతి పరిణామమంతయు జడము. ఇది 'నేను' అనే ఎఱుకకు తావైన జీవాత్మచే చూడబడును. కాబట్టి 'విషయ' మనిపించుకొనును. కాగా జీవాత్మ లేక 'నేను' 'విషయి' యాయెను. ఈ జడమే, ఈ జగత్తే జీవులందరిని బోల్తాకొట్టిస్తోంది! లేకున్నను 'ఉంది' అనిపించుకో వడంలోనే జగత్తుయొక్క చమత్కారమంతా యిమిడివుంది. నిజానికి జడము లేక ప్రపంచము విడిగాలేదు. చైతన్య సంయోగము లేక జడము దొరకదు.

**ఒక వస్తువునందు మరియొక వస్తువు నారోపించుట అధ్యాస. మిథ్యారూపమే అధ్యాస.** చేతనధర్మములు జడమునందు, జడధర్మ ములు చేతనమునందు ఆరోపించుచున్నాము. ఈ ఆరోపణము పేరే అధ్యాస. జీవునకు (నేను) బాహ్యజగత్తుతో సంబంధము కలుగునప్పుడు ఈ ఆరోపము కలుగుచుండును.

బ్రహ్మము సత్తు-జగత్తు అసత్తు; బ్రహ్మము చిత్తు-జగత్తు అచిత్తు; బ్రహ్మము ఆనందము-జగత్తు దుఃఖము ఈ రెండింటికిని పోలికయె క్కడుంది? జీవుడు జడరథాన్ని అధిరోహించినాడు. ఆ రథముకూడ తాననుకొనుచున్నాడు. భ్రమచే బ్రహ్మస్వరూపము మనకు ప్రచ్ఛన్నమై ఉన్నది. కాబట్టి మనము జగదాకారంగా బ్రహ్మముచే చూస్తున్నాము. భ్రమ పోయినచో బ్రహ్మస్వరూపము ప్రకాశించును. అపుడు జీవు నకు బ్రహ్మజ్ఞానము కలుగును. తర్వాత, బ్రహ్మమునందు జగద్భ్రాంతి కలుగదు — కలుగజాలదు.

శ్రీ శంకరులువారి అభిప్రాయమేమనగా, జగత్తనికాని, జగదాకా రమనికాని, యేదియులేదు. ఉన్నదొక బ్రహ్మమే. బ్రహ్మము తక్క జీవాత్మ అనేది వేఱొకటి లేదు. జీవాత్మ పరమార్థమున లేదు. బ్రహ్మ మునందు జీవాత్మ అధ్యస్త మగుచున్నది.

అధ్యాస మూలంగానే జీవునికి దుఃఖం కల్గుతోంది. 'అధ్యాస'కే 'అవిద్య' అని మారుపేరు. 'అవిద్య' జీవుని వీడిపోతే 'అథవాద్వారాణి భవంతి సర్వత్ర' అన్నట్లు ముక్తిద్వారం ఎదుట ప్రత్యక్షమౌతుంది. అవి

ద్యను తొలగించడానికే వేదాంతశాస్త్రం కంకణం కట్టుకొనింది. ఇదే శంకరదర్శనం!

జగత్తు = అధ్యాస (అవిద్య) = మాయ

జగత్తు మార్పుచెందుచుండును. కావున జగత్తుసత్తుకాదు. జగత్తు ఉన్నట్లు తోచును కాని అసలు జగత్తులేదు. ఈ లెక్కన జగత్తు అసత్తు.

జగత్తు ఉన్నట్లు తోపింపజేయునది అధ్యాస లేక అవిద్య. కావున అవిద్య అసత్తు కాదు. కాని అవిద్యయు మార్పుచెందుచుండును. విద్య ఆవిర్భవింపగనే అవిద్య తొలగును. కాబట్టి అవిద్య సత్తుకాదు. కాగా అవిద్య సత్తుకాదు, అసత్తుకాదు. సదసత్తుకానిది అనిర్వచనీయము. అనగా కలదనికాని, లేదనికాని చెప్పరానిది, అనిర్వాచ్యమగు ఈ అధ్యాసనే, ఈ అవిద్యనే 'మాయ' అందురు. మాయ అనిర్వచ-నీయము.

శంకరులు "ఆత్మానాత్మల కలయిక పారమార్థికముగాలేదు. కాని వ్యావహారికముగా సత్యము" అన్నారు. పారమార్థికసత్త అనగా నిజమైన ఉనికి. వ్యావహారిక సత్తకు ఉనికియేలేదు. నిజముగా ఏది ఉండునో దానినే సిద్ధింపజేయుటకు వ్యావహారికసత్తకలదు. దాని అస్తిత్వం తావన్మాత్రమే!

కాబట్టి తేలినదేమనగా, జీవుడు బ్రహ్మము కాడు. జీవునికి పారమార్థికంగా అస్తిత్వం లేదు. జీవుడు అవిద్యాసంభూతుడు. కావున జీవత్వము మిథ్య; ఉలక్కి. అవిద్య వలనగాని, అజ్ఞానం వలనగాని పుట్టునది మిథ్య! దానికి జ్ఞానం పునాదికాలేదు. బ్రహ్మము నిర్వికారము. అనాసక్తము. కాబట్టి బ్రహ్మముతో జీవ భావమున కెలాంటి సంపర్కమును లేదు. అట్లని యిది శూన్యవాదము కాదు. శంకరులు శూన్యవాదాన్ని ధ్వంసంచేశారు.

అందుకే అద్వైతానికి శాంతబ్రహ్మవాదము, కేవలాద్వైతవాదము మాయావేదాంతవాదము, అనిర్వచనీయవాదము వివర్తవాదమని పేర్లు.

కార్యకారణసంబంధమును సమగ్రంగా తెలియజేయునవే దర్శనాలు. షడ్దర్శనాలు మూడు సిద్ధాంతాలపై ఆధారపడివున్నాయి.

1. ఆరంభవాదము
2. పరిణామవాదము
3. మాయావాదము (లేదా) వివర్తవాదము

ఆరంభవాదము: వైశేషిక దార్శనికుడు కణాదుడు, న్యాయదార్శనికుడు గౌతముడు ఈవాద ప్రవర్తకులు సమవాయి, అసమవాయి, నిమిత్త కరణములు తమకంటె వేరైన కార్యములను పుట్టించునని వీరి మతము.

పరిణామవాదము: సాంఖ్యదార్శనికుడు కపిలుడు, యోగదార్శనికుడు పతంజలి, ద్వైత, విశిష్టాద్వైత ప్రస్థానాచార్యులు దీనిని సమర్థిస్తారు. ఉపాదాన కారణమే మారి కార్యమౌతుందనడం పరిణామవాదం. దీనికే సత్కార్యవాదమని పేరు. అసత్తు నుండి సత్తు పుట్టుచున్నదని ఆరంభవాదులనగా లేమినుండి కలిమిపుట్టదు. కావున అసత్తనగా అవ్యక్తమనియు, సత్తనగా వ్యక్తమనియు పరిణామవాదులంటారు.

పరిణామవాదాన్ని దారిదివ్వెగాగొని నడచిన సాంఖ్య, పాతంజల దర్శనాలు రెండూ కవలపిల్లలు. ఈ రెంటికీ ఎక్కువభేదంలేదు. "సాంఖ్య, యోగౌ పృథక్ బాలా ప్రవదంతి, నపండితాః" అని గీతాకారుడు చెప్పాడుకదా! కార్యమే కారణమని, వ్యక్తావస్థయే కార్యమని, అవ్యక్తావస్థయే కారణమని వీరుచెప్పారు. ఈ విశ్వంలోనికార్యజాతమంతా అవ్యక్తావస్థ పొందటమే ప్రళయం. ఆ అవస్థయే వీరిమతంలో ప్రకృతి లేక ప్రధానం. లేక అవ్యక్తం. ఈ అవ్యక్తావస్థా రూపమైన మూల కారణంనుండి ప్రపంచమనే ఈ అశ్వత్థం ఎలాపెరిగిందో ఈ కవలలు చక్కగా చూడగలిగారు.

విశ్వనాథ రామాయణ కల్పవృక్షంలో అహల్యాకృత రామస్తవంలో "సచ్చిదానందముల్ స్కంధత్రయముగాగ, నున్న యొక చెట్టుకానిచెట్టు" అనే సీసపద్యం (బాల-అహల్యా-552 ప.) లో సాంఖ్యంలోని పంచవింశతి తత్త్వాలు నిరూపింపబడినాయి. సాంఖ్యవృక్షము కల్పవృక్షమైనది.

సత్త్వరజస్తమోగుణాలు మూడు పరస్పర విరుద్ధాలు. ఇవి సమభాగాలుగా ఉంటే ఆ గుణత్రయాన్ని అవ్యక్తమనిగాని, ప్రకృతి అనిగాని అనవచ్చు. ఈ మూడుగుణాల సామ్యావస్థప్రకృతి — ఇదే మూల ప్రకృతి — ఇదే ప్రధానం — ఇదే మాయ.

# 56. ఆత్మవస్తు వివర్తరూపమే రామాయణ కల్పవృక్షం

వివర్తవాదము : శంకరానుయాయులైన అద్వైతులది వివర్తవాదం. అతాత్త్వికమైన కారణాన్యథాభావం వివర్తం. ఈ ఆత్మ ఎవరు? ఆకాశము మొదలు శరీరము వరకుగల జగత్తు. ఆనందము వలన పుట్టి, ఆనందముచే మెట్టి ఆనందమందే గిట్టుచున్నదని ఉపనిషత్తు చెప్పుటచే ఈ ఆత్మ ఆనందము. తైత్తిరీయములో – 'ఆనంద ఆత్మా' (2.5) ఆనందమయు మాత్మానం (2-8). ఆనందవల్లి ఏడవ అనువాకంలో – "రసోవై సః రసగ్ంహ్యేవాయం లబ్ధ్వాzzనందీ భవతి"అని తైత్తిరీయశ్రుతి అద్వయబ్రహ్మమే రసమని. ఈరసావగతిని పొందినవాడు ఆనందానుభూతిని పొందుచున్నాడన్నది. ఇదే మహారసం! శాంతరసం! ప్రకృతి రసం! శృంగారాది రసాలు వికృతిరసాలు! శాంతానికి వివర్త రూపాలు! అందుకే "భగ్నావరణా చిదేవ రసః" అని రసగంగాధరంలో జగన్నాథుడు నిర్వచించాడు.

జగత్తున కానందము వివర్తకోపాదాన కారణము. వివర్తమనగా విశేషముగా భాసించుట. ఇది అవస్థాంతర భాసమాత్రము. తాడు తాను వికారము పొందకయే పామువలె కనబడును. అటులే జగత్కారణమగు ఆనందము తాను వికారము పొందకయే జగత్తుగా కనబడును.

కారణ సమసత్తాకము పరిణామము. కారణాసమసత్తాకము వివర్తము. పరిణామవాదము ద్వైతులది వివర్తవాదమద్వైతులది. రామాయణకల్పవృక్షం మొట్టమొదటిపద్యంలోనే –

"ఆత్మ నిత్య మ్మకాలా ద్యవచ్ఛిన్నమ్ము
సచ్చిదానంద సంపచ్చయమ్ము
అద్వితీయమ్మేక వుపరిణామ ప్రాప్త
మవరిమేయ మ్మది యచ్చ తెలివి"

'అపరిణామప్రాప్త' మనడంచేత అద్వైతవాదం సూచింపబడింది. నిరవయవ పదార్థమునందుకు వివర్తము వర్తించును. నిరవయవమగు ఆకాశము నల్లగను, బోరగిలబడిన ఇంద్రనీల కటాహమువలెను కనబడును. అటులనే నిరంశమగు వానందము తాను మారకయే విచిత్రమగు జగదాకారముగ కనబడును. కల్పించు వాడొకడు లేనిదే వివర్తము భాసిం

పదు కావున ఇది మాయాశక్తి కల్పకము "క్రియేచ్ఛాజ్ఞాన రూపమగు మాయాశక్తి ఆత్మలో గల'దని శ్వేతాశ్వతరము చెప్పినది.

'నామరూపాత్మకమగు ఈ జగమంతయు సచ్చిదానందాత్మక'మని నృసింహ తాపనీయమును, ఆనందమే నని ఛాందోగ్యతైత్తిరీయములు చెప్పినవి. ఈశ్వరుడు నామరూపములకు కల్పించి విస్తరింప జేయుచు న్నాడని పురుషసూక్తమును, ఛాందోగ్యమును చెప్పుచున్నవి.

వికారము పొందని బ్రహ్మమునందు అచింత్యమగు మాయాశక్తి పలు వికారములకు పుట్టించు చున్నది. ఈ మాయ ప్రకృతి, మాయి మహేశ్వరుడు అని శ్వేతాశ్వతరము. ఈ మాయ చేసిన మొదటి వికారము ఆకాశము. అది ఉన్నది. భాసించుచున్నది. అవకాశమొసగి మనకు ప్రియమగుచున్నది. దాని స్వరూపమవకాశము. అభివ్యక్తికి పూర్వపరములందది లేదు. ఆద్యంతములందు లేనిది నడుమకు లేదు. కాన నది మిథ్య.

అనుకూల్యముగాని, ప్రాతికూల్యముగాని లేకపోవుటయే నిజమగు నానందము. ఆకాశము మొదలుకొని దేహాంతమువరకుగల వికారమైన నామరూపములందు యిట్లు సచ్చిదానందములున్నవి. ఈ నామరూ పములు సముద్రమునందు బుడగలవలె పుట్టి మరల నామరూపములు లేకుండ పోవుచుండును. రంగస్థలమున నటుడు తన పాత్రనునిర్వ హించినటుల బ్రహ్మచింతకుడు లోకముతో వ్యవహరించవలెను. కావున తొలుత అద్వైతమగు ఆత్మ తోచగనే దానిచే బుద్ధిని నియమించి నామరూపముల వీడవలెను. ఇది *నిర్విగత్వమగు అద్వైతానందము.* యోగముచేతను, ఆత్మవివేకముచేతను, అద్వైత విచారము చేతను బ్రహ్మానంద మనుభవించువానికి "నాకు దుఃఖములేదు, నే నాప్తకా ముడను, కృతకృత్యుడను, ప్రాప్తప్రాప్యుడను అని నాల్గు విధాలుగా ఆనందముపొందును. ఇది ధీవృత్తి రూపమగు విద్యానందము.

ఇతనికి ఐహికాముష్మిక దుఃఖములేదు. దుఃఖాభావమే ఆప్తకామత. సుఖముకొఱకు కదా కామము! సుఖములకన్నింటికి సముద్రమయిన ఆనందమే యితడు. ఇతనికి కామమెక్కడిది? ఇతడందరిలో కలిసిపో వును. ఇతడు శరీరమెఱుగడు. కర్మయే ఇతని శరీరమును నిలుపును. తానే ఆనందమని తెలిసికొని జీవన్ముక్తుడై బాలోన్మత్త పిశాచమువలె తిరుగుచు ఆనందమే అయిపోవును.

వాల్మీకంలోను, విశ్వనాథ రామాయణ కల్పవృక్షంలోను సాంఖ్యము,

అద్వైతము, విశిష్టాద్వైతలక్షణాలను కథారూపరంగా, తత్త్వపరంగా వింగడించి చూపవచ్చును. విశ్వనాథ వారెంత అద్వైతముఖంగా వ్రాసినప్పటికీ "ప్రభు రామకథావతారధారాగురుఘట్టభూతులైన గుహుడు, భరతుడు, సుగ్రీవుడు, విభీషణులలో విశిష్టాద్వైతానికి చెందిన దాసత్వము, భక్తియోగము శరణాగతి తత్త్వము ప్రపంచితమైనది. అహల్యా, శబరీ వృత్తాంతాలలో సాంఖ్య తత్త్వము ప్రపంచింపబడింది. సీతారాములు ప్రకృతి పురుషులైనప్పటికీ అద్వైతానందము చూరగొన్నవారు. రావణ, మారీచ కుంభకర్ణాదులైన రాక్షస సమూహమంతా వైరయోగులు.

మహాభాగవతపురాణంలో కర్దమప్రజాపతి దేవహూతుల చిట్టచివరి సంతానమే కపిలుడు. సాంఖ్యదర్శనప్రవక్త. ఈయన తల్లికి సాంఖ్య తత్త్వాన్ని మొదట ఉపదేశించాడు. ప్రకృతి పురుష వివేక వర్ణనచేసి, యోగసాధనచే మోక్ష మార్గ నిరూపణ చేసినాడు. దీనికి పునాదిగా అష్టాంగ యోగములు చెప్పి భక్తియోగము నిరూపించి జీవన్ముక్తిని వర్ణించాడు. (చూ॥ స్కంధం-3, 25-33 అధ్యా .)

పతంజలి యోగదర్శనంలో కూడ — "తపః స్వాధ్యాయ ఈశ్వరప్రణిధానాని క్రియాయోగః" "సమాధిసిద్ధిరీశ్వర ప్రణిధానాత్" (2-45) అన్నాడు. ఈశ్వర భక్తిచే ధ్యానము, ధ్యానముచే సత్త్వశుద్ధి , సత్త్వశుద్ధిచే వివేకము, వివేకముచే విరక్తి దానిచే పురుషావబోధము. అదియే ముక్తి" అన్నాడు. సీతారామాంజనేయ సంవాదంలో "రాజయోగంబు ముక్తికి రాజపథము" అని నిరూపింపబడింది. రాజయోగమనగా జ్ఞాన యోగము. దీనినే రాజగుహ్యము, పరమము, రాజవిద్య అని కవి ప్రశంసించినాడు. ఈయోగానికి మూడుమెట్లు. 1) సాంఖ్యయోగము, 2) తారకయోగము, 3) అమనస్కయోగము

'శ్రీరామచంద్రుడు తారకబ్రహ్మము' కావున ఆయనతత్త్వము చెప్పమనగా సీత హనుమకు తారకయోగముపదేశించినది సాంఖ్య అమనస్కయోగాలను శ్రీరాముడే హనుమకు బోధించాడు. తారకయోగమనగా నాదబిందుకళలను ప్రత్యక్షముగా ననుభవించి పిమ్మట వానికి లయస్థానమైన పరబ్రహ్మమునందైక్యమును పొందించుట. సాంఖ్యయోగమనగానేమో రాముడిలా చెప్పాడు" "మాయ అనునది పరమాత్మకు భిన్నమైన ప్రకృతి. ఇది అనాదిగా పరమాత్మయందున్న ఆత్మశక్తియే. అది అవ్యక్తమై జగత్తుకు కారణమగుట వలన దానిని 'మూలప్రకృతి' 'మాయ' అందురు. నాలోని 'మాయ'నే అవిద్య, అవ్యక్తము,

తమస్సు, సుషుప్తి, ప్రకృతి, ప్రళయము, ప్రధానము, మాయ, అజ్ఞానము, అనాది యిత్యాది శబ్దాలతో వ్యవహరింపబడుచున్నవి. ఆది మధ్యాంత శూన్యయగు ఆప్రకృతి ఆదిమధ్యాంతములున్నట్లుతోచి అదిమధ్యాంతములు లేనినన్ను (పరమాత్మను) ఆవరించి ఆదిమధ్యాంతములు కలవానినిగా చేయుచున్నది. కేవల సత్త్వగుణ ప్రధానముగాగలది అవిద్య. కాబట్టి ప్రకృతి మాయారూపంగా ఆవరించడం, అవిద్యారూపంగా ఆవరించడం అనే రెండు ఆవరణాలు నాకు కలిగాయి. ఇలా సత్త్వప్రధానమైన 'మాయ'లో దాని కధిష్ఠానుడైన నేను ఆకాశము మేఘమందలి నీటిలో ప్రతిఫలించినట్లు ప్రతిబింబించాను. అట్లు ప్రతిబింబించిన శుద్ధ చైతన్యంబును మాయయు, ప్రతిబింబమును కలసి ఈశ్వర శబ్దముచేత వ్యవహరింపబడుచున్నది. ఆ 'మాయ'కు లోబడక ఈశ్వరుడు బ్రహ్మ రూపుడుగానీ యుండును.

ఆ యీశ్వరుండ నే నా
మాయయె సీతావధూటి మది దలప మహా
మాయుడ నయ్యు వశీకృత
మాయుడనై యవతరింతు మహినిట్లనఘా!

అని శ్రీరామచంద్రుడు ఆంజనేయునితో తాను లోకోపకార్థమై భూలోకమునందు రామావతారము నెత్తితినని స్పష్టపరచాడు.

జీవుడనగా నెవరు? మలినసత్త్వప్రధానమైన మాయయే అవిద్యకదా! ఆ అవిద్యయందు అధిష్ఠానమైన నేను (ఆత్మ) కడవలోని నీటిలో మేఘనక్షత్ర సహితమైన ఆకాశచ్ఛాయవలె ప్రతిబింబించి **'జీవుడు'** అనబడుచున్నాను. "కార్యోపాధిరయం జీవః కారణోపాధిరీశ్వరః" జీవుడు కార్యోపాధియనియు ఈశ్వరుడు కారణోపాధి యనియు గ్రహింపవలెను. జీవునిలోగలఆనందమయకోశమను పేరుగల వ్యష్టిజ్ఞానమే కారణశరీరము.

అమనస్కయోగమనగా అనుభవయోగము. దీనిలో సాధనచతుష్టయము, అద్వైతానుభవము, నిర్వికల్పసమాధి, మహావాక్య విచారణ, బ్రహ్మవిద్య, వైరాగ్యము, కుండలినీయోగము, జీవన్ముక్తి చెప్పబడినవి.

కొంచెము వికసించిన తామరమొగ్గతో సమమైన హృదయాగ్రమునందు సూక్ష్మమైన ఒక కమలాకారమైన రంధ్రమున్నది. దానియందే సర్వమును ప్రతిష్ఠింపబడియున్నది. అక్కడ వైశ్వానరుడైన జఠరాగ్ని ఊర్ధ్వంగా ప్రసరిస్తూవుంది.

నీలతోయద మధ్యస్థాద్విద్యుల్లేఖేవ భాస్వరా।
నీవార శూకవత్తన్వీ పీతా భాస్వత్యణూపమా।
తస్యాశ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః।
సబ్రహ్మా నశివస్సహరి స్సేంద్ర స్సోక్షరః పరమస్స్వరాట్

ఆ అగ్నిజ్వాలలు నల్లనిమేఘములోని మెఱపులవలె నున్నవి. వాటిమ ధ్యన నివ్వరి ధాన్యపు గింజపై నుండు ముల్లువలె (వడ్ల గింజముల్లంతటి సామివచ్చె — కల్పవృక్షం) సన్నగా అణువువలె పసుపుపచ్చరంగుతో ఒక అగ్నిశిఖ ఉన్నది. ఆ శిఖామధ్యమునందు పరమాత్ముడున్నాడు. ఆ పరమాత్ముడే బ్రహ్మ, రుద్రుడు, విష్ణువు, ఇంద్రుడు, అక్షరుడు, కూటస్థుడైన స్వప్రకాశముగల సర్వాంతర్యామి" అని మంత్ర పుష్పము.

సర్వాంతరాత్మయైన అంగుష్ఠమాత్ర పురుషుడు సదా జీవులయొక్క హృదయమునందుండును. ఆ పురుషుని తన శరీరమునుండి ధైర్య ముగా ముంజగడ్డి నుండి లోపం ఊచను వెలికి తీసినట్లు వెలువరించి పరమాత్మలో లీనము చేయవలెనని కఠోపనిషత్తు. (3-17)

దిక్కాలాద్యనవచ్ఛిన్నానంత చిన్మాత్రమూర్తయే।
స్వానుభూత్యేక మానాయ నమశ్శాంతాయ తేజసే॥ — భర్తృహరి

## 57. మన లోపలా బయటా రామరాజ్యస్థాపన జరగాలి

శ్రీరాముడు అద్వైతానందానుభూతితో ఈ బాహ్యప్రపంచంలో స్థిరంగా ప్రవర్తించాడు. తత్ఫలితంగా రామరాజ్యమేర్పడింది ఏసుక్రీస్తు, మహమ్మదుప్రవక్త, బుద్ధుడు, మహావీరుడు, గురుగోవిందసింగ్ వంటి మతప్రవక్తలు, ప్రాచీన ఋషులు తమచుట్టూ ఎటువంటి ఆధ్యాత్మిక తేజస్సుతో కూడిన కారుణికత్వాన్ని, సోదరప్రీతితో కూడిన మాన వత్వాన్ని వెదజల్లారో అటువంటి రమణీయతాత్త్విక సౌందర్యాన్ని ప్రసరింపచేశాడు శ్రీరామచంద్రుడు. వీరంతా అంతర్ముఖులై బాహ్యప్ర పంచజ్ఞానం లేకుండా పోయారని కొందరు పరిహసించవచ్చు. వారనే దేమంటే రాముడుకాని, సీతకాని ఎంతటి రాజకుటుంబంలో పుట్టినా సామాన్య కుటుంబీకుల సమస్యలకు మించి కష్టపడ్డారేగాని జీవితంలో ఏం సుఖపడ్డారని ప్రశ్నిస్తారు. కాబట్టేలోకంలో ఆడపిల్లలకు సీత అనీ, మగపిల్లలకు రాముడనో లేక సిద్ధార్థుడనో పేరు పెట్టుకోవడానికి కూడా

భయపడుతారు. సుఖమంటే భౌతికవాదులదృష్టిలో భార్యాబిడ్డలతో కలిసి సుఖంగా కాలక్షేపంచేయడం. ఇది జీవుని పట్టి సాంసారికయాత్ర! వారు దానికే ప్రాధాన్యమిస్తారు. సంసారాన్ని చక్కదిద్దుకోవడం లోనే వాళ్ల బ్రదుకులు తెల్లవారిపోతాయి. వీరు సామాన్యజీవులు! ఇంకా చెప్పాలంటే అతిసామాన్య జీవులు!

విశిష్ట, విలక్షణమైన మనోప్రవృత్తిగల జీవులజీవితమే అది ధార్మికసూత్రబద్ధమైనప్పుడు, తత్రాపి ఆ జీవుడొక గొప్ప సంస్కారం, విజ్ఞానం గల కుటుంబంలో జన్మించినప్పుడు వాడిజీవితం లోకానికి ఆదర్శప్రాయమౌతుంది. సరిగ్గా సీతారాములట్టి విశిష్ట, విలక్షణ జీవులు! జీవితంలో ఒక ఉత్తమధ్యేయంతో లోకపరిపాలన సాగించే రాజుకూడా సామాన్యమానవుని బలహీనతలకు లొంగిపోతే రామరాజ్యమనే పేరుకేం అర్థముంటుంది? తన కర్తవ్యానికీ, ఆదర్శానికీ అడ్డుగా నిల్చినవారు భార్యయైనాసరే, బిడ్డలైనాసరే ప్రాచీనకాలపు రాజులు వారిని తమ లౌకికబంధాలనుండి తొలగించుకొన్నారు. అందుకే రాముడు ఈనాటికీ ఆదర్శపురుషుడయ్యాడు. రాముడు నిష్ఠురుడంటే దానికర్థం ధర్మం నిష్ఠురమైందని. నిష్ఠురత్వం ధర్మనిర్వహణంలో నిక్షిప్తమైవుందే తప్ప రాముని హృదయమందదిలేదు. రాముని హృదయం నవ్యనవనీత సమానమే. అందుకే రాముడు ఆరాధనీయుడయ్యాడు. సామాన్యజనులకు రాముడు సీతను అడవులకెందుకు పంపాడనేది యిప్పటికీ అర్థంకాని సమస్య! వారుకేవలం భౌతికసంబంధాన్నే చూస్తున్నారుగాని మానసిక, ఆధ్యాత్మిక స్థాయుల్లో భార్యాభర్తల అలౌకిక సంబంధాన్ని అర్థంచేసికోలేరు. అసలు, విష్ణుమూర్తి అవతరణకు దశరధునివంటి మనస్తత్వం గల్గినరాజును, ఆయన గృహాన్ని ఎన్నుకోవడంలోను, సీత అధ్యాత్మవిద్యావేత్తయైన మిధిలాధీశుడు జనకుని యింట లభించడంలోను వారి వారి అవతార రహస్యాలు యిమిడివున్నాయి. లోకదృష్ట్యా చూచినప్పుడు జనకుని వంటి తండ్రీ, సీతవంటి కూతురు ఎక్కడాకనబడరు. అనగా వారంతటి ఉత్కృష్ట కక్ష్యకు చెందిన జీవులు. అట్లే దశరధుడు-రాముడు. దాశరధి, దాశరధీరాముడని పిలువడానికి వారిద్దరిమధ్యగల సౌజన్య వాత్సల్యములెట్టివో లోకులకు తెలియదు.

సీతారాముల వైవాహిక జీవితఫలంగా వారికి లవకుశులనే కవలలు జన్మించారు. ఎప్పుడు? రావణసంహారానంతరం అయోధ్యకు తిరిగివచ్చిన తర్వాత. సీత గర్భవతియై, పూర్ణగర్భిణిగా బహిష్కరింపబడి వాల్మీకాశ్రమంలో ఆమె కవలల్ని ప్రసవించింది. పదునాలుగేళ్ల సుదీర్ఘ

వనవాసకాలంలో వారుగడిపిన బ్రదుకు నారచీరలతో కఠినవ్రత దీక్షకాక మరేమి? సామాన్యుల కివి సాధ్యమా? కాబట్టే సీతారాములు అలౌకికులైన జీవులు! రమణీయ రసకథాప్రపంచ సంజీవనులు!! కాబట్టే వారి చరితం వాల్మీకి కావ్యంగా వ్రాయడానికి పూనుకొన్నాడు. "రఘువరచరితం ముని ప్రణీతం" అని మనమీనాడు నమస్కరిస్తున్నాము. లోకానికి పతివ్రతా మాహాత్మ్యాన్నీ, ఏకపత్నీవ్రతాన్ని చాటిచెప్పడానికి అవతరించిన ఆదర్శదంపతులు సీతారాములు! మన బాహ్యాభ్యంతర జీవితాలలో సీతారాములు ఆదర్శమూర్తులై మనలో రామరాజ్యం స్థాపింపబడాలి! రామరాజ్యం మరెక్కడో లేదు. మనలోనే ఉంది.

శ్వేతచ్ఛత్రమనేది ధర్మసహితపరిపాలనకు చిహ్నం! "శ్రీరామపట్టాభిషేక సమయంలో వశిష్ఠమహర్షి సీతారాములను నవరత్నములతో పొదుగబడిన స్వర్ణమయసింహాసనముపై కూర్చుండబెట్టగా శత్రుఘ్నుడు శ్వేతచ్ఛత్రమునుపట్టగా, సుగ్రీవుడు శ్వేతవర్ణముగల చమరీమృగ వాలముతో చేయబడిన చామరములతో వీవసాగెను"

> తతస్స ప్రయతో వృద్ధో వశిష్ఠో బ్రాహ్మణైస్సహ।
> రామం రత్నమయేపీఠే సహ సీతం న్యవేశయత్॥
> ఛత్రం తు తస్య జగ్రాహ శత్రుఘ్నః పాండురం శుభమ్।
> శ్వేతం చ వాలవ్యజనం సుగ్రీవో వానరేశ్వరః॥
>
> — యుద్ధకాండ 131-59, 64

తత్పూర్వం అయోధ్యాపుర ప్రవేశఘట్టంలో శశిప్రభను భరతుడు, శత్రుఘ్నుడు శ్వేతచ్ఛత్రమును, రెండు శ్వేత చామరములతో ఒకటి లక్ష్మణుడు రెండవది విభీషణుడు చేపట్టినట్లు (సర్గ-131, 28-29 శ్లో) చెప్పబడినది.

"The White Umbrella - Indian Political Thought from Manu to Gandhi" అనే గ్రంథంలో D. Mackenzie Brown యిలా వ్రాసినారు. "In a larger sense the "White Umbrella" symbolizes the soverign power of the world - the protective, sheltering Dharma or 'Firmament of Law" whose instrument the king becomes when he receives the umbrella at the corontion ritual. The ruler and his administration are thereby obligated **to conduct the government in accord with the highest ethical principles of the Hindu tradition - to place public welfare and duty above personal desires.** And the citizen has of course a

corresponding responsibility in his own sphere of activity."

**"The personal integrity of the ruler and the moral sense of the citizen are the keys to sound government and prosperous society offered by Manu and Gandhi alike.** No trick of administrative technique, or organisation, no constitutional devices or amendments can save a government state lacking these essentials."

"The core of the tradition as symbolized by the "White Umbrella" is essentally this — 'The problem of government is the ethical problem of the individual projected into the field of the state.**Its solution lies in Dharma**" (pp. 157 - 161).

## 58. జీవుని ఆత్మకథయే సీతారాములకథ

ఒక గొప్ప గురువు నుండి జ్ఞానప్రవాహం ఒక మహాగ్రంథరూపంగా వెలువడుతుంది. అది భగవంతుని అనంతకల్యాణ గుణాలను బహుధా కీర్తిస్తుంది. లవకుశులు శ్రీరామచంద్రుని పుణ్యచరిత్రను గానం చేశారంటే వారు కీర్తించింది ఈలోకంలో జన్మించిన జీవుని కఠోర జీవితసత్యాన్ని యథార్థంగా గానం చేశారన్నమాట! 'కఠోరజీవితసత్యం' అని ఎందుకంటున్నానంటే "క్షురస్యధారానిశితా దురత్యయా" అనిచెప్పిన కఠోపనిషత్ వాక్యానికి రాముని జీవితం ప్రత్యక్షవ్యాఖ్యానం కాబట్టి. దీనికి ప్రోద్బలకంగానే వాల్మీకి మహర్షికూడా "ఖడ్గధారాపథేనైవ సుభటానాం మనోరథః" అన్న వక్రోక్తి జీవితకారుని వాక్యానికి ప్రమాణంగా రాముని శీలాన్ని నిరూపించాడు. అందులో అంతర్వాహినిగా విశ్వజనీనమైన జీవునివేదనను ప్రవహింపజేశాడు. ఆమహాకారుణ్యస్రవంతి ఒడ్డులొరసికొని ప్రవహిస్తూ కరుణరస మహావిశ్వాన్ని ప్రపంచించింది. కవిసమ్రాట్ విశ్వనాథవారి కల్పవృక్షంలో ఈ జీవునివేదన పరాకాష్ఠనుపొంది శాంతరస మహాసముద్ర సంగమంచేస్తోంది. ఇదే రామకథావాహిని! అటువంటి మహోత్కృష్ట సారస్వత బీజం మనలో కల్పవృక్షంగా వికసించి మన భారతీయసంస్కృతిని యిప్పటికీ చెక్కుచెదరక పరిరక్షిస్తూ ఉంది. బ్రహ్మవాక్కునకు ఎప్పటికీ అన్యథాత్వము లేదుకదా!

శ్లో॥ *యావత్స్థాస్యంతి గిరయః సరితశ్చ మహీతలే।*
*తావద్రామాయణకథా లోకేషు ప్రచరిష్యతి॥*

# 59. విశ్వనాథ రామకథాభాష్యకారిత్వము

వందే కవీంద్ర వక్త్రేందు లాస్యమందిర నర్తకీమ్।
దేవీం సూక్తిపరిస్పందసుందరాభినయోజ్జ్వలామ్॥

కవీంద్రుల ముఖచంద్రుడనెడు లాస్యమందిరమునందు లాస్యము చేయునదియు, సుమధురోక్తుల విలసితములనెడు సుందరాభినయములచే ప్రకాశించునదియునగు సరస్వతీదేవిని నమస్కరించుచున్నాను. (కుంతకుని వక్రోక్తి జీవితము-ఉన్మేషము-1, శ్లో. 1)

వాల్మీకి మహర్షి సంగ్రహరామాయణ కథనములో రామకథ సీతాదేవి చరితమేనని స్పష్టీకరించియున్నాడు. "కావ్యం రామాయణం కృత్స్నం సీతాయాశ్చరితం మహత్," (బాలకాండ-సర్గ 4, శ్లో.7.) విశ్వనాథ, కల్పవృక్షములో పై సత్యముచే ప్రపంచించి స్థాపించినాడు. "సీతమ్మతల్లి ప్రజ్ఞాకథనమే రామాయణ రచన లక్ష్యం" (ఖమ్మం సభా ఉపన్యాసం-ఆంధ్రప్రభ, 21-10-1963, చూ॥ విశ్వనాథవాఙ్మయ సూచికపుట-97) అని నిష్కరించిన విశ్వనాథ, తన స్వగతమునే హనుమంతుని స్వగతముగా జేసి యిట్లున్నాడు.

*"చేతమునందు బూర్వమున శ్రీరఘురాము నెఱింగినట్లుగా*
*నే తలపోసినాడ నిపుడీయమ గాంచిన యంత సర్వ మ*
*జ్ఞాతముగాగనుండెనను సంగతి నాకెఱుగంగ నయ్యెడున్*
***సీత నెఱుంగకుండ రఘుశేఖరుడర్థముకాడు పూర్తిగా"***

— *సుందర-పరరాత్ర-వ. 68*

నిజానికిది పాఠకుని స్వగతము. పై చివరి పాదము సీతాదేవి యొక్క మహోన్నత స్థానమును తప్పక చెప్పుచున్నది. సీతాదేవి అనగా నేమియో పూర్తిగా బోధపడిన విషయము సుందరకాండ ఉషఃఖండమందు కవి హనుమంతుని చేతనే చెప్పించినాడు.

జగత్తంతయు వైష్ణవీతేజస్సుగా దర్శించిన విశ్వనాథ, ధ్వనిగర్భితమైన సన్నివేశకల్పనములెన్నోచేసినాడు. చేసి, తానుకూడ రామకథా భాష్యకారులలో నొకడని ఆత్మవిశ్వాసముతో చెప్పికొన్నాడు.

"భాస, కాళిదాస, భవభూతి, దిజ్నాగు
లకు ప్రశస్త వాగ్విలక్షణుడు మురారి
భట్టునకును రామకథా భాష్య
కారులకును మోడ్పుకై ఘటించి" — కల్పవృక్షావతారిక-ప. *29*

ఈ వ్యాసములో అరణ్యాకాండలోని దశవర్షఖండములో (214 ప. - 216 ప.) కవి కల్పించిన యొకానొక సన్నివేశమును పురస్కరించుకొని విశ్వనాథ రామకథా భాష్యకారిత్వము నిరూపింపబడును. "రామాయణ కల్పవృక్షం వాల్మీకి గ్రంథానికి భాష్యం" (హైదరాబాదు-సభా ఉపన్యాసం - ఆంధ్రపత్రిక, 29-10-1959 చూ॥ విశ్వనాథ వాఙ్మయసూచిక, పుట-97) అని కవి స్పష్టీకరించిన దాని కుపబలకముగా తక్కిన కాండలలో అయాచోట్ల వివిధపాత్రలచే తాను ప్రత్యక్షముగనో పరోక్షముగనో చెప్పించిన వాక్యములు గ్రహింపబడును. ప్రధానముగా నొక సన్నివేశమునే దృష్టిలో పెట్టుకొని 'రామాయణము సీతాదేవికథ' యను మహర్షివాక్యము సోపపత్తికముగా నిరూపింపబడును.

## కథాసందర్భము — వాల్మీకి విశ్వనాథులు

సీతారామలక్ష్మణులు సుతీక్ష్ణుని యాశ్రమమునుండి సెలవునైకొని బయలుదేరినారు. సుతీక్ష్ణమహర్షి శ్రీరాముని 'భుజాద్భుతవృత్తి'ని (అరణ్య దశవర్ష-177 ప.)ని ప్రశంసించినాడు. దానికి ముందే రాముడు సర్వర్షిసంఘము ముందిట్లు ప్రతిజ్ఞచేసి యుండుట తత్ప్రశంసకు కారణము.

"ఇది వాగ్దానము మీతపః పరమ సాహిత్యంబు నిత్యత్వ సం
పద వర్ధిల్లగ దైత్యయూథముల వ్యాపాదింతు నే గాఢ వ
న్యదరీ గూఢుల నైన గూడికొని యిట్లై వచ్చి యర్దింతు నా
పదలో దీవ్రత యెంతయో తెలియ సర్వర్షుల్ నమస్కారముల్."

ఆ మాటలు వినిన సీత సుతీక్ష్ణునినుండి సెలవుగ్గైకొని పోవునప్పుడు దారిలో "-స్వామియల్ల ఋషి సంచయ మాడినమాట చేయ నెంచెన!?"యని "నిశ్చయంబయిన చేరికగా బతితో పోవుచు" నిట్లన్నది. ఎవరికి గాని 'అకారణవైరము' కూడదన్నది. "తల్లి కానకు పంచగా, మన భాగ్య మీవిధముకాగా అది చాలనట్లు యీ తీరున విరోధములు నెత్తికిగొని తెచ్చుకొనుట యెందులకు?" అని మెత్తగా మందలించినది.

"ఆ దైత్య సంతాన మేమైన నీకపరాధమున్ సలిపెనా యోగాని నిర్హేతుక ప్రాణాపాయము వారికేటికి ఘటింపంజూతువో చెల్లరే" అని సీత 'చనువు'గా రాముని కార్యవిముఖుని చేయుటకు యత్నించినది. చిట్ట చివరిగా —

ఆష్టమెయి వేల యేండ్లులు
క్ష్మాస్థలి పాలింప ధర్మ సంగ్రహణ రసా
గ్ర స్థాయి తపము చేయక
ప్రస్థానము వైర కలుష భావమ్మునకా?"

అని సూటిగా ప్రశ్నించినది. పై ఘట్టము వాల్మీకమునందును ఉన్నది. కాని, అచ్చట సీత చివరకు చెప్పినమాటలివి. "స్త్రీచాపల్యముతో నేనేదియో చెప్పితి ననుకొనుకుము. ఇది ధర్మమని నీతో చెప్పుటకు సమర్థుడెవరు? నీవు చక్కగా ఆలోచించి, నీ తమ్మునితోను కలిసి విచారించి ఏది యిష్టమో అటుల చేయుము." (సర్గ-9, శ్లో. 33) ఇవి జానకి భర్తమీద ప్రేమతో పల్కినమాటలు. ధర్మస్థితుడైన రాముని కార్యవిముఖుని చేయుటనగా కార్యోన్ముఖుని చేయుటయే. 'రామోవి గ్రహవాన్ ధర్మః' 'రామాద్విర్నాభిభాషతే' అన్న మహర్షి వాక్యముల కర్థమిదియే. ఒకమాట, ఒకబాణము, ఏకపత్నీవ్రతము రాముని జీవితధ్యేయము. కావుననే, వాల్మీకములోను, కల్పవృక్షములోను సీత, రాముని పరదారసంగమము, అసత్యము లేనివాడని ప్రశంసించినది. (శ్లో. 4. -అరణ్య-దశవర్ష-187 ప.) సీతకు రాముడిచ్చిన సమాధానముపై ఆమె చేసిన చమత్కారములో కథాధ్వని యిమిడియున్నది. అదికేవలము పైకి చమత్కారము. దాని వెనుకనున్న రహస్యము సహృదయహృదయైకవేద్యము. ఈ రహస్యమయ సన్నివేశ స్రష్ట విశ్వనాథ. ఇది వాల్మీకి చెప్పనిది.

శ్రీరాముడు, సీతచెప్పిన మాటలలోని పరమార్థము గ్రహించినాడు. ఆమె నుద్దేశించి రాముడు చెప్పిన మాటలు వాల్మీకమునందు మూడు శ్లోకములలో నున్నది (సర్గ-10, శ్లో. 2, 20, 21) అందు మొదట, చివర చెప్పిన శ్లోకములలోని భావములు విశ్వనాథ రెండు పద్యములలో చెప్పినాడు. "-సర్వము యథార్థము సెప్పితి వంతెకాద, యెంచగ హిత మింతకంటెను నేసంగద, నాదగు మంచి నిన్నుమించి గణన నేయుగానెవరు?" (అరణ్య-దశవర్ష-204, 205 ప.) అని వెంటనే "క్షత్రియైర్ధార్యతే చాపో నార్తాశబ్దో భవేదితి" (అరణ్య-సర్గ. 10, శ్లో.

3) అని తన స్వాభిప్రాయమును వెల్లడించినాడు. దీనికి విశ్వనాథ రచన యిట్లున్నది.

క్రమమొప్పంగను నాల్గు ధర్మములలో గైవ్రానగా క్షత్రధ
ర్మము కోదండము, వ్రాని యార్తజనసంరక్షా విధానంబు ధ
ర్మము వాగ్దానము తీర్చుటో పరమ ధర్మం బీ త్రయీ ధర్మము
త్తమ మస్మత్ప్రియ మీ తపస్విజన మద్ధా! యేమి కానోనొకో!"
— అరణ్య-దశవర్ష-*207* ప.

వాల్మీకి సూచించిన యంశమును ప్రపంచించిచెప్పుట విశ్వనాథ కథా భాష్యములో నొక లక్షణము. "మునీనాం అన్యథాకర్తుం సత్యమిష్టం హి మే సదా" (సర్గ, 10, శ్లో. 18) అన్న శ్లోకభావమును కూడ యిందు సంగ్రహించినాడు కవి. క్షత్రియశబ్దోత్పత్తి యేమి? క్షతాత్త్రాయత ఇతి క్షత్రియః అని. ఆ క్షతి ధర్మక్షతి.అది జరుగు చున్నప్పుడు ధర్మసంస్థాపనార్థము శ్రీరాముడు ఋషికార్యమును నెరవేర్చుటకే ఋష్యశృంగర్షి ఆధ్వర్యమున జరిగిన యజ్ఞమున అవతరించి ఇక్ష్వాకు వంశమున క్షత్రియుడై జన్మించి తమ జీవితమును ధర్మయజ్ఞముగా గడుపు మహర్షుల సనాతన ధర్మమును పరిరక్షించుటకు కంకణము కట్టుకున్నాడు. (అరణ్య-దశవర్ష-122, 124, 125 ప.) అదియే పై 'వాగ్దానము' లోని రహస్యము. (ఋషిప్రోక్తమైన ధర్మమును అనుష్ఠింప వలసినవాడు మానవుడు. లోకానికి రాముడు నడచి చూపించిన ఆదర్శమిది.) అట్టి 'వాగ్దానము'ను సీత మెల్లగా త్రోసిపుచ్చి మాట్లాడగా రాముడు క్షాత్ర ధర్మమును గూర్చి ప్రసంగించి చివరి కిట్లన్నాడు.

*"వలసిన నిను వదలెదనో*
*వలసిన సౌమిత్రి గూడ వదలెద నో మై*
*థిలి! తన చేయు ప్రతిజ్ఞా*
*స్థలనము ప్రాణంబు తోడ గానీకుండన్,"*

*"రాఘవులు మౌనులును దపోరక్ష త్రత*
*కలిత వాగ్దాన మిద్ది యుగాలుగాగ*
*యోగవద్య సంగత సమాహార ధర్మ*
*శుద్ధి నేనటవే పరిచ్యుతుడ నిచట."* (అరణ్య-దశవర్ష-*212, 213*)

ఇందు భవిష్యత్కథాసూచియైన మొదటి పద్యమునకు మాత్రము

మూలమున్నది. (అరణ్యకాండ-సర్గ.10,శ్లో.18.19.) రెండవది విశ్వ నాథ వ్యాఖ్యానము. రాముని వాగ్దానము నేడు క్రొత్తదికాదు. అది వంశపారంపర్యముగా వచ్చు వాగ్దానమట అనలేవాగ్దాన మిప్పటిదికాదు. వైకుంఠములో దేవతలకు, ఋషులకు శ్రీమహావిష్ణువు యిచ్చిన వాగ్దానమును యిది స్ఫురింపజేయుచున్నది. సకోదండమైన రాముని ఈ మునివేషమును ఈనాడు కొత్తగా సీత తప్పు పట్టవలసిన పనిలేదు. "భుజలంబమానమైన శార్ఙ్గధనువుతో స్వామి తన బహుకల్పనిత్యమగు తాపసిరూపుతో దశరథుని పుత్రకామేష్టిలో అవతరించడం దేవతలు ఋషులుచూచి గుర్తుపట్టారు. దీనికి కల్పవృక్షం అవతార ఖండంలో సమాధానం నిక్షేపించి యుండడం కవిప్రతిభ! మూలములో క్షాత్రధర్మ మునుగూర్చి రాముడు ప్రసంగించిన వెంటనే దండకారణ్య నివాసులైన మునులు శరణువేడి తమ బాధలు చెప్పికొన్న విధము పదకొండు శ్లోక ములలో నున్నది (సర్గ. 10. శ్లో. 5-15). దానిని విశ్వనాథ రెండు పద్యములలో కుదించినాడు (అరణ్య-దశవర్ష-210, 211 ప.). వాల్మీకి రామాయణములో నీఘట్టము ఈ క్రింది శ్లోకభావముతో ముగిసినది. "మహాత్ముడు, ధనుష్మంతుడైన రాముడిట్లని పలికి తన ప్రియురాలైన మైథిలితో సలక్ష్మణుడై రమణీయమైన తపోవనమునకు వెళ్లెను" (సర్గ-10. శ్లో. 22).

## విశ్వనాథ వినూత్న కథాకల్పన

వాల్మీకీయమునందు అరణ్యకాండ దశమసర్గాంతమునకు, ఏకాదశసర్గప్రారంభమునకు మధ్య విశ్వనాథ తానొక చక్కని సన్నివేశకల్పనము చేసి కథతో కలిపినాడు. ఆ కల్పనయే రామకథాభాష్యము. దశమ సర్గాంత శ్లోకభావముపైన చెప్పబడినది. దాని వెంటనే, అనగా రాముడు తన వాగ్దానము రఘువంశము యొక్క వాగ్దానమేయని నిష్కర్షించిన వెంటనే, కథాభాష్యకారుడైన కవి ఒక చిన్న వచనపు తునక వ్రాసినాడు. అది యిది.

**"అంత జానకి పతిచేతిలోని ఖడ్గము తాను దీసికొని నడచు-మంబోగా."** (అరణ్య-దశవర్ష-214 వ.)

ప్రణవములో ప్రపంచమంతయు పర్యవసించునట్లుపై వచన శకలములో సకల రామకథాపరమార్థతత్త్వమంతయు పర్యవసించుచున్నది. మహాకవి పరిణతప్రజ్ఞకిది దృష్టాంతము. మూలములో 'రామో ధనుష్మాన్'

అనియే చెప్పినాడుకదా! రాముని చేతికి కత్తియెట్లు వచ్చినది? అని ప్రశ్నింపవచ్చును. వాల్మీకములోనూ, కల్పవృక్షములోను అరణ్యప్రవేశము చేయునపుడే రామలక్ష్మణులిద్దరి చేతిలో చెరియొక కత్తియున్నది. "ఒడ్డెల్లన్ బహుకంటకావృతముగా నున్నన్ సుమిత్రా సుతుండడ్డం బాచిన కత్తితో దుడిచి యోగ్యాసీనతా స్థానమేర్పరచి"నాడు (అరణ్య-దశవర్ష-26 ప.). విరాధుని బాహువులను రామలక్ష్మణులిద్దరు ఖడ్గముతోనే ఛేదించినారు (సర్గ. 3, శ్లో. 20, 21) కావున, కత్తులతోను, విల్లంబులతోను అన్నదమ్ములు వనప్రవేశము చేసిరనుట స్పష్టము.

విశ్వనాథ ఈ ఘట్టమును కల్పించుటకు మూలములో ఆధారమేమైన యున్నదా? అని ప్రశ్నించినచో నది స్పష్టముగా లేదు కాని లీలగా ఆధారమనదగిన ఒక పురావృత్తకథనమును సీతయే వాల్మీకీయమునందు చేసియున్నది (సర్గ. 9, శ్లో. 16-23). ఆ పురావృత్తమును విశ్వనాథ సీత కూడ చెప్పియున్నది (అరణ్య-దశవర్ష-194-196 ప.). ఆ కథ సీత రామునితో ప్రసంగించు నీఘట్టమందే యున్నది. విశ్వనాథ, సీత చేతికి కత్తి నిప్పించుటలో అవ్యవహిత పూర్వకమైన తత్పురావృత్తకథనమే ప్రేరకమై యుండునని నేను భావించుచున్నాను. ఎట్లనగా, మూలములో లేశమాత్రముగా (8 శ్లోకములో) సీత తన వాదమునకు పబలకముగా చెప్పిన యీ కథ రాముని సమాధానముతో నివృత్తమయినను ఆ కథ సీత ముఖవినిస్సృతము గనుక దానికి ప్రాధాన్యమీయదలచినాడు విశ్వనాథ. ఎంతలేశ మాత్రమైన కథయైనను ఆ కథలోని మునిచేతిలో ఖడ్గమున్నది. వల్కలములు ధరించిన రాముని చేతిలోను ఖడ్గమున్నది. ఇది బాహ్యముగా కథాగత సామ్యము. మరియు వేషధారణ దృష్ట్యా పరస్పర విరుద్ధము (Juxtaposition) దీనికే, రాముడు తాను మునికాదు. క్షత్రియుడని సమాధానము చెప్పి సీత వాదము పరాస్తము చేసినాడు. కాని సీత తనవాదము నెగ్గించు కొనవలయును కదా! ఏ ఖడ్గముయొక్క నిమిత్తమనవసరమని సీత దృష్టాంత పూర్వకముగా వాదించిన దానిని రాముడు కాదని త్రోసి పుచ్చినాడో ఆఖడ్గము రాముని చేతియందుండుట సీతకు ఓర్వరానిదైనది. వెంటనే ఆ ఖడ్గమును తాను లాగికొని కోపముతో చరచర ముందుకు నడచివెళ్లినది.

ఇంతగా స్ఫురించుచున్న విషయమునకు మూలమున ఆధారములేదు అన్నను వచ్చు నష్టమేమియులేదు. ఎట్లయినను పై సన్నివేశ కల్పనమునందలి తార్కికానుస్యూతి (logical sequene) వాల్మీకమునందు లేదు.

కావున నిది అమూలక సన్నివేశ చిత్రణమే, 'కేవలము సన్నివేశము కల్పించినంత మాత్రమున ప్రయోజనములేదు. దానిని ఔచిత్యము చెడకుండ నిర్వహించుటలోనే యున్నది మహాకవి ప్రతిభ.' అనవచ్చును. విశ్వనాథ ప్రతిభ యీ ఘట్టమునందు ధగద్ధగాయమానముగా నున్నది. అనరాదు గాని వాల్మీకి రామాయణమందును యిట్టి కల్పనలు సకృత్తే. ఎందుకనగా, రామహస్తమందలి ఖడ్గము సీత హస్తమునకు ప్రదానము చేయించుట యీ ఘట్టమునకే పరిమితమై యింతటితో ముగిసిపోవుట లేదు. కల్పవృక్షములో ఈ ఖడ్గప్రస్తావన అనేక ముఖములుగా వ్యాపించి యుద్ధకాండలోని నిస్సంశయ ఖండమువరకు ప్రస్తరించి యున్నది. ఇది మున్ముందు వివరింపబడును.

తీలగా మూలమని చెప్పదగిన ఆ పురావృత్తమిది. సీత తాము తపము చేయుటకు వచ్చితిమి గాని అకారణవైరము కొనితెచ్చుకొనుటకు కాదు అనుచు, మరి ఈ కత్తులు, విల్లంబులు చూచినవారు తమ తమ పనులు చేసిపెట్టుమనుటచే వైరము తటస్థపడుచున్నదని చెప్పచు, దానికి దృష్టాంతముగా నొకముని శుచియై, సత్యవాక్కై తపము చేయుచుండగా ఐశ్వర్యలోభియైన యింద్రుడు కావలెనని ఆ మునికొక ఖడ్గమిచ్చి దానిని రక్షించుచుండుమనెను. అది న్యాస వస్తువుకదా యని ఆ ముని దానిని హస్తమందే ధరించి మొదట దుంపలను, పిదప మృగములను ఆ పిమ్మట అన్నియు ఖడ్గముతోనే చేయసాగెను. ఖడ్గమును రక్షించుట మాని ఆత్మరక్షణకై, ఉదరపోషణకై దాని నుపయోగించి తపస్సుకు దూరమయ్యెను. దానితో మోక్షమార్గదూరుడై, నిషాదుడై చెడిపోయెను. మూలములో యీ కథ ఎనిమిది శ్లోకములలో నుండగా విశ్వనాథ దానిని మూడు పద్యములలో చిత్రించినాడు. ఈ కథా ప్రసక్తి తరువాతనే రాముడు క్షాత్ర ధర్మమును గూర్చి ప్రసంగించినది. సీత వాదమేమనగా తాము వల్కలములు ధరించితిమికదా తపోవృత్తికి తగిన మునులమను అహింసావాదము. రాముని వాదమేమనగా తాము జన్మతః క్షత్రియులుకదా తద్ధర్మమాచరింపవలెనను క్షత్రియోచితవాదము. అప్పుడు సీత యేమిచేయవలెను? ఏమి చేసినది? రామునిచేతిలోని ఖడ్గము తానుతీసుకొని ముందుకునడచినది. కనుక పైపురావృత్త కథనము నుండియే ఈ సంఘటన వెలువడినది. కథాకథన విశ్లేషణముచే నిది అవగతమగు విషయము. ఏది యేమైనను విశ్వనాథ వంటి ప్రతిభావంతుడే పై సున్నితమైన కల్పన నిశితముగా చేసి నిరూపింపగలడు.

సీత యిట్లు వాదించుటలో అంతర్యము లేకపోలేదు. ఆమె తాను

చేయు వాదన తర్కసహముకాదని తెలిసియే, దానినట్లుగా కనపడనీయక వాదించినది. రాముని సత్యసంధత ఏమాత్రము స్థిరమైనదో నిశ్చయించుటకే పై వాగ్వాదము చేసినది. ఇది పరోక్షముగా రాముని మనః స్థైర్యమునకు సీత పెట్టినపరీక్ష. ఆ వాదనలో రాముడు నెగ్గుటతో ఆమెయే రాముని తత్త్వలప్రాప్తి పర్యంతము ముందుండి కథనడిపించినది. రావణునికి స్వయముగా తానే పట్టుపడినది. దానికి తానేతగిన వెసులుబాటును కల్పించినది. సీత చేతిలోని కత్తికింత అర్థస్ఫోరకత్వమున్నది.

పై సున్నితము, నిశితము అయిన కల్పనలో కవి చేసిన రెండవ మార్పు సీతారామలక్ష్మణులగమనము. నిజముగా అది మార్పు కాదు. వాల్మీకి సీతారామలక్ష్మణుల గమనమును రెండు విధములుగా చెప్పియున్నాడు. అయోధ్యాకాండలో వనప్రవేశసమయమున—

*అగ్రతో గచ్ఛ సౌమిత్రే! సీతాత్వామనుగచ్ఛతు।*
*పృష్ఠతోఽహం గమిష్యామి, త్వాంచ సీతాంచ పాలయన్॥*

— అయోధ్య (సర్గ, 52, శ్లో. 96)

అని చెప్పబడినది. ఇందు, ముందు లక్ష్మణుడు, అతని వెనుక సీత. ఆమె వెనుక రాముడు. ఇదీ వరుస. కాని, అరణ్యకాండ ఏకాదశ సర్గ ప్రారంభశ్లోక మిట్లున్నది.

అగ్రతః ప్రయయౌ రామః సీతా మధ్యే సుమధ్యమా।
పృష్ఠతస్తు ధనుష్పాణిః లక్ష్మణోఽను జగామహ॥

— అరణ్యా-సర్గ-11 శ్లో. 1

ఈ శ్లోకానుసారము రాముడు మొదట. సీత పిమ్మట. లక్ష్మణుడు కడపట. వాల్మీకి చేసిన ఈమార్పుకు పెద్ద ప్రయోజనమేమియు లేదు. కావుననే, విశ్వనాథ, అయోధ్యాకాండమందలి పై వరుసనే గ్రహించినాడు.

*"మును లక్ష్మణుడు, జానకి*
*వెనుకను, మఱియామె వెనుక వీరుడు రాముం*
*డును గాగ బోవుచున్ రా*
*ముని కనులామె కచభారముననే యుండెన్"*

— అరణ్యా-దశవర్ష-215 ప.

రాముని దృష్టి సీత కచభారముపై ప్రసరింపవలెననియే విశ్వనాథ,

పై మార్పును చేసెను. దీని వెంటనే వచ్చిన "దీప్రమోహన చంద్రకి....." యిత్యాది సీస పద్యము దేవి కచభరము యొక్క వర్ణన. ఇందలి రహస్యార్థమేమి? ఇది పరిశీలనాంశమగుచున్నది.

రహస్యార్థ పరిశీలన మనగా ఒక సన్నివేశము వెనుకనో, ఒక మాట వెనుకనో నున్న యాథార్థ్యమును భావించి వెలికితీసి అది కథకు, రసమునకు యెంతవరకు పరిపోషకమగుచున్నదో యెంత అవినాభావ సంబంధము గలిగియున్నదో వేర్వేరుగా వింగడించి చూపుట. కథ నుండి ఒకానొక సన్నివేశము సంఘటించినది, అనగా కథలో తత్సన్నివేశ కల్పనమునకు వెసులుబాటున్నది. ఆ కల్పన వట్టి కల్పనయైనచో కథకు యేమాత్రము ప్రయోజనములేదు. అట్లుగాక, కథ యనగా నది నిబిడ సన్నివేశ నిబద్ధము, సంఘటనాబద్ధము గనుక కథాగతికి దోహదము కల్పించు నొక సన్నివేశ కల్పనము కవి స్వకపోలకల్పితమైనప్పుడు తత్కల్పనమునందలి సార్థక్యము, ఔచిత్యము-తత్రాపి ప్రసిద్ధేతి వృత్తముగల రామాయణాదిమహాకావ్యకథాకథనములో విచారణీయాంశమగుచున్నది.

మహాకవి యైనవాడు ఊరకయే ఒకసన్నివేశమును ప్రయోజనరహిత ముగా సృష్టింపడు. "బహుళార్థ సంగ్రహణ బంధురధీకుడైన" విశ్వనాథ, "వ్యాఖ్యానలబ్ధ విశేషప్రతిపత్తియున్నయెడ నా వ్యాఖ్యానము" అని ఏ సీత ఖడ్గధారియైన మునివృత్తాంతము చెప్పినదో యాసీత ముఖతః చెప్పించి దానిని ఋజువు చేసినాడు. కథాభాష్యమన్నది విశ్వనాథకు కొట్టినపిండి. "విశ్వంభర సత్యసంస్థ" యైన విశ్వనాథ సత్యనారాయణ "సత్కృతిమతల్లిశ్రేణిక"ను గూర్చినవాడు. అతడు "సకలార్థ ప్రవిభాగధీ పరిణత స్వచ్ఛాత్మకుడు" గనుకనే రామకథాభాష్యము రచింపగలిగినాడు.

కల్పనలో వర్ణనకు వీలున్నది. ఆ వర్ణన సుదీర్ఘము కారాదు. క్లుప్త ముగా, సమర్థముగా, సార్థకపదప్రయోగ నివిష్టమైయుండవలెను. పిండి తార్థమేమనగా కల్పన, వర్ణనకూడా కథాకథన శిల్పములో నొకభాగమే. కవికృతమైన కల్పన, తదంతర్గతమైన వర్ణన, శిల్పపరిపోషకము లెట్లగు చున్నవో పరిశీలించుటకే రహస్యార్థ పరిశీలనమని పేరు. శిల్పమనగా అనేక రహస్యార్థములతో కూడుకొన్నది. అది సన్నివేశమును పుట్టించుటకు వల యుశక్తిగలది. కథలో నైసర్గికముగా నిక్షిప్తమైన ఆ దుంపనుండి అపూర్వ సన్నివేశము సృష్టించుట యనగా కవి తత్కథాతత్త్వమున పారము ముట్టినవాడు కావలెను. లేనిచో ఆ కల్పన వట్టి కల్పనగా మిగిలిపోయి నిష్ప్రయోజనమగును. సార్థకమైన కల్పనలోనే కవి ప్రతిభగుర్తింపబ

డును. ఒక ప్రసిద్ధేతివృత్తమునకు భాష్యము చెప్పుటయనగా నిర్దిష్టక్లిష్ట కల్పనలే కవిప్రతిభకు నికషోపలము. సన్నివేశ కల్పనకై కవి గ్రహించిన ఘట్టమునకు తత్పూర్వాపర సందర్భములు దానిని విశేషముగా సమర్థించవలెను. ఈ వైలక్షణములన్నియు విశ్వనాథ కల్పవృక్షములో కల్పించిన సన్నివేశముల కన్నింటికి అన్వయించుచున్నది.

విశ్వనాథ యొక్క సన్నివేశ కల్పనలో గల విశిష్టతయేమనగా అది కల్పన యన్నంతవ్యస్తముగా కన్పడక సహజముగా కథాధోరణిలో కలసిపోవునంత సూక్ష్మతంతువుగా నుండును. అనగా కవి యిక్కడ ఒక రహస్యార్థము నిక్షేపించినాడు అని పాఠకుడు గుర్తుపట్టుట కష్టమగును. సూక్ష్మపరిశీలనామతియైన పాఠకుడు తప్ప తత్కల్పన యందలి విలక్షణత్వమును గ్రహించి ఆస్వాదింపలేడు. కవి వాడిన మాటలు కథలో నెంతవరకు ప్రసరించునో గ్రహించుట "వ్యాఖ్యానతో విశేషప్రతిపత్తిః నహి సందేహాదలక్షణమ్" అన్నట్లుగా వ్యాఖ్యాతృమేధా విలసితమై యుండును. కావున ప్రతిభోన్మేషితమైన ఒకానొక కవి కల్పన యందలి యౌచిత్యమును ఒకానొక విలక్షణశక్తిగల పాఠకుడే పట్టుకొనగలడు. సహృదయుడనగా అతడు. పరమ భావుకుడనగా అతడు.

## సీతాదేవి త్రైలోక్య సర్వ స్త్రైణాకృతి పూనిన అంబిక

అంతవరకు సీత చేసిన ప్రసంగమేమి? ఇప్పుడిట్లు రాముని ఖడ్గము తానుగైకొని అతనికంటే ముందు నడుచుటలోగల అంతరార్థమేమి? "ఇంతవరకు నేను చేసిన వాదనను నీవు ధర్మము కాదని త్రోసి పుచ్చితివి. పైగా ధర్మోపన్యాసము చేసితివి. నీధర్మము, నీజీవితము రెండును అసిధారావ్రతముగా నున్నవి. కత్తివాదరవలె నీధర్మము నిశితము, దురత్యయము. దానిని నీవు అనుష్ఠింతుననుచున్నావు. అట్లైనచో దానికి నేనే అధిష్ఠాత్రిని. కనుక ఆ ఖడ్గము నిజముగా నాచేతిలోనిది. నాకిమ్ము. నీవు నావెంట నడువుము. నేను పోయెడి మార్గమే ధర్మమార్గము. అదియే నీ మార్గము, ధ్యేయము కూడ. విశేషించి, నేను నీ ధర్మపత్నిని, సహధర్మచారిణిని. అట్లయినను నీవు నామాట వినవలసినదే. నా వెనుక నడువ వలసినదే." ఇది సీత చెయిదములోని అంతరార్థము.

రాముని ఆగామి జీవితమంతయు అతని ధర్మనిష్ఠకు సీతాదేవి పెట్టిన పరీక్ష. రాముని 'వాగ్దానము' సీత 'వాగ్వాదము'తో స్థిర పడినది. దానికీ సంఘటన నాంది పలుకుచున్నది. తత్పర్యవసాన

మెట్లున్నది? సీతాపహరణము జరిగి రామాయణమంతయు నడచినది. అరణ్య కాండములో జరిగిన యీ వాగ్దాన వాగ్వాదములకు సమాధానము యుద్ధకాండలోని ఉపసంహారణ ఖండమందున్నది. అనగానేమి? అది రామాయణముగాదు. 'సీతాయణము'. రాముని ధర్మనిష్ఠ మహాల బీజముకాగా సీత ముందునిలిచి కథ నడిపినది. ఆ బీజము పెద్ద వృక్షమైనది. సీతను రాముడనుసరించగా రామకథ పూర్తియైనది. అది "సీత కథ" అన్నాడు మహర్షి. నిజమే! రాముని నిజజీవితము, ధర్మానురక్తి ఈ రెంటికీ అభేదాధ్యవసాయము. 'రామాయణ' శబ్దములో వలెనే రామునికి సీతకు అభేదాధ్యవసాయము. సీతను పరిగ్రహించుటయూ, పరిత్యజించుటయూ యన్న సంశయము వచ్చిపడినప్పుడు తనకెదురుగా నడచివచ్చి నిలుచున్న సీతనుచూచి రాముడిట్లనుకున్నాడు.

"ఈ యమ హేతువై వనులనెల్ల జరించెను దా బికారిగా
నీయమ హేతువై జలధికెంతొ శ్రమంపడి కట్ట గట్టె దా
నీయమ హేతువై గెలుచుటెంతొ శ్రమంబయి పోయె లంకలో
నాయమ జూచినంత హృదయంబున బట్టగరాని కోపమై"

"అతడు రాక్షసుండటంచు సౌమిత్రి వ
చించె నుంత వినదు చెలువ తాను
ననుభవించె దాను ననుభవించితి మేము
నాడదింత సేయు ననుచు గలదె?"

"ఇట్లూహించుచు రాముడు మనసులో నూరక కోపంబు పెంచుకొంచుండగా (యుద్ధ-ఉపసంహారణ-121, 122, 123 ప.)

ఈవిధముగా మనసులో కోపమును పెంచుకొనుచున్న భర్తను నిలుచున్న సీత విలోకించినది. అతని యింగితమును వెంటనే గ్రహించినది. లక్ష్మణునో, విభీషణునో, సూర్యసుతునో చూచుకొమ్మనిన రాముని దూషణ వాక్యములు విన్నది (139 ప.). గుండెలు దహించు మాటలవి. కావుననే అగ్నిలో జొత్తునన్నది. చివరి కిట్లన్నది.

"ఆడది యింత సేయు ననుటన్నది యున్నదె యంచు నన్నునూ
టాడితి, కైక కోరక మహాప్రభు నీవనిరాక లేదు. నీ
యాడది సీత కోరక మహాసుర సంహరణంబు లేదయా
యాడది లేక లేద జగమంచు నిదంతయు నేన చేసితిన్"(154)

ఇది రాముడు మనస్సులో నూహించిన దానికి సీత ప్రత్యక్షముగా నిచ్చిన సమాధానము. భర్తయొక్క యింగితమును ఆమె యంత చక్కగా నెఱింగినది. ఇదంతయు నేనచేసితిన్, ఇది సీతాదేవి మాహాత్మ్యము. ఇంకను చెప్పవలయునన్నచో భర్తయొక్క అప్రతిహత శక్తి సామర్థ్యము లామెకే తెలియును. తన్నుచుట్టు ముట్టిన దానవస్త్రీలతో సీత యిట్లన్నది.

*"వారిధి యడ్డమున్నదని వట్టినధైర్యము నాత్మవంచనం*
*బా రఘురాము బాణముల కడ్డులు శైలము లడ్డురావు దు*
*ర్వార తదీయ దివ్యతమ బాణమహాగ్నికి నింకి పోవునో*
*యూరకయే కరంగి చనునో యదినేన యెఱుంగ గల్గుదున్"*
*(సుందర-పరరాత్ర-320, ప.)*

ఇది భవిష్యత్కథా సూచకము. రాముడు సాగరతీరములో నిలిచి చూపిన పరాక్రమమును స్ఫురింపజేయుచున్నది (సుందర-సంధ్యా-348, 350 ప.). ఇంకను నిరూపింపవలయునన్నచో, విభీషణుడు స్నాతానులిప్తాంగియైన జానకీదేవిని రాముని సన్నిధికి సగౌరవముగా పిలుచుకొని వచ్చుచుండగా నచ్చట సమావిష్టులైన వానరదైత్యవీరులలో కలిగినగొప్ప సంరంభమును కవి యిట్లు వర్ణించినాడు.

*"ఏ స్త్రీ కోసము దక్షిణాంబునిధి యిట్లేదెన్ రఘూత్తంసుడా*
*యేస్త్రీ కోసము చంపెనో సకల దైత్యేంద్రున్ మహాయత్నుమై*
*యాస్త్రీ స్త్రీవలె గాక వేఱ యెదియో యయ్యయ్యొ త్రైలోక్య స*
*ర్వస్త్రైణాకృతి పూని యుంబిక వలెం బద్మాక్షి రంజిల్లునో!"*
*— యుద్ధ-ఉపసంహారణ-113 ప.*

సీతాదేవి అంబిక! వట్టి అంబిక కాదు. త్రైలోక్య సర్వస్త్రైణాకృతి పూనిన అంబిక! రాముని ఖడ్గమును తానుగైకొని ముందుకు నడచిన సీత 'ఖడ్గధారిణియైన అంబిక' అని కవి స్థాపించినాడు.

*ఈ అంబికయే రావణుని 'ఖడ్గరావణుని' చేసిన అంబిక!*
*తన చేతిలోని కత్తి వంటి కత్తిని తనభక్తునకు అనుగ్రహించిన*
*అంబిక! ఆ తర్వాత వాడు 'ఖడ్గరావణ మహామంత్రాధి*
*దైవతము'కాగా రామాయణ మంతానడిపించి రాముడు*
*విష్ణువని వానికి తెలియజేసి సంహరింపించిన అంబిక!*

రామునిచేతిలోని కత్తి మహావిష్ణువుయొక్క 'నందక'మనే ఖడ్గమే కావచ్చు! కాని రామావతారంలో రాముడు 'కోదండపాణి' తప్ప 'నందకపాణి'కాదు. మరి ఆ ఖడ్గమెవ్వరిది? సీతది-అనగా పరాశక్తియైన అంబికది! ఆ ఖడ్గము నిజముగా ఆమె చేతిలోనిది కాబట్టి ఆమెకే యిప్పించినాడు కవి! పరాశక్తి తన ఖడ్గమువంటి ఖడ్గమును తానే ఒకప్పుడు యిచ్చి రావణుని 'ఖడ్గరావణు'ని చేసియుండగా వాడిప్పుడు తనకే ఎదురు తిరిగినాడు. వానిని సంహరించుటకు ఖడ్గధారిణియైన సీత ఈ ఘట్టమునుండి కంకణము కట్టుకొని ముందుకునడిచినది. రాముడామెను అనుసరించినాడు. ఇది కధాభాష్యము! 'ఇదంతయు నేన చేసితిన్' 'అది నేన యెఱుంగ గల్గుదున్' ఇంతకు 'సీతాదేవికి తెలిసినదేమి? ఆమె చేసిన దేమి? శ్రీరాముడు పైన తాను చేసితినని చెప్పుకొన్నవన్నియు సీత చేసినవే. చేసినవనగా ఆమె కారణముగా రాముడు చేసినవి. సీత తానై చేయక రామునిచేత చేయించినవని యర్థము. ఆమె 'వైష్ణవీశక్తి!' 'అనంతవీర్య!' (దేవీ మాహాత్మ్యమ్ అధ్యా XI, శ్లో. 5) 'సమస్త జగధారభూత!' అలంఘ్యవీర్య!' (శ్లో. 4). 'సర్వభూతాంతర్గతయైన విష్ణుమాయ (అధ్యా. V, శ్లో. 5)

రాముని అభ్యుదయ మంతయు ఆమె చేతిలోనున్నది. ఆమెకు సర్వము తెలియును. రావణ సంహారమునకై పుట్టిన వేదవతియే యామె అని దేవీ భాగవతాదులు చెప్పుచున్నవి (శ్రీదేవీ భాగవతము-నవమస్కంధము). ఆమె రావణుని విడిచిపెట్టునా? వానిని తాను సంహారించదు. రామునిచేత చంపించును. ఆమె శక్తిస్వరూపిణి. భగవంతుడు గీతలో తాను సమస్త జగత్తును ఓజస్సుచే ధరించి యున్నానని చెప్పినాడనగా అర్థమేమి? (శ్రీమద్భగవద్గీత-అధ్యా 15. శ్లో. 13). ఆ ఓజస్సుయే దేవి! అదియే అనంత, అలంఘ్యవీర్య! ఇది దేవి యొక్క శక్తి! ఆశక్తిని సద్వినియోగము చేయుటలో నిమిత్తమాత్రమైన సాధనము రాముడు. ఫలితము పర్యవసించునది దేవిలో. కాని కీర్తిప్రతిష్ఠలు సాధనభూతుడైన రామునికే. అసలు ఫలితమెట్టిది? అది ధర్మసంస్థాపనము. ఇది రాముని జీవితధ్యేయముగా నిశ్చయించినదెవరు? సీతాదేవియే! సీత రాముని కత్తిపుచ్చుకొని ముందు నడుచుటలోగల రహస్యార్థమిది.

### ధరాసుత భాష్యకారుడై యాడెడు స్వామి

జానకీదేవి రామునికి ముందు నడచుచున్నది. రాముని కనులామె

కచభారము పైననే యున్నవి. దీని వెన్వెంటనే సాగిన "దీప్రమోహన చంద్రకి.... యిత్యాది సీసపద్యము దేవీకచభరము యొక్క వర్ణన. ఆ పద్యమిది.

సీ॥ "దీప్రమోహనచంద్రకి ప్రభాద్యోతితవనసీమము మయూరవైభవంబు
అద్రి నీలానీల యామ్య దిశాలంబమానాంబుదా భోగ మధురరేఖ
చందనాచలవనీ సంవాసి చమరీమృగాలి వాలాంచల వ్యజనరేఖ
లలిత తమాల పల్లవగుళుచ్ఛ కదంబ కల్పితచ్ఛాయా ప్రకామరేఖ

జరర వర్షర్తు సమయ ఘానచ్ఛవి ప్ర
తను నవోరభ్రలోమ కంథా సుషమయు
గాంచుచు దారి నడువ రాఘవకులుండు,
జనకసుతభర్త మున్నంటి చనుచునుండు" (అరణ్య-దశవర్ష-216వ.)

పై సీస పద్యపు చివరిపాదములో "కోమలమైన తమాల వృక్షపు చిగుళ్ల గుత్తుల సమూహాముచే నేర్పడిన నీడవలె" నున్నదట దేవి కచభరము. ఇచ్చట ప్రతి పాదాంతమునందున్న 'రేఖా' శబ్దము చిత్రకళ యందలిరేఖ (line) ను స్ఫురింపజేయుచున్నది. చిత్రకళకు రేఖ ప్రాణభూతమైన దని ప్రాచ్యపాశ్చాత్య చిత్రకారులందరు అంగీకరించినదే. ఇక్కడ ఈ రేఖావైభవమునందు కవి ప్రతిపాదాంతర్గమందలి ప్రాణభూతమైన అర్థ 'వైభవము'ను నిక్షిప్తపరచినాడు. ఆ రేఖ యెట్టిది? మధురరేఖ, వ్యజనరేఖ, ప్రకామరేఖ. ఇందు ఉత్తరోత్తరోత్కర్ష గల్గిన చివరిపాదము గ్రహింతము. సీతను రాముడు వెనుకనుండి చూచుచున్నాడు. ఆమె నడచుచున్నది. కొంచెము కోపగించుకొని నడచుచున్నది. వాల్మీకిమహర్షి ఆమెను 'సుశోభనా' 'సుమధ్యమా' అని వర్ణించి యున్నాడు. రాముని కనులు సీతాదేవియొక్క చక్కని నడుముపైగాక ఆమె కచసౌభాగ్యముపై నున్నది. ఆ కచదైర్ఘ్యము ఆమె నడుమును దాటియున్నది. ఓహో! రాముడు ధరానుతయొక్క తమాసౌందర్యమునకు భాష్యము చెప్పచు న్నాడా యేమి? అవును. ప్రథమతః రాముడు సీతాతనూసౌందర్య భాష్యకారుడు. లోనారసి చూచినచో వేద ప్రతిపాద్యమైన మహోజ్జ్వల సీతాతత్త్వ భాష్యకారుడు. దేవీ భక్తుడు. ఉపాసకుడు. దేవికి 'శ్రీరా మానందమయ్యైనమః' అని దేవీఖడ్గమాలాస్తోత్ర రత్నావళి యందొక నామము. 'లక్ష్మణాగ్రజపూజితా'అని శ్రీమచ్ఛంకరుల లలితాత్రిశతీ భాష్యము (Vani Vilas Press, Srirangam Vol. 18. నామానుక్రమణి నెం. 109).

శృంగారవేషరుచిరమై, సదాషోడశ వర్షిణియైన కామేశ్వరిలో 'ప్రకామరేఖ'ను దర్శించిన ఆదిదేవుడైన కామేశ్వరుడే శ్రీరామచంద్రుడు. ప్రకామమనగా 'ప్రగతం కామమితి' 'ప్రకృష్టఃకామః అస్యప్రకామః' 'మిక్కిలి కామము గలది'అని శబ్దకల్పద్రుమము, ఆంధ్ర శబ్దరత్నాకరము. అమర కోశములో ప్రకామమనగా 'యథేప్సితమ్' అని చెప్పబడినది. శబ్దరత్నాకరములోను యిదే అర్థ మివ్వబడినది. మహాభారత విరాటపర్వములో కీచకుడు ద్రౌపదిని యిట్లు సంబోధించుచున్నాడు. "చిత్రమాల్యాంబరధరా సర్వాభరణభూషితా, కామం ప్రకామం సేవత్వం మయా సహ విలాసిని." కావున ప్రకామమనగా ప్రకృష్టమైన కామము. ఇది గాఢత్వ సూచకము. ఈ కామమే సృష్టికి మూల బీజము. "కామస్తదగ్రే సమవర్తతాధి మనసోరేతః ప్రథమం యదాసీత్" అని ఋగ్వేదము (10-129.4.). ఈ కామ శబ్దము ఆత్మవస్తువు కామ కళయని ధ్రువీకరించిన 'కామ కళా విలాసము'ను చెప్పుచున్నది. "బిందురహంకారాత్మా రవిరేతన్మిథున సమరసాకారః, కామః కమనీయతయా కలా చ దహనేందు విగ్రహౌ బిందూ" (కామకళావిలాసమ్-పుణ్యానందాచార్య విరచితమ్. శ్లో. 7.) కామమనగా "కామ్యతే అభిలష్యతే స్వాత్మత్వేన పరమార్థ మహద్భిర్యోగిభిరితి కామః" కమనీయత అనగా స్పృహణీయత. కల అనగా విమర్శశక్తి. "అగ్నిషోమరూపిణీ విమర్శ శక్తిః తదుభయ భూత కామేశ్వరా వినా భూతా మహా త్రిపురసుందరీ బిందు సమష్టిరూపా కామకలా ఇతి ఉచ్యతే. సైవ ఉపాస్యతయా సర్వాగమేషు ఉద్ఘోష్యతే" అని పుణ్యానందాచార్యుల భాష్యము. ఇట్లు శ్రీవిద్యకు తల్లివంటిదైన 'కామకళావిలాసము'ను సీతమ్మ తల్లి ప్రజ్ఞాకథనమున ధ్వనింపజేసినాడు కవి. 'ప్రకామరేఖ'యనగా 'ప్రకృష్టమైన కామకళ'యని అర్థము.

తనువును రేఖచే స్ఫురింపజేయుట చిత్రకళా సంప్రదాయము. సీతా తనూ రేఖ ప్రకామరేఖగా ప్రతిభాసించిన దనగా అది సర్వ కళాదర్శన సిద్ధికి పరాకాష్ఠ. ఆమె సౌందర్యరేఖ. తత్పరాధిష్ఠాత్రి దేవి. సీతను 'సౌదామని' యన్నాడు విశ్వనాథ ఒక చోట. ఇది సుమిత్ర లక్ష్మణునితో నన్నది. రాముడు 'నీలమేఘ కాంతాపఘను'డట. సీత 'సౌదామనీ సమ శరీర'యుట. (2-277) ఇది తైత్తిరీయారణ్యకము నందు (10-11) చెప్పబడిన "నీలతోయద మధ్యస్థా విద్యుల్లేఖేవ భాస్వరా," అను దానితోను "తటిల్లతా సమరుచి షట్చక్రోపరి సంస్థితా" (40) అను లలితా సహస్రనామ స్తోత్రముతోను సంవదించుచున్నది. దేవియే సౌందర్య

సౌధ సౌదామని. లోకమునునది యొక పెద్దచీకటి ముద్దయైనచో అనగా చీకటిచెట్టు చిగుళ్ల గుత్తులయొక్క చిక్కని చీకటి వంటిదైనచో ఆ 'కటిక చీకటి'లో చరచరప్రాకు త్రాచుపామువంటి వేణిగల తటిల్లతయే దేవి. దీర్ఘ తమస్సులో ప్రతిభాసించునది దేవి యని అంతరార్థము. ఋగ్వేదమున అస్యవామీయ సూక్తమున్నది (ఋగ్వేదము-I-164-1. 52). ద్రష్ట-దీర్ఘతమసుడు. ఈతని సూక్తములు రహస్యార్థ గర్భిత ములు. తమస్సులో దాగియున్న విశ్వరహస్యములను అతడు దర్శించి నాడు కాబట్టి దీర్ఘతమసుడనుపేరు వచ్చినదని డా॥ వి.యస్. అగ్ర వాలాగారు చెప్పియున్నారు (Vision in Long Darkness - Dr. V.S. Agrawala, Varanasi, 1963.). ప్రథమమున ప్రకృతి తమస్సు చేతనే ఆవరింపబడి యుండెనని ఆ తమస్సునుండే సృష్టి కల్గినదని నాసదీ యసూక్తము చెప్పుచున్నది. "తమ ఆసీత్ తమసా గూఢమగ్రే..." (ఋగ్వేదము-10-129. 3) దేవి కేశపాశములను తమాల వృక్షపు చిగుళ్ల నీడలతో పోల్చినాడనగా అర్థమేమి? కేశములు నలుపు. తమాల వృక్షము నలుపు. దాని చిగుళ్ల నీడలు నలుపు. కామము నలుపు. ఇందలి చిగుళ్లే సృష్టియొక్క మొదళ్లు. దానినే వేదముపైన చెప్పుచున్నది. 'కామాక్ష్యైనమః' 'కామదాయిన్యైనమః', 'కామ్యాయైనమః' 'కామకళా రూపాయైనమః' అని శ్రీలలితా సహస్రనామ భాష్యము (నామావళి నెం. 61, 62, 321, 322). కావున, కామరేఖ యనగా తటిద్రేఖ. ఈ త్రటిద్రేఖయే సృష్టి. కవి హృదయ సీమలో విద్యుల్లత వంటి సద్యః స్ఫురణ కూడ ఇట్టిదే. దీనినే "ఆర్షం తే ప్రాతిభం చక్షుః" అన్నాడు భవభూతి. సీత 'కుండలినీశక్తి' అని పై చర్చ యొక్క సారాంశము.

పైన చెప్పినదంతయు వ్యక్తవిషయము కాదు. అవ్యక్త విషయము. కావుననే కవి యీ అవ్యక్తతత్త్వమును స్మరణాలంకారము ద్వారా ధ్వనింపజేసినాడు. ఈ స్మరణము నాయకుని స్వగతము. నాయకుడె వరు? శ్రీరామచంద్రుడు. ఈ స్మరణకు హేతువేమి? దీనికి కాళిదాసు చెప్పినదే సమాధానము. "రమ్యమైన దృశ్యములు చూచి, మధుర మైన శబ్దములు విని సుఖముగా నున్నజీవుడు సైతము పర్యుత్సుకుడగు చున్నాడు. కారణమేమి? అజ్ఞాతములై, అర్థముకాక, భావస్థిరములైన పూర్వజన్మల స్మృతులను ఆ జీవుడు చేతస్సులో త్రవ్వుకొనుచున్నాడు. (అభిజ్ఞాన శాకుంతలమ్-అంకము-5,శ్లో.2)అదియే నిజమైన కారణము. ఇది శ్రీరామచంద్రుని భావస్థిరమైన జనన్నాంతర సౌహృదస్మరణము.కవి

స్మరణాలంకారము ద్వారా పై మహావిషయమును నిరూపించుటలోగల అంతర్యమిది. అవతారస్ఫురణ పూర్తిగా భాసింపని మాయామానుష విగ్రహుడైన శ్రీరాముడు ఎక్కడో లోలోపల లీలగా స్ఫురించిన శ్రీమహాలక్ష్మీదేవీ సౌందర్యమును సీత కచభారము చూడగానే హఠాత్తుగా స్మరించినాడు. ఇది రామచంద్రుని అవతార విషయమును ప్రదీప్తమొనర్చుచున్నది.

జీవుని అంటిపెట్టుకొని కామభావన యున్నది. విశ్వనాథ చెప్పిన 'జీవుని వేదన'లో యిదొక అంశము. జీవగత కామభావన అనివార్యము. ఉదాత్తుడైన నాయకునిలో నిది లీలగా తోపింపజేసి ప్రతినాయకుడైన రావణునిలో సహజకామమును నిరూపించి అతనిచే సీతను "కామభూమీరుహా" (అరణ్య-జటాయుః ఖండం-ప. 384) అని సంబోధింపజేసినాడు. అట్లనగా నేమి? కామభూమీరుహము కల్పవృక్షము. అనగా సీతయే కల్పవృక్షము. మహర్షులు వేదమాతను "కామదూఘా" అని ప్రశంసించిరి. రావణుడు సామాన్యుడుకాడు. వేదముల వింగడించినవాడు. అట్టివాడు సీతను "కామభూమీరుహా" అన్నాడన్నచో దాని వెనుక "వేదః ప్రాచేతసాదాసీత్ సాక్షాద్రామాయణాత్మనా" అన్న మహర్షి వాక్యము నిరూపింపబడుచున్నది. వేదవతియే సీత అని దీని పిండితార్థము.

ఈ కవి మిక్కిలి గడుసరి. ప్రయోగించిన పదములకు నిర్దేశించిన యర్థమునే గాక సందర్భానుగుణమైన ప్రకరణార్థ స్ఫోరకత్వము యీతని వైశిష్టము. పైన, దేవి కచభారవర్ణనలో శబ్ద పరిపాకత్వమున్నది. "లలిత తమాల పల్లవ గుళుచ్ఛ కదంబ కల్పిత చ్ఛాయా ప్రకామరేఖ" ఇందలి 'లలిత' 'కదంబ' 'కల్పితచ్ఛాయా' శబ్దములకు నైఘంటికార్థములు వేర్వేరయినను ప్రకరణ దృష్ట్యా విచారించినచో 'లలిత' శబ్దము 'లలితాదేవి'ని 'కదంబ' శబ్దము 'కదంబవనవాసినీ,' 'కదంబ మంజరీక్లప్త కర్ణపూరమనోహరా' 'కదంబ కుసుమ ప్రియా' (శ్రీ లలితా సహస్రనామ భాష్యం, నామావళి నెం. 60, 21, 323) అని ప్రశంసింపబడిన దేవికి ప్రీతికరమైన కదంబ వృక్షమును, 'కల్పితచ్ఛాయా' యనెడు మాట 'మాయావిలసితమైన జగత్తును' ధ్వనింపజేయుచున్నవి. "మాయా కల్పితదేశకాలకలనా వైచిత్ర్య చిత్రీకృతమ్"అని శ్రీశంకరుల దక్షిణామూర్తి స్తోత్రం. "స్వతంత్రా సర్వతంత్రేశీ దక్షిణామూర్తిరూపిణీ" అని ల.స.నా. స్తోత్రం. రాజపరమేశ్వరుడైన రామునిచేతిలోని కృపాణము 'శ్రీరమ్యధర్మనిత్యమైనదే'

కావచ్చు - మరి ఆ ఖడ్గమే పరమేశ్వరి దక్షిణహస్తమున లంకరింపగా ఘోరారి మదకుంభి కుంభవిదారణదారుణమౌతున్నది! అదియే దశకం రుడైన రావణ సంహారము! "దక్షిణా దక్షిణారాధ్యాయైనమః"అని దేవీ నామము.

విశ్వనాథ కల్పవృక్షమును అద్వైతముఖముగా వ్యాఖ్యానించినాడు. అద్వైతమునకే శాంతబ్రహ్మవాదము, కేవలాద్వైతవాదము, వివర్తవాదము, మాయావేదాంతవాదము, అనిర్వచనీయవాదమేనియు పేర్లు. విశ్వనాథ శాంతరసమును కల్పవృక్షములో అంగిరసముగా చేయుటలో ప్రధానోద్దే శమిదియే. పైగా దేవికి 'శాంతా, శాంతిమతీ, శాంత్యతీతకళాత్మికా' (శ్రీ లలితా సహస్రనామ భాష్యమ్) అనియు పేర్లు. అభినవగుప్తుడు శాంతరసస్థాపకుడు. ఈతడు కాశ్మీర శివాద్వైతి. ఈ మతమునకే ఈశ్వరాద్వయవాదము, ప్రత్యభిజ్ఞా సిద్ధాంతమూ, త్రికసిద్ధాంతమనియు పేర్లు. ఈ ప్రత్యభిజ్ఞాసిద్ధాంతములో ఐదు కళలున్నవి. అందు చివరి రెండు 'శాంతకళ', 'శాంత్యతీతకళలు' (ప్రత్యభిజ్ఞాహృదయమ్- క్షేమ రాజు). తురీయాతీతయైన దేవియే శాంత్యతీతకళాత్మిక! దీనినే విశ్వనాథ కల్పవృక్షములో స్థాపించినాడు. 'కల్పిత'మనగా మాయ. అద్వైత వేదాంత మున జగత్తు కల్పితము. అనగా మాయా విలసితము, (బ్రహ్మసత్యమ్, జగన్మిథ్యా) భౌతిక చక్షుర్గోచరము. అంతవరకే దాని అస్తిత్వము. అభౌతిక, అలౌకిక పారమార్థిక దశలో అది వట్టి మిథ్య, భ్రాంతి. దేవి 'మహామాయ' అను విషయమును లోకమోహనమైన యామె కచభార ముపైనాధారపెట్టి వర్ణించినాడనగా యిక్కడనే కవి ప్రతిభ తళతళలాడు చున్నది. సీతాదేవి కచభరము సృష్టిరహస్యమునకు వ్యాఖ్యానము. అది జీవలోకమును ఆవరించిన మహామాయ. ఇది తాత్త్వికార్థము. దీనిని అధ్యాత్మరామాయణము స్థాపించుచున్నది.

అధ్యాత్మము ననుసరించి రాముడు మాయామానుష వేషము ధరించినవాడు (బాలకాండ-నారద ఉవాచ. సర్గ, 3 శ్లో. 36) నిత్యము, నిర్వికారము, నిరవధిక విభవము, మాయా నిరాసకము అయి నది బ్రహ్మపదార్థము. సీతయోగమాయ చైతన్యము, ప్రాణశక్తి (నారద ఉవాచ, శ్లో. 37). జడము, స్థాణువు అయిన బ్రహ్మపదార్థమును చైతన్యవంతముగాజేసి క్రియోన్ముఖము చేయునది యోగమాయ. పరిణా మహీనమైన దానిని పరిణామ శీలమొనర్చునది మాయాశక్తి. కావున 'మాయ' లేకుండ లోకములేదు. అనగా సృష్టిలేదు. చలనములేదు. అందుకనియే అధ్యాత్మము రాముని "నిత్యమాయానిరాసో మాయాకా

ర్యానుసారీ మనుజ ఇవ సదాభాతిదేవోzఖిలేశః" (శ్లో. 205) అన్నది. కల్పవృక్షములో ఖడ్గధారిణియైన సీత వెనుక రాముడు ఆమె కేశ పాశముల చూచుచు నడచినాడనగా అర్థమేమి? ఎంత 'మాయానిరా సకు'డైనను మనుజ శరీరము దాల్చినంతనే 'మాయాకార్యానుసారి'కాక తప్పదు. రాముడే సౌమిత్రితో నన్నట్లు "ఎప్పుడు మేను దాల్చితివా యీ తను సంగత లక్షణంబులుందప్పవు" (సుందర-సంధ్యా-241 ప.) అన్నది దీని యంతరార్థము.

కల్పవృక్షములో సీత, శైల కందరములో అవతార ఘట్టములను చిత్రించి రామునికి చూపు సందర్భములో కవి యొకమాట వాడినాడు. "—ధరాసుత భాష్యకారుడై యాడెడు స్వామి—" (అయోధ్య-అనసూ యాఖండం-51 ప.) రాముడు ధరాసుతకు భాష్యకారుడై యాడెడు వాడట! కాంతాసమ్మితముగా కల్పవృక్షము చెప్పినదానినే ఆధ్యాత్మము 'మాయాకార్యానుసారీ' యని స్పష్టీకరించినది. రాముడు సీత కచభా రము చూచుచు వెనుక నడుచుటయే దీనికి ప్రబల దృష్టాంతము. ఇంతేకాదు. రావణుడు సీత నధిక్షేపించుచు పల్కినపల్కుల వెనుక నిదేయర్థమిమిడి యున్నది.

"నీ మగడంత గొప్పవాడేమి? ఇంద్రునికంటె నధికుడు. బ్రహ్మను బుట్టించినవాడు. శివుని దలదన్నినవాడు. వానిని జేతిలోని కీలు-బొమ్మగా నాడించు నీవంతకంటె గొప్పదానవు" (సుందర-వరరా త్రఖండం-221 ప.) "అడవిలో నెవడైన దన భార్య నెత్తికొనిపోగా నీ మగడు కాక మఱెవ్వండును గొంతసేపేడ్చి యూరకుండును. వీడు మాత్రము నిన్ను వెదకి కొంచువచ్చును. నీవు వానినంత వలలో వేసు-కొంటివి" "నేను నిన్నాశ్రయించితిని గదా! నీవు వానిని నా మీదికి రాకుండజేసి పెట్టుము" (సుందర-వరరాత్రఖండము-221 ప.). చివర సాపేక్షముగా రావణుడన్న మాటలు సీతాదేవి మహోన్నత్యము తెల్పు చున్నది. సీత కచభార వర్ణనలో ఎత్తుగీతియందు "రాఘవకులుండు, జనకసుతభర్త" యనివాడు కవి. సీతయే రాముని 'సీతాపతి' యని సంబోధించినది (యుద్ధ-ఉపసంహారణ 115 ప.). ఈ 'జనకసుతభర్త' 'సీతాపతి' యనెడు సంబుద్ధులు "ధరాసుత భాష్యకారుడై యాడెడు స్వామి"కి పోషకము. శ్రీరామచంద్రుని 'మాయాకార్యానుసారీ' యని ఆధ్యాత్మము స్థాపించిన దానిని, కల్పవృక్షము, సీత కత్తిలినుకొవ్విషముందు నడువగా రాముడామె ననుసరించుచు కచభరము వీక్షించు ఘట్టముగా

కావ్యీకరించినది. కావ్యముగానిది. అధ్యాత్మికత యనగా అది.

కల్పవృక్షము సీతారాముల సౌందర్యము తుల్యమైనదిగా వర్ణించినది. ఇది వారియొక్క బాహ్యాభ్యంతర అభేదప్రతిపత్తిని స్థాపించుచున్నది. దేవి కచభరము దీప్రమోహన మని వర్ణించినది. "రామాభిధేయం రమణీయ దేహినమ్, మాయాతనుం లోకవిమోహనీయామ్" (అధ్యాత్మ రామాయణము, అహల్యాకృత రామస్తవము-బాలకాండ సర్గ 4. శ్లో. 9.) 'రామ' శబ్దమందే సీతారాములిద్దరు కలిసియేయున్నారు. ఇది 'రమణీయము,' కల్పవృక్షము రాముని ప్రవృత్తి, నివృత్తులను స్పష్టముగా వర్ణించినది. 'వినిహత సమస్తలోక మోహుని, నిరీహు రామచంద్రుని గాంచెను రావణుండు" (యుద్ధ-నిస్సంశయ-191-195 ప.) మరొక పద్యములో రాముడు మోహవిదూరునిగా, బైరాగిగా వర్ణింపబడినాడు. అధ్యాత్మ రామాయణము రాముని "నిత్యశ్రీ నిర్వికారో" (బాలకాండ-శ్లో. 206) అని వర్ణించినది. దేవియెంత 'శృంగార రస సంపూర్ణ'యో అంత 'విరాగిణి'. 'ఓం విరాగిణ్యైనమః' అని దేవీ నామము (శ్రీలలితా సహస్రనామభాష్యమ్).

దేవి కచభారము "అబ్ధినీలానీలయామ్యదిశాలంబమానాంబుధాభోగ మధురరేఖ" (అరణ్య-దశవర్ష-216) రాముడు "నిబిడితాకాశ నీలకాంతి ప్రరోహ కందళీకృత మంజుల కాంతిదేహుడు" (యుద్ధ-నిస్సంశయ-194 ప.) "అషాఢమాస నీలాంభోదవల్లీ విలాసభాసుర తనూల్లాస విభవుడు. (సుందర-సంధ్యా-5 ప.) "హారావళి విద్యుదంచిత నవాంబుద నీల మనోజ్ఞదేహుడు" (సుందర-పరరాత్ర-344 ప.) సీతాదేవి కచములు "లలిత తమాల పల్లవ గుళుచ్ఛకదంబ కల్పితచ్ఛాయా ప్రకామరేఖ." రాముడు "తరుణ తమాలస్థానీయ కాంతిదేహుడు (సుందర-షరరాత్ర-349 ప.)

*"మరు నిముసమ్ము నందు సుకుమార మనోజ్ఞ తమాల పల్లవాం*
*తర లవలీకిసాలయ నితాంత గుళుచ్ఛము లీల మోహనాం*
*బురుహవిలోచనుండు రఘుపుంగవు కౌగిట బొల్చెసీత మం*
*ధర పవమాన యాన కలనా వలనా చలనాలకాంతయై."*

— సుందర-పరరాత్ర-*349* ప.

ఇట్లు హనుమ, త్రిజటలు సీతారాముల అభేదప్రతిపత్తిని భావించినారు. ఇది సార్వకాలిక సత్యము.

"Sita is unique; that character was once depicted and once for all, Ramas have been perhaps serveral, but Sitas never. She is the very type of the Indian woman as she should be, for all the Indian ideals of a perfected woman have got around that one life of Sita.... Sita has gone into the very vitals of our race. She is in the blood of every Hindu man and woman; we are all children of Sita."

— SWAMI VIVENKANANDA

"రక్షోఽసురాణాం కరినోగ్రకంఠచ్ఛేద క్షర చ్ఛోణిత దిగ్ధసారమ్।
తం నందకం నామ హరేః ప్రదీప్తం ఖడ్గం నదాహం శరణం ప్రవద్యే"॥

— శ్రీ మహోవిష్ణు వంచాయుధస్తోత్రం

"నవావరణ దేవీనాం లలితాయా మహౌజసః
లలితాయా మహేశాన్యా మాలావిద్యా మహీయసీ
తత్తదావరణస్థాయి దేవతాబృంద మంత్రకమ్
మాలామంత్రం వరంగుహ్యం వరంధామప్రకీర్తితమ్
శక్తిమాలా వంచధాస్యా చ్ఛివమాలా చ తాదృశీ
తస్మాద్గోప్యతరా ద్గోప్యం రహస్యం భుక్తిముక్తిదమ్"

— శ్రీవామకేశ్వర తంత్రే దేవీఖడ్గమాలాస్తోత్రం

# 60. ఉపసంహారం

శ్రీ సీతారామ తత్త్వాన్వేషణమే ఈగ్రంధమందలి ప్రధానవిషయం. ఉపాధిగతులైన జీవులుగా సీతారాములనుభవించిన సుఖదుఃఖములు అద్వైతముఖంగా ఎలా పర్యవసించుచున్నదో శాంతరస వివక్షతో ఈగ్రంధము అనుశీలించుచున్నది.

ఈనాడు మానవుడు అవిదితమైన, అనేకానేక కాంక్షలతో, కోర్కెలతో సతమతమౌతూ జీవితాన్ని దుఃఖభాజనం చేసికొంటున్నాడు. కాని రామకథ, సర్వస్వమూ త్యాగంచేయుటంలోనే, సర్వజనులనూ ఆత్మ కధిన్నులైన వారిగా ప్రేమించి ఆదరించుటలోనే సుఖశాంతులున్నాయని ఘంటాపధంగా నిరూపిస్తున్నది. రామకథ మానవజాతికి, మానవుని మనుగడకు యిస్తున్న మహోత్తర సందేశం త్యాగము! ప్రేమ!! ఈరెండు సూత్రాల చేతనే మానవుడు మహోన్నతుడౌతున్నాడు.

త్యాగమందు తృష్ణారాహిత్యమున్నది.
ప్రేమయందు ఉద్విగ్నతలేని ప్రశాంత చిత్తవృత్తి యున్నది.

ఈ సృష్టి విశాలమైనది. విస్తారమైనది. ఇది ఏ ఒక్కడి స్వంతమూకాదు. ఇది ఎవరికొరకు సృజింపబడినది? ఎవరిక్కడ ఎల్లకాలమూ ఉండగలుగుచున్నారు? ఇది ఎంత యధార్ధముగా కన్పించినా అంత అయధార్ధము! ఎంత సత్యముగా, నిత్యముగా కన్పించినా అంత వ్యర్ధము! అనే భావన కల్గి సర్వజన సమాదరణీయమైన ప్రేమతో జీవితాన్ని సుఖమయం చేసికోవడంలోనే మానవుని ప్రజ్ఞకు సార్ధకత ఏర్పడుతున్నది. దీనినే రామకథలో అవతారపురుషుడైన రాముడెంత సర్వశక్తివంతుడైనప్పటికీ ఒకమనిషిగా ప్రవర్తించి సాధించిన విజయంద్వారా నిరూపించాడు.

రామకథలో రామునికందరూ సోదరులే! 'మానవులందరూ సోదరులు' (All Men Are Brothers) అన్న మహాత్మాగాంధి సిద్ధాంతమిదే! ఆయనేమన్నాడు —

"I have nothing to teach this world. The Truth and Non-voilence are as old as hills," వాల్మీకితో బ్రహ్మయేమన్నాడు —

యావత్స్థాస్యంతి గిరయః సరితశ్చ మహీతలే।
తావద్రామాయణ కథా లోకేషు ప్రచరిష్యతి॥

కొండలు, నదులూ ఉన్నంతకాలం రామకథ ఉంటుందనగా అర్థమేమి? సత్యమూ, అహింసా అంతకాలమూ ఉంటుందని దానిని మానవులు ఆచరించి చూపుతారనే గాఢమైన నమ్మకం!

ద్వేషము చేత, వైరముచేత సాధింపగలిగిందేమీ లేదు. అహింస, దయ, శాంతి, త్యాగము, ప్రేమ — ఇవి బుద్ధుని కాలంనుండి మహాత్ముని వరకు వినబడుతూనే ఉన్నాయి. ఆ మహానుభావుల మహోన్నతకార్యాలు కనబడుతూనే ఉన్నాయి.

అట్టివారే ఆనందమయులు. వారి జీవితం ఆనందమయం. ఆ దారిలోనడిచే సోదరమానవులందరూ ఆనందమయులు. వారు వెలుగు చేతులు చాచి అందరినీ ఆహ్వానిస్తున్నారు.

ఆ యానందమయుండె బ్రహ్మయని యభ్యాసంబుచే నిశ్చితం
బై యేర్పాటుగ వేద పంక్తులను భాష్యప్రోక్తమై యొప్పగా
నా యానందమయుండు రాముడని వ్యాఖ్యానించె వాల్మీకినాన్
ఆ యానందములున్ రఘూత్తముడు మూడై యొక్కడైనట్లుగా

ఆ యానందములందు వొందు విడిగానై సాహితీలోక కు
ల్యా యూషాకృతి బొల్చినట్లు "కవితా యద్యస్తి రాజ్యేనకిమ్"
ప్రాయః స్మారకహేతువై నెగడె నాపై నున్నదా, లోని వే
డో యా రాముడు స్వస్వరూప ఘటనాధ్యుండయ్యె నో నా జనెన్

ఆ యానందమె స్వామి లక్షణముగానై యాత్మ దీపింపగా
ఆ యానందమె నా హృదగ్రమున నిత్యంబై విడంబించినన్
నాయీ జన్మమె చారితార్థ్యఫలమై నా కల్పవృక్షంబునే
ప్రాయంగా నయినట్టి దివ్యఫలమై వాంఛింతు నా యొక్కడే!

— నారాముడు-విశ్వనాథ

# ఉపయుక్త గ్రంథసూచిక

## సంస్కృత గ్రంథాలు


1. అధ్యాత్మరామాయణమ్ — Text with Eng. tr. స్వామి తపస్యానంద శ్రీరామకృష్ణమఠం, మైలాపూరు 1985.
2. అష్టాదశోపనిషదః — (Eds.) V.P. Limaye and others, Poona.
3. ఈశావాస్యోపనిషద్ — Text with Eng. tr. by శశి తివారి భారతీయ విద్యాప్రకాశన్, వారణాశి 1986.
4. కామకళావిలాసమ్ — పుణ్యానందాచార్యవిరచితమ్
5. తర్కసంగ్రహః — With Deepika of Annambhatta Text with Eng. fr. స్వామి విరూపాక్షానంద, శ్రీరామ కృష్ణమఠం, మైలాపూరు, 1980
6. తైత్తిరీయోపనిషద్భాష్య వార్తికమ్ — సురేశ్వరాచార్యః Eng. tr. by J.M. Van Boetzelaer Leiden, 1971.
7. తైత్తిరీయోపనిషద్భాష్య వార్తికమ్ — Sanskrit text with Com. Ed. S. Subrahmanya Sastri Mahesh Research Institute Varanasi.
8. తైత్తిరీయసంహితా- (సంపా) — శ్రీపాదదామోదర సాత్వలేకర్, పూనా 1967.
9. దుర్గాదకారాదిసహస్రనా మస్తోత్రమ్ — కులార్ణవతంత్రమ్, ఉపాసనాష్టకం.
10. దశోపనిషదః — ఉపనిషద్బ్రహ్మయోగి వ్యాఖ్యతో, అడయార్, మద్రాసు
11. ధమ్మపదమ్ — Text with Eng. tr. ఆచార్య పుల్లెలశ్రీరామచంద్రుడు హైదరాబాదు, 1977

12. ధ్వన్యాలోకమ్ — ఆనందవర్ధనాచార్యః, లోచనవ్యాఖ్యా-అభినవగుప్తపాదః

13. నచేత్ వాల్మీకిరభవిష్యత్ — ఎస్.టి.జి. వరదాచార్యః

14. నాట్యశాస్త్రమ్ — భరతమునిః, అభినవభారతీవ్యాఖ్యా అభినవగుప్తపాదః

15. న్యాయసూత్రమ్ — గౌతమః

16. నైష్కర్మ్యసిద్ధిః — సురేశ్వరాచార్యః Eng. Tr. S.S. Raghavachar, University of Mysore, 1965.

17. ప్రత్యభిజ్ఞాహృదయమ్ — Eng. Text with Tr. -జయదేవ్ సింగ్ Motilal, 1963

18. భగవద్గీత — శ్రీధరీయటీకాసార విశేషసహితం పూర్ణానంద (నిర్వికల్పానందస్వామి) శ్రీరామకృష్ణమఠం, మైలాపూరు 1944

19. మహాభారతమ్ — నీలకంఠభాష్య సహితమ్, చిత్రశాలా ప్రెస్, పూనా.

20. మాండూక్యోపనిషద్ — Text with Eng. tr. ఆహితాగ్నియామునప్రసాద్ త్రిపాఠి వారణాశి, 1966.

21. మాండూక్యోపనిషద్ — శంకరభాష్య సహితమ్ అనుభూతిస్వరూపాచార్యటిప్పణమ్ (సంపా) ఎస్.ఆర్. కృష్ణమూర్తి శాస్త్రి, పి.వి. శివరామదీక్షితార్, మద్రాసు, 1978.

22. యోగవాసిష్ఠమ్ — పూర్వార్థ, ఉత్తరార్థములతో 'తాత్పర్యప్రకాశిక' పూర్ణానంద (నిర్వికల్పానందస్వామి) వ్యాసాశ్రమము, ఏర్పేడు 1974.

23. యోగఉపనిషత్తులు — వ్యాఖ్య-ఉపనిషద్బ్రహ్మయోగి, అడయార్ లైబ్రరీ, మద్రాసు

24. లలితాసహస్రనామభాష్యమ్ — భాస్కరరాయకృత సౌభాగ్యభాస్కరభాష్యమ్- 'దీధితి' ఆంధ్రానువాదం, పొంగూరి సూర్యనారాయణశర్మ (1979)

25. లలితా త్రిశతీభాష్యమ్ — శ్రీశంకరభగవత్పాదులు, వాణీవిలాస్ ప్రెస్, శ్రీరంగం

26. విజ్ఞాన భైరవమ్ — ఆంగ్లానువాదం- జయదేవ్‌సింగ్, హిందీ అనువాదం, పండిత వ్రజవల్లభ ద్వివేదీ

27. వివేక చూడామణి — శ్రీశంకరభగవత్పాదులు, చంద్రశేఖరభారతస్వామి వ్యాఖ్యతో, శృంగేరి, 1957.

28. శాక్త ఉపనిషత్తులు — వ్యాఖ్య-ఉపనిషద్బ్రహ్మయోగి, అడయార్ లైబ్రరీ, మద్రాసు

29. శ్రీమద్రామాయణమ్ — వాల్మీకి, వ్యాఖ్యానచతుష్టయవిశిష్టమ్, శ్రీశంకరగుణదర్పణ ముద్రాక్షరశాల, నెల్లూరు 1897.

30. శ్రీశంకరగ్రంథావళి — పదిసంపుటములు, సమతబుక్స్, మద్రాసు, 1981

31. సంబంధవార్తికమ్ — సురేశ్వరాచార్యః Text. Editor -ఎస్. సుబ్రహ్మణ్యశాస్త్రి, వారణాసి, Eng tr. T.M.P. Mahadevan, Madras University, Madras

32. సన్న్యాసోపనిషత్తులు — పనిషద్బ్రహ్మయోగి వ్యాఖ్య, అడయార్ లైబ్రరీ, మద్రాసు

33. సౌందర్యలహరి — 
   1. లొల్లలక్ష్మీధరవ్యాఖ్యతో వ్యాఖ్యాత-చదలువాడ జయరామశాస్త్రి, మద్రాసు 1982
   2. సమయామోదినీవ్యాఖ్య తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు, మద్రాసు, 1987

## తెలుగుగ్రంథాలు

| | | |
|---|---|---|
| 1. | అధ్యాత్మరామాయణము (వచనము) | — గుడ్లవల్లేటి వేంకటాచలపతిరావు, మచిలీపట్నం, 1973 |
| 2. | అధ్యాత్మరామాయణము (పద్యకావ్యం) | — గుంటూరు సుబ్బారావు |
| 3. | అశోకం (నాటిక) | — సామినేని ముద్దుకృష్ణ |
| 4. | ఆధునిక తెలుగుసాహిత్య విమర్శ - సాంప్రదాయికరీతి | — కోవెల సంపత్కుమారాచార్యులు, వరంగల్లు, 1981 |
| 5. | ఉపదేశసారము | — శ్రీరమణమహర్షులు |
| 6. | కల్పవృక్షరహస్యములు | — విశ్వనాథ సత్యనారాయణ, P.S. & Co., గుంటూరు, 1976 |
| 7. | నారాముడు (పద్యాలకు స్వీయవ్యాఖ్యానము) | — విశ్వనాథ సత్యనారాయణ |
| 8. | మాండూక్యోపనిషత్ | — స్వామి చిన్మయానంద, అనువాదం-వరలక్ష్మమ్మ (1961) |
| 9. | శ్రీమద్రామాయణ కల్పవృక్షము | — విశ్వనాథ సత్యనారాయణ |
| 10. | శ్రీసూక్తము (వ్యాఖ్యా సహితము) | — ఎక్కిరాల కృష్ణమాచార్యులు |
| 11. | శ్రీ హనుమన్మహావిద్యా ప్రకాశిక | — లంకా వేంకటేశ్వరశాస్త్రి |
| 12. | షోడశి-రామాయణ రహస్యములు | — గుంటూరు శేషేంద్రశర్మ |
| 13. | "సీతాయాశ్చరితం మహత్"(ఉపన్యాసపారం) | — విశ్వనాథ సత్యనారాయణ హైదరాబాదు, 1976 |
| 14. | సీతారామాంజనేయ సంవాదము | — పరశురామపంతుల లింగమూర్తి గురుమూర్తి (తాత్పర్యవిశేషార్థసహితము) వెన్నెలకంటిసుందరరామశర్మ వేదాంతం లక్ష్మయ్య గురువులు, బ్రహ్మాస్పర్శిని, కడప, 1992 |

15. శ్వేతపద్మం (వ్యాససంపుటి) — తుమ్మపూడి కోటీశ్వరరావు, అనంతపురం, 1991

16. విమర్శిని (విశ్వనాథ వాఙ్మయ జీవిత విశేష సంచిక) — (సంపా) కేతవరపు వేంకటరామకోటిశాస్త్రి, వరంగల్లు, 1977

17. విశ్వనాథ వాఙ్మయసూచిక — కేతవరపు వేంకటరామకోటిశాస్త్రి, కోవెలసుప్రసన్నాచార్యులు, వరంగల్లు, 1974

18. విశ్వనాథమార్గము (వ్యాససంపుటి) — ఆచార్య కోవెలసుప్రసన్నాచార్యులు, వరంగల్లు, 1992

19. బ్రాహ్మీమయమూర్తి-విశ్వనాథ సాహితీ దర్శనం — తాటికొండ వేంకటకృష్ణయ్య ముదివేడు ప్రభాకరరావు, తిరుపతి, 1976

20. వేయిపడగలు-సమకాలీనత-సార్వకాలీనత — డా॥ కె.వి.యస్. రాఘవన్, తెలుగు అకాడెమీ, హైదరాబాదు, 1989

21. పోతనభాగవతానుశీలనము — డా॥ధూళిపాళశ్రీరామమూర్తి, 1973

## సాహిత్య వ్యాసాలు

1. అనాహతము — కాశీనాథుని నాగేశ్వరరావు నాగేశ్వరశతజయంతిసంచిక, 1968

2. జీవునివేదన — ధూళిపాళ శ్రీరామమూర్తి, భారతి అగస్టు 1956

3. జీవునివేదన — ధూళిపాళ శ్రీరామమూర్తి జయంతి, 1959-60

4. జీవునివేదన — ధూళిపాళ శ్రీరామమూర్తి, మేఖల (విశ్వనాథ స్మారక సాహిత్యపత్రిక) 1978

5. నేను - మా అన్నగారు — విశ్వనాథ వేంకటేశ్వర్లు 'విమర్శిని' (విశ్వనాథవాఙ్మయజీవిత విశేషసంచిక), వరంగల్లు, 1977

## ఆంగ్ల గ్రంథాలు


1. Civilisation and its Discontents — Sigmund Freud
2. Collected works of Swami Vivekananda — Ramakrishna Mission, Calcutta
3. Central Philosophy or Buddhism — Prof. T.R.V. Murthy, 1955
4. Gaudapada-A Study in Early Advaita — Prof. T.M.P. Mahadevan, University of Madras, 1952
5. Holy Bible — Great Britan, London.
6. History of Indian Philosophy Vol. II — S.N. Dasgupta
8. Modern Man in search of a Soul. — C. G. Jung
9. Paradise Lost — Joth Milton
10. Pahari Paintings and Sikh portraits in the Lahore Museum — F. Aijazuddin
11. Philosophy of Yogavasistha — Dr. B.L. Atreya, Adyar, Madras, 1936
12. Reconstrution of Humanity — P.A. Sarokin, Bharatiya Vidya Bhavan, Bombay 1960
13. Suffering-Indian Perspectives — Ed. Kapil N. Tiwari, Motilal Banarasidass, 1986
14. Serpent Power — Sir John Woodroffe (Arthur Avalon), Ganesh & Co, Madras
15. Selected writings of Herbert Read — Ed. Allen Tate, Faber and Faber, London
16. Values of Life — Ernest Barker
17. Vision in Long Darkness — V.S. Agrawala, Varanasi
18. White Umbrella Indian Political Thought from Manu to Gandhi — D. Mackenzie Brown Jaico publishing House, Bombay






| | | |
|---|---|---|
| రచయిత | : | డా॥ ముదివేడు ప్రభాకరరావు |
| పుట్టింది | : | మదనపల్లెలో (26-5-1951) |
| చదివింది | : | శ్రీకాళహస్తి, తిరుపతుల్లో<br>తెలుగు (1973) సంస్కృతం (1993) ఎం.ఏ.,<br>లైబ్రరీసైన్స్‌లో బ్యాచలర్ డిగ్రీ (1974)<br>ఎపిగ్రఫీలో పి.జి. డిప్లొమా (1985)<br>'విశ్వనాథ పీఠికావాఙ్మయం'పై<br>సమగ్ర పరిశీలనకు పి.హెచ్.డి., |

శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్యపరిశోధనసంస్థలో
సహాయాంధ్రపరిశోధకుడుగా 1975 ఆగస్టు నుండి ఉద్యోగం.

### వ్రాసిన పుస్తకాలెన్నో! వెలుగు మొగంచూచిందొక్కటి

బ్రాహ్మీమయమూర్తి-విశ్వనాథ సాహితీదర్శనం (Co. Author) (1976)
ఇప్పుడు 'మహతా ప్రయాసేన' మరొక్కటి

### సంపాదిత గ్రంథాలూ దానికి సైదోడు

1. విశ్వనాథ శారద 90వ జయంతి సంచిక (Co. Editor) (1985)
2. తెలుగుకాగితపు వ్రాతప్రతుల వివరణసూచిక (Co. Editor) (1988)

### పరిష్కృత గ్రంథాలకూ పైమాటే చెల్లు

1. విజయరంగచొక్కనాథనాయకుని శ్రీరంగమాహాత్మ్యము (1988)
2. బాలపాపాంబ యక్షగానం అక్కమహాదేవి బోధోల్లాసం (ముద్రణలో)

### వెలుగు చూడవలసిన పుస్తకాలు

1. సాహిత్య విమర్శవ్యాసాలు 2. రాళ్లపల్లి రమణీయ రచనలు
3. విశ్వనాథ కవితాసంపుటి (వేణీభంగం) 4. విశ్వనాథవ్యాసాలు - ఉపన్యాసాలు 5. విశ్వనాథ పీఠికాత్రిశతి 6. సిద్ధాంతగ్రంథం